# సారస్వత వ్యాసములు

రెండవ సంపుటము





పరిష్కర్త

పురిపండా అప్పలస్వామి




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

SARASWATHA VYASAMULU-Second Volume
(A collection of Literary Essays).
Edited by Dr. Puripanda Appalaswami, Visakhapatnam.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
హైదరాబాదు 500 004

ప్రచురణ : 809

ప్రథమ ముద్రణ : 1969
ద్వితీయ ముద్రణ : 1981

ప్రతులు : 1000

వెల : రూ. 8-00

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ,
కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-500 004

ముద్రణ :
శ్రీ మాధవి ఆర్ట్ ప్రింటర్స్,
కుత్బిగుడ, హైదరాబాదు-27.

Paper used (partly) for the Printing of this book was made available by the Government of India at Concessional rate.

# ద్వితీయ ముద్రణకు తొలి పలుకు

1959 లో డా॥ పురిపండా అప్పలస్వామిగారి సంపాదకత్వాన ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురించిన "సారస్వత వ్యాసములు" రెండవ సంపుటము ప్రతులన్నింటిని తెలుగు పాఠకలోకము ఆదరించి అందుకొన్నది. డా॥ పురిపండా అప్పలస్వామిగారు జాగరూకతతో, విమర్శనా దృక్పథంతో, సాహిత్య సమీక్షా పరిజ్ఞానంతో సేకరించి మీ కందించిన ఈ వ్యాసాలు పాఠకులకు, పరిశోధకులకు, పండితులకు, భాషాభిమానులకు, విద్యార్థులకు, జిజ్ఞాసువులకు ఎంతో ఉపకరించినవని, వీటిని తిరిగి ముద్రించవలసిన అవసరము ఉందని అకాడమి కార్యవర్గమువారు నిర్ణయించినారు. ఆ నిర్ణయానికి ఫలితమే ఈ మలి ప్రచురణ; మా ఈ ప్రయత్నాన్ని హర్షించిన పాఠకలోకానికి, దీన్ని సఫలం చేయడంలో సహకరించిన డా॥ పురిపండా అప్పలస్వామిగారికి హార్దిక వందనాలు.

హైదరాబాదు, 
19-12-1980.

ఇరివెంటి కృష్ణమూర్తి 
కార్యదర్శి

# తొలిపలుకు

19వ శతాబ్ది చరమభాగమున ఆంగ్లభాషా సాహిత్య ప్రభావ మొకవైపు నుండియు, ముద్రణయంత్ర సౌకర్య మొకవైపునుండియు నాంధ్రదేశ సాహిత్య జీవితమున కొక నూతన చైతన్యమును కలిగించినవి. నూత్న సాహిత్యశాఖలు క్రొత్త చిగుళ్ళు తొడుగుచున్న తరుణముననే స్వాతంత్ర్యేచ్ఛ, దేశాభిమానము భాషాభిమానము మొదలగు ఉజ్జ్వల సాంఘిక భావములు సారస్వతరంగమున కాలుపెట్టినవి. వానిని సత్వరముగా సాహిత్యపరులలోను, సామాజికులలోను వ్యాప్తిచెందించుటకై పత్రికలు పుట్టి నడుముకట్టినవి. సాహిత్యము జీవితాంత ర్భాగ మను చైతన్యమును ముక్కోటి తెలుగువారిలో నుత్పాదించినవి సాహిత్య పత్రికలు. పత్రికల చలువ పందిళ్ళలో ఆంధ్రభారతి నిత్యనూతన శోభావిలాస ములు వెలార్చి తెలుగుబిడ్డల మన్నన లందుకొనినది.

పత్రికలలో దినపత్రికలు, వారపత్రికలు, పక్షపత్రికలు, మాసపత్రికలు, త్రైమాసిక పత్రికలు, ఉగాది సంచికలు— ఇట్లు ఎన్నియో భేదములు కలవు. వీనిలో సాహిత్యపత్రికల కొక ప్రత్యేకత కలదు. అందులో కొన్ని వెలుగు చూడని సాహిత్య గ్రంథములను వెలికి దెచ్చినవి; కొన్ని పూడిపోయిన శిలాశాస నములకు పునర్జన్మ కల్పించినవి; కొన్ని క్రొత్తగా గొంతెత్తి కావ్యగీతము లాలపించెడి కవికోకిలలకు నూత్న వసంతము కల్పించినవి; కొన్ని ప్రాచీన భాషాసాహిత్య మర్యాదలకు ప్రాణము పోసినవి; కొన్ని కొన్ని అభ్యుదయ మార్గమున శంఖములు పూరించినవి; ఇవి యన్నియు వాదములకు రంగస్థలము లైనను సత్యాన్వేషణమునకు కూడా నాందీ వాక్యము పల్కినవి. ఆ యా పత్రి కల వెనుక పరిషత్తులవంటి వ్యక్తులు, పారావారములవంటి మేధావులు, దిగ్దంతులవంటి పండితులు నిలువబడి నవ్యాంధ్ర సారస్వతసౌధ నిర్మాణమునకు పునాదులుకట్టినారు, రూపురేఖలు దిద్దినారు. అట్టి మహోజ్జ్వల అధ్యాయములకు ప్రతిబింబములైన పత్రికల ప్రాతసంపుటము లిప్పుడు మన కందుబాటులో లేవు. వానిలోని విజ్ఞాననిధులు విద్యార్థులకేకాక విద్వాంసులకుకూడ ఉపకారకములు కాగలవు.

ఇట్టి యభిప్రాయముతో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ గత సంవత్స రము ఆంధ్ర సాహిత్య పత్రికల సంపుటులలో ప్రచురితములైన ప్రఖ్యాత

సాహిత్యవేత్తల వ్యాసములను విషయ ప్రధానదృష్టితో నెన్నిక చేయించి 'సారస్వత వ్యాసము' లనుపేర రెండు సంపుటములుగా ప్రచురింపవలెనని నిర్ణయము కావించినది. ఈ సంపుటముల వలన 19వ శతాబ్ద్యుత్తరార్ధము నందును, ఇరువదియవ శతాబ్ది పూర్వార్ధమునందును జరిగిన తెలుగు సారస్వత విమర్శ స్వరూపస్వభావములు, భావపరిణామము మొ॥ నంశములు స్థాలీపులాక న్యాయముగనైనను తెలిసికొనుటకు వీలుండునని అకాడమీ వారి భావము.

ఈ కార్యక్రమము క్రింద 'సారస్వత వ్యాసములు' ప్రథమ సంపుటములో— 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (కాకినాడ), శారద, ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలు, భారతి'— అను సాహిత్య పత్రికల నుండి వ్యాసముల నెన్నిక చేసి సంపాదకత్వము నిర్వహింపవలసినదిగా డా. జి. వి. సుబ్రహ్మణ్యముగారిని దానిపై పర్యవేక్షణము సల్పుటకు డా. దివాకర్ల వేంకటావధానిగారిని కోరుట యైనది. అట్లే ద్వితీయ సంపుటములో 'అముద్రిత గ్రంథ చింతామణి', 'గ్రంథాలయ సర్వస్వము', 'తెలుగు', 'సారస్వత సర్వస్వము', 'ప్రతిభ', 'సుజాత', 'కిన్నెర'— పత్రికల నుండి వ్యాసముల నెన్నికచేసి సంపాదకత్వము నిర్వహింపవలసినదిగా శ్రీ పురిపండా అప్పలస్వామిగారిని, కోరుటయైనది.

పైని పేర్కొనబడిన సాహిత్య పత్రికల సంపాదకులకు, ప్రచురణ కర్తలకు, పై సంపుటములలో ప్రచురింపబడు వ్యాసముల రచయితలకు కృతజ్ఞతలు చెప్పుట అకాడమీ ప్రథమకర్తవ్యము. సకాలమున కీ సంపుటమును సిద్ధముచేసి యిచ్చిన శ్రీ పురిపండా అప్పలస్వామిగారికిని, వారి కీ కార్యమున సాయపడిన డా. తూమాటి దొణప్పగారికిని మా ధన్యవాదములు. ఆంధ్ర పాఠకజనులు మా ప్రయత్నమును సహృదయముతో గ్రహింపగలరని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు
15-4-1969

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# పీఠి క

## వ్యాసం అంటే ?

వ్యాసం అంటే 'ఏదేని యొక విషయమును విరివిగా వ్రాయుట' అని శబ్దరత్నాకరము.

ఈ అర్థవివరణము తృప్తికరము కాదు.

"ఏదేని యొక చరిత్రాంశము" అని ఆంధ్రవాచస్పత్యము.

ఇది కేవలం సంకుచితమైన వివరణం.

'ఏ విషయమునైనను తెలిసికొని దానియందలి అంశములను విభజించి వివరించి చెప్పుట వ్యాసమని చెప్పవచ్చును' అని తె. స. వారి విజ్ఞానసర్వస్వము.

ఈ వివరణం కూడా కేవలం కొంతవరకే సరిపోవచ్చును.

ఇంగ్లీషులో Eassy అన్నదానికి పర్యాయపదంగా తెలుగులో 'వ్యాసం' అని వాడుతున్నాం.

హిందీలో నిబంధ, ప్రబంధ లలితప్రబంధ, లేఖ, సందర్భ అని అంటారు. బెంగాలీ, ఒడియా భాషలలో ప్రబంధ, లేదా నిబంధ అంటారు.

Essay అంటే "A composition on some special subject commonly written and less complete and formal than a treatese, latterly, any dissertation or a particular subject a form of pure representation discourse" అని ఆంగ్ల నిఘంటువు [1]

"As a form of literature, the essay is a composition of moderate length, usually in prose, which deals in an easy, cursory way with the external conditions of subject, and in strictness with that subject only as it effects the writer" అని ఆంగ్ల విజ్ఞాన సర్వస్వం.[2]

Essay విషయంలో ఆంగ్లసాహిత్యవేత్తలు పదిమంది పదిరకాలుగా వ్రాశారు.

"A loose sallay of mind and irregular undigested piece of literature not a regular and orderly performance of literature." అని శామ్యుల్ జాన్సన్.[3]

1. A Standard Dictionary of the English Language. (1894)
2. Encyclopedia Britanica.
3. Samual Johnson. (1709-84)

"A oomposition of moderate length on any particular subject or branch of a subject - originally implaying want of finish, but now said of a composition more or less elaborate in style, though limited in range." అని ముర్రే.[4]

"The essay as a literary form resembles the lyric in so far as it is moulded by some central mood whimsical serious or satirical. Give the mood and the essay from the first sentence to the last grows around it as the cocoon grows around the silk worm." అని అలెగ్జాండర్ స్మిత్.[5]

"The essay proper or literary essay is not merely a short analysis of a subject, nor a mere epitome, but rather a picture of wandering minds effected for the moment by the subject with which he is dealing. Its most distinctive feature is the egostical element." అని హాల్వర్డ్, హిల్లు.[6]

ఇంతకీ వ్యాసానికి నిర్దిష్టమైన వొక ప్రత్యేక నియమం ఏదీ కనపడదు. అయినా సర్వాంగసుందరమైన ప్రక్రియగా ఇంగ్లీషులో అది వికసించింది.

చరిత్ర :

పదహారో శతాబ్దానికి ముందు సాహిత్యప్రక్రియకు Essay అన్న పేరు లేదు. 1571 లో ఫ్రెంచి రచయిత మాన్‌టైన్[7] తన గద్యరచనలకు 'Essays' అని ఓం ప్రథమంగా నామకరణం చేశాడు. అదిగో ఆపేరే తీసుకుని సుప్రసిద్ధుడె ఆంగ్ల రచయిత ఫ్రాన్సిస్ బేకన్[8] ఇంగ్లీషు వాఙ్మయంలో ఎస్సే (Essay) కు నాంది పలికాడు. అంతేకాదు, ఆ ప్రక్రియకు రాచబాట వేశా డతడు. దానికి మరింత అందచందాలు కూర్చి కౌలే[9] Father of the English Essay' అని పించుకున్నాడు. గద్యంలోనే కాక పద్యంలోనూ వ్యాసరచన చేశా డితడు. Myself అన్న ఇతడి వ్యాససంపుటి ప్రసిద్ధమైంది. అదే కాలంలో డ్రైడెన్[10] చక్కని శైలిలో విమర్శవ్యాసాలు వ్రాశాడు.

ఇంగ్లీషు Essay అన్నివిధాలా అభివృద్ధి పొందడానికి ముఖ్యమైన కారణం పత్రికలు. పత్రికలకి వ్యాసాలూ, వ్యాసాలకి పత్రికలూ పరస్పరం దోహదం కలిగించాయి. పద్దెనిమిదో శతాబ్ది ఆరంభంలో స్టీలు[11], అడిసను[12] అని

---

4. G. G. A. Murray. 5. Alaxander Smith. 6. Hallward & Hill.
7. Michel de Montaigue. (1533-92) 8. Francis Bacon. (1561-1626)
9. Abraham Cowley. (1618-67) 10. John Dryden. (1631-1700)
11. Richard Steele (1672-1729) 12. Joseph Addison (1672-1719).

ఇద్దరు స్నేహితులు 'టాట్లర్' (1703) ; 'స్పెక్టేటర్' (1711-12) అన్న పత్రికలు స్థాపించి చమత్కారపూర్వకమైన చక్కని వ్యాసాలు సృష్టించారు. ఈ పత్రికలు స్వల్పకాలమే నడిచినా విలక్షణమైన వీటి వ్యాసాల ప్రభావంవల్ల ఆంగ్లసాహిత్య చరిత్రలో ప్రతిష్ఠ సంపాదించుకున్నాయి. 'స్పెక్టేటరు' లోని వ్యాసాలే పానుగంటి వారి సాక్షికి వరవడి అయాయి.

అనంతరం జాన్సన్,[13] గోల్డుస్మిత్,[14] లాంబు, వంటి సుప్రసిద్ధ రచయితలు తమ వ్యాసాలతో ఆంగ్లవ్యాస వాఙ్మయాన్ని ఎంతయినా పరిపుష్టం చేశారు. జాన్సను ధార్మిక వ్యాసాలు వ్రాశాడు. 'ది రాంబ్లర్', 'ది ఐడ్లర్' వ్యాసాలు గొప్పవి. గోల్డుస్మిత్ తన 'సిటిజన్ ఆఫ్ ది వరల్డు' వ్యాసాలలో సరసమైన చమత్కారంతో ఆనాటి సమాజంలోని మంచి చెడ్డలు ఎత్తి చూపాడు. లాంబ్ వ్యాసాలు అధికంగా ఆత్మాశ్రయమైనవి. అతడి వ్యాస సంపుటి 'Essay of Elia' వ్యాస వాఙ్మయంలో అతి ప్రసిద్ధమైంది. లాంబ్ వ్యాసాలకు సంపాదకత్వం వహించి హాల్‌వార్డూ, హిల్లూ పీఠికలో వ్యాసస్వరూపం కూలంకషంగా చర్చించారు. లాంబ్ చూపిన మార్గమే అనుసరించి చెస్టర్‌టన్,[16] బెలాక్, బియర్‌బమ్, ప్రీస్టీ మొదలైనవారు వ్యాసరచనలో సిద్ధహస్తు లయారు. Familiar Essay కు లాంబ్ నిజమైన మార్గదర్శకుడు మృదువైన 'హ్యూమర్' అతడి సొమ్ము. ఇలియా (Elia) అన్నది అతడి మారుపేరు ఆదే పేరుతో అతడు 'The London Magazine' పత్రికలో వ్యాసాలు వ్రాశాడు. ఆదే కాలంలో హాజ్లిట్[17] మంచి విమర్శ వ్యాసాలు ప్రకటించి 'విమర్శకుల విమర్శకుడు' అయాడు. అతడి 'Table Talks', 'The Plain Speaker, గొప్ప వ్యాస సంపుటాలు.

లార్డ్ మెకాలె, మాథ్యూ ఆర్నాల్డు, ఆర్. లూయిస్, స్టీవెన్‌సన్, ఈ.వి. లూకాస్, ఏ, సైమన్స్,హిలెయిరీ ఏ.జి. గార్డినర్, ఆర్. లిండ్, డబ్లు. హెచ్. హడ్సన్, ఏ. బిర్రెలీ, మాక్సు బీర్‌బమ్, ఆర్థర్ సైమన్స్, మీనాల్, ఎమర్సన్, హోమ్సు లోవెల్ మొదలైనవారు సుప్రసిద్ధులైన ఇంగ్లీషు వ్యాసకర్తలు. చివరి ముగ్గురు అమెరికనులు.

స్వరూపం :

'కవికి గీటురాయి గద్య అయితే గద్యకి గీటురాయి వ్యాసం' అన్నాడు హిందీ సాహిత్య చరిత్రకారుడు రామచంద్ర శుక్ల.

హాల్‌వార్డ్, హిల్ పండితుల నిర్వచనం ప్రకారం వ్యాసం 'చిన్న రచన.' అంటే వ్యాసం సుదీర్ఘమైంది కాకూడదు. జటిలమైందీ, దుర్బోధ్యమైందీ

13. Samuel Johnson (1709-14) 14. Oliver Goldsmith (1728-74).
15. Charles Lamb 1775-1834). 16. G.K.Chestorton (1874-1936).
17. William Hazitt (1778-1830). 18. Alexander Pope (1688-1744).

కాకూడదు. ఇంగ్లీషులో పూర్వం 'Essay on Human understanding' వంటి దీర్ఘవ్యాసాలు నాలుగయిదు వందల పుటలకి మించినవి వ్రాసేవారుకొందరు. తెలుగులో కూడా ఇలాటివి లేకపోలేదు. ఉదాహరణకి దీర్ఘవ్యాసంకింద ఈ సంపుటంలోని 'ఆంధ్ర మహాభారత విమర్శనము' చూపవచ్చు. ప్రతిభ పత్రికలో వొకవ్యాసం వందపుటలు దాటింది. ఈనాడు కూడా దీర్ఘవ్యాసాలు కనిపిస్తున్నాయి. 'వాఙ్మయ వ్యాస మంజరి'లో వొక వ్యాసం నూటావీభై పుటలకు దాటింది.

వ్యాసం నాతి దీర్ఘంగా వుండాలి. తేలికగా వుండాలి. స్వల్పకాలంలో చదవ గలిగినది కావాలి. విషయం ఏదైనా కావచ్చు. రచన కళావంతం కావాలి. శైలి మనోజ్ఞమై వుండాలి. సరళమైన వ్యాకరణతో పాఠకుణ్ణి ఆకర్షించాలి. రచయిత తన సిద్ధాంతాలు పాఠకుడి మీద బలవంతంగా రుద్దకూడదు. అనవసరమైన వర్ణనలు చేయకూడదు. చెప్పదలచుకున్నది సూటిగా చెప్పాలి. హృదయానికి అత్తుకున్నట్టు చెప్పాలి.

వ్యాసం మెదడుకి సంబంధించినది కాకుండా హృదయానికి సంబంధించింది కావాలి. భావగీతం (Lyric) లాగా ఆత్మాశ్రయంగా వుండాలి.

"The true essay is essentially personal" అంటాడు హడ్సను.

ముఖ్యంగా శైలిమీదా, చమత్కారం మీదా వ్యాసం గొప్పతనం ఆధారపడి వుంటుంది.

కవితలో 'లిరిక్కు' ఎలాటిదో వచనరచనలో వ్యాసం అలాటిది.

వ్యాసం ముఖ్యంగా వచనంలోనే వుండాలి. పోపువంటి రచయిత వ్యాసం పద్యంలో వ్రాశాడు [Essay on criticism]. కాని పద్యంలో వ్యాసం వికసించలేదు. జ్యోతిషం, భూగోళం, గణితం మొదలైనవి పద్యాల్లో వ్రాసిన మనవారు వ్యాసం పద్యంలో వ్రాయకపోవడం మన అదృష్టం.

## తెలుగు వ్యాసం :

పాశ్చాత్య సాహిత్య ప్రభావంవల్లనే మన భారతీయ సాహిత్యాల్లో ఈ కొత్త ప్రక్రియ-వ్యాసం వచ్చి చేరింది. అచ్చుయంత్రాలు అవతరించి కొత్తగా పుట్టిన పత్రికలున్నూ వ్యాసవాఙ్మయానికి అవసరం కల్పించాయి. అంతకిముందు మన సాహిత్యంలో వ్యాసం (Essay) లేదు.

సంస్కృతంలో ఏ కాదంబరినో, తెలుగులో ఏ కళాపూర్ణోదయాన్నో-అది పద్యమే అవుగాక-చూపి, మనలో 'నవల' వుండిన సూచన కలదని అనడానికి ఎవరైనా సాహసిస్తే సాహసించవచ్చునేమో, కాని మన ప్రాచీన సాహిత్యంలో

'వ్యాసం' వుస్తావనడానికి మాత్రం అవకాశంలేదు. శాసనాలూ, వ్యాఖ్యానాలూ వ్యాసాలు కావు.

పందొమ్మిదో శతాబ్ది పూర్వార్థం నాటికే తెలుగు గద్య సాహిత్యంలో ఈ నూతన ప్రక్రియ 'వ్యాసం' ప్రభవించింది.

1840-50 ప్రాంతంలో స్వామినేని ముద్దునరసింహం నాయనిగారు 'హితసూచని' అని చక్కని వ్యాస సంపుటి వ్రాశారు. మనకు తెలిసినంతవరకు తెలుగులో తొలివ్యాస రచయిత ముద్దు నరసింహం నాయనిగారు.

'హితసూచని' 1862లో—నాయనిగారి మరణానంతరం అచ్చయింది. ఇందులో విద్యాప్రమేయము, వైద్యప్రమేయము, సువర్ణప్రమేయము, మనుష్యేతర జంతుసంజ్ఞా ప్రమేయము, రక్షః ప్రవృత్తి ప్రమేయము, మంత్రప్రమేయము, పరోక్షాది జ్ఞానప్రమేయము, వివాహప్రమేయము అని ఎనిమిది ప్రమేయాలు (వ్యాసాలు) వున్నాయి.

హితసూచని రచయిత Essay కి పర్యాయపదం 'వ్యాసం' అనడానికి బదులు 'ప్రమేయం' అని ప్రయోగించారు. ఇది గమనించదగింది. ఇలాగే పరవస్తు వేంకట రంగాచార్యులుగారు (1822-1900) తమ వ్యాసాలకు 'సంగ్రహము' అన్నారు. కందుకూరి వీరేశలింగంగారు (1848-1919) 'ఉపన్యాసము' అన్నారు.

అంటే ఆనాటికి వ్యాసం అన్నపదం వాడుకలోకి రాలేదేమో అనిపిస్తుంది. కాని 1852లో అచ్చయిన సి. పి. బ్రౌన్‌గారి ఇంగ్లీషు-తెలుగు నిఘంటువులో Essay అంటే అర్థవివరణ ఇలా వుంది :

"Eassy. n.s (add) is commonly called in Madras వ్యాసము. Essayist. n.s. he who makes an attempt, who writes an Eassy, an author ప్రయత్నము చేసేవాడు. (In Madras commonly called వ్యాసము వ్రాసేవాడు గ్రంథకర్త)"*

అంటే 1852 నాటికి పూర్వమే Essay అనడానికి తెలుగులో వ్యాసం అనీ, Essayist అంటే వ్యాసము వ్రాసేవాడు అనీ వాడుకలో వుందన్నమాట. అయినా మన తొలి వ్యాసరచయితలు ముగ్గురూ వ్యాసము అన్నపదం ప్రయోగించలేదు, చిత్రం!

ఏది ఎలావున్నా బ్రౌన్ దొరకాలంనించీ Esasy అన్నదానికి వ్యాసం అన్నపదం తెలుగులో రూఢిపడిపోయింది. అయితే ఈ అర్థంలో ఈ పదం ప్రప్రథమంగా ఎవరు ఎప్పుడు ప్రయోగించారంటే చెప్పడానికి పరిశోధన కావాలి.

---

*1852లోనే అచ్చయిన బ్రౌన్ తెలుగు-ఇంగ్లీషు నిఘంటువులో వ్యాసము అన్నమాట లేదు.

తెలుగు వ్యాస వాఙ్మయంలో తొలి సంపుటంగానే కాకుండా రచనా శిల్పం లోనూ, శైలిలోనూ, భాషా ప్రయోగంలోనూ, అభ్యుదయకరమైన భావాల లోనూకూడా చెప్పుకోదగిన సంపుటం ముద్దు నరసింహం నాయనిగారి హిత సూచని. ఈ వ్యాసాలలో నాయనిగారి అభిప్రాయాలు ఈనాటి ప్రగతివాదులు కూడా హర్షించదగినవి. వీరేశలింగమంతవారు వీరి వ్యాసాలు తమ వ్యాసాలలో చేర్చుకున్నారు.

ముద్దు నరసింహంగారి తరవాత తెలుగు వ్యాసకర్తగా పరవస్తు వేంకట రంగాచార్యులు (1822-1900) గారి పేరు చెప్పాలి. ప్రతిభా పూర్ణమైన వీరి వ్యాసాలలో ఆర్షవిజ్ఞానం ప్రతిఫలిస్తూ వుంటుంది.

అనంతరం గొప్ప వ్యాసకర్తగా పేర్కొనదగినవారు కందుకూరి వీరేశ లింగంగారు. తెలుగు సాహిత్యంలో ఇతర శాఖలకులాగానే వ్యాసవిభాగానికి కూడా రాచబాట వేశారు వీరేశలింగంగారు. వీరి వ్యాసాలు నాటికీ నేటికీ అమూల్యమైనవి.

వీరేశలింగంగారి సమకాలికులూ, తరువాతివారున్నూ అయిన కీర్తిశేషులు కొమర్రాజు వేంకటలక్ష్మణరావు, బండారు అచ్చమాంబ, పూండ్ల రామకృష్ణయ్య, వేదం వేంకటరాయశాస్త్రి, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి, జయంతి రామయ్య, చిలుకూరి వీరభద్రరావు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, ముట్నూరి కృష్ణారావు, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, ఒంగోలు వెంకటరంగయ్య, ఆచంట వెంకటరాయ సాంఖ్యాయనశర్మ, గిడుగు వేంకటరామమూర్తి, మారేపల్లి రామచంద్రశాస్త్రి, కట్టమంచి రామలింగారెడ్డి, సురవరం ప్రతాపరెడ్డి, వేటూరి ప్రభాకరశాస్త్రి, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, పురాణం సూర్యనారాయణతీర్థులు, గొబ్బూరు వెంకటానందరాఘవరావు, చిలుకూరి నారాయణరావు, కాశీనాథుని నాగేశ్వరరావు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, పానుగంటి లక్ష్మీనరసింహారావు, మల్లంపల్లి సోమ శేఖరశర్మ, వేలూరి శివరామశాస్త్రి, శ్రీవాత్సవ, కొంపెల్ల జనార్దనరావు మొద లైనవారు ఎన్నో అన్ని వ్యాసాలు వ్రాసి ఆ శాఖను పరిపుష్టం చేశారు.

వ్యాస సాహిత్యం వందేళ్ళుగా క్రమవికాసం పొందుతూనే వుంది. ఆధు నికులలో రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, పింగళి లక్ష్మీకాంతం, విశ్వనాథ సత్య నారాయణ, శివశంకరశాస్త్రి, తాపీ ధర్మారావు, దీపాల పిచ్చయ్యశాస్త్రి, నార్ల వేంకటేశ్వరరావు, వేదం వేంకటరాయశాస్త్రి, చల్లా రాధాకృష్ణమూర్తి, గిడుగు వేంకటసీతాపతి, శ్రీ.శ్రీ., నోరి నరసింహశాస్త్రి, దివాకర్ల వేంకటావధాని, ఆరుద్ర, సి. నారాయణరెడ్డి, నిడుదవోలు వెంకటరావు, దేవులపల్లి రామానుజ రావు, వడ్లమూడి గోపాలకృష్ణయ్య, వడలి మందేశ్వరరావు వావిలాల సోమ యాజులు, నాయని కృష్ణకుమారి, తూమాటి దోణప్ప, జి. వి. కృష్ణారావు,

కె. వి. రమణారెడ్డి, బి. రామరాజు, జి. సుందరరెడ్డి, రావూరి భరద్వాజ, గుంటూరు శేషేంద్రశర్మ, కొత్త సత్యనారాయణచౌదరి, విద్వాన్ విశ్వం, చిలుకూరి పాపయ్యశాస్త్రి, పుట్టపర్తి నారాయణాచార్యులు, పిల్లలమర్రి వేంకట హనుమంతరావు, వసంతరావు వేంకటరావు, ఆంధ్ర శేషగిరిరావు, నటరాజ రామకృష్ణ, దిగవల్లి వేంకటశివరావు మొదలైన వందలాది రచయితలు తామర తంపరగా వ్యాసాలు రచిస్తున్నారు. కొందరు చక్కని సంపుటాలు ప్రకటిస్తున్నారు. ఈ విధంగా తెలుగు వ్యాసం సర్వాంగ సుందరమైన కళాపరిపుష్టి సంతరించుకోబోతున్నది.

ఇంగ్లీషులో వ్యాసానికి—అదే Eassy కి నాలుగు శతాబ్దాల చరిత్ర వుంది. కొమ్ములుతిరిగిన సాహిత్య మహారథులు కలంపట్టి దానిని సాహిత్యరంగంలో వొక విశిష్టమైన కళాఖండంగా తీర్చిదిద్దారు. పట్టుమని పదిదశాబ్దాలు కాలేదే అనండి, మరేకారణం కానివ్వండి తెలుగులో కావ్యం, కథ, నవల గడించినంత విశిష్టస్థానం వ్యాసం ఇంకా గడించలేదే అనాలి ఆలోచిస్తే. అయినా భవిష్యత్తు ఉజ్జ్వలంగానే వుంది, సందేహం లేదు.

వెనకటి కాలానికీ ఇప్పటికీ వ్యాసరచనలో బ్రహ్మాండమైన మార్పు కనిపిస్తుంది. ముఖ్యంగా గిడుగువారి ఉద్యమఫలితంగా మన పత్రికలు—ఏ వొక్కటో తప్ప—వ్యావహారిక భాష ఆదుకున్న అనంతరం ఈ మార్పు మరింత కొట్టవచ్చినట్టు అవుపిస్తుంది.

ఈ సంపుటం :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అధ్యక్షులు డా. బెజవాడ గోపాలరెడ్డి గారు చేసిన సూచన పురస్కరించుకొని మన ప్రాచీన పత్రికలనించి సంకలనం చేసి రెండు సారస్వత వ్యాస సంపుటాలు ప్రకటించడం కోసం సాహిత్య అకాడమి నిశ్చయించింది. అందులో వొకటి నేను సంకలనంచేయాలని ఆదేశించింది. డా. తూమాటి దొణప్పగారు నాకు సహకరించాలనీ కోరింది. అదిగో దాని పరిణామమే ఈ సారస్వత వ్యాస సంపుటం.

ఈ సంపుటంలో 'అముద్రిత గ్రంథ చింతామణి', 'గ్రంథాలయ సర్వస్వము', 'తెలుగు', 'సారస్వత సర్వస్వము', 'ప్రతిభ', 'సుజాత', 'కిన్నెర' పత్రికలనించి సారస్వతవ్యాసాలు ఏర్చికూర్చడం జరిగింది. ఈ పత్రికలన్నీ ప్రసిద్ధమైనవి ; కేవలం వ్యాపారపరశికోసం కాక సారస్వత సేవకోసమే పుట్టి, సారస్వతాభివృద్ధికి తోడ్పడినవి ; ఎంతోమంది సాహిత్యవేత్తలను ప్రోత్సాహపరచి వ్యాసరచనకు దోహదం కలిగించినవి. కనక వ్యాసవాఙ్మయం ఈ పత్రికలకు ఎంతయినా రుణపడి వుంది.

ఈ సంపుటంలోని వ్యాసకర్తలందరూ సుప్రసిద్ధులు; సాహిత్య మహారథులు; భాషా నిష్ణాతులు.

ఈ వ్యాసాలు పరికిస్తే పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధంనించి ఇవాళదాకా తెలుగు వ్యాసవాఙ్మయం ఎలాఎలా పరిణామం పొందిందో-పూర్తిగా కాకపోయినా స్థూలంగా అయినా అవగతమవుతుంది కొంతవరకు.

1885లో 'అముద్రిత గ్రంథ చింతామణి' అవతరించింది. ఆనాటి సాహిత్యయోధులు వేదం వేంకటరాయశాస్త్రి, కందుకూరి వీరేశలింగము, కొక్కొండ వేంకటరత్నము, పూండ్ల రామకృష్ణయ్య (పత్రికాధిపతి), మండపాక పార్వతీశ్వరశాస్త్రి, నాగపూడి కుప్పుస్వామయ్య, శతఘంటం వేంకటరంగయ్య ప్రభృతుల సాహిత్య సమరానికి 'కురుక్షేత్రం', దాని మయూఖాలు, అప్పటి ఆ వ్యాసాల వాక్యనిర్మాణమూ, భాషా, శైలీ, విషయ నిర్వచనమూ మొదలైన వాటితో 1936 నాటి 'ప్రతిభ'లోని వ్యాసాలు సరిపోల్చి చూసినప్పుడు తెలుగులో వ్యాసరచన ఎంతమార్పు, ఎటిమార్పు చెందిందీ వ్యక్తమవుతుంది. దీనినిబట్టి తెలుగు గద్యవాఙ్మయంలో కలిగిన క్రమ వికాసమున్నూ గమనింపవచ్చు కొంతవరకు.

ప్రాచీన వ్యాసాల సంకలనానికి ఇది తొలి ప్రయత్నం మాత్రమే. ఇలాటివి ఇంకా విరివిగా వెలువడినప్పుడు భాషకీ, సాహిత్యానికీ ఎంతయినా ఉపకారం జరుగుతుంది.

కృతజ్ఞత :

ఈ సంకలన కార్యం నిర్వహించడానికి నాకు అవకాశం కల్పించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వారికి—ముఖ్యంగా డా. గోపాలరెడ్డిగారికీ, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికీ, తగిన సలహాలతో తోడ్పడిన మిత్రులు డా. తూమాటి దొణప్పగారికీ, కోరడంతోనే పాత 'అముద్రిత గ్రంథ చింతామణి' సంపుటాలు పంపి సహాయపడిన మిత్రులు శ్రీ కె. వి. రమణారెడ్డిగారికీ, అడగడమే తడవుగా అన్ని గ్రంథాలయ సర్వస్వం సంపుటాలూ పంపి సహకరించిన మిత్రులు శ్రీ పాతూరి నాగభూషణంగారికీ ఎంతయినా కృతజ్ఞుణ్ణి.

విశాఖపట్నం
1-1-1969

—పురిపండా అప్పలస్వామి.

# విషయసూచిక



# ఆంధ్ర మహాభారత విమర్శనము

ఆంధ్ర మహాభారతమును మహారాజశ్రీ వేమూరి వేంకట కృష్ణమ్మసెట్టి అందు సన్నుగారు బ్రహ్మశ్రీ మహారాజశ్రీ రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులవారిచేతను బ్రహ్మశ్రీ రాయదుర్గము నరసయ్యగారిచేతను బరిష్కరింపించి ముద్రింపించి ప్రకటించి యున్నారు. గ్రంథముయొక్క తీరుఁ జూడ ముద్దులు మూటగట్టుచున్నది. అక్షరము లక్షనదము పోలికం బోలి యున్నవి.

తెలుఁగు భారతము ప్రప్రథమమున 1867 సం॥ ఏప్రెలు నెలలోఁ బ్రకటింపఁ బడినది. అపుడు దానిని చెన్నపురి రాజకీయ పాఠశాలాంధ్ర ప్రధాన పండితులగు వింజమూరు కృష్ణమాచార్యులవారు పరిష్కరించిరి అపుడే దీని యందుఁ గొన్ని స్ఖాలిత్యము లుండినవి. ముద్రితగ్రంథములు చిక్కుచు వచ్చినందున తాళదళ సంపుటములను జూచువారు లేక యవి రామబాణాఖ్య క్రిమికుల దష్టవర్ణములై పోయినవి పోఁగా నిప్పటికిని గొన్ని గ్రంథములు మిగిలి యున్నవి. ముద్రితగ్రంథములలో సంశయాంశములు సంభవించినపుడు వ్రాఁత ప్రతులఁ జూచి తీర్మానించుచున్నారు. "సీ. లాక్షణికులు సర్వలక్షణం బనియు" దీని భావించుచున్నారు గాన మేమిపుడు వ్రాయఁ దలంచిన విషయమంతయుఁ దదనుసారమై యుండును. అట్లని యన్ని విషయములును మేమిక్కడ వక్కాణింపఁ జాలము. 'స్థాలీపులాకన్యాయమున్' గైకొందుము.

ఇప్పుడు వేంకటకృష్ణమ్మ సెట్టిగారు ముద్రింపించిన భారతమునందు శ్రీ కాళహస్తి నివాసులగు బ్రహ్మశ్రీ శతఘంటము వేంకటరంగశాస్త్రులవారు 88 పుటల పీఠిక వ్రాసి ప్రకటించి యున్నారు. దానియం దనేక విషయములు విమర్శింపఁ దగియున్నవి. అవి యెవ్వియన:—

మ. ధృతరాష్ట్రుఁడును బుత్రులు న్వనము కుంతీనందనుల్ సింహముల్
మతి నూహింప ససింహమైన వనమున్ మర్దింతు రెండు న్వనా
వృతవృత్తంబులుగాని సింహములకు న్వేగంబ చేటొందుఁ గా
న తగంబొందుట కార్య మీ యుభయమున్ సంతుష్టిమై నున్కికిన్.

అని యుద్యోగపర్వ ప్రథమాశ్వాసమున 818 వ పద్యముగా ముద్రింపఁబడియున్నది. ఇందు నాల్గవపాదమునందలి ప్రాసముం గూర్చి "కానన్" శబ్దము ద్రుతాంత మైనను దీని నిచ్చటఁ దిక్కనగారు కళగానే వ్రాసినారని వేంకట రంగశాస్త్రిగారు "కానన్ అను ద్రుతాంతము కంటె 'తగన్' అను పదము పర మగునపుడు ద్రుతమున కర్ధానుస్వారమును "త"కారమునకు "ద"కారమును రావలసియుండఁగా నట్లు లేక తకారప్రాసమున "త"కారముగానే ప్రయోగించి యుండుటం జేసి యెక్కడనేని గొన్నిచోట్ల "కానన్" అను దాని ద్రుతమునకు లోపమును దాని మీఁది పరుషవర్ణములకు సరళవర్ణము లాదేశములుగా రావనియు నీద్రుతము లోపించి పరుషవర్ణమే నిలుచుననియు నందులకీ నిపాతనము జ్ఞాపక మని కల్పింపవలసియుండెను. ఇట్టి ప్రయోగము లింకెక్కడ నైన నుండెనేని వానికీ ప్రయోగ మాధార మగును" అని వ్రాసిరి.

ఈ పద్యముపై 1895 సం. ఏప్రెలునెల మామయూఖములో బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిలవారు విమర్శవ్రాసి యిట్లు ప్రకటించియున్నారు:

"కానతెగన్; కాన=అడవి· తెగన్=నఱుకఁబడి పోఁగానని యర్థము."

అని వేంకటరాయ శాస్త్రిలవారు సవరించి యుండిరి. ఆ సవరణను గూర్చి పీఠికాకారులగు నీ వేంకట రంగశాస్త్రిలవారు 85 వ పుటలో వ్రాసిన వ్రాతం గనుఁడు :-

"కాన తెగన్ అని పాఠము గల్పించి, కాన=అడవి; తెగన్=తెగఁగా వనావృతవృత్తంబులుగాని సింహములకున్ వేగంబ చేటొందు నని మూఁడవ పాదముతో నైన నన్వయింప వచ్చును."

అని వ్రాసి యున్నారు. "కల్పించి" అని వీరు వ్రాయుటచేతనే వీరి కీయర్థమంత ఋజువుగా నుండలేదని స్పష్టపడెగదా. వీరికే గదు. గ్రంథముల బరిష్కరించిన పండిత ద్వయమునకును "కానతెగన్" అను పాఠము రుచింప లేదు. రుచించి యున్నచో "గానతెగన్" అని ముద్రింపరా? సంస్కృత మూలముం గనుడు.

శ్లో॥ వనం రాజా ధృతరాష్ట్రస్య పుత్త్రో వ్యాఘ్రాస్తే పై సంజయ,
పాండు పుత్త్రాః మావనం ఛిన్ది సవ్యాఘ్రం మావ్యాఘ్రానీన
శర్వనాత్. 53.

శ్లో॥ నిర్వనో వధ్యతే వ్యాఘ్రో నిర్వ్యాఘ్రం ఛిద్యతే వనం.

తస్మాద్వ్యాఘ్రో వనం రక్షేత్ వనం వ్యాఘ్రమంచ పాలయేత్. 54. ఇందు రెండవ శ్లోకము నందలి "నిర్వనో వధ్యతే వ్యాఘ్రో" అను వాక్యమునకు "వనావృత వృత్తంబులు గాని సింహములకున్ వేగంబ చేటొందున్" అనునది తిక్కనగారి భాషాంతరీకరణమఁట. నిర్వనః అనఁగఁ బోయిన వనముగల, ఛేదింపఁబడిన వనముగల యని యర్థము. కావున నిర్వనములై యుండుటచే వనావృత వృత్తంబులుగాని సింహములకు వేగంబ చేటొందునని యర్థము. ఏతత్పీఠికా కారుల మతముఁబడి తిక్కన "కాన" అనుపదముఁ గారణవాచకముగా నుపయోగించి యుండినచో సింహములు వనావృత వృత్తంబులు గాక యుండుటకుఁ గారణ మూహ్యము. ఇట్లగుటకుఁ గారణము వనచ్ఛేదమో, లేక వనము స్వస్థముగ నుండియు సింహ స్వచ్ఛంద వృత్తియో యీ రెంటిలో నొకటి కారణముగ నుండవలయును. "వనావృత వృత్తంబులుగాని" అను వాక్యములో "నిర్వనమ్"అను పదార్థము రాదు. "కానతెగన్" అను శ్రీ శాస్త్రుల వారి పాఠమీ సందిగ్ధమును దొలంగించి మూలము ననుసరించి యుండును. మఱియుఁ "దగన్" అనఁగ నొప్పునట్లుగానని యర్థమని పీఠికలో వ్రాయఁబడి యున్నది. ఒప్పునట్లుగానని వ్రాసిరిగదా. ఒప్పునది యేది? ఈ యొప్పుట లేకయే "పొందుట కార్య మీయుభయమున్ సంతుష్టిమై నున్కికిన్" అను వాక్య మర్థమగు చున్నది. కావునఁ దిక్కయజ్వ యిట్టి యపుష్టార్థక పదమును బ్రయోగించి యుండఁడని నొక్కి చెప్పనగు. మూలానుగుణసారియగు వేంకటరాయ శాస్త్రుల వారి పాఠము. లక్ష్య లక్షణ విరుద్ధ మిథ్యాకల్పనయగు పీఠికా కారుల సిద్ధాంతమున కవకాశము లేకయే తదప్రాస దోషముఁ దొలంగించును. ఒకవేళఁ బీఠికా కారులు మూల శ్లోకములో "తస్మాత్" అను పదమున్నది గనుక "కాన" యనుపదము నవ్యయముగాఁ దిక్కన ప్రయోగించి యుండునని యిఁక వాదింతురు గాఁబోలు. అది సమంజసము గాదు. అట్లైన మూలములో నున్న వ్యాఘ్ర శబ్దమునకు తెలుఁగు పద్యములోని సింహశబ్దము పర్యాయ పదమనియుఁ జెప్పుదురేమో. శ్లోకద్వయ భావమే తిక్కనకు ముఖ్యము. రెండు శ్లోకములకుఁ గదా యొకపద్యము వ్రాయఁబడినది. "కానతెగన్" అను పాఠములోఁ గాన నను నవ్యయము నాల్గవపాదములోని "పొందుట" అను పదమునకు ముందు నధ్యాహార్యముగ నున్నది. కావున నీ పాఠమే సర్వవిధ సమంజసము. ఇట్టి పాఠమును కల్పనయని చెప్పి యొక యవలక్షణపు పాఠ మూహించుట పాడిగాదు. ఉభయ భాషా పాండిత్యము గలిగిన వేంకటరంగ శాస్త్రి గారిట్టి పట్టును దిట్టముగా విచా

రించి యిదమిత్థమని న్యాయముగా నిర్ణయింపకుండుట మిగులలోపమని తలం చెదము. పండితులకు న్యాయము కంటగించు చున్నది. అక్షరాస్యు లసూయా గ్రస్తులై రి. పక్షపాతమును బ్రేమించిరి. ఇఁక న్యాయమెక్కడిది? కడిఁది యే. బ్ర. వావిలాల వాసుదేవ శాస్త్రిల వారి మేనమామగారగు బ్ర. వత్యము అద్వైత పరబ్రహ్మ శాస్త్రిల వారును గొన్ని వత్సరముల క్రిందట వాసిరెడ్డివారి హవేలీ లోఁగావించిన శతావధానము నందును నీ పద్యముయొక్క నాల్గవ పాదమే ప్రశ్నగా నీయఁబడఁగా నందులకు వారు "ధృతరాష్ట్రిందును బుత్త్రిలు స్వనము అను పద్యమునే పూర్తి చేసినట్లుగా "నందక రాజ్యము" అను గ్రంథము నందును, 62 పుటలో నున్నది. వేంకటరాయ శాస్త్రిల వారు తప్పుఁ దొలంగించి సుష్ఠువగు పాఠమును బ్రకటించినను నిప్పటి వారిలోఁ గొందఱు దాని నొప్పక తమ తప్పుదారినే పోవుట భాషయొక్క పాపము.

"కావున భారత ప్రయోగములన్న మాత్రనే యిప్పటి పుస్తకములలో నగపడు వాని నన్నింటిని గ్రహింపక కవిత్రయము వారట్టి ప్రయోగములు ప్రయోగించిరా యని లెస్సఁగ నాలోచించి తగురీతి వాని నిశ్చయింప వలసి యుండెడు."

అని పీఠికా కారులు వ్రాసికొనియున్న వాక్యము వారికేల యన్వయింపదు? సంస్కరణ కర్తలిద్దఱును వేంకటరాయ శాస్త్రిలవారు మా పత్రికలో నీ పద్యమును వివరించియున్న వ్యాసమును జూచియు నా సవరణ నిష్టపడ లేదు గదా. వేంకటకృష్ణమ్మ సెట్టిగారు ప్రకటించిన పత్రికలో "........ ఆనంద దాయకంబై యుండునట్లు భారతంబు వ్రాయఁబడియు నయ్యది యనేక శతసంవత్సరంబులు గడచియుండు కతంబున లేఖకులచేఁ బ్రమాదవశంబునఁ దప్పిదంబు లొకకొన్ని వ్రాయబడియుఁ గొందఱు లాక్షణిక మాతులచే ననం బద్ధ పాఠంబులు గల్పింపఁబడియు, గొందఱచే స్వప్రయోగానుసారిగ నక్కడక్కడ మార్పఁ బడియుఁ గొందఱచే నపశబ్దంబులు గూర్పఁబడ నవి సరియని మఱికొందఱచే దుర్వాదము సేయఁబడియు నిట్లు నానావిధంబుల దూషితంబై తావిప్పుడు విపులుఁ గప్పిన నిప్పునుం బోలెఁ బొనుఁగుపడి యున్నది." అని ప్రకటించి యున్నారు. పై పద్యములోని సవరణ విషయమై వీరేమి శ్రద్ధఁదీసి కొనిరో తెలియ కున్నది. వీరిట్లు గ్రంథమును మార్పు గావింతురని ముందే తెలిసి మా మిత్రులగు గునుగుపాటి ఏనాది రెడ్డిగారు వేంకటకృష్ణమ్మ సెట్టిగారి

పేర వ్రాయఁగా సెట్టిగారు 1898 సం. అగష్టునెల తే. 8 దిన చెన్నపురినుండి యిట్లు వ్రాసిరి.

ఆంధ్రమహాభారత ముద్రణ విషయమై వ్రాయుచు 'మీ సదుద్యమము సత్కవి పండితులచే నీడేరునుగాని పండితాభాసులచే నీడేరదని రూఢిగా నెఱుఁగుదును' అని తెలియఁ జేసితిరి. ఇప్పటి పండితు లేకీభవించి పనిఁజేసి లోకోపకారము చేయుటకు మాఱుగా మత్సరగ్రస్తులై యొకరిలోపము లొకరు వెల్లడిచేసి ప్రొద్దుపుచ్చుకొను చుండుటచే వాస్తవమైన పాండిత్య మెవరియం దుండునది నిశ్చయింపఁ దగినంత శక్తి మాకు లేదు. పండితవర్యులైన బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిల వారికి వ్రాయఁగా వారు మౌనముగా నుండిరి.

కావున గంతకుం దగిన బొంత యన్నట్లు మాకుఁ దగిన నాలుగక్షరములు దెలిసిన వారిని బెట్టుకొని తప్పులు మెండైనను అచ్చు మంచిది అట్టగట్టిదియగు ప్రతినైన నొకటి ముద్రించు కొనెదము. సముద్ర మీఁదువానివలె దోవగానక యున్నారము' అని వ్రాసినారు గాన వారి జాబు సార్థకమైనదిగదా. ఇందువలననే వీరు భారతమును సుష్ఠుగా ముద్రింపలేదని యేర్పడుచున్నది. వీరి భారతములో నాదిపర్వము ప్రథమాశ్వాసమున 76 వ పద్యముఁ జూడుఁడు :-

ఉ. ఇంబుగ సర్వలోకజను లెవ్వనియేని ముఖామృతాంశు బిం
బంబున నుద్భవంబయిన భారతవాగమృతంబు కర్ణరం
ధ్రంబను నంజలిం దవిలి త్రావుచు రట్టి మునీంద్రలోక వం
ద్యుం బరముం బరాశరసుతుం బ్రణమిల్లి కరంబు భక్తితోన్.

అని ముద్రింపించి యున్నారు. ఇదివరకు ముద్రింపఁబడిన భారతములో "ఇమ్ముగ" నని యున్నది గాని "ఇంబుగ" నని లేదు. అప్పకవీయమున

తే. గట్టిబిందువు మీఁది బకారమునకు
జమిలి మాప్రాస మైత్రినా జరుగుచుండుఁ
గమ్మతావులు వెదచల్లు నంబుజములు
శంబరారాతి చేతివాలమ్ములనఁగ.

అనియున్న లక్షణము వీరిచేతిలో నవలక్షణమైనది. తాళప్రతులయందును, ముద్రిత ప్రతుల యందును "ఇమ్ముగ" ననియున్న పాఠమును నీ సంస్కరణ కర్తలు కారణము చెప్పక 'ఇంబుగ' నని వ్రాయుట మిగుల శోచనీయముగా నున్నది. పీఠికాకారులైనను దీనిం దాఁక సన్నకసన్న విడిచినారు.

ఉ. ఇంబడరంగ నియ్యకొనియెన్ రజనీచరుఁడేమి భాగ్యమో
యంబుజనాభ"

అను పద్యము శబ్దరత్నాకరమున వ్రాసియున్నది. భారతమునకుఁ గళా పూర్ణోదయము ప్రమాణము గాదు. ఈ భారతపద్యమునైన సీతారామాచార్యుల వారు తమ శబ్ద రత్నాకరములో నుదాహరింపలేను. ఇట్లుండ వీ రేయాధార ముం బట్టి యిట్టి బెట్టిదంపు మార్పుం గావించిరో తెలియదు. ఈ ప్రాసమే చెల్ల కూడదని వీరి యభిప్రాయ మైనచో, నప్పకవి

"రంబు జంబు రంభు జంబు రంబుఁ జెన్ను మీఱఁగాఁ
దొమ్మిదింట విశ్రమంబు తోరమై సుగంధికిన్
గ్రమ్మఁగా నుతింపనొప్పు గానలోలుఁ దచ్యుతుం
దంబుజాక్షుఁ డాదిదేవుఁ దక్షరాఖ్యుఁ డెప్పుడున్."

"ఇమ్మహిలోఁ గ్రమ్మ భగల్
బింబమునన్ గంబుధరా"

అను పద్యముల నేల వ్రాయును ? కావున వీరి భారతములో నున్నట్టి "ఇంబుగ" నను పద్యము "ఇమ్మగ" ననియే యుండవలయునని మా సిద్ధాంతము. ఈ ప్రాసము విషయమై మేము 1900సం. మే నెల మయూఖములో వివరించి వ్రాసియున్నారము. ఈ ప్రాసము పనికిరాదని వీరుమాత్ర మభిప్రాయ పడిరే కాని తక్కిన వారెవ్వరిట్టి యభిప్రాయ పడలేదు. ప్రక్రియా ఛందస్సున యతి ప్రాసమున నుదాహరణములని యిట్లు వ్రాయఁబడి యున్నది :

అంబకు మ్రొక్కినా కలవడినట్లు
ఇమ్మగా యతికుదాహృతులు సెప్పెదను

అని వ్రాసియున్నారు. ఈ ప్రాసమే చెల్లకున్నచో "ంబ=మ్మ" లకు ప్రాసముగా నేల ముద్రింపఁబడెనో యోచింపుఁడు.[1]

---

1 అదే పత్రికలో అనుబంధంగా కింది విషయం ప్రకటిత మయింది : కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహమున నిట్లు వ్రాసియున్నాడు.

ఆ. బమలు బిందు పూర్వకముగఁ బ్రాసంబుల
నిలుపఁజెల్లు ..................

ఉ. కాదన కిట్టిపాటి యపకారము తక్షకుఁ డేకవిప్ర సం
బోదనఁజేసి చేసె నృపపుంగవ నీవు ననేక భూసురా
పాదిత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాది కా
కోదర సంహతిన్ హుతవహోగ్రమహోగ్ర శిఖాచయంబులన్.

అను పద్యము వీరి నూతన భారతములో 'బోదన' మని రెండు పద్యములలోను ముద్రింపఁబడి యున్నది. మొదటి తడవ 19 వ పుట యందును రెండవమాఱు 46 వ పుట యందును నున్నది. రెండవమాఱు ముద్రింపఁబడి నపు డిట్లొక జ్ఞాపిక సంస్కరణ కర్తలు వ్రాసియున్నారు. ఎట్లన :—

"బుధ-నిశామనే యను ధాతువు నుండి సంబోదన, 2 పాదనఁజేసి చేసె నృపపావన యని పాఠాంతరము."

ఇందు రెండు విషయము లున్నవి. బోదన శబ్దమొక్కటి. పాదనఁ జేసి చేసెనను పాఠాంతర మొక్కటి. పాఠాంతరముతో మాకుఁ బనిలేదు. బోదనను గుఱించి ముఖ్యముగ వ్రాయుచున్నారము.

ప్రాచీనంపుఁ బ్రతుల నేమి ముద్రిత గ్రంథములలో నేమి "బోధన"మని యున్నది. దీనిని రాయదుర్గము నరసయ్యగారు బోదనమని మార్చి ముద్రించినారు. దీని మే మెఱుఁగుదుము. అప్పుడే యిది తప్పని సెట్టిగార్లతోఁ జెప్పియున్నారము. మంచిది. వీరు 'బుధ-నిశామనే' యను దాతువున నుండి 'సంబోదన' యగునని గదా వ్రాసిరి. అనఁగా నరసయ్యశాస్త్రిుల వారికి దధలకు ప్రాస మిష్టములేక మార్చినారు. అప్పకవిగారు దీని నిట్లు చర్చించి వ్రాసినారు; ఎట్లన :-

---

అని లక్షణము వ్రాసి లక్ష్యములకుఁగా "ఇమ్ముగ సర్వలోక" అను పద్యమును మాత్రమే గాక జైమిని భారతము నుండియు

ఉ. అమ్మఖవాజి పాండు తనయాధ్వరవాహమెదిర్చి మోము మో
వం బసివెట్టి హేషితరవమ్మున వక్షముఁ బూర్వపత్తురా
గమ్మున వ్రేయ జేసి యిది కంఠము వట్టి విదల్పఁదోన మి
త్రమ్మయి కేళికిం గదఁగి దంతములన్ గళ మప్పళింపఁగన్. అ.7.

ఇందు 'మోము మోమమ్మసివెట్టి' అని కాదు. పసి యనఁగా వాసన. ఆ వాసన వెట్టి యని యర్థము. మసివెట్టి యన నర్థము లేదుగానఁ బసి వెట్టి యని కవి యభిప్రాయమనుట స్పష్టము. ఏది యెట్లున్నను 'అంబఖవాజి' అని కాదు గదా.

"బుధ అవగమనే అను ధాతువు వలనను, బుధ శబ్దములోని రెండవ వ్రాయి తవర్గమునందుఁ జతుర్థాక్షరమైన ప్రాసముల పట్లను బూర్వకవి ప్రయోగములు గలుగుట చేతను దృతీయ వర్ణములకుఁ జెప్పవచ్చును. సుధా శబ్దము మొదలైన వానికి నిటువలెనే యని తెలిసికొనునది."

అని వ్రాసి నృసింహ పురాణమున నుండి భారతమున నుండి యీ పద్యముల నదాహరించి యున్నారు :

1. ఉ. కాదన కిట్టిపాటి యపకారము తక్షకుఁ డేకవిప్ర సం
బోధనఁ జేసి చేసె.........(ఆదిపర్వము)

2. క. వేదము లాదిగఁగల య
ష్టాదశ విద్యలకు నీవ స్రష్టవు తత్త
ద్బోధకులును భవదాజ్ఞా
పాదకులు సమస్త ధర్మపాలన చతురా.

3. క. ముదమొదవ రమ్య హర్మ్యము
తుది నిలువున నిష్టసఖులతోఁ డ విహారా
స్పదమగు నెలవున మెలఁగెడు
సుధేష్ణ తజ్జాలకములఁ జూచెం బ్రీతిన్.

4. క. వింధ్యాద్రివోలె నాప్రతి
వింధ్యుఁ డచలితోగ్రమూర్తి వెలయ నిలిచి ద
ర్పాంధ్యమతి నదరి దీప్తా
వంధ్యాస్త్రము లెక్కమారవరుపైఁ బఱపెన్.

ఇందు 1, 3, 4 పద్యములలో నున్న "బోధక, సుధేష్ణ, ప్రతివింధ్య" శబ్దములను పంస్కరణ కర్తలు 'బోదన, సుదేష్ణ. ప్రతివింద్య' శబ్దములుగా మార్చి ప్రకటించినారు. కారణమును వ్రాయరైరి. బోధక, సుధేష్ణ, ప్రతివింధ్యుఁ డని గ్రంథములలో నున్నట్టు మే మెఱుఁగుదుము గాని బోదక, సుదేష్ణ, ప్రతివింద్యుఁడని మే మెఱుఁగము. ఒక మేమే గాము. ఎనమంద్రము. వేంకటరామయ్యగారు వ్రాసినట్టి యకారాది నిఘంటువగు పురాణనామ చంద్రికయందు 119-224 పుటలలో వరుసగాఁ 'ప్రతివింధ్యుఁడు, సుధేష్ణ' అని వ్రాయఁబడినది గాని వీరి గుణితము రీతి లేదు గాన వలయుననియే పై ప్రాసముల నిట్లుమార్చిరి.

మఱియు నీ నూతన భారతమున పీ రనేకముగ మార్పులు గావించి యున్నారు. ఇప్పటి మన తెలుఁగు కవులలో నొకరి యభిప్రాయముతో నొక రేకీభవింపక పోవుట నైజమైనది. ఒకరుచేసిన మార్పుల నొకరు న్యాయముగా నున్నను నసూయతో ముందుగా నొప్పుకొనరు. తర్వాత దొంగకుఁ దేలుకుట్టి నట్లుగ మార్చుకొందురు. ఆ చిత్రమంతయు నీ నూతన భారతమునఁ బ్రత్యక్షముగఁ గనవచ్చును. ఉదాహరణములం గనుఁడు :

బిల్వేశ్వరీయ వాదమున వేంకటరత్నము పంతులుగారు దథలకుఁ బ్రాస మున్నదని భారతములోని

“శా. ఏ దక్షౌహిణు లెన్నఁ బాండవబలం బేకాదశాక్షౌహిణుల్
రూఢిం గౌరవసైన్య మీ యుభయమున్....”

అను నాదిపర్వములో ముద్రింపంబడి యున్న పద్యమును బ్రమాణముగాఁ జూపి హోరాహోరిగాఁ బోరిన విషయ మీ సంస్కరణ కర్తలకుఁ దెలియనిది గాదు. అపుడు వీరు దథలకుఁ బ్రాసము చెల్లదని యొక్కుమ్మక్కై వ్రాయరైరి గదా. ఇప్పుడెట్లు మార్చిరో తెలియదు. (చూడుఁడు క్రొత్తభారతము పుట 131 పద్యము 69)

మఱియొక చిత్రము. ఆసూరి శ్రీనివాసాచార్యులవారు లవలకు యతి యున్నదని భారతము నందలి “పా. లకుఁడవు నీవ యట్టి యనవద్య గుణుండవు” అను నాది పర్వములో నున్న పద్యమును జూపి సంజీవనిలోఁ బ్రకటించి నపుడీ సంస్కరణ కర్తలు దానిం దృఢీకరింపక యపుడు మౌనము వహించి యిపుడు “పావకుఁడవు” అని ముద్రింపించినారు. ఈ సవరణను శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులవారు మానపత్రికా మయూఖములో 1895 సం॥ ఏప్రెలు నెలలో 44 వ పుటయందుఁ బ్రకటించిరి.

అఖండయతి గుఱించి భీష్మపర్వము ప్రథమాశ్వాసమున నున్న “నీలోనికి దివ్యదృష్టి నిచ్చెదఁ బుత్త్రా” అని యున్నందున నిది యఖండ యతికిఁ బ్రయోగ మని వారు దుర్వాదముఁ జేయఁగా శ్రీ వేంకటరాయ శాస్త్రులవారు 1895 సం॥ మా మయూఖములో 45, 46, 47 పుటలలో నిట్టి పద్యములం జర్చించి యిది యఖండయతి కాదని నిర్ణయించి

ఆలోకింపఁగ వలసిన
నేలోనికి దివ్యదృష్టి నిచ్చెదఁ బుత్త్రా.

అని సవరించిన దానిని వీరు సన్నకసన్న నూతన భారతములోకిఁ జేర్చి నారు. (చూడుఁడు. పుట 924. పద్యము 6.) ఆయుద్ధములో వీరిలో నొకరైనను దీని నప్పుఁడు తాఁకరైరి. ఇది యమర్చిన దానిలో నత్తగారు వ్రేలుపెట్టినట్లున్నది.

రళ ప్రాస విషయకమై విమతులు భారతమునందలి స్త్రీ పర్వములోని
'బోరగిలం బడ్డవాఁడు కపాల మొకటి'

అను పాదమును జూపిరి. ఆ ప్రయోగము తప్పని శ్రీ కొండముది నరసింహముగారు

'బోరగిలఁ బడ్డవాఁడు కపోల మొకటి.

అని 1894 సం॥ ఏప్రెలు మయూఖమున వ్రాసియున్నారు. అపుడా సవరణలు బాగుగా నున్నవని వీరికి వ్రాయుటకు నిష్టము లేకపోయినది ఇపు డది ప్రశస్తమని వారు తమ నూతన భారతమునఁ జేర్చిరి. (చూడుఁడు. స్త్రీపర్వము పుట 1582 పద్యము 101) ఈ విధముగా నీ సంస్కరణ కర్తలు తమ కిచ్చవచ్చిన వానిం గైకొని తక్కినవానిం దృణీకరించి యున్నారు. వారు నిరసించిన వానిని గొన్నిటి నిటఁ బ్రకటించుచున్నారము.

తే. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁగావు
ఎఱుఁగు మెల్ల ధర్మంబుల కెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు.

అని భారతమున నాదిపర్వమున నున్నది. 1859 సం॥ వ్రాయఁబడిన 'ఆంధ్రవ్యాకరణ చంద్రిక'లోఁ బాదాంతమందు సంధి లేదనుటకుఁ బ్రమాణముగా దీని వ్రాసియున్నారు. ఇట్టి ప్రయోగములు వసుచరిత్ర, సుమనోమనోభిరంజనము మొదలైన గ్రంథములయం దున్నవి. టీకాకారులును నొప్పికొనియున్నారు. ఇట్లుండఁగా నీ సంస్కరణ కర్తలు "సరియుగావ ఎఱుగుము" అని ముద్రింపించినారు. "కావు" అని తాళపత్రప్రతులలోను, ముద్రిత ప్రతులలోను, వ్యాకరణములలోను, నీతిసంగ్రహమను గ్రంథమునను నున్నది. ఇంతయేల,

శ్రీ రావుబహద్దరుగారగు శ్రీ వీరేశలింగము పంతులవారే 1800 సం॥ ప్రకటించిన *సంగ్రహ వ్యాకరణమునందును 44 వ పుటలో నుకారసంధి రామికి నీ పద్యమే వ్రాసియున్నారు. "సరియుఁగావు" అని యందు వ్రాయఁబడియున్నది. దాన వారు వ్రాసిన సూత్రమునుం గనుఁడు.

"వాక్యముల తుదనుండు ఉకారమునకు సంధి లేకుండుట యొక దోషము గాదు"

అపుడు దోషముగాక పోయినది. వీరిపుడు మార్చినట్టి "కావ" యనుదాని ప్రయోజన మగపడదు. వారేల యట్లు ముద్రింపించిరో తెలియదు. ఈవిషయమై పీఠికలో నేమియు వ్రాయఁబడ లేదు.

సకల ప్రాస విషయమై స్త్రీపర్వములో నున్నట్టి

ఆసభ నమ్మోయి నీ దు
శ్శాసనుఁ డప్పాండు పుత్త్రిసతిఁ గ్రూరాత్ముం
డై శంక లేక పెద్దయుఁ
గాసింబెట్టంగ నెఱిఁగి కలఁగిన మదితోన్.

అను పద్యమును బిల్వేశ్వరీయ విమర్శనములో విమతులు చూపఁగా దానిని శ్రీ వేంకటరాయ శాస్త్రిల వారు శంక లేక యనుటకు బదులు "సుంకు లేక" అని 1896 సం॥ ఏప్రెలు మా మయూఖమునందు 48 వ పుటలో వ్రాసి యున్నను వీరు దాని నిష్టపడ కుండుటకుఁ గారణ మగపడదు. సకలప్రాసము వీరి కిష్టము గాఁబోలు. భారతమున నిట్టి పద్యములు లేవు.

"పరిఘ జలంబులం దమలపంకరుహోత్పల కైరవాది సుందరకుసుమంబునన్."

అని వీరి నూతన భారతంబున ముద్రితమైనది. ఇది పరిఖా శబ్దము. పరిఘ శబ్దము గాదు. ఖేయపర్యాయమగు పరిఖ శబ్దము ఖాంతము. అను అవధారణే. నిఘంటువులలో ఖాంతముగానే యున్నది. ఇది ఖాంతమేగాని ఘాంతము గాదని

---

*శ్రీ వీరేశలింగము పంతులుగారి "సంగ్రహ వ్యాకరణము" యిప్పటికిఁ బదునొకొండు మార్లు ముద్రితమైనది. "సరియుఁగావు, ఎఱుఁగుము" అని యన్నిట నున్నది.

మేము 1890 సం. ఏప్రెలు నెల 24 తేదీ నొక వ్యాసము వ్రాసి ప్రకటించి యున్నారము. దానిని మూడవ సంపుటమునఁ జూడవచ్చును. ఇట్టు దీని నిద్ద ఱునుఁ బొరఁబడి యుందురా? ఉన్నచోఁ గడపటనైన నేల సవరించియుండరు? కావున వలయుననియే ప్రకటించి యుందురు. (చూ. ఆ. పర్వ. పు. 214. ప. 76.) పీఠికలోను నీపద్యము ముద్రితమై యున్నది. అందు "బరిఖ" మని ముద్రితమైనది. చూ. పీఠిక పు. 16.)

క. సాదిత శాత్రవులగు భీ
 ష్మాదులయం దధిగతాశ్రయంబయ్యెఁ జతుః
 పాదం బగుచున్న ధను
 ర్వేదము బ్రాహ్మణులయందు వేదము పోలెన్.

అను పద్యము వీరి నూతన భారతమున 386వ పుటయందున్నది. ఈ సంస్కరణ కర్తలు "ప్రతి వింధ్యుఁడు, సుదేష్ణ మొదలగు నామవాచకములను విరుద్ధముగా మార్చిరని మున్నె వ్రాసియుంటిమి గదా. ఇపుడు సాధితశబ్దమును సాదిత శబ్దముగా మార్చి ముద్రింపించిరి. సాధిత యనఁగా సాధింపఁబడిన యని యర్థము. సాధిత శాత్రవులగు భీష్మాదులనఁగా సాధింపఁబడిన శత్రువులు గల భీష్మాదులని యర్థము స్పష్టము.

శ్రీ వేంకటరాయ శాస్త్రిలవారు గావించియున్న మార్పులలో పీరు గైకొన్నవానిలో మఱికొన్నింటిని వివరింతుము.

క. నీ చెప్పెడి పెద్దలు ద్రో
 ణాచార్యులు మొదలుగాఁగ నని కొల్లని వా
 రై చేరన్ వారిం గొని
 యే చక్కంబెట్టు వాఁడనే పాండవులన్.

అని ద్వితీయాశ్వాసమున ముద్రిత మైనదున సంతసించు చున్నారము. దీనినే వేంకటరత్నము పంతులువారు చజ ప్రాసమని పోరి "ఏఁజక్కంబెట్టు" అని తమ సంజీవనిలో నిర్ణయించిరి. శ్రీ వేంకటరాయ శాస్త్రిలవారు పంతుల వారు పొరఁబడిరని మా పత్రికలో 1895 సంవత్సరవు మయూఖములోఁ బ్రక టింపించిరి. వీరుగాక పీఠికాకారలును జచ ప్రాసము నిష్టపడరైరి. ఇందువలన నీ పద్యము ఋజువుగానే ముద్రింపఁ బడినది.

క. కవదొనలును గాండీవం
బవుల నిడం బనుపు ముంద అరదము డిగ్ మే
న్వవిదప డిగియెద శుభకర
మవు నివ్విధమట్లు సేయు మనుఁడు నతండున్. (శల్య)

ఈ పద్యమందు వబ ప్రాసమని వేంకటరత్నము పంతులవారు వాదించిరి. వారి వాదమంతయు వీరొప్పక "ఏనవిదప" అని ప్రకటించి వబ ప్రాసము నిరసించినందులకై సంతసించుచున్నారము.

క. నమ్మము కై నువు మోపగు
జమ్మి వెసం బ్రాఁకి విడిచి చాపము నా కం
ఉమ్మనుఁడు చేయునదికే
కమ్ముగ్గుం దమ్మిహీజ మఁసత నెక్కెన్. (విరాట.)

ఇందులో క్త్వార్థక సంధియని వేంకటరత్నము పంతులవారు వాదించిరి. ఆ వాదమును వేంకటరాయశాస్త్రులవారు మా 1895 సం॥మేనెల మయూఖములో ఖండించి వ్రాసిరి. 'అందు+ఇమ్ము' అని శాస్త్రులవారి మతము. ఈ మతమునే ఈ పీఠికాకారులును నొప్పి "అందు+ఇమ్ము అని పదచ్ఛేదము. "అందు=ఆ శమీవృక్షమందలి శవాకారమగు 'కట్ట' యందు (ఉన్నయని యధ్యాహారము) ఉన్న చాపము, నాకు యిమ్ము అని అన్వయము... క్త్వార్థ కేకారసంధికిఁ బ్రస్తావనమే గలుగదు" అని పీఠకయందు 26 వ పుటలో వ్రాసిరి. ఆ యుద్ధసమయములో నీ పీఠికాకారులుగాని సంస్కరణ కర్తలుగాని ఇది క్త్వార్థక సంధిగాదని వ్రాయమికిఁ జింతిల్లుచున్నాము. ఇది పండితలక్షణమా యాలోచింపుఁడు. ఎట్లయినను వీరిపుడైన నది క్త్వార్థక సంధి గాదని వ్రాసినందులకై సంతసించెదము.

క. జ్ఞానము కేవల కృప న
జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రకాశము సేయం
గా నది సకల ధరిత్రీ
దానంబునకంటె నధికతర పలమునగున్.

అను పద్యమునందు రెండవ పాదముయొక్క యతిం గూర్చి వీరు సంశయించి జ్ఞాకును కాకును యతి చెల్లదని పీఠిక 26 పుటలో నిర్ణయించినారు. అప్పకవి మార్గము వీరికి రుచింపలేదు. ఇంక వీరిమాట వేరికి రుచించునో చూతము. అప్పకవియును

తే. ప్రౌఢకవులు కొందఱు జ్ఞకారంబునకును
ప్రథమవర్ణంబు తొలి యక్కరములు నాల్గు
నిడుదును ప్రబంధముల నొక్క యెడ విశేష
వశులనుచు సోమయాజులు వాడు కతన.

అని వ్రాసిన పద్యమును బీఠికాకారు లిష్టపడరైరి. జ్ఞాకును కాకును నెచ్చట యతి లేదఁట. మఱియు జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రజనితము సేయంగా" నని యొక పాఠమగుపడుచున్నదట. ఇందువలన వీరు జ్ఞాకును కాకును యతి నిష్టపడరైరి. విశేషవశులని యప్పకవి చెప్పియేయుండెను. ఏమిచెప్పినను విను వారెవ్వరు? "తమకంపు తమకింపు; పరుకంపు తనుజంపు" అను సామెత చెవుల కామెత కాకపోవునా? ఈ పీఠికాకారులు "ధృతరాష్ట్రిందును బుత్త్రిలు స్వనము" అను పద్యము గూర్చి "తగన్" అనుట దగునని పైవిధముగా సాధించిన స్థలము నందు "ఇట్టి ప్రయోగము లింకెక్కడ నైన నుండెనేని వానికిఁప్రయోగ మాధారమగును" అను వీరి సూత్రము వీరేల యిచ్చట నన్వయింపరు? లాక్షణికులందఱుఁ దిక్కనమతమే గైకొనిరి. ప్రక్రియా ఛందస్సున యతిప్రాసల కుదాహరణములను శీర్షిక క్రింద నిట్లు వ్రాయఁబడి యున్నది.

ద్వి. కంధర ఖండా భ ఖర కాలకూట
గ్రంథిల కంఠుఁడు జ్ఞానయోగంబు

ఇందు రెండవ పాదమున జ్ఞానమను యతి చెల్లఁబడి యున్నది. ఇంతియే గాన ప్రప్రథమమున ముద్రింపఁబడిన భారతములో వీరు నుడివినట్టి "ప్రజనితము సేయంగా" నను పాఠము లేదు. శ్రీమాన్ నేటూరు పార్థసారథి అయ్యంగారు ప్రకటించిన భారత శాంతిపర్వమున 617వ పుటలోను, "బ్రకాశము సేయంగా" ననియే యున్నదగాన "బ్రజనితము సేయంగా" నను పాఠము సరసము గాదని నిర్ణయించెదము.

క॥ అనఘ యిది యేటి తప మే
మనుపమ దుఃఖితుల మగుట నాధారము లే
కను సంతాన చ్ఛేదం
బున వ్రేలెద మధమలోకముల తెరువు ననన్.

అని 40 పుటను ముద్రింపఁబడినది. తెలుఁగు ప్రతుల యందన్నిటను 'సంతానోత్సేధంబున' నని యున్నది. ఈ నూతన భారతమున వీరు మాత్రము 'సంతానచ్ఛేదంబున' నని సవరించినారు. ఛేద మేలకో తెలియదు. వారి సవరణ నిరుపయోగము. సంతానోచ్ఛేద మనునది సరియైన పాఠము. ఉత్సేధమనఁగా మీఁదికిఁ బెరుగునది. 'ఉత్సేధతీతి ఉత్సేధః-షిదుగత్యాం-మీఁదికిఁ బెరుగునది' అని గురుబాల ప్రబోధిక గావున నుత్సేధమను పాఠమే సుష్ఠువు. 'మేము సంతానోత్సేధము చేతనో యాధారము లేనివారమై యందువలన నతి దుఃఖితులమై యధమ లోకములవైపు పడనున్నాము. ఇందు సంతానోచ్ఛేద మన నాధారములేని హేతువు. అధారము లేమి దుఃఖమునకు నధమ లోకములవైపు పడుటకును హేతువు. కావున 'అధారములే' మిని సంతానోచ్ఛేధంబున నని నన్నయార్యులు ప్రయోగించి' రని తలంచెదనని బ్ర. వేదము వేంకటరాయశాస్త్రిలవారు 1895 సం॥ మా మయూఖము నందు 58 పుట యందు వ్రాసియున్నారు. అట్లు వ్రాసి యున్నదాని నీ సంస్కరణ కర్తలును టీకా కారులును జదివియును దాము పట్టిన కుందేటికిఁ బదత్రయమనుట వింతగా నున్నది. ప్రౌఢ వ్యాకరణమున సీతారామాచార్యులవారును 'సంతానోచ్ఛేదంబున' అని యైననుఁ బ్రకటించినారు. ఈ సంస్కరణకర్తలు 'సంతానచ్ఛేదము' అనియే ముద్రింపించినారు. 'అక్రపత్యయాంతావ్యయంబు కళయ' యని ప్రౌఢవ్యాకరణము. ఇంతియగాక సీతారామాచార్యులవారును 'లేకను' అని ద్రుతాంతముగా నుండుట వలనఁ గొంద ఱయ్యది ద్రుతప్రకృతిక మని భ్రమించెదరు' అని ప్రౌఢవ్యాకరణమున 3వ పుటలో వ్రాసి యున్నారు. పీఠికాకారులు దీని నొప్పికొనియును 'లేకను' అని యుండవలయు నని సాధించుట సరసము గాదు. జ్ఞాకును కాకును దిక్కనగారు యతి చెప్ప లేదఁట. ఇది వీరి సిద్ధాంతము. అప్పకవి యిట్టి యతి కలదని ఘంటాపథముగా నుడివియున్నను నది వీరికిఁ బనికిరాక పోయినది. వీరి నూతన లక్షణము నందఱు మోదింప వలయునఁట!

మఱియు నీ పీఠికయం దనేక చిత్రము లున్నవి. అవి విద్యావిషయకములుగావు. అయినను వారు వ్రాసియున్నందున నిచటఁ దాఁకవలసియున్నది. వీరప్పకవి స్వప్న విషయమై వ్రాయుచు 'నీకల కలయే గాని యెంతమాత్రము విశ్వాస పాత్రము గాదు" అని యప్పకవిపైఁ దమ కటాక్ష వీక్షణము బ్రసారించి తిక్కన గారి కల విషయమై వ్రాయుచు 'నీ కవి చిత్తవృత్తిం గూర్చి స్వప్న సన్నిహితుఁడైన హరిహరనాథుఁడు దనతోఁ జెప్పినట్టి కవి విరాటపర్వము

మొదట రచియించిన యీ క్రింది పద్యముచేత నిర్ధారణ చేయవచ్చును' అని పీఠికలో 38 వ పుట యందును, 'ఈ కవిగ్రామణి తాను భారత రచనా కౌతుకియై దీని కేపురుషు నధినాథునిఁగాఁ బేరుకొందునని ఇంచుక నిద్రించు నపుడు దనతండ్రి కొమ్మనామాత్యుఁడు కలలో వచ్చి

శ్లో॥ కిమస్థిమాలాం కిముకౌస్తుభంవా.

అను సంస్కృత శ్లోకమును దన కావించిన దాని నవధరించి...విరాట పర్వాదినిఁ జెప్పియున్నవాఁడు. మహానుభావుఁ డగు సోమయాజి కిట్టి దైవాను గ్రహము కలిమియుండ నొప్పును' అని పీఠికలో 63 వ పుట యందును వ్రాసి ప్రకటించి యున్నారు. అప్పకవి కల వీరికిఁ బనికిరాక సోమయాజి కల వీరి కెట్లు పనికివచ్చినదో !

పీఠిక యొక్క 82 పుటలో బ్ర॥ వేంకటరంగశాస్త్రిగారు

మ. అరయన్ శంతను పుత్త్రుపై విదురుపై నక్రూరుపైఁ గుబ్జపై
నరుపై ద్రౌపదిపైఁ గుచేలుని పయిన్ నందవ్రజ స్త్రీలపైఁ
బరగంగల్గు భవత్కృపారసము నాపైఁ గొంత రానిమ్ము నీ
చరణాబ్జంబుల నమ్మినాఁడ జగదీశా కృష్ణ భక్తప్రియా !

అను పద్యము సోమయాజి యవసానసమయమున శ్రీకృష్ణాంకితముగ నొక్క శతకమునఁ జెప్పెనట' అని వ్రాసియున్నారు. ఈ పద్దియము కృష్ణశత కములోనిది గాదనియు దీనిఁ దిక్కనగారు వ్రాయలేదనియు మేము 1898 సం॥ సెప్టెంబరు నెల మయూఖములో వ్రాసియున్నను నీ పీఠికాకారులు దానిం జదివియు మరల నీ పీఠికయం దట్లే వ్రాయుట మిగుల శోచనీయముగా నున్నది. శ్రీ వీరేశలింగము పంతులుగారు 1895 సం॥ ప్రకటించిన 'ఆంధ్రకవుల చరిత్ర' ప్రథమ భాగములో నీపద్యమున్నది. వెండియు శతఘంటము వేంకటరంగశాస్త్రి గారే ఈ పద్యము తిక్కనగారు వ్రాసిరని మా పేరను వ్రాసియున్నారు.[1] ఆ యుత్తరమును మేము 1898 అక్టోబరు నెల మయూఖములోఁ బ్రకటించి యున్నా రము. 1898 సంగన నిది తిక్కన పద్యముగాదని మేము వ్రాసి ప్రకటించి యున్నను వీరు తమ మార్గమును విడువకుండుటకుఁ గల కారణ మారయుఁడు.

1. చూ. తిక్కన సోమయాజికవి చరిత్రాదులు.

ఈ సంస్కరణ కర్తలలో నొకరగు రాయదుర్గము నరసయ్యగారు వేంకటరాయశాస్త్రిలవారు వ్రాసిన విక్రమార్క చరిత్ర ముద్రణ విమర్శము నందలి సవరణల నొప్పక వెక్కిరించి శశిలేఖలోఁ బ్రకటించియు నీ నూతన భారతమున ధాత్రీ సత్త్వ వృత్తి యష్ట్రి శబ్దములను తకారద్విత్వ సహితముగా నొక చోటను రహితముగ మఱియొక చోటను బ్రకటించుటకుఁ గల కారణ మారయఁ జాల కున్నారము.

క్షత్రియ. ప. 178. పు. 48. క్షత్రియ ప. 160. పు. 71 ; ధాత్రి ప. 96. పు. 88 ; ధాత్రి ప. 249. పు. 459.

క॥ అద్ధ్వ పురుషోపలాలిత
ముద్ద్యోతితరోచి రుద్గమోగ్రం బరి ని
ర్భేద్ద్యము దివ్యజనన మన
వద్ద్యంబిది కార్ముకైకవరము గుమారా!

అను నీ కంధపద్యము 719వ పుటలో విరాటపర్వ చతుర్థాశ్వాసమున ముద్రింపఁబడి యున్నది. "అద్యము, భేద్యము, అనవద్యము" వీనికి ద్విత్వము లెట్లు వచ్చినవో తెలియఁబడదు. ఉత్+ద్యోతిత=ఉద్ద్యోతితమని యగును. తక్కిన వానికి గతియెట్లో !

నూతన భారత సంస్కరణ కర్తలు ప్రాచీన ప్రతులలో "నెల్లి సౌంభక" మని యున్న దానిని కారణము చెప్పక "సౌభక" మని ముద్రింపించియున్నారు. శబ్దము సౌభకమా ? సౌంభకమా యని మే మారసితిమి. సంస్కృతమున సౌభక మని యున్నదని బ్ర. వేదము వేంకటరాయశాస్త్రిలం వారు 1892 సం. న నారణ్యపర్వముకుఁ డీకవ్రాసినపు డీ శబ్దమును గూర్చి చర్చించి 816వపుటలో వ్రాసియున్నారు. వీరిపు డా సవరణను గైకొనిరి. ఇంతియగాని యిది వీరి పాండిత్యము గాదు "సుష్ఠుభాతి ఇతి సుభః-సుభఏవ సౌభః" అని వ్యుత్పత్తిఁగూడ చూపఁబడి యున్నది. దీనిని సంస్కరణ కర్తలు చూచియుందురో లేదో యాహింపుఁడు. ఇట్టి యుదాహరణమునే మఱియొక దానిని వ్రాసెదము.

చ॥ వరదుఁడు పార్థు శౌర్యవిభవంబున కాతని ధైర్య వృత్తికి
న్నరుదుగ మెచ్చి సన్నిహితుఁ డయ్యె...."

అవి ముద్రితమై యున్నది. ఈ చోట దోష మున్నదని వేంకటరాయ శాస్త్రిలవారు తమటీకా గ్రంథములో 360వ పుట యందు నిట్లు వ్రాసియున్నారు. "ఈ పద్యములోఁ గొందఱు ధైర్య వృత్తికి న్నరుదుగమెచ్చి'' అను పాఠముగాఁ దలఁచి అచ్చుపరమైనపుడు ద్రుతంబునకు ద్విత్వంబు గొన్నియెడలఁ గలుగునని సమాధానము చెప్పుచున్నారు........'ధైర్యవృత్తికై' అని యున్న నేమియు బాధకము లేదు. విభవంబునకున్ అని షష్ఠి యున్న దందురేని సుఖముగా నిక్కడను షష్ఠియే యుండవచ్చును. అపై మాట 'అరుదుగ' అనుటకు బదులుగా 'హరువుగ' నని యుండవచ్చును. నన్నయ అచ్చు పరమయినపుడు ద్రుతమునకు సంశ్లేషము కలుగదు అని శాసించి తన శాస్త్రమునకే కేవల విరుద్ధముగా నేల ప్రయోగించును ?..." అని వ్రాసియున్నారు. ఈ నూతన సంస్కరణ కర్తలు శాస్త్రిలవారి టీకాగ్రంథము 1892 సం.మునఁ బ్రథమశాస్త్ర పరీక్షకుఁ బాఠముగాఁ జెప్పినారు. అందీ విషయముఁ జూచినారు. అందు వ్రాయఁబడిన 'అరుదుగ' అనుదానిం గ్రహించిరి.

పత్రికాధిపతి*
(పూండ్ల రామకృష్ణయ్య)

---

అముద్రితగ్రంథచింతామణి, నెల్లూరు. జనవరి, ఫిబ్రవరి 1902 సం. 16 సంచికలు 1, 2.

# మొల్ల రామాయణము

ఈ రామాయణమును నాంధ్రభాషయందు నాతుకూరి కేసనశ్రేష్ఠి యనువాని కూఁతురగు మొల్ల యను స్త్రీ రచించినది. ఈ గ్రంథ మెపుడు రచియింపఁబడి నది నిర్ణయించుటకు గ్రంథమునందు నాధారమేమియు గోచరింపదు. అయినను

సీ. సన్నుత సుజ్ఞాన సవివేకి వాల్మీకి
నఖిల శాస్త్రాగమాఖ్యాను వ్యాసు
ఘోరాంధకార ప్రభారవి భారవి
సత్కాంతి హిమకరశ్లాఘు మాఘు
వివిధకళాన్విత విఖ్యాతి భవభూతిఁ
బ్రకటకావ్యధురీణు భట్టబాణు
మానినీలోక సమ్మదభద్రు సౌభద్రుఁ
గవితారసోల్లాసుఁ గాళిదాసు

స్తుతగుణోద్దాము సాచన సోము భీము
నవ్య మంజుల వాగ్ధుర్యు నన్నయార్యు
రసికుఁ డైనట్టి శ్రీనాథు రంగనాథుఁ
దిక్క కవిరాజు భోజు నుతించి మించి.

క. తొల్లిటి యిప్పటి సత్కవి
వల్లభులను జాటుధార వాగ్వైభవకళా
మల్లులఁ గవితారచనల
బల్లిదులైనట్టి ఘనుల భక్తిఁ దలంతున్.

అని తాను సంస్కృతాంధ్ర కవిస్తోత్రమును జేయునపుడు శ్రీకృష్ణరాయ సంస్థానాస్థాన కవులలో నొక్కనినైనఁ బేరుకొనని కారణముచేత నీమె కృష్ణరాయ లకు ముందే జీవించి యుండునని తోఁచుచున్నది. నెల్లూరు జిల్లా మాన్యూలు అను గ్రంథమును వ్రాసిన మహారాజశ్రీ బాస్వెలు దొరగారు 698వ పుటయందు "మొల్ల యనునది కుమ్మర కులోద్భవురాలగు నొక కవియు, నీమె తిక్కన

సోమయాజి సమకాలీనురాలనియు నెల్లూరు తాలూకాలోని పడుగుపాడను గ్రామ నివాసి యనియు రామాయణమును దెనుఁగునఁ బద్య కావ్యముగా వ్రాసినదనియు దానికి మొల్లరామాయణమని పేరనియు వ్రాసియున్నారు. ఇంతియగాక బొద్దికూరపాడు వేంకటరంగకవివరునిచే వ్రాయఁబడి ముద్రితమైన "పూర్వకవుల చరిత్రము" తొలిభాగమున 20, 21వ పుటయందుఁ దిక్కన తండ్రియగు కొమ్మనామాత్యునకుఁ గుంభకారకులీనుండగు రంగప్ప యను వాని కొమరితకు మొల్ల జన్మించిన దనియు నీయనకుఁ గుమ్మర గురునాథుండు తోఁబుట్టుననియు నెల్లూరునకు నుత్తర వైపున బ్రవహించు పినాకినీనది యుత్తరతీరంబున నుండు పడుగుపాడను గ్రామంబు జన్మభూమి యని వ్రాయఁబడి యున్నది. మఱియు 1947 సం. న సెప్టెంబరునెలలో బొంబాయిలో ముద్రింపఁబడి యుండు కావలి వేంకటరామస్వామి పండితునివల్ల సర్కారువారి రికార్డు దాఖలా సహాయముతో వ్రాయఁబడి ముద్రింపఁబడిన 'దక్షిణ హిందూస్థానపుఁగవుల చరిత్ర' మను నొక యాంగ్లేయ గ్రంథమున మొల్ల యను నది యొక కుమ్మరవాని కూఁతురనియుఁ గృష్ణదేవరాయల వారికాలమునందుండినదనియు లోకవాడుక ప్రకారము స్నానానంతరము తన తలవెండ్రుక లార్చుకొనునంతలో రామాయణము రచియించిన దనియు వ్రాయఁబడియున్నది. ఇచ్చది వాడుకయును మొల్లయనునది కృష్ణరాయని కాలమున నున్నట్లే ప్రబలియున్నది. పైన వ్రాయఁబడిన విధముగ నెల్లూరు మాన్యూలునందు బాస్వెలు దొరగారు మొల్లకవి తిక్కన సమకాలీనురాలనియుఁ గావలి వేంకటరామస్వామి పండితులుగారు తిక్కన సమకాలీనురాలు మొల్ల యని వ్రాసియుండుటచేతఁ దిక్కనకును కృష్ణరాయలకును షుమారు రెండువందల సంవత్సరము లెడమున్నట్టు గనపడుచున్నది. ఇన్నూరు సంవత్సరము లొక్క మనిషి జీవించి యుండుననుటక్కు మఱియొక చోద్యముండదు గనుక తిక్కన కాలమునందొక మొల్లయును కవియుఁ గృష్ణరాయల కాలమునందొక మొల్లయను కవియు జీవించియున్నట్టు నిశ్చయింపవలసియున్నది. పై నుదహరించిన సీస పద్యములో నాంధ్రభాషాపారంగతులకు నాచన సోముని, భీముని, నన్నయార్యుని, శ్రీనాథుని, రంగనాథుని, దిక్కనకవిని మాత్రము స్తుతియించి కృష్ణదేవరాయ సభాపండితులలో నొక్కని యైన నోరఁ గ్రుచ్చని కారణము చేత దిక్కనవిని కృష్ణరాయలకు ముందుగ జీవించియున్నట్టు నిశ్చయించవలసి యున్నది. ఇదియే నిశ్చయ మంటిమేని కావలి వేంకటరామస్వామి పండితులుగారు వ్రాసిన వ్రాఁత వలనను తెనాలి రామకృష్ణకవి మొల్లయను కవితోఁ బ్రత్యక్షముగ సంభాషించినాఁడను ఒకానొక నానుడివలనను గృష్ణరాయల కాలమందుఁ గూడ

నొకానొక మొల్లయను కవి యన్నట్టే మనము నిశ్చయింప వలసి యున్నది. ఆ పక్షమున మొల్లయను నామముగల కవులు ఇద్దఱు జీవించియున్న ట్లేర్పడు చున్నది. ఈసందియమును గుఱించి బొద్దికూరపాడు వేంకటరంగకవిగారు "పూర్వకవుల చరిత్రము" యొక్క 28వ పుటయందు నీవిధముగ వ్రాసి యున్నారు: ఎట్లనఁగా:—

"ఈ గ్రంథమును సాంగంబుగ నేను చదివినాను. ఇందనేక వ్యాకరణ దోషములు కాన్పించుచున్నవి. ఏవి యెటులుండినను ఇందలి పూర్వకవి ప్రార్థనను దిలకించిన నీ మొల్లయనునది పైన వ్రాసిన చరిత్రమునకు సంబంధించి యుండలేదు. కృష్ణదేవరాయల ప్రభుత్వకాలమునం దొక మొల్ల యున్నట్టు వదంతి కలదు. అదియే యామెయై యుండవచ్చును. ఈయమ కొమ్మనామాత్య జాతయే యైయున్న పక్షమునఁ బూర్వకవి స్తుతిరీతి యీరీతిగ నుండదు."

అని వ్రాసి యున్నందునఁ బ్రస్తుత ప్రస్తావనలోని మొల్లరామాయణము తిక్కనకవి కాలమునందు జీవించి యుండిన మొల్ల విరచితము గాదని యెఱుంగు నది. అది యేమంటిరేని తనకు వెనుకటి కవులగు నాచన సోమన శ్రీనాథాదులను తాను గ్రంథమునందు స్తుతియించుటకు నను వడదుగానఁ దిక్కనకవి కాలము నందు జీవించియుండిన మొల్లకవి విరచిత రామాయణ మెచ్చట నున్నదియో మనము విచారించవలయును.

ఇఁక నీమె కులమునుగుఱించి యోచింతము. పైన వ్రాయఁబడిన బ్రౌను దొరగారును, కావలి వేంకట రామస్వామిగారును, వేంకటరంగకవి గారునుగాక బ్రౌన్ దొరగారుకూడ మొల్లయనునది కుమ్మరకులోద్భవురాలని వ్రాసియున్నారు. ఎనమంద్రము వేంకటరామయ్యగారి "పురాణనామ చంద్రిక" యందుఁ జూడఁగా "మొల్ల-ఒక కుమ్మరవాని కూఁతురు. ఈమె చదువుకొని విద్వాంసురాలై రామా యణమును పద్యకావ్యముగా రచియించెను. దానిని మొల్లరామాయణము అని అందురు. ఈమెయొక్క కవిత్వము మిక్కిలి ప్రౌఢమై పురుషప్రణీత కావ్యమును బోలియుండును" అని వ్రాయఁబడియున్నది. గ్రంథమునం దెక్కడను దన కుల మిది యని యీామె వ్రాసియుండలేదు. అయినను నాశ్వాసాంత గద్యములయందు మాత్రము "శ్రీకంఠ మల్లేశ వరప్రసాదలబ్ధ గురులింగ జంగమార్చన వినోద సూరిజన కవిత్వ చమత్కారి అతుకూరి కేసనశ్రేష్ఠి గర్భ శుక్తి జనిత ముక్తా లలామ నారీగణోత్తమ మొల్లవిరచితంబు" అని వ్రాయఁబడియున్నది. గ్రంథము

నందెక్కడను యీమె తలకులగోత్ర మిది యని వ్రాయకపోయినను నిక్కవిని కుమ్మరిది యని నిర్ణయించి వ్రాయుటకు వేంకటరామయ్య లోనగు వారికి యేమి యాధారములు చిక్కియున్నవో తెలిసినవికావు. అట్లు చిక్కియున్న యెడల గ్రంథములయందు వ్రాయకపోరని తోచుచున్నది. ఒక వేంకటరామయగారే కాదు. బ్రౌన్‌దొర లోనగువారు మొల్ల యనునది కుమ్మరిది యని వ్రాయుటకుఁ గారణము విచారించఁగా పద్యమునందు "కేసనశ్రేష్ఠి" యని యుండుటచేత నిది కుమ్మరిది యని వ్రాసియుందురని యూహించుట కవకాశము గలిగియున్నది. ఆ పక్షమున శ్రేష్ఠి శబ్దభవమగు ''సెట్టి" యను పదము నంతయు నందుఁగల కోమటులు, బేరులు, బలిజలు, సాలెలు, కుమ్మరులు లోనగు తెగలు లోకము నందుఁ బ్రశస్తముగ నగుపడుచున్నవి గాన వీనిలోఁ గేసనశ్రేష్ఠి యే తెగలోఁ జేరినవాఁడో తెలిసికొనుట దుర్ఘటముగా నున్నదిగదా! కాఁబట్టి ఇక్కవి గుమ్మరి దియే యని యెటులఁ జెప్పనొప్పునో విచారింపుఁడు.

ఇయ్యాముద్రితమగు మొల్లరామాయణము శ్రీరామాంకితమై మూడాశ్వాస ములు గలిగి, బాలకాండము ప్రథమాశ్వాసముగాను, అయోధ్యారణ్య కిష్కింధా సుందరకాండములు ద్వితీయాశ్వాసముగాను యుద్ధకాండము మూడవ యాశ్వాస ముగా విభజింపఁబడి యున్నది. వీనిలో నయోధ్యారణ్య కిష్కింధాకాండములు మిగుల స్వల్పములై ప్రతికాండము ఏఁబది పద్దియములచేతను, బాలకాండము నూఱు పద్దియములచేతను సుందరకాండము నూటయేఁబది పద్దియములచేతను యుద్ధకాండము షుమారు రెండువందల పద్యములచేతను శోభిల్లుచు గ్రంథమం తయు నించుమించుగా నాఱువందల పద్యములు గలిగియున్నది. ఈ గ్రంథము యొక్క అవతారికయందు

క. గురులింగ జంగమార్చన
పరుఁడును శివభక్తియుతుఁడు బాంధవహితుఁడున్
ధర నాతుకూరి కేసన
వరపుత్రిని మొల్లనామవర విఖ్యాతన్.

అని వ్రాసియున్నది ఇంతియగాక దాఁజదివినది కాదనియు గోపవరపు శ్రీకంఠమల్లేశ వరముచేతఁ గవిత్వంబు జెప్పితిననియు, రామచంద్రుఁ డీ గ్రంథ మును జెప్పుమని చెప్పినందునఁ దా నీ గ్రంథమును వ్రాసిన ట్లీ క్రింది పద్యము లలో వ్రాయుచున్నది. ఎట్లనఁగా—

తే. కావ్య సంప్రక్రియలును నిఘంటుక్రియలు
క్రమను లేమియు నెఱుఁగ విఖ్యాతి గోప
వరపు శ్రీకంఠమల్లేశ వరముచేత
నెఱిఁ గవిత్వంబు జెప్పంగ నేర్చుదాన.

క. చెప్పుమని రామభద్రుఁడు
చెప్పించిన పల్కుమీఁదఁ జెప్పెదనేనై
యెప్పుడు నిహపరసాధన
మిప్పుణ్య చరిత్రఁ దప్పు లెంచకుఁ డెందున్.

అని వ్రాసి, ఆంధ్రకవిత్వ ముండవలసిన విధమును గుఱించి యీ క్రింది పద్యమును వ్రాయుచున్నది.

చ. వలిపెపుసన్న పయ్యెదలొ వాసనగందపుఁ బూఁత మేయిపైఁ
గొలఁదిగ గానుపింప వలిగుబ్బచనుంగవఠీవి నొప్పఁగాఁ
దెలుఁగని చెప్పనొప్పుఁ గడుదీటగు మాటలఁ గ్రొత్తరీతులన్
బొలుపువహింపకున్న మఱిపొందగునే, యతిగూఢ శబ్దముల్.

ఈ పై పదార్థమునే గలిగిన మఱియొక పద్యము వేంకటనాథకవి కృత మగు పంచతంత్ర పద్యకావ్యమునందు వ్రాయబడియున్నందున నిందుఁ బొందు పరచు చున్నాము :

చ. ఘనతర ఘూర్జరీకుచయుగ క్రియ గూఢముగాక ద్రావిడీ
స్తనగతి తేటగాక యరచాటగు నాంధ్రవధూటి చొక్కపున్
జనుఁగవఁ బోలె గూఢమును దాటుదనంబును లేకయుండఁ జె
ప్పిన నదిపో కవిత్వ మనిపించు నగిం చటుగాకయుండినన్.

మఱియుఁ గవిత్వం బతిమృదువుగ నుండవలయునని యీ క్రింది పద్యములచేఁ దెలుపుచున్నది :

తే. తేనెసోక నోరు తియ్యనయగు రీతిఁ
దోఁద నర్థమెల్లఁ దోఁపకున్న
గూఢశబ్ద వితతిఁ గొట్లాడుపనియెల్ల
మూఁగ చెవిటివాఁడి ముచ్చటరయ.

క. కందువమాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్ప నది తెనుఁగుకు నిం
పొందై రుచియై వీనుల
విందై మఱి గానిపించు విబుధులకెల్లన్.

*  *  *

ఉ ఓలము వంచి, యొయ్యన రఘూద్వహుఁ డమ్మరిఁ బోసి, శబ్దవి
న్మాలము దాఁక విల్దిగిచి, ముష్టియు దృష్టియుఁ గూర్చి, గోత్రభృ
త్కూలము వజ్రపాతహతిఁ గూలువిధంబునఁ గూలనేసె న
వ్వాలిఁ బ్రతాపశాలి మృదు వందనశీలి సురాలి మెచ్చగన్.

శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులవారి విరచితమగు "శబ్దరత్నాకరము" నం దీ పద్యము మొల్లరామాయణము బాలకాండములో నున్నట్లు వ్రాయఁబడి యున్నది. ఈపద్యము కిష్కింధాకాండమునందే యుండవలయును. పై పద్యమును గూర్చి యొక జనశ్రుతి: ప్రస్తుత ప్రస్తావనలోని మొల్లరామాయణము కృష్ణరాయలకాలము నందుండిన మొల్లకవి విరచితమని మనము తీర్మానించితిమి గాఁబట్టి తనకుముందే వ్రాయబడియుండిన భాస్కరరామాయణములో నీ ఘట్టము నందుఁ జెప్పబడిన

శా. చండాశీ విషఘోరసాయకముఁ జంచజ్జ్యాసమేతంబుగా
నిండారం దెగఁదీసి లోకములు ఘూర్ణిల్లంగ రామక్షితీ
శుం డాస్ఫోటన నేసె దుందుభి ఘనక్షోణీధ్రదంభోళి ను
ద్దండారింధనకీలి నిర్ధరణవిద్యాశీలి వాలింబడన్,

అను నీ పద్యమునందు వాలిని రాముఁడు పొంచి యేయునపుడు జ్యానినాదమువలన లోకములు ఘూర్ణిల్లుచుండినను దద్ధ్వనిచే వాలి యేల జాగరూకుఁడు గాలేదను నాక్షేపణలేకయుండ మొల్లకవి తన రామాయణమునఁ బైపద్యమును యుక్తి యుక్తమున వ్రాసినదని యొక వదంతి కలిగియున్నది. ఈ యాక్షేపణకుఁ దగు సమాధానముఁ దెలియఁగోరి రంగనాథరామాయణమును జూడ

ద్వి. నిగ్రహానుగ్రహనిధి రాముఁ డంత
సుగ్రీవుఁ దలవడ స్రుక్కుటఁ జూచి

యీలోన నేవాలి నే నేయకున్న
వాలి సుగ్రీవుని వధియించు ననుచు
జలనిధు లేడును జగము లీరేడు
కలఁగి భూతలమెల్లఁ గఱఁగి కంపింప
గుణనాద మొనరించి కోరి మైఁ బెంచి
తృణముగా దృష్టించి తెగఁ దీసిపోసి
వెస నమోఘాస్త్రంబు వింట సంధించి
అసమానబలశాలి యగు వాలి నేసె.

అని భాస్కరరామాయణములోవలె నిందును వ్రాయఁబడియున్నది. పై రెండు విధములలో వాలినిఁ గూల్చునపుడు తనదేహమును వంచికొని పొంచి ఆకర్ణాంతము వఱకు నల్లె నీడ్చి ముష్టిదృష్టులు దప్పక మితధ్వనితో వాలి న్బడ నేసెనా? లేక నీరేడు జగములు గంపించునట్లుగా గుణనాద మొనరించి రాముఁడు వాలిని నేసెనా? ఇందెయ్యది నిక్కవమని సంస్కృతరామాయణమును జూడ నివ్విధముగా వ్రాసి యున్నది :

శ్లో. హీయమానవధో పశ్య త్సుగ్రీవం వానరేశ్వరం,
వీక్షమాణం దిశశ్చైవ రాఘవ స్స ముహుర్ముహుః. 30

శ్లో. తతో రామో మహాతేజా ఆర్తం దృష్ట్వా హరీశ్వరం,
శరం చ వీక్షతే వీరో వాలినో వధకారణాత్. 31

శ్లో. తతో ధనుషి సంధాయ శర మాశీవిషోపమమ్,
పూరయామాస తచ్చాపం కాలచక్రమివాంతకః. 32

శ్లో. తస్య జ్యాతలఘోషేణ త్రస్తాః పత్రరథేశ్వరాః,
ప్రదుద్రువు ర్మృగాశ్చైవ యుగాంత ఇవ మోహితాః. 33

శ్లో. ముక్తస్తు వజ్రనిర్ఘోషః ప్రదీప్తాశని సంనిభః,
రాఘవేణ మహాబాణో వాలివక్షసి పాతితః. 34

కిష్కింధాకాండే-షోడశస్సర్గః.

అని వ్రాసియున్నదిగాని జనశ్రుతిరీతి పొంచియుండి శ్రీరాములవారు వాలిని బాణమేసినట్టు పై శ్లోకములలోఁ గన్పడదు. అయినను సప్తదశసర్గము నందు వాలి రాముని దూషించుచు

4)

శ్లో. త్వం నరాధిపతేః పుత్రః ప్రతిభః ప్రియదర్శనః,
కులీనః సత్వసంపన్న స్తేపస్వీ చరితవ్రతః. 13

శ్లో. పరాఙ్ముఖవధం కృత్వా కో ను ప్రాప్త స్త్వయా గుణః :
యదహం యుద్ధసంరబ్ధః శరేణోరసి తాడితః. 14

అని వ్రాసియున్నందున ఇందలి 'పరాఙ్ముఖవధం కృత్వా' అను వాక్యమునకు వ్యాఖ్యానము జూడఁగా 'పరాఙ్ముఖవధం పరయుద్ధాసక్తం గుణః ఉత్కర్షః- యుద్ధసంరబ్ధః అన్యయుద్ధ పరాఙ్ముఖ ఇత్యర్థః, అని యీ ప్రకారము వివరించి యున్నది. కాఁబట్టి రాముఁడు వాలి నేయునపుడు వాలి కగుపడక మాటుజేసి పొంచియుండి బాణమేసెననుట సంశయమని యూహించునది. ఇచ్చట పరాఙ్ముఖవధ యనఁగా వాలిసుగ్రీవు లొకరితో నొకరు పోరునపుడు హఠాత్తుగా నొక ప్రదేశము నుంచి శరము ప్రయోగించుటయే. పరాఙ్ముఖవధ యనఁగాఁ బొంచి యేయుట యని యర్థమగుచున్నది.

—పూండ్ల రామకృష్ణయ్య*

---

*అముద్రిత గ్రంథ చింతామణి.

# ఆఱింటి 'త్రా'

1894 సం. డిసెంబరు తే 28ది గల శశిలేఖ యందుఁ దత్పత్రికాధిపతి గారు "ఆంధ్ర కుమార సంభవము" గూర్చి యివ్విధముగ వ్రాసియున్నారు. ఎట్లన

"ఈ గ్రంథపు మొదటి పద్యమున 'శ్రీమద్భీష్మసుతాక్షియనుచోఁ గఠినోచ్చారణ మట్లుండ నాఱవచోట "త్రా" అనునది విషప్రాసమనుట యీ పండితులలో నెవరెఱుంగరు. మన కీ యనిష్ట మేల నని యూరకుండిరి. దేవతకైనను గాక నరున కంకితము సేయంబడిన కావ్యమున నింతదోషమున్నచోఁ 'గవివరుండు గాఁడు కాలయముండు గాని,' ఆఱింటను దాఁబెట్టిన' అన్నట్లు కావ్యమున కింత కంటె లోపమును భర్తకశ్రేయమును గలుగునా! దీనిం గన్నులనైనం జూడ వచ్చునా! చెవుల వినవచ్చునా! శ్రీకారము దొలుతనున్న దందురేమో! నిప్పు మ్రింగి నీళ్ళు ద్రావినను, నీళ్ళు ద్రావి నిప్పు మ్రింగినను గొంతుక కాలుటయే ఫలము గదా!" అని వ్రాసి, తరువాత 1895 సం. జనవరి తే 4ది సంచిక యందు నిందుల కుపబలముగా నప్పకవీయమున నుండి 'సాళువ పెదతిమ్మ,' 'హయమదిసీత' లోనగు పద్యములం బ్రకటించియు నంతలోఁ దనివి సాలక యీ క్రింది వాక్యమును బ్రకటించిరి. ఎట్లనఁగా—

"పై విషాక్షరముల నెల్ల నొకరిని దిట్టినపుడే చాటువులలో దోషము లగుంగాని కావ్యములయం దున్నపుడు దోషములు గావందురేమో! కావ్యములు జేయుంగోరు కవులకుఁ గానే యీ దోషముల నప్పకవి తెలియఁజెప్పెను. తిట్టుకొనుటకు శాస్త్రము వలయునా?" అని ప్రకటించినారు. దీనికి సమాధానమ్ముం జెప్పవలసిన విధి కవియందున్నను మాకు నించుక సంబంధ ముండుటచే సమాధానము జెప్పఁ బ్రయత్నించినారము. పైగా నిది విద్యా విషయిక ప్రసంగముగాన నిందుకు వెనుదీయుట పండితజన సమ్మతము గాదు. ఇపుడు వారిం దాఁకు తాకునకు మాత్రము జవాబు వ్రాయఁ బ్రయత్నించితిమి.

దీనికి నితరులచే శృంగభంగము గాకమునుపే వారి శృంగభంగమునే వారికిఁ జూపవలసి యున్నది. ఎట్లన, వారు పైనవ్రాసిన వాక్యపంక్తి యందు "భర్తకశ్రేయమును గలుగునా" అని ప్రకటించియున్నారు. భర్తకశ్రేయ

మును గలుగునా యని వారే వ్రాయుచున్నారు గానఁ గుమారసంభవ కృతిభర్త యగు శ్రీ ముద్దు కృష్ణయాచేంద్రులవారి కశ్రేయము గలుగదు. ఇది నిజమే. కృతిభర్త కశ్రేయము గలుగ వలయునను అభిప్రాయముతో వీరు వ్రాయ లేదుకావునను "సత్యవాణీ సరస్వతీ" యనునట్లు వాణియే వారికి శృంగభం గము గావించినది. శృంగభంగమైనందుననే భర్త కశ్రేయమును గలుగునా ?" యని వాక్యమైనది. ఒకరికిం గోడుగోరు వారికి నెన్నిపర్యాయములు శృంగ భంగములు గావలయునో గద. ఇక మేము వ్రాయు సమాధానముల గనుఁడు.

"పురాస్త్ర రసగిరి రుద్రేష్వ కచటతపా మాతృకా నింద్యాః" అని శబ్దాను శాసన మూలసూత్రము. ఇందుకర్థము. పుర=త్రిపురములు 3; అస్త్ర=పంచాస్త్ర ములు 5; రస=షడ్రసములు 6; గిరి=కులగిరులు 7; రుద్ర=ఏకాదశరుద్రులు 11 ఈ సంఖ్యాస్థానములు అ-క-చ-ట-త-పలుగా నున్నచో నింద్యములు. దీని పెద్దకవి తెనింగించిన విధముం జూడుఁడు.

క. ఆదిసర్వమును బ్రథమై
కాదశ షష్ఠార్ణములు కకారాదులలో
నాదిమ దంత్యోష్ఠ్యము లిడ
రాదు పుర శరర్తు గిరి హరస్థానములన్

దీని కర్థముం జూడుఁడు. ఆదిస్వరము=ప్రథమ స్వరము-అ; కకారాదు లలో=హల్లులయందు; ప్రథమ వర్ణము=క; ఏకాదశవర్ణము=ట; షష్ఠార్ణము= చ; ఆదిమ దంత్యము=త; ఆదిమ ఓష్ఠ్యము=ప; అను వర్ణములు (అ-క-ట-చ-త-ప) యివి పుర=3; శర=5; ఋతు=6; గిరి=7; హర=11. అనఁగాఁ బైన వ్రాసిన యక్షరములు 3-5-6-7-11 ఈ స్థానముల యందుఁ బద్యములో వ్రాయరాదని యర్థము. (పై శ్లోకముగాని పద్యముగాని క్రమాలంకారమున వ్రాయఁబడినదని భ్రమ జెందవలదు. ఇది క్రమాలంకారమైనచో నక్షరము లాఱును సంఖ్యాస్థానము లైదును జెప్పఁబడి యుండవు.) ఇఁకఁ బ్రకృతాంశము నకుం బోవుదుము. పైన నుదహరించిన వర్ణము లాఱును 3-5-6-7-11 స్థలము లలోఁ బద్యములయందు నింద్యములై యుండఁగా, లోకములో బాపురులకు మాత్రము దెలిసినదంతయు నాటింట నుండు తకారమేగాని తక్కిన (పైన నుదాహరించిన) వర్ణముల గతి యెట్టిదో తెలియదు. శశిలేఖకుఁ దెలిసినదంతయు

నంతమాత్రమే. ఇది నిజము. "అటింటను దాఁబెట్టినఁ గవివరుండు గాఁడు కాల యముండు గాని" అని శశిలేఖ పైనవ్రాసియున్న వ్రాఁతయే యిందుకు నిదర్శనము. ముంజేతి కడియముం గనుటకు నద్దమేల ? దాని వ్రాతయంతయు నెత్తిన వ్రాయఁబడి యున్నది. ఆటింటఁ దకార మీ శశిలేఖకుఁ గుమారసంభవమున నగపడినందున గ్రంథమునుగూర్చి పలుకరాని పలుకులం బలుకుటయగాక యోంకార సదృశమగు గ్రంథాది శ్రీకారము నిష్ప్రయోజనమని నిందించినది. శ్రీకార మాహాత్మ్య మింతింతని నుడువుటకు వలనుపడదు. శ్రీకారముంగూర్చి శశిలేఖ వ్రాసిన విధముంజూడ శశిలేఖకుఁ గుమారసంభవమే కుమార సంభవమైనట్లున్నది. అట్లు గానినాఁడు పద్యాది యందున్న మగణమైనం గనంబడదా? శుభకరమైన యీ మగణము శశిలేఖకు నియమగణముగాక యమగణమై దోఁచినట్లున్నది.

పద్యాది యందున్న శ్రీకారమును గూర్చి మగణ ప్రయోగమును గూర్చి యప్పకవీయమున నెంతవ్రాయఁబడియున్నది. అది శశిలేఖ గమనించినదో లేదో గాని సమష్టికి "శ్రీకారము దొలుతనున్న దందురేమో" యని దానిని దూలనాడినది. లక్షణముల నతిక్రమింప నీ సర్వావలక్షణ శశిలేఖ యాటింటి తకారమును మాత్ర మేల నాక్షేపణ జేయవలెను? తకారమునం దంతటి నమ్మక మున్నపుడు శ్రీకారమునం దంతటి యపనమ్మక మెట్లు గలిగెను ? ఇది పలడిత లక్షణమా?

ఇఁక శ్రీకారప్రభావముం జూడుఁడు.

క. పదపడి శ్రీకారము కృతి
మొదల నిలిచి దోషపుంజము నడంచి శుభం
బొదవించుఁ బరుస మినుమును
గదిసి సువర్ణంబుజేయు కరణిన్ ధరణిన్.

అని శ్రీకార ప్రభావ మిట్లు శాస్త్రము శాసించియుండఁగా దీనిఁ నీవ్రటఁబుచ్చి హీనోపమయగు "నిప్పుమ్రింగి నీళ్ళుద్రాఁగినను, నీళ్ళుద్రావి నిప్పుమ్రింగినను గొంతుక కాలుటయే ఫలము గదా" యని శ్రీకారమాహాత్మ్యమును దృణీకరించి శశిలేఖ వ్రాసినది. శ్రీకార ప్రభావమును నిరసించి వ్రాసిన శశిలేఖకుఁ బద్యాది యందలి మగణప్రభావముం జెప్పిన నదిమాత్ర మెట్లు ప్రయోజనకారి యగును? ఒక మగణమే గాదు, నగణము నిట్టి ప్రయోజనము నిచ్చుచున్నది. వావివరుసలు లేక చెల్లెంద్ర నైనం గవియు వారికిం బోలె శాస్త్రమున నమ్మకము లేనివారికి

మగణ మైనను యమగణమైనను నొక్కటే. ఇఁక నగణప్రభావము వారి కెందుకు? లక్షణ శాస్త్రమున నించుక నమ్మకమున్న నిట్టి వృథాక్షేపణం గావించి యుందురా? వారాక్షేపించిన పద్యమందలి మగణ ప్రభావము నించుక చూడుఁడు.

క॥ మగణంబు పద్యముఖమున
నగణితముగఁ గూర్చి చెప్పనగు కృతియొండెన్
దగ పద్యమొండెఁ గర్తకు
నగణితముగ నొసఁగు నాయురైశ్వర్యంబుల్.

క. మించిన పరుసము లోహము
గాంచనముగఁ జేయునట్టి కైవడి గణముల్
మంచివిగానివి యైనను
మంచివియై వెలయఁ జేయు మగణము పతికిన్.

అని వ్రాసియున్నను దీని నంతయు నిరసించి

తే. వ్యంజనాహ్వయమున నొప్పు వ్రాలలోన
షోడశాక్షర మాఱవచోట నిలిపి
మచ్చరంబునఁ దనుఁ జంపవచ్చినట్టి
చెడుగునకు నైనఁ బద్యంబు నిడఁగ వలదు.

అని చెప్పినంత మాత్రమునఁ బూర్వోత్తర పదసందర్భమునైన నెఱుంగక కార్పణ్యముచేఁ బై విధముగ వెట్టిమొట్టిగఁ బ్రేలినదిగాని వేఱుగాదు.

అటింటఁ దకారము తిట్టుపద్యములందు మాత్రమే దూష్యముగాని దీవన పద్యముల యందుఁ గాదు అట్లుగాక యెట్టి పద్యముల యందైనను తకారము దూష్యమైనచో నెన్ని పద్యములలో నాటింటఁ దకారములు లేవు! పైన నుదాహరించిన సూత్రార్థము చొప్పున నాటింటఁ దకారము గల పద్యము లన్నియు నింద్యము లైనచో "విమలాదిత్య తనూజుఁడు" అను భారతము నందట మూఁడవ పద్యమునఁ దకారమున్నది గదా. కాకునూర్యప్పకవి.

క. ఇప్పటి నియమము లన్నియు
నొప్పుగఁ గావ్యంబు మొదల నొక పద్యము దాఁ
జెప్పినను జాలు నవతల
దప్పిన దోషంబు లేదు దర్పకజనకా.

అని చెప్పియున్నాఁడని పద్యములో శ్రీకారయుక్త మగణ ప్రభావముం జూడక యందలి తకారమునకుఁ గారము వహించినది గదా. ఇది యవివేక విజృంభణముగాని వేఱుగాదు. ఇట్టి ప్రయోగములు దోషములుగావని పూర్వకవులందఱుఁ బ్రయోగించి యున్నారు. శశిలేఖ యాక్షేపించిన తకారమునకేగాక తక్కిన వర్ణములకుం బ్రయోగములం జూపుచున్నారము.

ఈ ప్రయోగములన్నియు నరాంకిత గ్రంథములలోని ప్రథమపద్యములు.

౧. శా. శ్రీలావణ్యవతీ కుచద్వితయ కాశ్మీర..........నం

ద్యాల శ్రీనరసింహ కృష్ణవిభు నిత్య శ్రీయుతుం జేయుతన్.

తకార మాఱింటను. కకార మేడింటను యీ పద్యమునందున్న యది. (కళాపూర్ణోదయము.)

౨. శా. శ్రీవక్షోజ కురంగనాభ... ... ...

... .... నేలు శుభదృష్టిం గృష్ణరాయాధిపున్

కకార మీ పద్యమున నైదింట నున్నది. (మనుచరిత్రము)

౩. శా. శ్రీభూపుత్రి వివాహవేళ .... .... ....

... ... నేలుతం దిరుమలేంద్ర శ్రీమహారాయనిన్.

పకార మీ పద్యమున మూడింట నున్నది (వసుచరిత్రము)

౪. శా. శ్రీ లావణ్య పయోనిధి త్రివళివీచీ .... .... ....

... ... సదయుండై సౌఖ్యగుండక్షమా

పాలాగ్రేసర నారసింహుని సదర్థ శ్రీయుతుం జేయుతన్.

పవర్ణ మీపద్యమున నైదింటనున్నది(పిల్లలమఱ్ఱిపీరన్న జైమినీభారతము)

౫. శా. శ్రీరామా కుచమండలీ మృగమద శ్రీగంధ .... .... ....

చకార మీ పద్యమున నైదింట నున్నది. (శృంగార నైషధ కావ్యము).

౬. శా. శ్రీకాంతామణిఁ గన్నొఱంగి ... ... ...

తకార మీ పద్యమున మూట నొప్పియున్నది.(పాండురంగమాహాత్మ్యము)

౭. శా. శ్రీ మేల్గూర్ప భరింపుమీ సకలధాత్రీ రాజ్యమున్

పవర్ణ మీ పద్యమున నేడింట నున్నది. (భద్రాపరిణయము లేక ముకుంద విలాసము)

౮. శా. శ్రీకాంతా కుచ హేమ కుంభములపై ... ... ...

తవర్ణము మూడింటను-చవర్ణ మైదింటను-హవర్ణ మాఱింట నున్న యది. (వెన్నెలకంటి సూరన్నగారి విష్ణుపురాణము.)

ఇవి యన్నియుఁ బ్రాచీన ప్రయోగములు గావని శశిలేఖ యనునేమో; ఆట్లైనచో నీ క్రింది దానిని శశిలేఖకుం జూపుచున్నారము.

౯. శా. శ్రీకిం బ్రేమపదంబు ... .... ...
.... .... వేమ భూవిభున కిచ్చున్ సుస్థిరైశ్వర్యముల్.

పవర్ణ మీ పద్యమున నైదింట నున్నది. (కవిత్రయములోని యెఱ్ఱాప్రగడ హరివంశము).

౧౦. చ. సిరియొక యింత చేకుఱుట చేతనె ... ...
సరగున నేలుఁగాత గురుసామిని వేంకటసుబ్బరాయనిన్.

తకార మీ పద్యమున నాఱింట నున్నది. పద్యాది యందు నగణమున్న కతన దీనిని లక్ష్యముగఁ జూపినారము. (కందుకూరి వీరేశలింగముగారి శుద్ధాంధ్ర భారత సంగ్రహము.)

ఇపుడు చూపిన నరాంకిత గ్రంథములలో నీ ప్రథమ పద్యముల దగపడు విషాక్షరములగు త, క, ప, చ వర్ణములు గలిగిన పద్యముల నంకితముం బొందినవారికిఁ గలిగిన సంకటములను వెల్లడించిన తర్వాత నావలి విషయములం ద్రొక్కి-దలఁచి యున్నారము. పైన నుదాహరించిన నన్నయ సూత్రమునందలి 'అ-క-చ-ట-త-ప లలోఁ దకారము మాత్రమే నింద్యమని వాదించు పక్షమున నందుకుఁ గల కారణము లెవ్వియో ప్రకటింపఁ గోరుచున్నారము.

గ్రంథముల యందలి మొదటి పద్యములయందే గాక దీవన పద్యములై వెలయుచున్న గొన్ని చాటుపద్యములయందుఁ (వారు పేర్కొన్న) విషాక్షరము లగపడుచున్నవి; చూడుఁడు....

మ. సరిబేసై రిపుడేల భాస్కరులు భాషానాథపుత్రా; వసుం
ధరయం దొక్కఁడు మంత్రియయ్యె; వినుకొండన్ రామయామాత్య భా
స్కరుఁడో; యౌ; నయినన్ సహస్రకరశాఖ ల్లేవదే యున్నవే;
తిరమై దానము సేయుచో; రిపులహేతిన్ వ్రేయుచో; వ్రాయుచో.

పవర్ణము పైపద్యమున నాటింట నన్నయది. ఈ పవర్ణమున కేమీ సమాధానమో !

క. ఇప్పటి దాతల సరిగాఁ
జెప్పకురా భట్ట కర్ణ శిబి ఖేచరులన్
జెప్పుము మూర్తిమనుని వెం
కప్పకు దానమున నిర్భయంబున సభలన్.

త వర్ణము పైపద్యమున నైదింట నున్నది. ఇట్టి పద్యమునఁ దవర్ణముం జెప్పవచ్చునా ?

క. అప్పు లిడు నతఁడు ఘనుఁడా ?
యప్పు డొసఁగి మరలఁ జెందు నాతఁడు రాజా ?
చెప్పఁగవలె సాహిణిమా
రప్పను దానమున ఘనుఁడు రాజు నటంచున్.

తవర్ణము పైపద్యమున నాటింట నున్నయది. ఇదియును స్తుతిపద్యముగదా.

క. అన్నలుఁడు రూపమున సిరి
యన్నఁ గళాయుక్తి భరతునన్న కరుణచే
నన్న సముద్రపు పెద చి
న్నన్న కుమారుండు వెంగళామాత్యుఁ డిలన్.

ఈ పద్యములయందు బైన నుదాహరించిన "అ-క-చ-ట-త-ప" వర్ణములఁ బూర్వకవు లందఱు వాడి యున్నారు. పై వర్ణము లాఱును దిట్టు పద్యములంద మాత్రము దూష్యములుగాక యున్నచో నిదివఱకుఁ జూపిన పద్యములలో నున్న అ-క-చ-ట-త-ప వర్ణములం బూర్వకవు లేల ప్రయోగించి యుందురు ? నన్నయభట్టుగారి సూత్రాభిప్రాయము నప్పకవి స్పష్టముగ విశదీకరించి పై వర్ణములం దిట్టుపద్యములలో మాత్రము వ్రాయరాదని తన యభిప్రాయము వ్రాసియున్నాడు. ఇంతియగాక పైన నుదాహరించిన వర్ణములలోఁ దిట్టుపద్యములయం దైనను నాఱవచోటఁ దవర్ణముంచి నిన్నుఁ జంప వచ్చు వానియం దైనఁ బద్యము మచ్చరమున వ్రాయరాదని స్పష్టముగఁ జెప్పి యున్నాఁడుగాని వేఱొండు విధముగఁ జెప్పియుండఁడయ్యె. ఈ యర్థమును శశిలేఖ తన యిష్టానుసారముగ మార్చుకొని ''తకారము నొక పద్యము నందలి యాఱవ యక్షరముగా నిమిడ్చి చలమూని తన్నుం జంప వచ్చుచుండు మూర్ఖున

కేడియుఁ బద్యము సేసి యీరాదు. అని యర్థము వ్రాసి యున్నది. అప్పకవి వ్రాసిన "వ్యంజనాహ్వయము" అను పద్యములో

"మచ్చరంబునఁ దనుఁజంప వచ్చినట్టి
చెదుగుపకు నైనఁ బద్యంబు విడఁగవలదు"

అని వ్రాసియున్నదానికి నర్థము శశిరేఖా పత్రికాధిపతిగారు మచ్చర శబ్దమును దనుఁ జంపవచ్చినట్టి చెదుగునకు నన్వయముం జెప్పుచు నిఁక దీవన పద్యములలో నాతింటఁ దకారము వ్రాయరాదని యొక సంశయముం జూపిరి. ఈ యర్థమే నిజమైనచో మేము పైనఁ జూపిన దీవనపద్యములలోఁ దవర్ణము వ్రాసిన కవులందఱు నిరర్థకులే గదా. అట్టి కవిసింహులే నిరర్థకులైనపుడు కుమార సంభవకృతికర్తను గుఱించి యుపన్యసించి వ్రాయుట నిరుపయోగమే. ఆ కవి బుషభుల నందఱిని నిష్ప్రయోజకులని రూఢిచేసినంగదా యాపట్టమునే వీరికిం గట్టవలయును.

ఇఁకఁ దిట్టుపద్యముల యందు మాత్రము పైవర్ణములనఁగా "అ-క-చ ట-త-ప-" ఈ వర్ణములు నింద్యములని యప్పకవి వ్రాసియున్న విధముం జూడుఁడు :

సీ. గడియలోపల మూఁడు కంద్రికలై తాఁడి
ధరఁగూల దిట్టె మేధావిభట్టు
కినిసి యొక్క ముహూర్తమున బ్రహ్మదండి ముం
డ్లెల్ల డుల్లఁగఁ దిట్టె మల్లఘనుఁడు
మూఁడునాడికలకు ముట్టడి పైచిన
మారని భీమన మడియఁ దిట్టె
నెరజాముసకుఁ జెఱు వంతయు నింకంగఁ
దిట్టెరు బడబాగ్నిభట్టసుకవి
వావరత్రయమునకుఁ జావంగఁ దిట్టె
శ్రీనగముఁ దోఁచు తుక్కని శేషమంత్రి
తురగ చోరకుఁ బడఁ దిట్టెఁ దిరుమలయ్య
పద్యగత దుష్టవర్ణ ప్రభావములను.

ఈ పై సీసపద్యములోఁ జెప్పఁబడిన కవులు చెప్పిన లక్ష్యంబు లెవ్వి యనిన :

తవర్ణము నాఱవచోట నుంచి మేధావిభట్టు తాటిచెట్టును విఱుగఁ దిట్టిన చాటు ధార :

క సాళువ పెదతిమ్మ మహీ
పాలవరుఁడు పిఁడెవచ్చెఁ బద్యము వ్రాయన్
గేలను లే దాకొకటియుఁ
దాళమ ముత్తునియలగుచు ధరపైఁ బడుమా.

అకారమును మూఁడవచోట తకార మేడవచోట నిలిపి ప్రౌఢకవి మల్లన బ్రహ్మదండి చెట్టుముండులు రాలఁ దిట్టిన చాటుధార :

క. గుడి యన్న నృపతిఁ బొడఁగన
నడరంగాఁ గొండపల్లి నగరి పదమటం
గుడియడుగు మదమఁ గాడిన
చెడుముండులు బ్రహ్మదండి చెట్టున దుల్లున్.

టకారము నేడవచోట నుంచి బడబానల భట్టు చెఱువు నీళ్ళింక దిట్టిన చాటుధార:

క. బిడబానల భట్టారకు
కుడిచేయుంగరము రవికి గొబ్బున నర్ఘ్యం
బిడువేళ నూడి నీలోఁ
బడియెఁ దటాకంబు నీటఁ బాయుము వేగన్.

కకార మైదవ చోట నిలిపి యేలూరిమంత్రి శ్రీశైలమును దోఁచిన తుక్కరుసును మూఁడు దినములకుఁ జావఁదిట్టిన చాటు ధార :

చ. మును పౌళకేల రావణుఁడు మోదమున న్రజతాద్రి యెత్తి నం
తనె హరుఁ దప్పుడే తన పదంబునఁ ద్రొక్కి మదం బణంచెఁగా
వనమయగారి తుక్కసచివా యల శ్రీగిరి గర్ణపాళులన్
గనలుచుఁ ద్రవ్వి సర్వమును గైకొన నీకిపు డాతఁ దోపఁడే.

హ వర్ణము మొదలను త వర్ణము నాఱవచోటను పకార మేడవచోట నుంచి నెల్లూరి తిరుమలయ్య తన గుఱ్ఱమును దొంగిలించిన శ్రీపతి పోతరాజుఁ జావఁదిట్టిన చాటుధార :

చ. హాయమది సీత ; పోతవసుధాధిపుఁ డాతఁయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుఁడ; సహ్యజ వారిధి; మారు దంజనా
ప్రియతనయుండు; లచ్చన విభీషణుఁ; డాగుడిమెట్టలంక; నా
జయమును, బోతరక్కసుని చావును నేడవనాడు సూడుఁడీ.

పైన జూపిన పద్యములలో నున్న, ప-త-అ-ట-క-హ-వర్ణములు దిట్టు పద్యములందు ఉపయోగించినందున దూష్యములై విషాక్షరము లయ్యెనుగాని దీవనపద్యములం దున్నచో నని దూష్యములు గావయ్యెను. శశిలేఖాపత్రికాధిపతి యభిప్రాయము చొప్పున నయ్యవి దూష్యములైనను వానిం దీవనపద్యము లయం దుపయోగించినపుడు శ్రీకారమును మగణమును వాని దోషమెల్ల హరించు ననుటకు నించుకయైన సంశయము లేదు. అట్లుగాక యయ్యవి దోష వర్ణములైనచో మున్నుజూపిన మను వసు చరిత్రాదులను వ్రాసిన కవులందఱిని నిందింపవలసినదే. ఏరినేగాదు ఎఱ్ఱాప్రగ్గడ యందును నీదోషముం జెప్పవలసి యుండును.

* * *

ఈ తకారమును గూర్చి తాతంభట్టుచే విరచింపఁబడిన సులక్షణసారము నందును నివ్విధముగ వ్రాయఁబడియున్నది. ఎట్లన :—

క. ఘోరతర పద్యముఖమున
వేఱుగ నొక చోటు జూచి వెదకఁగ నేలా
యాఱవకడ 'తా' నిలిపిన
మాఱమ్మనఁ గ్రుమ్మినట్లు మడియు మనుజుడున్,

ఈ పద్యమునకుఁ దాత్పర్య మివ్విధముగ వ్రాయఁబడి యున్నది.

"పద్యాదియం దాఱవ యక్షరము తకారంబుగా బ్రయోగించి తిట్టినేని బాణప్రయోగంబు చేతఁ జచ్చినట్లుగఁ జచ్చునని తాత్పర్యము" అని వ్రాయఁబడి యున్నదిగాని వేఱొండు విధముగ వ్రాయఁబడి యుండదయ్యె. కాఁబట్టి తకారము పద్యములో నాఱవకడ నుంచి తిట్టినచో నది నది దూష్యమేగాని దీవించినచో దూష్యము గాదని యెఱుంగవలయును.

* * *

తిట్టుపద్యములయందు "అ-క-ధ-ట-త-ప" వర్ణములు మాత్రమే గాక "హ-జ-గ-ర" వర్ణములు నుపయోగించి యున్నారని తాతంభట్టుగారు సులక్షణ సారమున నివ్విధముగ వ్రాసియున్నారు. ఎట్లనఁగా :—

క. హ జ గ ద లివి మూఁడవచో
నిజముగ నిందించి చెప్ప నీల్గుట యరుదే
భుజగమునకన్నఁ గీడగు
సుజనామరభూజ! రేచ! సుగుణసమాజా! —

ఇది యిట్లుండఁ బైన నుదాహరించిన నన్నయభట్టారకుని సూత్రము నందు లేని "హ-జ-గ-ద"వర్ణములును దిట్టుపద్యములలో నుపయోగించినచోఁ దప్పకఁ గీడుగలుగునని [తాతంభట్టుగారి] సులక్షణసారమున వ్రాయఁబడి యున్నందున నీ వర్ణము లుపయోగించి యేరైనం దిట్టి యున్న చాటువులుండునా యని గ్రంథావలోకనముఁ జేయఁగా లింగముగుంట తిమ్మన్న, సులక్షణసారములో నీ క్రిందిపద్యము వ్రాసియున్నది.

ఉ. చాపముగా నహార్యమును, జక్రిని బాణముగాఁగ, నారిగాఁ
బాఁప దొరం బొనర్చి దలఁపంద్రిపురంబులఁ గాల్చవే మహో
ద్దీపిత తీవ్రకోపమున దేవతలెల్ల నుతింప నాఁటివిల్
బాపపు ఢిల్లిమీఁదఁ దెగఁ బాపఁగదే శరభాంకలింగమా.

ఇట్టి తిట్టుపద్యము లనేకములున్నవి. పైన నుదాహరించిన విషాక్షరముల నెల్ల నిర్దిశ్యస్థలములయందుఁ జేర్చి యొకరిని దిట్టినపుడు మాత్రమే దోషముగాని దీవించినపుడు దోషముగాదు.

మఱియొక తిట్టు [చాటు] పద్యముం గనుఁడు.

ఆ. వె. ఊరు నాకుఁ గ్రొత్త ఊరికి నేఁ గ్రొత్త
మాలతొత్త నీవిమానమెత్త.

పైన వ్రాసిన లక్ష్యలక్షణములం బట్టి తిట్టు పద్యములలో మాత్రము-త-క-చ-ట-త మొదలగు వర్ణములు కీడు కలుగఁజేయఁ జాలుననియుఁ దక్కిన పద్యములలో నింద్యములు గావనియు లక్ష్యలక్షణములఁ బట్టి వాకొనుచున్నారము.

పత్రికాధిపతి *
(పూండ్ల రామకృష్ణయ్య)

* అముద్రిత గ్రంథచింతామణి. నెల్లూరు. ఫిబ్రవరి,-మార్చి, 1896 సంపు. 8 సంచిక 2,3.

# నాటకాల యందు గ్రామ్యభాష యుపయోగింపఁ దగునా ? తగదా ?

నాటకాలయందు గ్రామ్యభాష యుపయోగింపఁ దగునని మా మతము. ఆర్. వి. వేంకటసుబ్బయ్య, ఎం. ఏ. గారు యుక్తాయుక్తమును విచారింపక ౧౨వ తేది ఫిబ్రవరి శశిలేఖలో "గ్రామ్య ముపయోగింపవలసినదే యను వారూరకుండక వాదమునకు రండు. మీ మీ యాధారములం జూపుడు. ఖండింతుము. నిజము విలుకడపై నేర్పడుఁ గాక" అని ప్రకటించినందున వారికిఁగా మేమీ జవాబును వ్రాయుచున్నారము.

మనదేశములో నాటకములు సంగీతకృతులతోఁ జేరి యక్షగానములని వ్యవహరింపఁబడుచున్నవి. ఆ యక్షగానములం దన్నింటను గ్రామ్యభాష (పాత్రోచితమైన భాష) వ్రాయఁబడి యున్నది. ఆ నాటకములఁ బ్రదర్శించునప్పుడు వేంకట సుబ్బయ్యగారును జూచియుందురు గాన దాని నిటఁ జర్చించుట వలనఁ బ్రయోజనము లేదు. సుంకరి కొండడు, దాష్టీక పంతులు, ఎఱుకత, పటాస్, గొల్ల లోనగు వేషముల భాషఁ జూచినవారు దీనిం గుఱించి మా యభిప్రాయముతో నేకీభవింతురు గాక. ఇఁక యక్షగానములకుం బోవుదము. కీర్తనలతోఁ గూడిన యక్షగానములు సంస్కృత నాటకములం బోలి యుండనందున నవి సంస్కృత నాటకముల వంటివి గావని కొందఱనెదరుగావి వేంకటసుబ్బయ్య గారు మెచ్చిన చిత్రనళీయము గూడ వానిలో నొకటిగా నున్నందున నట్టి కీర్తనలఁ గలిగిన నాటకములపై వేంకటసుబ్బయ్యగా రసూయపడరని నమ్ముచున్నారము.

సుమారు 80 సంవత్సరములనుండి సంస్కృతనాటకముల ననేకు లాంధ్రీకరించుచున్నారు. సంస్కృత నాటకములలో నీచాది పాత్రలకుఁ బ్రాకృత మున్నను దెలిగించువారు సంపూర్ణమైన పండితులు రెంటను గానందునఁ గాఁబోలు వారు ప్రాకృతమునకు సమమైన భాషను వ్రాయలేక తద్విరుద్ధముగా నాంధ్రీకరించిరి. ఇది లక్షణ సేతుచ్చేదము రసచ్చేదము నొనర్చుట గాదా ? చక్కఁగా

నాలోచింపుఁడు. యక్షగానము లన్నియు రసపోషణమున సంస్కృత నాటకముల ననుసరించి యున్నవని దీనివలన నూహింపవచ్చును గదా! రసమనఁగాఁ బాత్రానుగుణ్యమగు భాషయని యర్థము.

కొ. వేంకటరత్నం పంతులువారు మొట్టమొదట నాంధ్రీకరించిన నరకాసుర విజయ వ్యాయోగములో నీచాది పాత్రలకు మిశ్రభాష నిచ్చి వేంకటరాయ శాస్త్రిల వారి నాగానందము వ్యాప్తియైనతర్వాత విజయనామ వత్సర చైత్రసంజీవనిలో "సంస్కృత రూపకముల నాంధ్రీకరించునపు డందు ప్రాకృతభాషాస్థానీయముగా నచ్చతెలుఁగు వాడుట యుచితము" అని వ్రాసినందున నీచాది పాత్రలకుఁ దగినభాష యిది యని చెప్పుటకుఁ బంతులువారికి సైతము దెలిసి యుండలేదని స్పష్టము గాలేదా? మఱియు నీచాది పాత్రములకు నచ్చతెలుఁగే ప్రమాణ మనుటకుఁ గల యాధారము లెవ్వి?

వే. వేంకటరాయ శాస్త్రిలవారి నాగానందమునకుఁ బూర్వ మీవాదమే లేదు అట్లనుట వలన నీ నూతన మార్గమునకు వీరే మార్గదర్శులు గారు. ప్రహ్లాద నాటకమునందు వీరేశలింగముగారు పాములవానికిఁ గొంచెముగానో గొప్పగానో పాత్రోచితమైన భాష వ్రాసియే యున్నారు. దానికి సకల కలాధికారులు మెచ్చలేదందురేమో? వేంకటరాయశాస్త్రిగారి నాగానందము ఎఫ్; ఏ. పరీక్షకు పఠనీయగ్రంథముగా నుండెను. అది పొరఁబాటునఁ బెట్టఁబడినదని వీరు నుడువు పక్షమున నీ సంవత్సరమునకుఁ బ్రథమ శాస్త్రపరీక్షకుఁ బఠనీయ గ్రంథమగు ద్వితీయ ముద్రణ సునందినీ పరిణయమునందును వలయునంత గ్రామ్యభాష యున్నదిగదా. ఇఁక వేంకటసుబ్బయ్యగారు పరీక్షకులైనఁ గాని యట్టి నవలక్షణములు చేరవుగాఁబోలు. ఈ ద్వితీయముద్రణ సునందనితో చదువ వలసినదని గదా సకలకలాధికారులు రెండవ యుత్తరువు గత యక్టోబరులో నిచ్చియున్నారు. గ్రామ్యమును వారేల తొలఁగింపరైరి? అది నాటకములో ముఖ్యమని మున్మాటికి నమ్ముడు.

మా మిత్రులగు వేంకటసుబ్బయ్యగారును, వావిలికొలను సుబ్బారావు గారును, నాగపూడి కుప్పుస్వామయ్యగారును, కొంద ఱనామకులును గ్రామ్యము నాటకములలో నుపయోగింపరాదని ప్రత్యక్షముగానో, పరోక్షముగానో ప్రకటించుచున్నను నూతనముగ వెలువడిన శ్రీనివాస కల్యాణమను నాటకమున

గ్రంథకర్తగారగు మాడ్గుల రాజాగారు *పీఠికలో "జనరంజనముగా నుండు నను తలంపుతో నిందుఁ బాత్రానుగుణ్యముగా నచ్చటచ్చట దేశ్యగ్రామ్య పద ములు వ్యవహరింపఁ బడినవి" అని వ్రాసియుండుట వలన విశాఖపట్టణము మండలమునను నాటకములఁ బాత్రోచితమైన గ్రామ్యభాషయే వలయునని స్పష్ట మయినదిగదా.

గ్రామ్యము నాటకములయందుఁ బెట్టిన భాష చెడిపోవునని వీరి వాదముగా నున్నది. నాటకములయందు నానందము గలుగఁజేయునది రసముగాని భాషగాదు. దీనిలో భాషను గోరువాఁ డల్పబుద్ధి గలవాఁడని పూర్వమే వక్కాణింపఁబడి యున్నది. ఎట్టన :—

శ్లో॥ ఆనందనిష్యందిషు రూపకేషు వ్యుత్పత్తిమాత్రం ఫలమల్పబుద్ధిః
యోపీతిహాసాదివదాహసాధుః తస్మై నమః స్వాదు పరాఙ్ముఖాయ.

వేంకటసుబ్బయ్యగారు "ప్రాకృతభాష గ్రామ్యభాషవలె నింద్యము గాదు. అద్దానికి లక్షణ మున్నయది." అనియు వ్రాసియున్నారు. దీనికి సమా ధానము విశేషముగ వ్రాయఁబనిలేదు. ప్రాకృతమును సంస్కృత గ్రామ్యమే; దానికి వ్యాకరణ మన్ననో వెనుక పుట్టినది. మఱి యీ వాక్యమును వారు వినలేదు గాఁబోలు.

"సకల జగజ్జంతూనాం వ్యాకరణాదిభి రనాహిత
సంస్కారః; సహజో వచన వ్యాపారః ప్రకృతిః;
తత్ర భవం తత ఆగతం వా ప్రాకృతం."

అని యున్నదిగదా. నాటకాద్యారూఢములైన పిమ్మట వాని ప్రచార ముడిగినందువ వానికి లక్షణములు సుఖబోధార్థమై పండితులు రచియించిరి. ఇంతకన్న నెక్కువ వలయునేని 1898 సం. ఫిబ్రవరి 5 తేదీగల ఆంధ్ర ప్రకాశికం జూడవచ్చును. అందొక నూతన ప్రస్తావ మున్నది. అనేక సంశ యములు వీడును. మీవంటి వారికిగా నది ప్రకటింపఁ బడినది.

సంస్కృతనాటకములయందు నీచాతినీచపాత్రములకుఁ బ్రాకృతపైశాచ్యా దులవలె నీ తెలుఁగునాటకములందును బాత్రోచితముగా నాయాదేశ్య గ్రామ్యము లుపయోగించిన నత్యంత రసవంతములుగా శ్రవణానందకరములుగా నుండునని

---

*శ్రీ విక్రమదేవవర్మ జయపురం మహారాజు కాకపూర్వం ఆయనను మాడుగుల రాజుగా రనేవారు.—ప్ర. అ.

ప్రయోగింపఁబడియె. ఇందుల కాధారమేమియని యందు రేమో సంస్కృతనాటక లక్షణమున నుండి కొన్ని శ్లోకము లుదాహరించుచున్నారము.

శ్లో. ప్రాకృతం శౌరసేనీ చ నీచపాత్రస్య చ స్త్రియః,
పైశాచం మాగధం వా స్యా త్పిశాచాత్యంత నీచయోః.

శ్లో. యద్దేశ్యం నీచపాత్రం స్యా త్తద్దేశ్యం తస్య భాషితం,
భాషా తు సంస్కృతం ప్రోక్త మనీచానాం కృతాత్మనాం.

శ్లో. లింగినీ మంత్రి దేవానాం దేవీనామపి కుత్రచిత్.

అని పైన నుదాహృతమైన లక్షణమనుసరించిన మనసుకలవారు గనుకనే కొంద ఱీక్రింది నాటకములయందు గ్రామ్యభాష నుపయోగించిరి.

1. సునందినీ పరిణయము; 2. సుఖమంజరీ పరిణయము (కోలాచలము శ్రీనివాసరావుగారు); 3. ప్రహ్లాద నాటకము (వీరేశలింగముగారు); 4. తారా శశాంక నాటకము (బుక్కపట్టణము శఠగోపసూరి); 5. నాగానందము; 6. శాకుంతల నాటకము; 7. ప్రతాపరుద్రీయ నాటకము (వేంకటరాయశాస్త్రులు గారు); 8. కుసుమకోమల నాటకము (ధూళిపాళ కృష్ణకవి); 9. చిత్రనళీయము (రామకృష్ణమాచార్యులుగారు); 10. శ్రీనివాస కల్యాణము (శ్రీ విక్రమదేవవర్మ గారు); 11. ప్రహ్లాద నాటకము (రామానుజయ్యసూరి).

ఇఁక సిద్ధాంతమును వ్రాయుచున్నారము. వేంకటరత్నముపంతులువారి యందుఁ గల యభిమానముచేఁ దమకుఁ బయస్సు పయమగుననుటకు వీరి "కంబ రామాయణము" సాక్షియగుచుండఁగా లక్షణము లేనట్టి రసమునకును విరుద్ధ మైనట్టి సలక్షణమయిన భాష నాంధ్రమున నాటకములయందు నీచపాత్రములకుఁ బనికివచ్చునని వేంకటసుబ్బయ్యగారు "వాపోవుట" మిక్కిలి వింతగనున్నది. కావున "వేంకటరాయశాస్త్రి కృతి వెంగలిమూఁక కెఱుంగ శక్యమే" యనునది మా కప్పుడప్పుడు జ్ఞాపకమునకు వచ్చుచునేయున్నది. యక్షగానములు వ్రాసిన మనవారందఱును పాత్రోచితమయిన గ్రామ్యభాషయే వ్రాసియున్నారు. వ్రాయు చున్నారు. వ్రాయుదురు. దీనికి విరుద్ధమైనది నాటకమేగాదు. ధర్మవరము రామ కృష్ణమాచార్యులవారికి నీ యూహ యంకురించియే యున్నది. దానిం "దమ యంతి"యను మాటయందుఁ జూచుచున్నారుగదా. వారి సదభిప్రాయము వృద్ధి గావలయునని కోరెదము.

మనదేశములో ననేక వేల సంవత్సరములనుండి దేశభాషలలోఁ బాత్రోచిత మయిన గ్రామ్యభాషతో నాటకము లాడఁబడుచున్నవి. అందుచే నాంధ్రభాషా దేవతకుఁ గోపమురాలేదు. భాష చెడలేదు. తిక్కన నన్నయ ఎఱ్ఱయ లోనగు వారు భారతాదులను రచియించిరి. వారి గ్రాంథికభాష యేమియుఁ జెడదయ్యెను. ఎన్నియో యక్షగానము లప్పటికే యుండెనుగదా. ఎన్ని యున్నను నాటకభాష యొక విధముగాను, గ్రాంథికభాష మఱియొక విధముగాను వేఱువేఱుగ నున్నది. అట్లే సంస్కృతమునందును గలిగియుండెను. ప్రాకృత మున్నందున్న సంస్కృత గ్రంథములు పాడైపోయినవా ? కవులు వైయాకరణులుగా నుండకపోయిరా ? ఒక్కొక కవి కావ్యమును నాటకమును రెంటిని వ్రాసియుండలేదా? నాటకమున గ్రామ్యము వ్రాసినందునఁ గవికిఁ బాండిత్యము తగ్గినదా ? భాష చెడినదా? కావున నెన్నివిధముల నాలోచించినను వేంకటరాయశాస్త్రిలవారి మార్గము మంచిదనియు, రసపోషకమైనదనియు, లోకానందకరమనియు వేంకటసుబ్బయ్యగారి కింది మూలకముగాఁ దెలుపుచున్నారము.

పత్రికాధిపతి

—పూండ్ల రామకృష్ణయ్య*

## 2

పాత్రోచితమైన భాషను నాటకాదులయం దుపయోగించుట గర్హ్యము కాదు. అత్యావశ్యకము.

గ్రామ్యమును సంస్కృతాంగ్లేయభాషలలో నుపయోగించియున్నారు. సంస్కృతనాటకములలోనున్న ప్రాకృతము సంస్కృతభాషకు గ్రామ్యప్రాయమైనది. ఆంగ్లేయభాషయందలి షేక్స్పియర్ అను మహానాటకకర్త 'మిడ్‌సమ్మర్ నైట్సు డ్రీమ్' అను నాటకములో 'క్విన్స్' మొదలైన నీచపాత్రలకును, 'హెన్రీ ది ఫిఫ్త్' మొదలైన నాటకములలో 'పిష్టల్; నిమ్' మొదలైన నీచపాత్రలకును

*అముద్రిత గ్రంథ చింతామణి. నెల్లూరు. మార్చి 1899, సంపుటి. 12. సంచిక 8.

గ్రామ్యమునే ప్రయోగించియున్నాఁడు. ఇందుచే పై భాషలు చెడినవా? లేక యా నాటకములకుఁగాని. తత్కర్తలకుఁగాని యెట్టి న్యూనతయయినఁ గలిగెనా? న్యూనత కలుగకపోయినదిగాక వారొనర్చినకార్యము రసపోషకమై యత్యంతానంద జనకమైనదని కొనియాడఁబడుచున్నది. అన్యభాషల విషయ మిట్లుండఁగాఁ దెనుఁగు యేమిపాపముఁజేసినది? గ్రామ్యభాషను గ్రాంథికభాషయని భ్రమియుదురా? గ్రామ్యము భాషను జెఱుపఁజాలదు. రెంటికిని భేదము తెలియుచునే యుండును. గ్రాంథికభాషయను పేరుతోఁ దప్పుప్రాసములు, తప్పుయతులు, తప్పుసంధులు, తప్పుసమాసములింకను లక్షణశాస్త్రమునందుఁ జెప్పఁబడియున్న హద్దులను మీఱి రసమనునది తెలియక వ్రాయు వ్రాఁతలు భాషానాశకములు.

తెలుఁగునాటకములలో గ్రామ్యము ప్రయోగింపఁబడిన నొకదేశమునందు వ్రాయఁబడిన నాటకములు మఱియొకదేశమునందుండువారికి సుబోధకములు గావనునది వాదమేకాదు. సంస్కృతనాటకములలో నుపయోగింపఁబడియుండు ప్రాకృతము షడ్విధముగానున్నది. కొన్నిచోట్ల మాగధియుఁ గొన్నిచోట్ల శౌరసేనియుఁ గొన్నిచోట్లఁ బైశాచియుఁ గొన్నిచోట్ల నపభ్రంశము నిట్లే మఱిరెండు విధములైన ప్రాకృతభాషలు రసైకప్రాధాన్యులైన సంస్కృతనాటకకర్తలచేఁ బాత్రోచితముగఁ బ్రయుక్తములై యున్నవి. ఈ ప్రాకృతభాషలు వాని నామధేయములచే దేశభాషలుగ నుండి యుండవలయుననియు, వానిరూపములచే సంస్కృతగ్రామ్యములనియు స్పష్టపడుచున్నవి. నాటకముల యందలి పాత్రలు జీవించియుండఁగా దేశభాషలు కాకపోయినను కాళిదాసాది మహాకవులకాలమునందు దేశభాషలుగ నుండినవని యనేకులు పండితులు సిద్ధాంతీకరించి యున్నారు. నాటకలక్షణ గ్రంథములలో దేనినైన నొకదానిని లోఁతుకు దిగి తెలివితోఁ జదివిన నీ విషయము స్పష్టముగఁ దెలియును. ఇట్లుండ శౌరసేని మాగధీయులక్కను, మాగధి శౌరసేనీయులకుఁ దెలియుటెట్లు? ఇంతియగాక యాంగ్లేయభాషయందు వ్రాయఁబడు నావల్సను గ్రంథములుకూడ రసప్రాధాన్యములు గనుక వానియందుఁగూడ పాత్రోచితమైన భాష యుపయోగింపఁబడి యున్నది. సర్ వాల్టర్‌స్కాట్ అను నింగ్లీషుకవి వ్రాసియున్న నావల్సులో నీచపాత్రలకు స్కాటులెండుదేశములో నొకభాగమునందు మాటలాడఁబడు 'హైలాండు డైలెక్టు' నుపయోగించియున్నాఁడు. ఇతరులు వ్రాసినవానిలోఁ గొన్నింటియందు 'మిడ్‌లాండ్ డైలెక్టు'ను, గొన్నింటియందు 'లోలాండ్ డైలెక్టు' నుపయుక్తములై యున్నవి. పై నుదహరింపఁబడిన హైలాండ్ డైలెక్టు

మొదలైన యాంగ్లేయ గ్రామ్యభాషలలో మనతెనుఁగు గ్రామ్యభాషలలోనున్న భేదములకన్న విశేషభేదములు కలవు. అందుచేత వీనిని తగులఁబెట్టిరా ?

సంస్కృతాంగ్లేయభాషయందలి దేశీయములు రసపోషణకై వ్రాయఁబడి నవి కాని. వానివలన వారికి వ్యుత్పత్తిఁ గలుగజేయుటకుఁగాదు. సంస్కృ తాంగ్లేయ భాషలను స్వభాషలుగాఁ గలవారికి నాయాభాషలయందలి దేశీయ గ్రామ్యపదముల యందలి రసము తెలియదనుట యనుభవవిరుద్ధము. అజ్ఞాన జనితము. అటుల తెనుఁగునాటకములయందుఁ గూడ రసపోషణార్థ ముపయో గింపఁబడిన గ్రామ్యదేశీయ పదములయందలి రసము స్వచ్ఛమైన యాంధ్రునికిఁ దెలియకపోదు.

ఒకవేళ 'వాఁడు పూడ్చినాండు', 'కోం పీంకును' అని మాటలాడు మహానుభావులకుఁ దెలియకపోయిన పోవచ్చును. వారికిఁగా నాంధ్రనాటకము లఁ సహాసములుగఁ జేయుట న్యాయముకాదు. పైన నేనుఁ జెప్పినమాటలకు ని మెనవిన : 1898 సం. డిసంబరు నెలలోఁ జెన్నపురిలో జరిగిన కవి తసఁఘమునకు రాజమహేంద్రవరము నుండి మ. వడ్డాది సుబ్బారాయుఁడు , బళ్లారినుండి మ. ధర్మవరము కృష్ణమాచార్యులవారును, ఆత్మకూరు మ డి మఱియొక ఆచార్యుల వారును, చిత్తూరునుండి మ. నాగపూడి కుప్పు స్వా మయ్యగారును వచ్చియుండిరి. అచ్చట వీరందఱు నిజదేశీయ పదభూయిష్ఠం బైన గ్రామ్యభాషతోనేగదా ప్రసంగించిరి అట్లుండియు నక్కడికి వచ్చియుండిన వారికి వీ ప్రసంగములయందలి రసభావములు చక్కఁగ విశదములుగాలేదా ? పై ణములఁబట్టి వేంకటసుబ్బయ్యగారి వాద మనుభవవిరుద్ధమై యుక్తి హీ గనున్నది.

"స్త్రీ శూద్రాదులనోట దేవభాష నుచ్చరింపఁ దగదను నభిమానమే యీ నియమమునకు సరియైన కారణముకాని, సంభాషణములను సహజములుగాఁ గన్పట్టఁ జేయవలయునన్న భ్రాంతిగాదు. ఇది సహజమగునె? రాజొక భాషయందు పలుకును. రాణి మఱియొకభాషతో బదులిడును" అని ఎం. ఏ. వేంకటసుబ్బయ్య గారు మంచి వాదమునే వ్రాసియున్నారు. ఇందలి "స్త్రీ శూద్రాదులనోట...... భ్రాంతిగాదు." అనుమాట శుద్ధ యబద్ధము. ఈ యభిమానముచేతనేనా నటజాతి యుఁడైన సూత్రధారునికిని, ఋషికన్యకాది కొన్ని స్త్రీ పాత్రములకు దేవభాషనే యుపయోగించి యుండుట; మాళవికాగ్నిమిత్రి నాటకములో బౌద్ధ సన్యాసినికి సంస్కృతము ప్రయుక్తమైయున్నది. ఉత్తరరామచరిత నాటకములో నరుంధతి మొదలైన కొన్ని యుత్తమజాతీయ స్త్రీ పాత్రములకు సంస్కృతమునే చెప్పి

యున్నారు. అరుంధతి నొకవేళ నక్షత్రము పేరని భ్రమసి దేవత యందురేమో! వసిష్ఠుని భార్యగాఁ జెప్పఁబడియున్నది.

ఇంతియేఁగాక పైనవ్రాసినట్లు సూత్రధారునికిఁ బ్రతినాటకము నందును సంస్కృతమే ప్రయుక్తమైయున్నది. కొన్ని ప్రసిద్ధ నాటకములఁ జదివి జూచిన నేకజాతీయులైన యిద్దఱు మనుష్యులలో నొకనికి సంస్కృతము మఱియొకనికిఁ బ్రాకృతము నుపయోగింపఁబడి యున్నది. ఉదాహరణము: ప్రసన్నరాఘవ నాటకములో మంజీరకుఁడును, నూపురకుఁడును వైతాళికులైనను, మంజీరకునికి సంస్కృతమును, నూపురకునికిఁ బ్రాకృతమును నుపయుక్తములై యున్నవి. నాటకములలో విదూషకుఁడు మాటలాడు తావులనెల్లఁ బ్రాకృతమే ప్రయుక్తమై యున్నది. విదూషకుఁడు బ్రాహ్మణుఁడైనను ప్రాకృతమే మాటలాడియున్నాఁడు. ఇట్లుదాహరణములు లెక్కలేక యున్నవి. పైన నుదాహరింపఁబడిన చోట్ల నెల్ల జాతిమాత్రము కాని, లేక స్త్రీపురుష వివక్షతామాత్రము కాని భాషాప్రయోగమును ని[illegible]దు. జాతియును, సంస్కారమును, స్త్రీ పురుష వివక్షతయుఁ జేరి నిబంధించి యున్నవి. శూద్రులయ్యును సూత్రధార మంజీరకులు సంస్కృతమును మాటలాడలేదా? బ్రాహ్మణుఁడయ్యును విదూషకుఁడు ప్రాకృతమునే మాటలాడ లేదా? బౌద్ధ సన్యాసిని, యరుంధతి మొదలైన వారు స్త్రీలయ్యును దేవభాషను ముచ్చటింప లేదా? వీని నన్నిటినిఁ బట్టి చూడఁగా నౌచిత్యమే ప్రాకృతభాషా ప్రయోగమునకుఁ గారణము కాని, వేంకట సుబ్బయ్యగారి యభిమానము కాదని స్పష్టమగుచున్నది. ఇట్టి యుదాహరణంబులఁ బట్టియేకదా నాటక లక్షణకర్తలు రసికాగ్రేసరులగుటంజేసి పాత్రోచితమైన భాష నుపయోగింప వలసినదని వ్రాసి యున్నారు. స్త్రీలను దేవభాష నుచ్చరించునటుఁ జేయఁగూడదని యభిమానమంట. ఇది యేటిమాట? శ్రౌతములోని మంత్రములలో సగము మంత్రములు స్త్రీ యుచ్చారణఁ జేయవలసినవి గలవు. శుద్ధ శ్రోత్రియులకే మంత్రముల విషయమై కూడ యభిమానము లేకుండఁగా, రసైక ప్రాధాన్యులైన నాటకకర్తలకు సామాన్య దేవభాషా విషయమై యుండునా ?

"ఇది సహజమగునే? రాజొక భాషయందుఁ బలుకును. రాణి మఱియొక భాషలో బదులిడును." వేంకట సుబ్బయ్యగారి వాదముల నన్నింటిలో నిది సర్వోత్కృష్ట మయినది. ఇదియే వీరికి బలమని వీరి వ్రాఁతవలన బలపడినది. ఆహా! వీరి సంస్కృత ప్రాకృత భాషల పరిచయము ! శ్రుతి ముదిరినట్లున్నది.

ఈ వాదమువలన వీరు సంస్కృత లక్షణమునుకాని, లేక నాటకములనుకాని పఠించనేలేదని స్పష్టమగుచున్నది ఒకవేళ నొకటి రెంటిని చదివియుండిన ఛాయతో గాలమును గడిపిరేకాని ప్రాకృత భాగముల వంకనైన వీరు కన్నులు త్రిప్పినవారు కాదని బోధపడుచున్నది. వ్యాకరణాదులచే సంస్కరింపఁబడిన భాష సంస్కృతము. ఇట్లు సంస్కరింపఁబడక ప్రాకృత జనులచే మాటలాడు భాష ప్రాకృతము. ఎం. ఏ. గారు ప్రాకృతమునకు వ్యాకరణ మున్నదని వ్రాసి యున్నారు. నిశ్చయమే. నాటకాదులయం దుపయుక్తమై యుండుటచే దానికి వ్యాకరణము కలిగినది కాని వ్యాకరణము గలదైనందున నది నాటకాదులయం దుపయోగింపఁబడలేదు. వీరు కర్మమును నోటియందుంచుటకు బదులుగా మఱియెచటనో యుంచినారు. ప్రాకృతము వ్యాకరణముచే సంస్కరింపఁబడి నచో "దేశ్యము నింద్యమైనను రసపోషణఁ జేయునదైనందున, నాటకముల యందు హైన్యమును బోఁగొట్టుకొని గౌరవమును జెందును" అను ముక్కనులక్షణ కారులెందుకు వ్రాసియుందురు? తెనుగున గ్రాంథికభాషయు దేశీయభాషయు వెవ్వేఱుభాషలైనచో సంస్కృతము ప్రాకృతము కూడ వెవ్వేఱుభాషలగును. "ఇయమ్హి మందభగ్గా అణవేదు అజ్జ ఉత్తకోణ ఓ ఓ అను చిట్టియదుత్తి" యనునది ప్రాకృతము. దీనికి సరియైన ఛాయ "ఇయ మస్మి మందభాగ్యా ఆజ్ఞాపయతు ఆర్యపుత్త్రః కోనియోగో అనుష్ఠీయతామితి." పండితంమన్యులు చెప్పు మాటఁమ వినక, భాషాజ్ఞాన లేశమునైనఁ గలిగి శ్రవణేంద్రియము నుపయో గించుటకుఁ దెలిసిన వారెవరైన వీనిని వెవ్వేఱు భాషలందురా? "వాడు పొయ్యాడు నేను వచ్చ్యా" అనుదానికిని "వాడు పోయెను, నేను వచ్చితినను దానికిని గల భేదముఁకన్న పై రెంటియందు నెక్కుడు భేదములు గలవా? ఈ యంశములను బట్టి జూచిన రాజు సంస్కార సహితమైన భాషను మాట లాడుటయు రాణి సంస్కార హీనమయిన భాష మాటలాడుటయు సహజ విరుద్ధ మగునే? ఇది వింతయగునే? వ్యాకరణ సహితమయిన భాష నింటిలో సహజముగ మాటలాడుదురా యను సంశయ మొకటి కలుగును గాఁబోలు!

ఎం. ఏ. ఔచిత్యవాదమును ఖండించుట కాంగ్లేయభాష యందలి హరిశ్చంద్ర నాటకము నుదహరించియున్నారు. ఆహా! వీరికి దొరకిన యుదా హరణ పౌష్కలము! ఆ భాషలో ననేక నాటకముల నాంగ్లేయులే రచించి యున్నారు. వానియందు వివాదాంశమెట్లు తీర్మానింపఁబడి యున్నదో దానిని చూడక, వైకృతభాషను మాత్రముఁ జదువుకొని యాంగ్లేయ దేశీయములను

జన్మప్రభృతి వినక, హిందూదేశము నందలి భావములను నాటకరసమును చేతనైనంత వఱకు నాంగ్లేయులకుఁ గనఁబఱుచుదము గాక యను యభిప్రాయముతో నేరోయొక హిందువులు వ్రాసిన యాంధ్రీకరణమును(?)వీరు వీరాయుధముగఁ జేకొనినందులకు మిగుల నాశ్చర్యపడవలసి యున్నది. దీని వలన వీరి వాదముయొక్క కుంటితనము బైటఁబడినది. "అభావే విరక్తిః" యను మాట ఈ భాషాంతరీకరణమునకుఁ జెల్లును. తన్నాటక కర్తకు నాంగ్లేయ దేశీయములు తెలియవు. మఱియు మన మేభాషయందు నాటకము వ్రాయుచున్నామో, వానియందు మన మౌచిత్యముఁ గనబఱుపవలయును గాని హరిశ్చంద్రుఁ డాంధ్రభాషను కాని యాంగ్లేయభాషను కాని మాటలాడెనా యనుమాట పాటింపఁదగినది కాదు. లోకములో నున్న భేదములనెల్ల నాటకములలోఁ గనఁబఱచెదరా యని యడుగుదు రేమో ! ఇది వాదము కాదు. రాలుగాయతనము. లోకవ్యవహారంబులు దైవనిర్మితంబులు. నాటకములు మనుష్య నిర్మితంబులు. ఈ భేదమును మనసున నుంచుకొనవలయును. ఎంతవఱకు సాధ్యమో యంతవఱకు సంస్కృత నాటక కర్తలు నియమముల నేర్పఱచి యున్నారు. ఆ నియమము లత్యద్భుతములని మత్సదృశులకును ననేకులు పండితులకును తోఁచియున్నది. ఈ నియమములచే భాషానాశము కాలేదు. భాషాగౌరవముఁగూడ చెడలేదు. వీనిని మన తెనుఁగున నేల యనుసరింపఁగూడదు ? ఛందస్సును, వ్యాకరణమును, నలంకారమును, పదములను సయితము నాంధ్రభాషకుఁ బ్రాణదాయకమగు సంస్కృతమున నుండి మనము తెచ్చుకొని యుండఁగా నాటక లక్షణము మాత్ర మేల పనికిరాదు ? ఒక సంస్కృత మననేల ? ఏ దేశమున నుండువారికైనను ప్రతిభ యొక్కటియే. రసముకూడ నొక్కటియే. ఇందుచేతనేకదా రసపోషణకై యాంగ్లేయ భాషా నాటకముల యందుఁ గూడ నీచపాత్రలకు గ్రామ్యము ప్రయుక్తమయినది. మన భాషతోఁ దన్మార్గావలంబులు గావలయునన్న ప్రతిభ కావలయును. ప్రతిభయున్నఁగాని ముత్యము నందలి కాంతివలెఁ గావ్యములందు వెలుగుచున్న రసమును గ్రహింపఁజాలరు. ప్రతిభాసహితు లీ కాలమునందుఁ జిక్కుట యరుదు. అట్టివారే మన భాషయందు నాటకములను రచింతురు గాక.

నెల్లూరు                ఏకగుడిపాటి వేంకటాచలము*
20-2-1899

---

* అముద్రిత గ్రంథ చింతామణి. ఏప్రెలు, 1899, సంపు. 12. సంచిక. 4

# సారస్వత జీవనము

ఉ. భూషలుగావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్
భూషితకేశపాశ మృదుపుష్పసుగంధ జలాభిషేకముల్
భూషలుగావు పూరుషుని భూషితుఁజేయు పవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము భూషణముల్ నశియించు నన్నియున్.

—లక్ష్మణ కవి.

## సారస్వత జీవన మన నేమి ?

సారస్వత జీవన మన నేమో యాంగ్లేయభాషా పరిచితులు కానివారికి బోధపడక యెద్దియో యొక క్రొత్త విశేషముగాఁ దోఁచవచ్చును. గ్రంథరూపమున నున్న వాఙ్మయమునకే సారస్వతమను నామము వర్తించుచున్నది. అట్టి సారస్వత నిర్మాణమునే జీవనాధారముగాఁ జేసికొని లోకయాత్ర గడుపునట్టి వృత్తికే సారస్వత జీవనమని నామకరణముఁ జేయుచున్నాఁడను. దీసినే గ్రంథములు వ్రాసి తన్మూలమున ధనమార్జించుటయే వృత్తిగాఁ గలిగియుండుట యని తేటమాటలతోఁ జెప్పఁదగును. ఇట్టి సారస్వత జీవనము నాగరికులైన విదేశీయులలో నెక్కువగాఁ గాన్పించుచున్నను మన యాంధ్రులలో నరుదై యున్నది. ఈ విషయము మహత్తరమైన దగుటచేతను, ఇదియొక వృత్తిగా మనదేశమున నిదివఱకుఁ బరిగణింపఁబడకుండుటచేతను, ఆంధ్రసారస్వతమును గూర్చి మాత్రము వ్రాయుదును.

## ప్రాచీన కాలమున సారస్వత జీవనము

"సారస్వత జీవనము పూర్వముండెనా ? ఉన్నచో నేరీతి నుండెను ? ఇప్పుడేరీతి నున్నది ! దీని నవలంబించుటవలనఁ గలుగు లాభనష్టము లెట్టివి ? దీని నభివృద్ధి పరచుటెట్లు ?" అను నీ మొదలగు ప్రశ్నంబులకుఁ దగిన ప్రత్యుత్తరంబులు సంగ్రహముగానైనఁ జర్చించి చెప్పవలసి యుండును. సారస్వత జీవన మొకరీతిగాఁ బూర్వకాలమున మన దేశమున నుండెను గాని స్వచ్ఛమైనరీతి నుండక యది యొక ప్రత్యేక మొకశాఖవారిలోనే యత్యల్ప సంఖ్యాకు

లచే నలంకరించుకొనఁబడి దేశకాల స్థితులనుబట్టి యెదుగుబొదుగు లేక సంస్కార రహితమై యొప్పుచుండెను.

పూర్వకాలమున రాజ్యపరిపాలనముచేసిన మహారాజులు, మండలాధిపతులు, సేనానాయకులు, మంత్రులు, ధనికులు మొదలగువారు కొందఱు భాషాభిమానులును కీర్తికాములునై కవుల నాదరించి భూవసతులను, కొన్నివేళల నగ్రహారములను నొసంగియు, ధనకనక వస్తువాహనాదులచే సంతరింపఁజేసియు బహువిధంబుల సత్కరించుచుండుటచేత ననేకులు వారలకు కృతుల నంకితములఁ గావించి కుటుంబపోషణముఁ జేసికొనుచువచ్చిరికాని యది యంత యుత్తమమార్గముగాఁ గనఁబట్టకుండెను. అంతియగాక మహాసముద్రములో నొక జలబిందువువలె మహాసంఘములో వారి సంఖ్య యత్యల్పమై యుండెను. ఆ యత్యల్పసంఖ్యగలవారి మార్గముకూడ నిఱుపేదలై, భక్తాగ్రగణ్యులయిన కవివరేణ్యులచే నీచమైనదిగా గర్హింపఁబడుచునే వచ్చినదికాని యుత్తమమార్గమని సూచింపఁబడలేదు.

## బమ్మెరపోతన

పూర్వజన్మ సహస్ర సంచిత తపఃఫలంబున శ్రీమన్నారాయణకథా ప్రపంచ రచనా కుతూహలుండును, సహజపాండిత్యుండును, కవివరుండును, భక్తాగ్రేసరుండు నగు బమ్మెరపోతన నిఱుపేదయయ్యును నరకృతి నిషేధించి, తన భాగవతమును శ్రీహరి కంకితముచేసినట్టుగ నేతత్కృతిలోని

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్నిపుచ్చికొని సొక్కి శరీరమువాసి కాలుచే
సమ్మెటప్రేటులం బడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు భాగవతమ్ము జగద్ధితమ్ముగన్.

అను పద్యమువలన విస్పష్టమగుచున్నది.

మఱియు సంకుసాల నృసింహకవియు తన కవికర్ణ రసాయనమున

"సీ. అందోళికలయందు నంతరచరులైన
శవకృతాకృతులఁ బిశాచజనుల
వాలవీజనములఁ గ్రాలుచు నీఁగకు
నంటిని ఖరవర్తులాందనముల

వేత్రపరంపరా విలకంటకాకృతిఁ
జేరఁ బోరాని కర్పూరతరుల
పరకరాలంబులై ప్రార్థింపఁ గైకోక
వాయెత్తకుండు జీవచ్ఛవముల

శంఖనాగస్వరాదిక శ్రవణసమద
విస్ఫుటచ్ఛత్ర విస్ఫారితస్ఫటాక
దిష్ట విషవైద్య వశవర్తి దుష్టఫణుల
ప్రభుదురాత్ముల నెవ్వాఁడు ప్రస్తుతించు!

నరగుణాంకితమయ్యెనే సరసకృతియు
దూష్యమగు శునకోద్వృత్త దుగ్ధ మట్లు
హరి గుణాంకిత మయ్యెనే సరస కృతియు
హారసూత్రంబు గతి హృదయంగమంబు."

అని వాక్రుచ్చి గర్హించియున్నాఁడు. బమ్మెరపోతరాజు కర్ణాటులకుఁ గృతి యొసంగి ధనము సంపాదింపవలసినదని శ్రీనాథునిచేఁ బ్రేరేపింపఁబడినపుడు భారతి కన్నీరుమున్నీరుగా నేడ్చుచుఁ బ్రత్యక్షమైనట్లుగాఁ గాన్పించిన నతఁడు

"ఉ. కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ నేల యేడ్చెదో
కైటభ దైత్యమర్దనుని గాదిలికోడల యోమదంబ యో
హాటకగర్భురాణి నిను నాఁకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాత కీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ!"

అని పలికి యామె నూరార్చినట్లుగాఁ జెప్పెదరు.

ఒకప్పుడు బమ్మెరపోతరాజు పొలము దున్నుకొనుచు నలసి గట్టునఁ గూర్చుండి యుండఁగా నతని బావమఱఁది యని చెప్పఁబడెడి పై శ్రీనాథకవి "హాలికులు సుఖముగా నున్నారా?" యని పరిహాసము జేయఁగా నమ్మహనీయుఁడు

"ఉ. బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుకూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి గహనాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికులైన నేమి నిజదార సుతోదర పోషణార్థమై?"

అని యతఁడు మాఱుమాటడకుండు నట్లుగాఁ బ్రత్యుత్తరం బిచ్చెనని కూడ చెప్పెదరు. ఇట్టి దృష్టాంతములను మఱికొన్నిటి నాంధ్ర సారస్వతము నుండి యెత్తి చూపవచ్చును గాని గ్రంథవిస్తర భీతివలన వానిని విరమించు చున్నాను.

## ప్రాచీనకాలమున సారస్వత జీవనము వృద్ధిబొందకుండుటకు గారణము

ఈ కాలమునందువలె నా కాలమున నచ్చుకూటములు వెలసి, గ్రంథములు ముద్రింపఁబడి మూల్యమునకు విక్రయింపఁబడుట లేనికారణమున, నా కాలమున స్వతంత్రమైన సారస్వతజీవనమున కవకాశము లేకయుండెను. ఏతన్మూలమున నాంధ్రసారస్వత మీకాలమునందువలె శాఖోపశాఖలతో వర్ధిల్లుటకు మార్గములేక యున్నతావుననే యుండి యాకాలపుం బ్రభువర్యుల దయాధర్మభిక్షములకులోనై మనవలసినదయ్యెను. కాఁబట్టి యా కాలమునాటి సారస్వతజీవనము నొక జీవనముగాఁ బరిగణింపవలసిన పనిలేదు.

## పూర్వకాలమునందు కవులు

పూర్వకాలమునఁ గవులయెడఁ బ్రజలకు భక్తికన్న భయ మెక్కువగ నుండెను. కవులు తిట్టిన శాపమైతఁగులునన్న వెఱ్ఱిభయ మా కాలమునను౦డు టచేఁ గొందఱు కవులు భూషించియు, దూషించియుఁ గూడ ధన మార్జించు చుండిరి. ఒకనిగుఱించిన కీర్తిగాని యపకీర్తిగాని వ్యాపింపఁజేయుటకు నీ కాలమునందలి వార్తాపత్రికలవలె నా కాలమునందలి కవులు కారకులగుటచేత సాధారణముగా నెల్లవారును కవులకు భయపడుచు, నుభకార్యాదులలో కట్నములు కానుకలుగూడ చెల్లించువారుగ నుండిరి. ఎవ్వరుసన్మానింపరో వారిపైఁ గత్తికట్టి, కలముచేఁబట్టి, చలముచే నొక దూషణపద్యమునుగాని గ్రంథమునుగాని వ్రాసి దేశదేశములఁ జాటు దుష్కవులుకూడ నుండుటచే గ్రంథకర్తపదము భయంకరమైనదై యపకీర్తిపాలయ్యెను. సామాన్యులలో "గ్రంథకర్త" యనఁగా చెడుగు చేయువాఁడని యపార్థమేర్పడినది. అతఁడు "గ్రంథసాంగుడు; మనవాఁడు గ్రంథకర్తయైనవాఁడు" అనునవి చెడుపనులు చేయువారినిగూర్చి పలుకునట్టి వాక్యములుగానున్నవి.

## గీర్వాణభాషా పండితులు

ఇట్లే గీర్వాణభాషాపండితులు కొందఱు సామాన్యజనుల వేషభాషల నధిక్షేపించును నౌచితి నెఱుంగక ఛాందసులై పామరులతో సంభాషించునపుడు సయి

తము సంస్కృతపదాడంబరమును జూపుచుండుటచేత సామాన్యజనులకు వారి భాష యర్థము గాకయుండెను. అందువలన సామాన్యజను లాగీర్వాణపండితు లను గర్వభూయిష్ఠులనుగాఁ దలంచుచుండిరి. ఏతత్కారణమువలన గీర్వాణశబ్ద ము కపార్థమేర్పడినది. అతనికి గీర్వాణము బలసిపోయినదనఁగా వానికి గర్వ మతిశయించినదను నర్థము స్ఫురించుచున్నది. ఎంతటి సద్వస్తువునైనను సద్విని యోగమునకుఁదేక దుర్వినియోగపఱచుచున్న యెడల దానికుండు సహజగౌర వముకూడ చెడుచుండుననుటకు పై విషయములను తార్కాణముగఁ జూప వచ్చును. కాబట్టి గ్రంథకర్త శబ్దమున కట్టియపార్థ మేర్పడినప్పుడు సారస్వత జీవనమునకు సంఘములో గౌరవ మెట్లేర్పడఁగలదు ?

## నవీనకాలమునందలి యభివృద్ధి

కనుకనే మనదేశములో నింతకుఁబూర్వము గ్రంథరచన యొకవృత్తిగాఁ బరిగణింపఁబడుచుండలేదు. అది సర్వప్రజలలో నొక్కటియనుమాట జన సామాన్యమునకుఁ దెలియకుండెను. ప్రస్తుతస్థితి యొకింత పరికింతము. బ్రిటిషు ప్రభుత్వము మనదేశమునకు లభించిననాటనుండి మనదేశములో ముద్రాయంత్ర ములు వెలసి ప్రాచీనాంధ్రగ్రంథము లనేకములు ముద్రింపఁబడి చౌకవెలకు వేనవేలు విక్రయింపఁబడు చున్నవి. వార్తాపత్రికలమూలమునను ఏటేటను ముద్రాయంత్రములనుండి వెలువడు గ్రంథములవలనను భాషాభివృద్ధి యగు చున్నది. స్వదేశోద్యమమువలన మనదేశమునకుఁగలిగిన లాభము భాషోజ్జీవన మని ముఖ్యముగాఁజెప్పఁదగును. సర్వకలాశాలాధికారులు దేశభాషలనుద్ధరింప నుదాసీనులై యున్నను దేశమున గ్రంథప్రచారమునకై యనేకసమాజములేర్పడి యేటేట బెక్కుగ్రంథముల నచ్చొత్తించుచు దేశమున వెదఁజల్లుచున్నవి. ఆంగ్లేయభాషావిశారదులైనవారు మాతృభాషపట్ల విముఖులుగాక యనేకు లిప్పుడు మాతృభాషాభిజ్ఞులై యత్యంతోత్సాహముతో మాతృభాషాసేవకై గడంగు చున్నారు. పల్లెంలో సైతము గ్రంథభాండాగారములు వెలయుచున్నవి.

## మార్పుకాలము

శాస్త్రగ్రంథములు, చరిత్రగ్రంథములు, నవలలు, నాటకములు ముద్రా యంత్రములనుండి వెలువడుచు నొకరీతిగా నమ్ముడువోవు కాలము వచ్చినది. ఇదియొక మార్పుకాలము. ఈ కాలస్థితినిజూచి యనేకు లాకర్షింపఁబడి గ్రంథ రచనకుఁబూనుకొని దానినే జీవనాధారమగువృత్తిగఁ జేకొనవలయునని సాహ సించి ముందుకు వచ్చుచుండుటచే భాషాప్రపంచమున నొక గొప్పకలవరము

జనించుచున్నది. దాని స్వరూపమిట్టిదని తెలిసికొనుట గ్రంథరచనకు దొరకొనం బూనిన ప్రతిమనుష్యుని కవశ్యకర్తవ్యమైయున్నది. గ్రంథ కర్తలకు మాత్రమే కాదు, దేశక్షేమము నభిలషించి సారస్వతాభివృద్ధికై పాటుపడుచున్నట్టి ప్రతిదేశాభిమానికిని కలవరస్వరూపమును దెలిసికొనుట విధియైయున్నది. ఈ కలవరమే వేఁడీ వ్యాసమును వ్రాయుటకు నన్నుఁ బ్రేరేపించుచున్నది.

## ఈ కాలమునందలి కవులు

వస్తుస్వరూపమును సరిగా గ్రహింపశక్తులులేక దురాశాబద్ధులై యనేకులు సరియైన భాషాజ్ఞానముగాని శిక్షగాని, లోకానుభవముగాని, యోర్పుగాని లేక గ్రంథకర్తలకుండు బాధ్యతలను గుర్తెఱుంగక, దుస్సాహసమునకుఁగూడ నొడిగట్టి, చేతకానిపనులకుఁ జేయిచాచి, తాము నష్టముఁబొందుటయేకాక తాఁజెడ్డకోతి వనమెల్లఁ జెఱిచినదన్నట్లు ప్రతిభాశాలులైన గ్రంథకర్తల ప్రయత్నములకుఁ గూడ నాశనమును గల్పించి, దేశమునకుఁ జేటువాటిల్లురీతి వర్తింపసమకట్టుట శోచనీయము. మనదేశములో నెవ్వఁడేని సమర్థుఁడొకఁ డొకవ్యాపారమునుజేసి, యా వ్యాపారమునకై నానాకష్టములుపడి సమర్థతతో దానిని నిర్వహించి కొంచెము లాభముబొందుట తటస్థమైనతోడనే యనేకు లదివరకు మాంద్యులై యుండియు, మఱియొకవృత్తికి దొరకొనక వానిపై పోటీకిబోయి, యా వ్యాపారమునే చేయనవలంబించి, తాము నష్టమునుబొందుటయేగాక, లాభమునుబొందుచున్న మొదటివానికి నష్టము గలిగించి, చెఱచుచుండుట మనము కన్నులారఁ జూచుచున్నారము. సారస్వతవిషయమునఁగూడ నిట్టిచందములేగానంబడుచున్నవి.

సారస్వతజీవనము కష్టసాధ్యము. మిక్కిలి పవిత్రవంతము. సుగుణాఢ్యులకు సులభసాధ్యము. దురాశాపాశబద్ధులకు దుస్సాధ్యము. నాల్గుపద్యము లల్లఁ గల్గినవాఁడు కవియు, నాల్గుపత్రములు గీకినవాఁడు గ్రంథకర్తయుఁ గాఁజాలఁడు. సత్కావ్యములను రచించువారు సత్కవులు. సత్కవుల సంవృత్తమును సంకుసాల నృసింహకవి కవికర్ణరసాయనమున నిట్లభివర్ణించియున్నాఁడు :

చ. మనమున నొన్న నెవ్వగలు మాన్పి ఘటింతు గకాండసమ్మదం
బనఘ కథాముఖంబున హితాహితబోధ మొనర్తు రింపుగా
గనుఁగొనుకంటె సద్వృత్తముగా నెఱిఁగింతు రతీంద్రియార్థముల్
ఘనమతు లెల్లవారికి సకారణబంధులుగారె సత్కవుల్.

ఇక్కాలమున నిట్టిసత్కవు లెక్కడనోగాని కానంబడరు. సత్కవులెట్టివారో సద్గ్రంథకర్తలు నట్టివారేయగుదురనుటకు సందియములేదు. నిష్కళంకమైన యోచన, సత్యమందనురాగము, కీర్తిప్రదమైనస్వేచ్ఛ వీనితో గూడి కొన్నదైనయెడల సారస్వతజీవనము తక్కినవానికన్న శ్రేష్ఠమైనదనుటకు లవమాత్రము సందియములేదు.

## గ్రంథకర్తలు

తనంతగ తా నొకపక్షమునకు మొగ్గనూహించినప్పుడు తక్క గ్రంథకర్త యెన్నఁడును నొకమనుష్యునకుఁగాని, యొకస్థలమునకుఁగాని, యొకపక్షమునకుఁగాని వశుఁడు కాఁజాలఁడు. గ్రంథకర్తకు జనసామాన్యమైనను రాజాధిరాజైనను నొక్కటియె. గ్రంథకర్త యనేకప్రజలను బరిపాలింప సమర్థతగలవాఁడు. అతని శక్తి మహత్తరమైనది, అప్రతిమానమైనది. కనుక సారస్వతజీవనము తక్కినవానికన్న నధికసంతోషకరమైనదిగానే నూహించెదను. అయినను గొందఱు నా యభిప్రాయముతో నేకీభవింపకపోవచ్చును. అట్టివారు సారస్వతజీవనము గలవారిలోనే పెక్కండ్రుకలరని నే నెఱుంగుదును. అగ్నిమాంద్యముచే కస్తిపడువారనఁగా మనోరథభగ్నులైన గ్రంథకర్తలు పెక్కండ్రుగలరు. ప్రచురణకర్తలకు ననేక సంవత్సరములవఱకు నొడఁబడికలు వ్రాయువారు శృంఖలములలో నృత్యములు సేయువారిపగిది దుఃఖభాజనులగుచున్నారు. సారస్వతజీవనమువలనఁ గలుగవలసిన యానందము గలుగనేరదు. ప్రచురణకర్తలు తమకృషికి నెంత ప్రతిఫలము నొసంగుదురోయని యనుదినమును తానువ్రాసిన కాగితములను లెక్కపెట్టుకొనుచుండు గ్రంథకర్త యెన్నఁడును సుఖ మనుభవింపఁజాలఁడు. జనప్రవాహమెట్లీడ్చిన నట్లు పోవుచు, నేఁడిచ్చట, రేపు వేఱొక్కచోట, నెల్లుండి మఱొక్కచోట స్తుతిపాఠములంగనుచు, తబ్బిబ్బులగుచు, అప్పటికానందమును బొందఁగోరు గ్రంథకర్త దేవతాప్రసాదమునకు దూరగుఁడై, తానెవ్వరితోఁగలసిమెలసి తిరుగదలంచెనో యట్టి గొప్పవారిచేతనే పరిత్యజింపఁబడి తుదకు కష్టకాలమునకు నసహాయుఁడై పరితప్తుఁడు గాక మానఁడు.

## శ్రీనాథుని యవసాన దశ

మహారాజులచెలిమిఁజేసి, బంగరుతూగుటుయ్యెలలో సూగుచు, హంసతూలికాతల్పంబులలో శయనింపుచుఁ బల్లకులలోనెక్కి యెల్లవేళల విహరించుచు, బమ్మెరపోతరాజుదారిద్ర్యమును బరిహసించిన కవిసార్వభౌముఁడు శ్రీనాథునివంటివాఁడుసైతము వార్ధక్యమునఁ గష్టపరంపరలపాలయిన విషయము శ్రీనాథకవికృతములైన

సీ. కవిరాజుకంఠంబుఁ గాఁగిలించెనుగదా
పురవీథి నెదురెండ పొగడదండ
సార్వభౌముని భుజా స్తంభమెక్కెనుగదా
నగరివాకిటనుండు నల్లగుండు
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబున
దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమొందెనుగదా వెదురుగొడియ

కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలుఁ బెసలు
బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు

సీ. కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబు లే రాయఁడిచ్చుఁ
గైలాసగిరిఁబంట మైలారవిభుఁడేగె
దినవెచ్చ మేరాజు దీర్పఁగలఁడు
రంభ గూడె తెనుంగురాయరాహుత్తుండు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁ డయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వనిపంక్తిఁ గలదు

భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగెఁ
గలియుగంబున నిఁక నుండఁ గష్టమనుచు
దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి.

అను పద్యములలోఁ దెలుపఁబడియుండెను.

రాబర్టు బరన్సు

ఇట్లే ప్రసిద్ధిఁగాంచిన "రాబర్టుబరన్సు" అను నాంగ్లేయకవి యౌవన కాలమున మిక్కిలి గౌరవించి శ్లాఘించుచుండెడి తన తొంటిమిత్రులు పేక్షాపరులై,

యొక్కరొక్కరే విడిచిపోవ, "నైదుపౌను" లప్పియవలసినదని యొక ప్రచురణ కర్తను బ్రార్థింపవలసివచ్చినది. తన యౌవనమునఁ దన్నుస్తుతించిన ధనాఢ్యులగు ప్రభువులందఱు నేమైరి? వారిసంబంధములు, వారికార్యములు నెఱవేరినంతవఱకె. కుక్షింభరణార్థము స్తోత్రప్రియులై ప్రభువులను, ధనాఢ్యులను బొగడుచుండెడి కవుల కెప్పటికి సారస్వతజీవనమువలనఁ గలిగెడి నిజమైనసౌఖ్యము గలుగనేరదు. కుక్షింభరణార్థము తన యమూల్యమైన స్వాతంత్ర్యామృతమును ధారవోసి, బానిసతనము నలంకరించుకొను గ్రంథకర్తకు నిజమైన సౌఖ్యమెట్లు లభించును? మఱికొందఱు గ్రంథకర్తలు కుక్షింభరణార్థము తమ కృతినాథుల సంతోషపెట్టుటకై యోగ్యులైన సత్కవులెన్నడును, వినరాని కనరాని క్షుద్ర విషయములకుదిగి తమ శక్తులను భ్రష్టపఱచుకొనుచున్నారు.

## గ్రంథకర్త కష్టములు

ఇట్టివారి విషయ మటుండనిచ్చి, సారస్వతము జీవనముగాఁజేసికొన్న సద్గ్రంథకర్తలకు కష్టములులేవాయని యడుగవచ్చును. గ్రంథకర్తలకు ఆశాభంగములు, నిరుత్సాహములు, కష్టములు లేకయున్నయెడల వారు ఆనందము యొక్క విలువనెట్లు తెలిసికొననగును? సుస్థిరచిత్తుఁడైన గ్రంథకర్త ఫలసిద్ధిని గోరువాఁడగునేనియెన్నఁడు నాశాభంగములకు, నిరుత్సాహములకు, నాటంకములకు భయపడి వెనుదీయఁడు. అతఁడు వానినే విజయకారణములుగాఁ జేసికొనఁ జూచును. సారస్వతమునకు సేవఁజేయఁబూనిన నిజమైన గ్రంథకర్త యుత్కృష్టాదర్శములను గలిగియుండు భాగ్యము వహించియుండెనేని సౌఖ్యప్రదము లయిన వస్తువులను వ్యర్థవ్యయములను దాంభికత్వమును విడిచి సులభజీవనమున కలవాటుపడి, తృప్తిఁగాంచియుండును. పుష్టికరమైన భోజనము మెదటికి చుఱుకుఁబుట్టింపఁ జాలదు. ప్రతిభాశాలి లక్షాధికారిగఁ బుట్టియుండలేదు. అసూయాపిశాచగ్రస్తులగు కువిమర్శకులవలన గ్రంథకర్తలకు మనస్తాపములు కలుగుచుండను. గొప్పతనమునుగోరి ముందుకు సాగివచ్చు ప్రతిగ్రంథకర్తకు నిట్టిపీడ కలుగుచునేయుండును.

## నిజమైన గ్రంథకర్త

కాని ప్రతిభాశాలియైన గ్రంథకర్త యెన్నడును నిరుత్సాహమునుజెందక, పట్టుదలయు, సభినివేశమునుగలిగి నిరంతరకృషిచే నట్టి శత్రువులకందనివాఁడై యున్నతస్థానమునుజేరి పరమానందమును బడయుచుండును. సత్యానురక్తి ఆత్మ

గౌరవము, ఆత్మవిశ్వాసము, ఆత్మశిక్ష, జితేంద్రియత్వము, నిరంతరపరిశ్రమ, అభినివేశము, సాహసము, ధైర్యము గలిగియుండునట్టి ప్రతిభాశాలియైన గ్రంథకర్త పామరజనానురాగమునకై యుత్తమగుణములను గోల్పోవఁజూడఁడు. ప్రపంచమును దనవెంట నీడ్చుకొనిపోవఁజూచునుకాని ప్రపంచమువెంటఁ దాను బఱుగిడఁజూడఁడు. ఇట్టి శక్తులు లేనివాఁడు గ్రంథరచనకు దిగరాదు. దిగినను నిష్ప్రయోజనము.

క. నేరిచిన సుకవి కృతిచేఁ
బే రెఱిఁగించుకొని జగతిఁబెంపగు టొప్పున్
నేరకకృతిఁ జెప్పుట దన
నేరమి యపకీర్తి జగతి నిలుపుట గాదే.

క. ఏరసముఁ జెప్పఁ బూనిన
నారస మాలించువారి కడరింపని యా
నీరసపుఁ గావ్యశవముల
దూరముననె పరిహరింపుదురు నీతిజ్ఞుల్.

చ. ఫణితులు రెంట మూఁట నొకపద్యము గూరుచువారు లక్ష్యల
క్షణ సహకావ్యనిర్వహత గల్గుట చిత్రము గానియట్లపో
ఫణిమణిమాత్రధారులగుపాము లసంఖ్యము గాక తత్ఫణా
మణివిధ విశ్వభూభృతిసమర్థుఁడు శేషుఁడు గాక కల్గునే.

అని పై పద్యములలోఁ గవికర్తరసాయనకవ్యకర్త విస్పష్టములగు వాక్కులతోఁ బ్రతివాఁడును గ్రంథరచనమునకు దిగరాదని సూచించియున్నాఁడు.

"Valuable energy is wasted by being misdirected. Men are constantly attempting without special aptitude, is indispensable." అని జార్జిహెన్రీలూయిస్ వక్కాణించుచున్నాఁడు. అన్నిఁటికంటెను సారస్వతజీవన ముత్కృష్టమైనదనుటకు సందియము లేదు. ప్రతిభాశాలియైన గ్రంథకర్త యొక్కఁడుమాత్రమే కష్టపరంపరలనుండి తప్పించుకొని, సానంబట్టిన మణివలెఁ బ్రకాశింపఁగలఁడుగాన ప్రతిభాశాలురుమాత్రమే సారస్వతమును స్వతంత్రజీవనముగఁ జేసికొనఁదగియుందురుగాని యే విధమైన విద్యాశిక్షణమునులేక యమ్మకూటములు తేరగనున్నవికదాయని పాడుపొత్తములు రచించి ముద్రణము గావించి యదియొక జీవనోపాధిగఁజేసికొనఁ గోరువారు తుదకు నష్టమును బొంద

గలుగుదురేకాని లాభమును బడయఁజాలరు. ఎల్లవారును సద్గ్రంథకర్తలఁ బ్రోత్సాహపఱుచుచు నసద్గ్రంథకర్తల నిరుత్సాహపఱుచుచు నాంధ్రసారస్వతము పరిశుద్ధమైన దానినిగఁ జేయుట విధ్యుక్తధర్మమని వేఱుగ నేఁ జెప్పనక్కరలేదు.

## మనము చేయవలసిన పని

ఆంధ్రసారస్వతము బెక్కువిధముల నేఁ డభివృద్ధిగాంచుచున్నను, సంస్కార మభిలషించుచున్నది. నేటికాలమున వందలకొలఁదినవలలు ముద్రింపఁబడుచున్నను గొన్నిటి మృదుమధురమైన శైలి మృగ్యమగుచున్నది. మన యాంధ్రులలోఁ బ్రతిభాశాలురైన మేధావులు కొందఱాంధ్రసారస్వతమును జీవనాధారముగఁ జేసికొని సంఘమున కత్యావశ్యకములును, ఆరోగ్యప్రదములునగు గ్రంథసముదాయము నర్జింపఁ జేయవలసియున్నది. అట్టి ప్రతిభాశాలురు బయల్వెడలిన యెడల దేశాభిమానులెల్లరును వారికి సర్వవిధములఁ దోడ్పడి, యాంధ్ర సారస్వత మున్నతస్థితికివచ్చునట్టులను జేయుటయగాక సారస్వతజీవనముగూడఁ బవిత్రమైనదనియు, నత్యావశ్యకమైనదనియుఁ, బ్రోత్సాహపఱుపఁదగినదనియు నాంధ్రలోకము గ్రహించునట్లు కృషిసల్పుట మనకెల్లరకు ముఖ్యకర్తవ్యము.

—చిలుకూరి వీరభద్రరావు*

*గ్రంథాలయ సర్వస్వము, 1916. ప్రథమ సంపుటము-ప్రథమ సంచిక.

# ఆంధ్రభాష

"స్వస్థానవేషభాషాభిమతాస్సంతోరసప్రలుబ్ధధియః,
లోకే బహుమన్యంతే వైకృతకావ్యాని చాన్యదపహాయ"

అను సూక్తి చొప్పున నెల్లవారికిని స్వకీయవేషభాషలం దభిమానము వెలయుచుండుట స్వాభావికమె. అభిమాన మెంతయున్న నేమి? దేశీయుల సామర్థ్యాదులనుబట్టి గదా భాషయు నభివృద్ధిని గాంచుచుండును: దేశీయు లసమర్థులయి యుండునపుడు వారి యభిమానము దేశభాషలకేమి యుపకారము చేయగలుగును? దేశీయులు సుస్థితిలేక పరచక్రాది భయముచేతను దారిద్ర్యాదులచేతను పీడితులగుచున్నపుడు వారివలన దేశభాషలకేమి యుపకారము సంభవించును? కాబట్టి సర్వవిధముల చేతను దేశాభివృద్ధియే భాషాభివృద్ధికి మూలకారణమని చెప్పుటకు సందేహము లేదు.

(దేశభాషలకును, సంస్కృతమునకును నాంగ్లకళాశాలలందు గొంత ప్రాధాన్యము నిచ్చియు 'విద్వాన్' 'శిరోమణి' మొదలగు పరీక్షలను ప్రత్యేకముగా నియమించియు, నాంగ్లప్రభువులు గొంతవఱకుఁ బ్రోత్సాహము నిచ్చుచున్నారు.) ఆంగ్లేయభాషయం దాఱితేఱిన మనవారు పాశ్చాత్యుల నాగరికతను మనభాషా వాఙ్మయములకుఁ గొంతవఱకుఁ జవిచూపుచున్నారు. దేశభాషామయములగు గ్రంథమాలలు, పత్రికలును బయలువెడలి భాషావాఙ్మయములను బోషించుచున్నవి. ముద్రణాలయములు వ్యాపించి వాఙ్మయాభివృద్ధికిఁ దోడ్పడుచున్నవి.

అట్లయినను దురదృష్టవశమున మనవారు తమకుఁ గల యుత్సాహమునకుఁ దగినట్లు మంచి యత్నములను జేయకున్నారు. కొన్ని విషయములందుఁ జేయఁజాలకున్నారు. పత్రికాధిపతులు తగిన పండితులను సంపాదించి భాషావాఙ్మయ విమర్శనములను వృద్ధిచేయకున్నారు. అత్యుత్తమభాషతోఁ దమ పత్రికలను వ్రాయకయు, భాషాపోషక విషయముల కధికముగాఁ బత్రికలయందుఁ జోటీయకయు, నేవోకొన్ని విషయములను నేదో యొక విధమయిన భాషతో నింపుచున్నారు. ఇఁక గ్రంథకర్తలు తగిన భాషాజ్ఞానమును సంపా

డింపకయె గ్రంథరచనమునకుఁదలపడుచున్నారు. ఇందులకుఁదగినకారణము లేకపోలేదు. దేశభాషలు రాజభాషలు కానందున నున్నతపదవులు నందుటకుఁగాని ధనసంపాదనముచేయుటకుఁగాని సహాయకారులు కాజాలకున్నవి కావుననే సామాన్యముగా బుద్ధిమంతులెల్ల నాంగ్లేయభాషాభ్యాసముతోడనె తమ విద్యాభ్యాస కాలమునెల్ల వినియోగించుచున్నారు. హైస్కూలులందును, కళాశాలలందును విద్యార్థు లుపాధ్యాయులు చెప్పు పాఠములు సరిగా వినకున్నను, నెక్కువ శ్రద్ధతోఁ బరిశ్రమ చేయకున్నను నుత్తీర్ణు లగుచున్నారు. హైస్కూలు క్లాసులలో దేశభాషల మార్కు లెట్లున్నను పైక్లాసులలోఁ జేర్చుకొనుచున్నారు. ఇఁక బాలుర కెట్లీ విషయమున శ్రద్ధగలుగును? విద్య రావలసిన కాలములో నీ రీతిగా జదివి ఇంగ్లీషు భాషలోఁ గృతప్రతిష్ఠులైన పిమ్మటఁ గొందఱు హూణభాషాభ్యాసమునఁ గలిగిన నాగరికతా విశేషమున దేశభాషాభివృద్ధికి యత్నించియు దేశభాషాజ్ఞానము సంపాదింపఁ బ్రయత్నించియు సఫలమనోరథులు కాఁజాలకున్నారు. కొందరట్టి సామాన్య జ్ఞానముతోడనే గ్రంథరచనకుఁ దలఁపడి తమకును భాషకును నెన్నో లేనిపోని చిక్కులను గల్గించుకొనుచున్నారు. ఇఁక నాంగ్లభాషాజ్ఞానములేని కేవల పండితులలో ననేకు లుదర పోషణ వ్యాపారముతోడనె కాలమునెల్లఁ గోలుపోవుచు దేశభాషా పరిశ్రమమును బూర్తిగాఁ జేయఁజాలక యేదోకొంత జ్ఞానమును సంపాదించి యంతతోనె కృతకృత్యుల మయితిమని తలచుచున్నారు. ఇట్టివారు నూతనమార్గములను ద్రొక్కుట యటుండఁగాఁ బ్రాచీనుల గ్రంథములను బూర్తిగా నర్థము చేసికొనుటయె దుర్లభమగుచున్నది. వీరికి వ్యవహార భ్రష్టమగు సంస్కృతభాషయందుఁ గొంత పరిచయముండుట గలదు; గాని వీరు సంస్కృతమువలెనె యప్పటి దేశభాషలుగూడఁ జిరకాలము క్రిందట వ్రాయబడిన వ్యాకరణములను లొంగియుండక తీఱదని తలంచుచు నట్లుండని ప్రాచీనకవి ప్రయోగములను సవరించి వారి మర్యాదను గాపాడఁగోరుచున్నారు. ఇది మిక్కిలి శోచనీయము. వ్యాకరణములకు నాధారములగు కవిప్రయోగములు వ్యాకరణములకు లొంగకుండుటలో వింతయేమున్నది. వైయాకరణులు తమకు స్ఫురించినవి మాత్రమె సంగ్రహించియుందురు. అంతమాత్రమున నట్టి దుర్బల వ్యాకరణములను బట్టి కవిప్రయోగములు దిద్దుటకంటె నన్యాయము వేఱే మున్నది! ఇట్లు దిద్దివేయుచుండుట మన తెలుఁగు వారిలో నప్పకవి నాఁటికె వ్యాపించి యున్నదని యీ క్రింది యప్పకవీయ పద్యమె చెప్పుచున్నది.

ఉ. నన్నయ ముఖ్య సత్కవి జనంబుల కావ్యములందు లేఖకుల్
గొన్నియుఁ బాఠకాధములు గొన్నియుఁ బోకడపెట్టి తక్కువై
యున్నెడఁ జూచి జానపదు లోడక దిద్దిన తప్పుత్రోవ లె
ల్లన్నిజ మంచుఁ గైకొనిన లక్షణవేత్తలు సమ్మతింతురే!

దురదృష్టవశమున మనవారు చిరకాలమునుండి పైరీతి నాంధ్రమహాకవుల కావ్యములను దమతమ వ్యాకరణ జ్ఞానమునుబట్టి దిద్దివేసి నిజమయిన కవిప్రయోగము లెవ్వియో లోకమునకుఁ దెలియకుండునట్లు చేసిరని చెప్పుట కెంతయు విచారించుచున్నాను. ఈరీతి నొక్కొక్క కాలమున నొక్కొక్క వ్యాకరణము బయలు దేరుటయు, నాయా కాలములకుఁ బ్రసిద్ధములయియున్న మహాకవుల కావ్యములు తత్తద్వ్యాకరణానుసారముగా దిద్దివేయఁబడుచుండుటయు జరుగుచు వచ్చినందునఁ బ్రాచీన మహాకవుల కావ్యము లొక్కొక్కటి పెక్కురూపములతో వెలయుచుండుట సంభవించినది. పై విషయము చదువరుల హృదయమున నెలకొల్పుటకయి యొక్క యుదాహరణము మాత్ర మిచ్చుచున్నాను.

"ఒనర నింపునించు ననియెడు వీనిపై"

అని యిట్లు విన్నకోట పెద్దన ధాతువులకుఁ జువర్ణాంతతయుఁ బువర్ణాంతతయు నంగీకరించి

క. కోపింపుట కోపించుట
కాపింపుట పసులనొప్పఁ గాపించుట నా
నేపారునట్టి పలుకులు
లోపుగా బహుళములు జగతిలో నెఱుఁగఁగన్

అని యుదాహరించి యున్నాఁడు. క్రమక్రమముగ వైయాకరణులలోఁ గొందఱు పువర్ణాంతత్వము ధాతువుల కంగీకరింప లేదు గాని కొన్ని రూపము లందు మాత్రమే పత్వము నిత్యమని యంగీకరించిరి.

"అనుబంధ ప్రార్థన యోర్ద్వావ్యతిరేకాది వచోః పస్యాత్"

అను నాంధ్రశబ్ద చింతామణి సూత్రమునకు వ్యాఖ్యానము చేయునప్పు డహోబల పండితుఁడు "నుతి స్త్రీ యాం క్తిన్" ఇతి ష ము ఖ ప్రత్యయః ప్రాప్తిమానార్థ వివక్షయావసతి రనుబంధకః, ఇంచుగాగమః, పాదేశః, చురితిక్రియాపదానామితి చుః—కార్థ ఇత్యాది వక్ష్యమాణ సూత్రేణపుక్, అనక్త న్యాయేన

సానునాసికోచ్చారణం జీత్'' మతింపుచున్నాఁడు. పోషింపుచున్నాఁడు (అహోబలు పండితీయము-463 పేజీ) అని యుదాహరించి యున్నాఁడు. దీనిని బట్టి మనవారు చెప్పుచున్నట్లు "నుతిస్తున్నాఁడు" అనునది యొక్కటియే గ్రామ్యముకాక "నుతించు చున్నాఁడు" అను బాలవ్యాకరణ సిద్ధ రూపము పైతము గ్రామ్యమెయని చెప్పక తప్పదు గదా!

పై రీతిని ప్రాచీనవైయాకరణులు వ్రాసియుండుటచేఁ గావలయు సామాన్యముగాఁ బ్రాచీన తాళపత్ర గ్రంథములందు వర్తమానార్థక రూపములం దెల్లఁ బత్వరూపమును దఱచుగా వ్రాయఁబడీ యున్నది. సర్వలక్షణసార సంగ్రహమునఁ గూచిమంచి తిమ్మకవి యీ విషయమును గుఱించి వ్రాయునపుడు "కావింపుట కావించుట, భావింపుట మఱియు దీని భావించుటనన్, గావెలయుఁ గృతులఁ దుహినగ్రావసుతా ప్రాణనాథ ప్రమథసనాథా!" అని వ్రాసి పత్వ రూపము సామాన్యముగా నాంధ్రవాఙ్మయమునం దెల్ల నగపడు చుండుటచే "కావింపుటకు సుఃఖమే కావించుటకు'' అని యిట్లు ప్రసిద్ధమగు పత్వరూపమున కుదాహరణము మాని క్వాచిత్కమగు పత్వాభావ రూపమునకె కవిప్రయోగములం జూపియున్నాఁడు. ప్రకృతమునందన్నవో యియ్యది కేవలము విపరీతమయి యున్నది. ముద్రితములగు నిప్పటి యాంధ్ర గ్రంథములం దెక్కడను వర్తమానార్థక రూపములందుఁ బత్వము మచ్చునకైనఁ గానరాదు. కావుననె బహుజనపల్లి సీతారామాచార్యుల వారెట్టెటో శ్రమపడి వెదకి వెదకి పత్వరూపమునకు శబ్దార్థము నందు రెండుదాహరణములను మాత్రము సంపాదించి యందుఁ బత్వ మ్ముండవచ్చునని ప్రౌఢవ్యాకరణము నందు సూత్రించి యున్నారు. ఇట్టి వైపరీత్యము సంభవించుటకు సూరిగారి బాలవ్యాకరణమును, గవిప్రయోగములను దిద్ద వేయుటలో మనవారికిఁగల సాహసమును మూలకందములని చెప్పుటకు సందేహము లేదు గదా!

''అగమాన్య చకారముల కద్విరుక్తములకు ముత్తు పరమగు నపుడు పవలగు'' (బాల-క్రియా-58 సూ.) అను సూత్రముచే వర్తమానార్థమునఁ బత్వము రాకుండుటయేగదా పయి నుదాహరించిన వైపరీత్యమునకు ప్రధాన కారణము! పాపము, సూరిగారి వ్యాకరణమేమో ప్రాచీన వ్యాకరణ సమ్మత మనుకొని మనవారిట్టి సాహసమునకు దొరకొనిరి; కాని యాయన నిబంధనములు వేఱుగ నున్నవని గ్రహింపఁ జాలరైరి. "నుతించు చున్నాఁడు" అనునది యాంధ్రశబ్ద చింతామణి చొప్పున గ్రామ్యమని మనవారెఱుంగరు గదా, అట్లెఱింగినను నిట్టి వైపరీత్యము పుట్టకుండును.

విచక్షణులారా! చూచితిరా వ్యాకరణముల మాహాత్మ్యము! అయ్యో, కారణాంతరములచేతను, లోకవ్యవహారముచేతను వ్యాకరణములు మాఱుచుండ వానితోపాటుగఁ బ్రాచీన మహాకవి ప్రయోగములును మాఱుచుండ వలయునా? ప్రాచీనాంధ్రము నవీనాంధ్రమునను భేదములేక యాంధ్రభాష నన్నయ నాఁటి నుండి నేఁటి వఱకు నొక్కరీతినే యున్నదను నపసిద్ధాంతము మనస్సులందు మనవారికి గాఢముగా నాటుకొని యుండుటచేఁగదా పయిరీతిని మనవారు ప్రాచీన మహాకవి ప్రయోగములను సవరించుటకు సాహసించిరి. మీఁదు మిక్కిలి యిప్పటి కవులు కొందఱు వ్యవహార వశమున భాషలోఁ బ్రవేశించిన యుత్తమములగు ననేక పదములను దమ గ్రంథములందుఁ బ్రయోగించియు, మొన్నమొన్నటి వరకు నాలుగైదు ముద్రణముల వఱకు నట్లె యుంచియు, ఇటీవలి గ్రామ్య వాదపు గందరగోళముతోఁ దమ గ్రంథములెల్లఁ దప్పులని యొప్పుకొని యిప్పు డిప్పుడు మరలఁ దమ గ్రంథములలోని యట్టి పదములను దీసివేసి బాలవ్యాకరణముతో సరిపెట్టుకొనుచున్నారు. పరిశీలింపఁగా వ్యవహారముననున్న పదములలోఁ గవుల కామోదమును గల్పింపఁజాలిన పదముల కసాధుత్వ మెట్లు సంభవించును? ఆరయ నరయ వ్యాకరణ కోశాది మాత్ర ప్రసిద్ధములగు నట్టి ప్రాచీనాంధ్ర పదములకన్న నీ యుత్తమ వ్యావహారిక పదములే యుత్కృష్టములని గ్రహింపవలసి యున్నది. అదృష్టవశమున మనవారు పట్టలేదుగాని పద విషయమునఁ బట్టిన యీ పట్టుదల నర్థవిషయమునందును వాక్యరచనావిషయము నందును బట్టినచో నిఁక గ్రంథముల మాట యటుండఁగా నోరు మెదపుటకైన నవకాశము లేకపోవునుగదా!

వఝ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి*

* గ్రంథాలయ సర్వస్వము. ద్వితీయ సంపుటము. ప్రథమ సంచిక.

# భారత భాషకును నేటి గ్రాంథిక భాషకును భేదము

వ్యావహారికభాషకును, గ్రాంథికభాషకును పరస్పర వైషమ్యము కలిగి, దెబ్బలాడుకొనుచుండే ఈ కాలములో ఉభయ పక్షాలవారూ తమపక్షమే బలము గలదని నమ్ముకొనుచున్నారు. కాని, వాదము విషయమై ఎంత దెబ్బలాడుకొను చున్నా, ఉభయపక్షముల వారికి భారతమే ప్రమాణమై ఉన్నది. నన్నయభట్టు గారి భారతము ౧౧వ శతాబ్దములో ఉండే వ్యవహారభాష ననుసరించి వ్రాయ బడ్డా, నన్నయభట్టుగారు భాషను శాసించివేసినారనీ, అప్పటినుండీ భాష మరి మారలేదనీ, కాబట్టి భారతము ఏ భాషలో వ్రాయబడ్డదో ఆ భాషే మనకు ప్రమాణమనీ, ఆ భాషలోనే గ్రంథాలు వ్రాయవలెననీ గ్రాంథికవాదుల ఉద్దేశము. నన్నయభట్టుగారి భారతము ఆ కాలములో వ్యావహారిక భాషలో వ్రాయ బడడమేకాక, తరువాత కవులందరూ వ్యవహారము ననుసరించి భాష మార్చు కొనుచు వచ్చిరనీ, నేటి గ్రాంథిక భాషకూ నన్నయభట్టుగారి గ్రాంథికభాషకూ చాలా వ్యత్యాసము ఉన్నదనీ, వ్యావహారిక భాషకు సమీపముగా ఉన్న గ్రంథాలే జనసామాన్యముచే ఆదరింపబడుచుండుననీ, కాబట్టి వ్యావహారికభాష లోనే గ్రంథాలు వ్రాయవలెననీ, వ్యావహారిక భాషావాదుల ఉద్దేశము. నన్నయ భట్టుగారి ఆంధ్ర శబ్ద చింతామణి భాషనంతా శాసించునని మొదటివారందురు. నన్నయభట్టుగా రాంధ్రశబ్ద చింతామణి వ్రాయనేలేదనీ, నన్నయభట్టీయములో శాసింపబడని ప్రయోగాలు వేలకువేలు ఇతర కవుల గ్రంథాలలో ఉన్నవనీ, రెండవారి మతము. ఈ వాదాలన్నీ అలాగు ఉంచి, నిజముగా భారతభాషకూ ఇప్పటి గ్రాంథిక భాషకూ భేదము ఉన్నదా లేదా అన్న సంగతి ఆలోచింతము.

అయితే, ఇక్కడ పెద్ద చిక్కొకటి ఉన్నది. భారతము - భారతము అని అందరూ పెద్దపెద్ద కబురులు చెప్పెదరు. కాని, నిజముగా నన్నయభట్టు గారి భారతము ఇది. వాగనుశాసనుడి మతము ఇది అని చెప్పగలిగే భారతము నాకొకటీ కనుపడలేదు. అచ్చు పుస్తకములు నెల్లూరి ప్రాంతాలలో ఉండే తాళగ్రంథాల ననుసరించి, చిన్నయసూరిగారి మతాన దిద్దివేసి సంపాదకులు అచ్చువేసినారు. ఇక మరో విరుద్ధమైన మార్పు ఉన్నది. మా తాతగారి తండ్రి

గారు కామకవిగారు గొప్ప విద్వత్కవులు. వారు భారతము స్వయముగా వ్రాసుకొన్నారు. కాని, అచ్చుపడ్డ భారతానికీ, వారి ప్రతికీ ఎంతో తేడా ఉన్నది. వారు విద్వాంసులు గనుక వారి యిష్టానుసారము వారు దిద్దివేసినారు. వారి ప్రతి చూచి వారి శిష్యులూ, స్నేహితులూ ప్రతులు వ్రాసుకొన్నారు. కాబట్టి పాలతేరు ప్రాంతాలలో దొరికే తాటాకు పుస్తకాలన్నీ కామయ్యగారి మతము అనుసరించే ఉన్నవి. ఇందుచేత మన కో నీతి బోధపడుచున్నది. పండితులు వ్రాసుకొన్న పుస్తకాలు నన్నయభట్టుగారి మతము నిజముగా తెలియజేయవని. కాబట్టి నేను బహుప్రయాసముతో విద్వాంసుడు కానివాడొకడు వ్రాసుకొన్న గ్రంథము సంపాదించినాను. ఇది నూరేండ్లకు పూర్వము వ్రాయబడ్డది. దీనిలో లేఖక ప్రమాదాలు విడిచిపెట్టి తక్కిన భాగాలు చూచితే అచ్చు పుస్తకాలలో పాఠాలకన్న సరసమైన పాఠాలు కనిపించును. లేఖకుడు సంస్కారికాడు గనుక సంస్కర్తకూడా కాలేదు.

ఇక, అచ్చుపుస్తకాలకూ ఈ తాళగ్రంథానికీ భేదము కొంచెముచూతము. ఈ తాళగ్రంథములో వచనభాగమంతా అచ్చు పుస్తకములో వచనభాగము కంటె చాలా భిన్నముగా ఉన్నది. కొన్నిచోట్ల కలియనే కలియదు. అచ్చు పుస్తకములో ఉండే కొన్ని పద్యాలు వ్రాత పుస్తకములో కనుపడవు వ్రాత పుస్తకములో ఉండే పద్యాలు కొన్ని అచ్చు పుస్తకములో కనుపడవు. కొన్ని పద్యాలు సగము సగము భేదముగా ఉన్నవి. కొన్ని పద్యాలలో కొన్ని కొన్ని శబ్దాలు మాత్రమే భేదించును. దాఖలాలు కొంచెము చూపెదను.

౧. అచ్చు : అనవరత మహామహీ రాజ్యసుఖంబు లనుభవించుచు.
వ్రాత : అనవరతంబును మహారాజ్య సుఖంబు లనుభవింపుచుండి.

౨. అచ్చు : మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానానంత సామంత విలాసినీ పరివృతుండై.
వ్రాత : సేనాపతి దండనాయక మహాప్రధానానంత సామంత సీమంతినీ పరివృతుండై.

౩. అచ్చు : వివిధతర్కవిగాహిత సమస్తశాస్త్రసాగరగరీయ ప్రతిభులైన తార్కికులును.
వ్రాత : వివిధవితర్కితగాహిత సమస్తశాస్త్ర ప్రౌఢసార గరీయ ప్రవీణులైన తార్కికులును.

౪. అచ్చు: విద్యావిలాసగోష్ఠి సుఖోపవిష్టుడైయిష్టకథావినోదంబులనుండి.

వ్రాత : విద్యావిలాసుండును, సుఖోపవిష్టుండునై యిష్టనైష్టిక వినోదంబుల నుండి.

ఈ పై భేదాలన్నీ ఒక్క చిన్న వచనములోనే ఉన్నవి. ఇక, పద్యాలలో భేదాలు చూడండి.

౧. అచ్చు : అమలిన తారకా సముదయంబుల నెన్నను.

వ్రాత : అమరనదీసుతా సముదయంబుల నెన్నను.

౨. అచ్చు : దానములను బహువిధక్రతుహంత జప
బ్రహ్మచర్యములను బడయబడిన
పుణ్యఫలము వడయబోలు నశేషపా
పక్షయంబునకు శుభంబు పెరుగు.

వ్రాత : దానఫలములను బహువిధక్రతువుల
బ్రహ్మచర్యవ్రతమునను బడయబడిన
పుణ్యఫలముల బడయుచో భువి నశేష
పాపహరమగు బ్రజకు శుభంబు పెరుగు.

అచ్చు : భానుప్రభులగు పాండుమ
హీనాథాత్మజుల లక్ష్మియెల్లను నీకున్
నేనపహరింతు నిపుడు ధ
రానుత.......

(పై పద్య మొక్కటియే నన్నయభట్టారకుడు 'నేను' అను సర్వనామ ముపయోగించె ననువారి వాదమున కాధారమైయున్నది.)

వ్రాత : భానుప్రభులగు పాండు మ
హీనాథాత్మజుల లక్ష్మియెల్లను దగ నీ
కే నపహరింతు నిపుడు ధ
రానుత......

(ఈ పాఠమున 'ఏను' అనియే యున్నదిగాని, 'నేను' అనిలేదు. నన్నయభట్టు 'ఏను' అను రూపమేగాని, 'నేను' అను రూపము నుపయోగింప లేదని మా సిద్ధాంతము.)

అచ్చు : గురుకులమునందు గురులకు
పరిచర్యలొనర్చి తా నపరిమిత నిష్ఠ

వ్రాత : గురుకులమునందు గురులకు
పరిచర్య లొనర్చుచున్న పరిమిత నిష్ఠ

(ఇందు 'లుక్సంశ్లేషౌ నాచిద్రుతస్య' యను సూత్రమునకు విరోధముగా సంశ్లేషము ద్రుతమునకు గనుపట్టుచున్నదని సంపాదకు లచ్చులో దిద్ది యుందురు. అది నిజమేని 'అన్నిష్టసఖి', 'అన్నేటి తరగతులు', 'ఎన్నదు స్నేని' అను పాఠము లేల దిద్దలేదో!)

ఇట్టి భేదము లెన్నో కలవు. ఇక, సరసములైన పాఠాలు చూడండి.

౧. అచ్చు : తగునిది తగదని ఎదలో వగవక

వ్రాత : తగునని తగదని ఎదలో వగవక

(ఇందు అచ్చు పాఠములో రెండు క్రియలకు ఏకకర్తృవాక్య మన్వయింపవలసి ఉన్నది. వ్రాత పాఠములో ఆ లోపము లేదు.)

౨. అచ్చు : కృతభోజనుండవై పొమ్మని క్షణియించిన నొడంబడి

వ్రాత : కృతభోజనుండవై పొమ్మని క్షణంబిచ్చిన నొడంబడి

(ఇందు 'క్షణియించుట' అనే ధాతువు "నిమంత్రణము చేయుట" అనే అర్థమును ఉపయోగింప బడదు. కాని, సంస్కృతములో కూడ 'క్షణం'దత్వా అని నామరూపమే ఉపయోగింపబడు చున్నది. కాబట్టి 'క్షణయించిన' అనే పాఠము కన్న 'క్షణంబిచ్చి' అనే పాఠమే సరసముగా ఉన్నది.)

౩. అచ్చు : కుండలమ్ము వేగ గొనిరమ్మని నాలవ నాటికినని
పూని నన్ను బనిచె, గురుపత్ని నేడ యక్కుం
డలంబులు దొడ్డు దివస మీదివస మతిక్రమింప.

వ్రాత : కుండలమ్ము వేగ గొనిరమ్ము నాలవు నాటికనని పూ
ని నన్ను బనిచె గురుపత్ని నేడ యక్కోమని కడ కేగు
దివస మీదివస మతిక్రమింప.

(ఇందులో అచ్చుపాఠముకన్న వ్రాతపాఠము ఎంత సరసముగా ఉన్నదో చూడండి. అచ్చుపాఠములో మూడు లోపాలు ఉన్నవి.

(*a*) 'నాల్గవ నాటికి' అని ఉన్నది. 'మూడవు', 'నాలవు' అని అవు శబ్దముతో నన్నయభట్టు ఎప్పుడూ ప్రయోగించడము సంప్రదాయము. కాబట్టి అచ్చులో ఉన్న 'నాలవ' అనే తప్పు. వ్రాతలో ఉన్న 'నాలవు' అనేది ఒప్పు.

(*b*) 'నేడ యక్కుండలంబులు దొడ్గు దివసము'ఇందు, ఉతంకుని నాలుగవనాటికి రమ్మని గురుపత్ని సెలవిచ్చినది. కాని, తాను కుండలము లెప్పుడు తొడుగుకొనునో ఆ సంగతి చెప్పలేదు. కాబట్టి, 'నేడ యక్కుండలంబులు దొడ్గు దివసము' అని ఉతంకుడు చెప్పడము స్వభావ విరుద్ధము. కాబట్టి, వ్రాత పుస్తకములో ఉన్న 'నేడ యక్కోమలి కడ కేగు దివసము' అనే పాఠమే సరస మైనది.

(*c*)'తొడ్గు' అనే క్లిష్టపదము అచ్చుపాఠములో కలదు. వ్రాతపాఠములో అది లేదు.)

౪. అచ్చు : శ్రీమహాభారతంబు నందలి యభిప్రాయంబు విన
నభిలాష పెద్దయై యుండు.

వ్రాత : శ్రీమహాభారతంబునందుల యభిప్రాయంబు తద్ద
యుం గలిగి యుండు.

ఆంధ్రశబ్ద చింతామణిలోని "జేరలిచ" అనే సూత్రానికి భారతములో (నన్నయ భాగములో) పద్యాలలో ఉదాహరణ కనుపడదు. కాబట్టి "అందలి" అనే అచ్చు పాఠము తప్పు. "అందుల" అనే వ్రాతపాఠము ఒప్పు. ఇక, "మహా భారతంబు నందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయై యుండు" అనే దానికన్న 'మహాభారతంబు నందుల యభిప్రాయంబు తద్దయుం గలిగియుండు.' అనేది యెంత సరసమైన అర్థమిచ్చుచున్నదో ఆలోచించండి.

౫. అచ్చు : చిత్ర లలిత గతి నొప్పు నేనూరు గాడిదలును సింధు

వ్రాత : చిత్ర లలిత గతినొప్పు నేనూరు గాడిలు సింధుజ

ఇందు గాడీలు అనే శబ్దము పూండ్ల రామకృష్ణయ్య పంతులు మొదలు కొని కల్లూరి వేంకటరామ శాస్త్రులుగారి పర్యంతము గల విద్వాంసులకందరికీ అన్యభాషా శబ్దాలను గురించి ప్రమాణమై ఉండగా గాడిదలని అచ్చులో దిద్ద డానికి కారణమేమి ? గాడీలు అనగా ఎద్దులబళ్ళు అని అర్థము. ఇది ఉత్తర హిందూస్థానములో వాడుకలో ఉన్నదిగాని, తురకపదము కాదు తురకపదమని భ్రమపడి పదకొండవ శతాబ్దములో తురకపదాలు భాషలోకి రావడము స్వభావ విరుద్ధమని ఆలోచించి సంపాదకులు దిద్ద ఉందురు. ఈలాగు దిద్దివేయుచుంటే భాషకు ఏమి గతి ?)*

ఇట్టివి వందల కొద్దీ చూపవచ్చును, ఇక, విడిచిపెట్టిన పద్యాలు చూడండి.

౧. సుప్రసిద్ధమైన 'పాయక పాకశాసనికి'

అనేపద్యం వ్రాతలోలేదు.సందర్భముకూడ దానిననుసరించే మారిఉన్నది.

౨. "పదిదినము లైదు ప్రొద్దులు"

అనే పద్యం వ్రాత పుస్తకములో లేదు. ఇది అథర్వణకృత భారతము లోనిదని కొందరు లక్షణ కర్తలన్నారు. ఇది పునరుక్తి అని ఇదివరకే కొందరు వాదించినారు. అచ్చు పుస్తకాలలో మరల ఎందుకు ఎక్కించినారో తెలియదు.

౩. ఆదిపర్వము తృతీయాశ్వాసములోని

క. లోకోత్తర చరితుండగు
నాకావ్య తనూజ నీకు నా రాధ్యునే
ప్రాకట భూసుర కన్యక
నీకట్టిన మైల గట్ట నేర్తునె యనినన్

---

* మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారు పరిష్కరించిన భారతం ప్రతిలో "చిత్రలలిత గతినొప్పు నేనూరు గంధర్వహయములు" అని వుంది. పాద టీకలో "గాడీలు సింధుజ" అన్న పాఠాంతర మిచ్చారు. "గాడిదలు" అన్న పాఠ మివ్వలేదు. చదలువాడ సుందరరామ శాస్త్రులు దండిగుంట సూర్యా నారాయణ శాస్త్రులు "భారత సంజీవని" వ్యాఖ్యతో ప్రచురించిన ప్రతిలోను "గంధర్వహయములు"పాఠమే వుంది. పాదటీకలో వీరు"గార్దభంబుల సింధు" అని పాఠాంతర మిచ్చారు. (ఆది 8 221.) సంస్కృత మూలంలో "తథైవాశ్వ రీణాం" [ఆది. 221.48. అని వుంది. అశ్వతరములు అంటే కంచర గాడిదలు అని అర్థం.-పురిపండా.

అనేపద్యం వ్రాతపుస్తకములోలేదు. సందర్భము దాని ననుసరించే మారి ఉంది.

పై కారణాలబట్టి నిజముగా నన్నయభట్టు మతము ఇది అని తెలిపేది అచ్చు భారతమా ? అప్పకవి, కామకవి మొదలైన పండితులు దిద్దిన వ్రాత ప్రతులా ? దిద్దడానికి సామర్థ్యములేని పాఠకులకు వ్రాసుకొన్న ప్రతులా ? ఈ సంగతి మొదట నిర్ధారణ అయి నిజమైన "నన్నయ భట్టుగారి భారతము" ఏర్పడితేగాని భారతము ప్రమాణముగా అంగీకరించడానికి బొత్తిగా వీలులేకుండ ఉన్నది. కాబట్టి మాకు భారతము ప్రమాణము, మాకు భారతము ప్రమాణము-అనేపండితులు అరణ్యములో పడిపోయిన నన్నయ భట్టుగారి భారతము నిజమైనది పైకి తీసుకొనివచ్చి, ఆ పైని తమవాదాలు ఆరంభించితే బాగుండును. ఆ పని మానివేసి, ఎవరి పుస్తకాలు వారే ప్రమాణము చేసుకొనుచు, ఒకరితో ఒకరు దెబ్బలాడుకొనుచు, అవసరములేని స్థలాలలోను, తమకు తెలియని స్థలాలలోను దిద్దివేసి, యిష్టము వచ్చినట్లల్లా పుస్తకాలు అచ్చువేయుచు, సబబు సందర్భము లేని అచ్చుపుస్తకాలల్లా ప్రమాణమని అంగీకరించుచు, నేల విడిచి సాము చేయడము ఎంతమాత్రము ప్రయోజనము లేదు. అది అలాగు ఉండనీయండి.

ఇక, భేదాలులేకుండ ఉన్న భాగములో నన్నయభట్టు భాషకూ ఇప్పటి గ్రాంథిక భాషకూ ఎంత భేదము ఉన్నదో చూతము.

౧. ఉ. ఇమ్మగు సర్వలోక జను లెవ్వనియేని ముఖామృతాంశు బిం
బమ్మున నుద్భవం బయిన భారత వాగమృతంబు, కర్ణరం
ధ్రమ్మను నంజలిందవిలి త్రావుదు రట్టి మునీంద్రు లోకవం
ద్యుం బరమున్ బరాశరసుతుం బ్రణమిల్లి కరంబు భక్తితోన్.

ఇందు 'ఎవ్వని యేని ముఖామృతాంశు బింబమ్మున నుద్భవంబయిన భారత వాగమృతంబు త్రావుదురు' అనే నన్నయ వాక్యము ఈ కాలపు గ్రాంథిక భాషలో అలాగే వ్రాయుచున్నారా ? "ఎవ్వని వాగమృతంబు త్రావుదురో" అని గదా ఆధునిక గ్రాంథిక రూపము ! నన్నయ గ్రాంథికానికినీ ఇప్పటి గ్రాంథికానికినీ ఎంత భేదముఉన్నదో చూడండి. ఇదిగాక, "పరాశరసుతుం బ్రణమిల్లి" అని, ప్రణమిల్లిఅనే క్త్వార్థకము ద్వితీయతో అన్వయముచేసినాడు. ఇప్పుడెవరైనా అలాగు వ్రాయుచున్నారా ? "[పరాశర] సుతునకు బ్రణమిల్లి" అని షష్ఠితో గదా అన్వయించెదరు ! ఎంత భేదమో చూడండి.

౨. 'ఇట్టి మహాత్మునకీ గాంచితి.'

ఈ రూప మెవరైన వ్రాయుచున్నారా ? 'ఈ గల్గితి' అనేదికదా ఆధునిక గ్రాంథిక రూపము.

౩. పాములు పంచత్వము ననియెదుమని.

దీని ఆధునిక రూపము 'పంచత్వము పొందెదు మని.'

౪. 'ఇది వడిగలదు మనసుకంటె గొడ్డుకంటె.'

ఇందు 'కలదు' అనే క్రియకు కర్త 'ఇది' అనే సర్వనామము. ఇప్పటి గ్రాంథిక రూపము 'దీనికి వడిగలదు.' ఇట్లే 'ఏను నేర్చు గలను' అనేది 'నాకు నేర్పు గలదు' అనీ, నీవు నేర్పుగలవు అనేవి 'నీకు నేర్పుగలదు' అనీ మారి పోయినవి.

౫. 'శాపంబు కారణంబునం జేసి'

ఇది ఇప్పుడు 'శాపంబుచేత' అని మారినది.

౬. నాకుం గరుణింపుం డని

ఇది 'నన్నుం గరుణింపుడని' అని మారినది.

౭. 'తనకు నురగ భోజనంబు సురపతిచేతం బడసి.

ఇది 'తానురగ భోజనంబు etc." గా మారినది.

౮. 'చిరముగ బ్రహ్మకుం దపము చేసి.'

ఈ షష్ఠి చిత్తగించండి. ఇప్పు డెవ్వరైనా వాడుచున్నారా ?

౯. 'అతివ్యక్తంబులై యాకాశంబు వలన పీతెంచిన'

ఇందులో 'వలన' కును పంచమీ విభక్తి 'వలన' కును ఎంతో భేదము.

౧౦. 'అక్కన్యను మ్రొక్కించి' ఇది అక్కన్యచే మ్రొక్కించి అని మారినది.

౧౧. 'అయ్యయి కాలము తప్పకుండగనీ.'

'అయ్యయి' అనేది ఇప్పుడు బహువచనముతోనే అన్వయించెదరు.

౧౨. 'గరుడుని వినతనుం బనులు గొనుచున్నంత.'

ఇందు తృతీయార్థమందు ద్వితీయ చేతన వాచకాలకుకూడా వాడుక చేసినాడు-వ్యాకరణంలో అచేతన వాచకాలకు మాత్రమే చెప్పినాడు. ఇప్పటి కవులు కూడ అచేతన వాచకాలకే వాడుక చేయుచున్నారు. ఇక, కొన్ని శబ్దభేదాలు చూడండి :

౧. వగవక-ఆలోచింపక అన భారతార్థము.

ఏడువక-అని ఆధునికార్థము.

౨. మొగి-మొత్తము అని భారతార్థము.

ఆధునిక భాషలో ఇది వ్యర్థపదము

౩. వాని నిప్పించు కొమ్మనిన.

ఇప్పించుకొనుట యనగా పుచ్చుకొనుట యని భారతార్థము. ఈ శబ్ద మిప్పుడు లేనేలేదు.

౪. అలిగి-మిక్కిలి కోపించి-అని భారతార్థము.

సామాన్యముగ కోపించి అని ఇప్పటి అర్థము.

౫. వధూసరయను నామంబుసేసె.

అనగా నామముంచెను అని భారతార్థము. ఈ యర్థములో చేయుధాతు విప్పు డెవరైన ఉపయోగించుచున్నారా ?

౬. ధూమవితతుల్ సేసెం బయోదావళిన్.

ఇందు 'సేసెన్' అనగా 'పుట్టించెను' అని అర్థము. ఈ యర్థమిప్పు డున్నదా ?

౭. అయ్యెర నొకదుందుభంబు.

ఇందు 'ఎర' అను ప్రాచీనరూపము 'ఎడ' అను ఆధునికరూపముగా మారినది.

౮. అతిప్రయత్నంబున రక్షించుకొని యుండె.

ఇందులో 'కొని' అనే ఆత్మనే పదానికి, ఈ కాలములో 'కొని' అనే ఆత్మనె పదానికీ భేదము ఉన్నది.

౯. మదవక సేయు మీపనియని సమర్పణసేసె.

ఇందు 'సమర్పణ' అనగా ఆజ్ఞ. ఇప్పటి సమర్పణకూ ఎంత భేద మున్నదో చూడండి.

౧౦. తరుణియ లొప్పనాడిరి.

ఇందులో తరుణియ అనే శబ్ద మిప్పుడున్నదా ?

౧౧. నీతదర్థమ-పువ్వుల యవ్విధంబునన్-దానముచేసిన తత్ఫలంబు.

ఇందులో 'తత్' అనే శబ్దము ఇప్పుడెవరైనా వాడుచున్నారా ?

౧౨. పెద్దవాడుండ గొండొకవాడు.

ఇందులో 'కొండొక' అనేది 'కొండిక' అని మారిపోయినది. ఈలాంటివి ఎన్నెన్నో చూపవచ్చును.

ఆంధ్రభాషాభిమానులారా ! ఈ భేదాలన్నీ చిత్తగించండి. నన్నయ వ్రాసిన గ్రాంథిక భాషకూ, ఇప్పుడు మీరందరూ వ్రాయుచున్న గ్రాంథిక భాషకూ ఏమైనా సంబంధమున్నదా ? నన్నయ భాషకూ మీ భాషకూ, ఇంత భేదమున్నా, భారతకాలమునుంచీ భాష మారలేదనీ, భారతభాషతోనే వ్రాయవలెననీ దెబ్బలాడడము ఏమైనా న్యాయముగా ఉన్నదా ?.......

భాష మారేటపుడు దాని ఇష్టము వచ్చినట్లు మారుచున్నదా, లేక, మారడానికి ఏమైన మార్గమున్నదా ? అన్న సంగతి ఆలోచింతము. భాష తనఇష్టము వచ్చినట్లుమారదు. భాష మారడానికి సాధారణముగా అన్నిభాషలకూ సామాన్యమైన మార్గాలు ఉన్నవి. ఒక్క ఉదాహరణ చూతము

నన్నయ్యగారు 'ఏను నేర్పుగలను' అని ప్రయోగించినారు. ఇప్పుడు మనము'నాకు నేర్పుగలదు'అని ప్రయోగింతుము. ఈ భేదము ఎలాగు వచ్చినది?

ఉత్తమ పురుష—ఏను నేర్పుగలను.
మధ్యమ పురుష—నీవు నేర్పుగలవు.
ప్రథమ పురుష — వాడు నేర్పుగలడు.
ఆమె నేర్పు గలదు.
అది నేర్పు గలదు.

పై మూటిలో నన్నయ కాలములో చివర క్రియలకు ఏను, నీవు, ఆమె, అది, వాడు అనే సర్వనామాలు కర్తృవాచకాలై యుండేవి. అయితే, ప్రథమ పురుష స్త్రీలింగములోను, నపుంసక లింగములోను ఒకచిక్కు వచ్చినది. ఆమె, అది, నేర్పుగలదు అనే దానిలో 'కలదు' అనే క్రియకు ఆమె, అది అనేవి

కర్తలో నేర్పు అనేది కర్తో అనుమానము కలిగినది. ఈ అనుమానము తక్కిన చోట్ల కలుగలేదు. అయితే, ప్రథమ పురుషలో కర్త ఏదో సందేహము కలుగ డముతోనే, సమీపముగా ఉన్న నేర్పు అనే నామవాచకమే కర్త అని భ్రమ పడ్డారు. అందుచేత, ఆమె, నేర్పు అనే రెండు ప్రథమా విభక్తులు అనవసరాలు లాగు కనుపడ్డవి. కాబట్టి మొదటి ప్రథమా విభక్తి షష్ఠీ విభక్తిగా మారిపోయి నది. అందుచేత, ఆమెకు నేర్పుగలదు, దానికి నేర్పుగలదు అనే రూపాలుపుట్టి నవి. తరువాత క్రమక్రమముగా సామీప్యము చేత నాకు నేర్పుగలదు. నీకు నేర్పుగలదు, వానికి నేర్పుగలదు అనే రూపాలు పుట్టినవి. నిజముగా ఆలోచించి చూచితే భేదాలన్నిటికీ కారణాలు ఈలాగే కనిపించును. అయితే, ఈ భేదాలు ఏ వ్యాకరణాలవల్లను వచ్చినవికావు. ఈ భేదాలు ఆంధ్ర శబ్దచింతామణి, అథ ర్వణ కారికలు,బాలవ్యాకరణము, ప్రౌఢ వ్యాకరణము మొదలైన వ్యాకరణాలేవీ తెలియచేయడములేదు. వాస్తవముగా ఆ వైయాకరణుల కెవరికీ ఈ భేదాలు గ్రాంథిక భాషలోకి వచ్చినవని తెలియనే తెలియదు. అయితే, ఈ భేదాలు భాష లోకి ఏలాగువచ్చినవని శంక. ఈ భేదాలు మొట్టమొదట సామాన్య జనుల వ్యవహారములో పుట్టి, తెలియకుండ, మెల్లిగా, చల్లగా, గ్రంథాలలోనికి ఎక్కి పోయినవి. గ్రంథాలలోకి ఎక్కిపోవడానికి కారణము కవుల చెవులకు ఇంపుగా ఉండడమే. కొమ్ములు తిరిగిన మహాకవులు, 'చల్లాఅంబలి త్రావితిన్' అన్నప్పు డును, 'సీరాముసేన' అన్నప్పుడును, 'అందరికిన్ దలా యొకటి' అన్నప్పు డును, 'చిరుమనదెచ్చి రాచరిక మిచ్చిన' అన్నప్పుడును, 'మొక్కెసామి' అన్నప్పుడును 'సూసినామేలు బాగెను నేసినాము' అన్నప్పుడును, 'కూడీకూడని చిన్నకూకటులతో' అన్నపుడును, 'వందే నేర్పుల' అన్నప్పుడును, 'నుయి దాటే వానికిన్' అన్నప్పుడును, ఆ మహాకవుల చెవులకు ఏ పదాదులు ఇంపుగా ఉన్నయో అవే ప్రయోగించినారు. కాని, వారు లక్షణగ్రంథాలు లక్ష్యపెట్టినారు కారు. వారు ప్రమాదమువల్ల ఆ పదాలు ప్రయోగించినారని తలచడము తప్పు. ప్రాచీన రూపాలకీ, నవీనరూపాలకీ ఇదే భేదము. ఈ కాలములో 'గ్రాంథికభాష అనే భాషలో వ్యావహారిక రూపాలు ఉండడానికి ఇదే కారణము. ప్రాతభాష ముసలివారి వంటిది. ముసలివారిని మూలకూర్చుండబెట్టి నమస్కరించెదముగాని, వారు మనతో కలిసిమెలిసి ఆనందించడానికి పనికిరారు. మనకు ఆనందము కలుగజేయువారు మనతో కలిసిమెలిసి తిరిగే అన్నదమ్ములు. వ్యావహారిక భాష అన్నదమ్ములవంటిది. గ్రాంథికభాషలో వ్యావహారికపదాలు దూర్చడము ముసలి

వాని జుత్తుకు మసిపూసి పిల్లవాడు అనడము వంటిది. కాబట్టి పండితులారా! ఇప్పుడు మీరు వ్రాయుచుండు గ్రాంథికభాష నిజమైన గ్రాంథికభాష కాదనీ, గ్రాంథిక వ్యావహారికభాషల మిశ్రమమనీ, తెలుసుకొని, మీ గ్రాంథికభాష ఇప్పటివారికి కొంతవరకు కర్ణరసాయనముగా ఉండడమునకు కారణము-అందు లోనివ్యావహారిక పదసమ్మేళనమే అనిగ్రహించి-నిజమైన వ్యావహారికభాషే పూర్ణముగా కర్ణరసాయకముగా ఉండగలదనినమ్మి-వ్యవహారభాష స్వేచ్ఛగా తెలిసి (తెలియకకాదు) గ్రంథాలలో వాడుకచేయండి. ఆ రీతిగా వ్రాసిన గ్రంథాలు మాకూ, మీకూ, జనసామాన్యానికీ కూడా ఉపయోగకరములై, సంతోషదాయకములై ఉండును. ఇదే నా ప్రార్థన.

మండపాక పార్వతీశ్వరశాస్త్రి*

---

*గ్రంథాలయ సర్వస్వము, 1918, ద్వితీయం సం. 3 వ భాగం.

# ఆధునికాంధ్ర సారస్వతము

నే నిందు సారస్వత శబ్ద వ్యుత్పత్తిని గూర్చి చర్చింపఁ దలఁచ లేదు. పూర్వాపర దశలను బోల్చి తారతమ్యమును తేల్ప నెంచలేదు. చిరంతన శోధనచేఁ జేర్చిన భాషాచరిత్రమును వినిపింప రాలేదు. తుదకు క్రొత్తక్రొత్త నియమములను బెంచి ఆధునిక సారస్వతమును శాసింప సాహసింపలేదు. ఇందే కార్యమునకుఁగాని నాకుఁ జాలినన్ని అధికార యోగ్యతలులేవు. అది నాకన్న నితరు లెక్కువగా నెఱుఁగరు. కాని, సారస్వతముయొక్క వర్తమానావస్థను విప్పిచెప్ప సంకల్పించితిని. ఇందు ఖండనమండలములకు అవకాశము కొలఁది యని సహృదయు లెరుగనిది కాదు సందర్భవశమై యట్టి ప్రసక్తి గలిగినను వ్యాసకారకుని యభిమతము కాదని విశ్వసింతురుగాత. ఈ కార్యమును అలతి యైనది కాదు. ఒక్కొక్కని యనుభవము వేఱు, ఒకొ్కక్కని మార్గములు వేఱు, కాని మొత్తముమీదఁ జేయునది భాషావ్యవసాయమె.

ఒకనికి రుచించినది మఱియొకనికి రుచింపదు. ఒకఁ డభిమానించినదానిని మఱియొకఁడు తిరస్కరించును. ఈ భిన్నరుచిత్వమునకు ప్రకృతి యొకసాక్షి. ఒగరుచిగుళ్ళు దిను కోయిలకు పండు తమలపాకులు రుచింపవు. పాము కుబుస ముల వంటి ఉప్పాడ చీరెలపై మనసుపడు మానవతి యొక్కతె. కన్నుచెదరు కలంకారి చీరెలనే యందగించుకొను సుందరి యింక నొకతె. అయితే యిరువుర కును అలంకారమె ప్రధానసంకల్పము;కాని యభిరుచులనుఁ దిప్పు దృష్టిమాత్రము వేఱు. ఇంతకును జెప్పవచ్చిన దేమన; స్వీయరుచిపై నధికమైన యభిమానముం డుట నమంజసమే. అది కళాధర్మము. కాని భిన్నరుచిని వెక్కిరించుట ప్రమా దము. నే నీక్రింది పంక్తులలో సాధ్యమైనంతవఱకు నా సొంత యూహలను వ్యక్తీకరింతును. సంకల్ప దృష్టిమాత్రము సమరసభావము నందున్నది. ఒక పక్షమును ద్రోసిరాజనవలెనని నా మతము కాదు. మఱియొక పక్షము నాకాశ మున కెక్కించవలెనని యూహ యసలే లేదు. అందువలననే మహాకవి రవీం ద్రుని సూక్తులు ధ్యాన పురస్సరములుగా నీ వ్యాసము నారంభింతును.

వాగర్థ ప్రపంచము నేలు ఓ వాణీ! నీ మధురస్వరూపమును, నీ స్నిగ్ధ స్వభావమును నన్నావహింప నిమ్ము. నా వాక్కులు ప్రమాద సమ్మోహితములు. కావున నా మాతృభాషా గౌరవమును గాని, తదుద్గమన గానమును గాని, తదు స్మిల తేజస్సునుగాని ఏమాత్రమును మైలచేయని రసన నిమ్ము అదియే నా సంక ల్పము.

## కవిత

సారస్వత పరిణామమందు కవిత కాద్యస్థానము కలదు. ఏజాతి సారస్వ తము నవలోకించినను ఈ రహస్యము తేటపడును. 'హోమరు' మహాకవి కావ్య ములు లేకపోయినచో పాశ్చాత్య వీరులు లేరు. వారి చిత్రజీవితములు లేవు. వారి శైశవ నాగరికత లేదు. 'హ్యూయనిషియో' పాటలు లేక అతిపురాతనమైన చీనా జాతీయ సభ్యత బోధపడదు. ఋషుల ఋక్కులును, మునుల పురాణము లును ఉదయింపవేని మనభారతవర్షనాగరికతకు జిహ్నములే కాన్పించియుండవు. ఇవి యన్నియుఁ గవితారూపములోనే యున్నవి. కావున కవిత భాషాపరిణామ ఫలములలో నుత్కృష్టమైనదని చెప్పకతీరదు.

వర్తమానావస్థ యందు మనభాషలో కవిత లేదని చెప్పుట తప్పు. తప్పేమి, గొప్పపాపము. కాని అది మాఱి యవతరించుచున్నది. మారుపు అనివార్యమనియే నాయూహ. ఈ మారుపు జాతిభాషల యందచందములకును, వికాస విస్తారములకును క్రొత్త నాజూకుఁ దేగలదు; కాని, కొందఱూహపడు నట్లు సమూలచ్ఛేదనమును దాకొల్పదు. చిహ్నముల యందు వికసన సౌష్ఠవ మున్నది. కాని, వికారదురాగత మేమియులేదు. ఈ మార్పును నిరసించి నిరో ధించు పండితులు కొందఱు ప్రకృతి నైజమును గుర్తింపలేకున్నారు. కవితకుఁ బ్రాణము పోసి యుజ్జీవింపఁ జేయుశక్తులు భాషలో నున్నవని వీరి భ్రమ. అట్లు కాదు. జాతీయ పరిస్థితి, దేశవికాసము, సాంఘికగతి, విద్యాపద్ధతి నాగరకాభి రుచి, మున్నగునవి కొన్ని కవితాప్రేరేపకములు. చూడుడు శ్రీకృష్ణదేవరాయల కాలమునాడు ఆంధ్రకవిత కొక స్వేచ్ఛావికాస మలవడినది. ఎందుచేత? ఆవఱకు వేంగియంతయు తీవ్రసంక్షోభపడినది. కాని ఈ సంక్షోభ దేనియందు? మతము నందు. అప్పటికి ఆంధ్ర సభ్యతా దృష్టి మత నిర్బంధముల నుండి తొలఁగ లేదు ప్రజాభినివేశమునందు మతము ప్రధానముగా నుండును. ఇతరములు లేవని నా అభిప్రాయముగాదు. మత సంసక్తి నుండి జాతీయదృష్టి బలవంత ముగా నాకర్షింపఁదగిన అన్య పరిస్థితి పొసఁగియుండలేదని నా యర్థము. శ్రీకృష్ణరాయల కాలమందు ఈ గతి మాఱినది. జాతీయదృష్టి తురకకత్తి

మెఱపులచే లాగఁబడెను. పౌరుషము విజయకాంక్ష, తొలకరించెను. జాతీయ మగునొక అహంభావము క్రమ క్రమముగా బలిసెను. దీని పరిణామ మిచట నప్రసక్తము. కాని, పర్యవసానమేమి? దిగంత విశ్రాంతమగు ఆంధ్రసామ్రాజ్య ప్రతిష్ఠ ఆంధ్రుల ప్రతాపము పురాతన వేంగీసీమాగ్రములు దాటిపోయినవి. ఇటు కళింగము ప్రమింగినది. అటు కర్ణాటమును కబళించినది. ఆంధ్రుల జయ స్తంభములు దూర దూర స్థలముల నెత్తఁబడెను. ఇది యొక సజీవమైన పరిస్థితి. జాతిలోని యంతశ్శక్తులను ప్రజ్వలించు సమయము లిట్టివె. ప్రజలలో ప్రభుత్వ గర్వము రాణించినది. అభిమానము బలిసినది. సంపదలు పెంపొందించినవి. దానితో సౌఖ్యానురక్తి యధికమైనది. తదనుభూతమై సౌకుమార్య విలాసములు నందుకొనినవి. అదియే సంగీత సాహిత్యములు మోహపెట్టు తరుణము. ఆ కాలపు సాహిత్య పరిణామముగా 'మనుచరిత్ర' వంటి విలక్షణగ్రంథ ముదయించినది. అందలి నాయికను జూడుఁడు. ఆకాలము నాటికి ఆంధ్రస్త్రీ లోకమున బుష్పించిన సాహససంపత్తి ధ్వనింపకపోదు. వరూధినీ చర్యను కేవల కవిభావనా ఫలితమని సామాన్య ధర్మముగా నన్వయింపకుఁడు. భావపరముగ నన్వేషింపుఁడు. నా యర్థము బోధపడగలదు. వరూధిని సాహసించి నాయకునిఁ గౌగిలించినది. రసప్రపంచము నం దిది సామాన్య పమర్థనీయమని నేనెఱుఁగుదును. కాని, కావ్యమునందు తన నాయికకింత సాహసచర్యను "సహృదయసమ్మతముగా" నేర్పి దిద్దిన తెనుఁగుకవులు ఆవలకు మిగుల తక్కువ. ఆపె వేషమునందు ఆకాలమునకు గలిగినమార్పు గాన్పింపకపోదు. వేయేల, వరూధిని వాలకమంతయు మొగలాయి నాగరికతా లీనమైన పిదప బరిణమించిన తెనుఁగు నాజూకునకు నిదర్శనమని నా యాశయము. అందలి వర్ణనలు చూడుఁడు. కాలికాఖరుచిని జెప్పక చెప్పుచున్నవి.

క. కుశలతి యేవ్రతముల నగు
నళనాయాసమున, నింద్రియ నిరోధమునన్
గృశుఁడవయి యాత్మ నలచెదు
సశరీర స్వర్గసుఖము సమకొని యుండన్.

ఈ పద్యపంక్తులయం దెంత యర్థమో ధ్వనించుచున్నది. మతాచారములపై శ్రద్ధ తొలఁగినది; సుఖవిలాసము లవశ్యభోగ్యములను నభిరుచి తలయెత్తినది. ప్రవరాఖ్యుని వంటి భూలోకబృహస్పతిని జూచి ఆ కాలపు నాగరకులేమనుకొనిరో మన కీ పద్యము హృద్యముగఁ జెప్పుచున్నది. ఇట్టి కవితను

ప్రేరేపించినది జాతీయ పరిస్థితి; కాని, భాషాతత్వము కాదు. భావనను గురించి భాష కవి చేతులలో నాటలాడినది.

అనాఁ డెట్టి మార్పు కలిగినదో ఈనాఁడును అట్టి మార్పే కలుగుచున్నది. కొన్నిట నీమార్పు అధికమైనది; బలవత్తరమైనది యని చెప్పుట కవకాశములు కలవు. ఆంధ్ర కన్య సౌభాగ్య సౌందర్యమును దిలకింపుఁడు. దుకూలధారణము నుండి తలకొప్పు తీరిక వఱకు నెంతమార్పు వాటిల్లినదో తెలిసికొనుఁడు. తెనుగుకన్నె మెడలోఁ గాసుల దండ లూగుచున్నవి. కంఠరేఖలవంటి నానులు నాజూకుఁ బెంచుచున్నవి. నాగరములేని తెనుఁగు చిన్నది యిపుడు కానరాదు. పెద్దనాది మహాకవులు తాము పోషించిన నాయికల మెడలలో కాసులదండలు వేయలేదు. నానులు పెట్టలేదు. నాగరములు చేయించలేదు. కాని ఆధునిక మహాకవులు తీర్చిదిద్దిన నాయికల కవి యేల యుండరాదు? నిషేధముండకూడదని నా మతము. నిషేధ మటుంతము, విధి పూర్వకముగా నీ మార్పును అభిరుచి ధర్మము నర్థించి చేయవలెను.

ఇంకొకటి, తెనుఁగుకవుల రచనలయందు తెనుఁగు నాయిక లేల యుండరో నేనూహింపఁ జాలకున్నాను. తెనుఁగు నాయిక పేర తెనుఁగు కాంతా లోకముయొక్క 'విలక్షణత' సారస్వతమందు పొందుపడవలెను. దీనికొక నిదర్శనము చెప్పెదను. గుజరాతీ సారస్వతము నిపుడు నడిపించుచున్న మహాకవి 'కలాపి.' అతని కావ్యము నెందుఁ జూచినను ఆ సంఘపరివర్తనము అద్దములోఁ జూచినట్లు పొడకట్టును. వారి వస్త్రాద్యలంకారము లంత యింపైనవి కావు. వనితలవాలక మంత హృదయంగమముగ నుండదు. పలువురు విదుషీమణు లీ సందర్భమును గూర్చి వ్రాసిరి. మార్చుటకై విశ్వప్రయత్నములు సలిపిరి. కాని, తుదకు 'కలాపి' కవితయు, మహారాజ శాయజీ మార్గదర్శకత్వమును జతపడు వఱకు అభ్యర్థనీయము సాధ్యమయినది కాదు. ఆయన కవితయం దెందుఁ జూచినను గుజరాతీకాంతా సౌందర్యప్రశంస యుండును. ఆయన శైలియు మిగుల గడుసైనది. ఒక నాయికను పూర్వ పద్ధతికిఁ బ్రతిబింబముగాఁ జిత్రించును. మఱియొక నాయికను అభ్యర్థనీయ పద్ధతికిఁ బ్రతిరూపముగా దిద్దును. నాకీ పరస్పర వైపరీత్యము ఆయన చదివి వినిపించినపుడు బోధపడినదికాదు. ఏల యిట్లు రచించితి వని ప్రశ్నించితిని. అందుల కాయన యీ క్రింది ప్రత్యుత్తరము నిచ్చెను.

"నేను ప్రయోజనము నర్థించియే యీ రచనాక్రమ మవలంబించితిని. పూర్వపు స్త్రీ సౌందర్యమును జిత్రించుటచే దాని విలక్షణతకు స్థాయిఁ గల్పించిన వాఁడనైతిని కాలిక వృత్తమును బాటించుటచే, కలుగుచున్న మార్పునకు దారులు తీసిన వాడనైతిని. అనఁగా భావియందొక చిత్రకారుఁడు ఈ కాల వాఙ్మయము బరిశోధించుట తటస్థించు ననుకొనుము. అప్పు డాశిల్పకుని దృష్టికి పూర్వగుజరాతి స్త్రీరూపమును, మార్పులతో బరిణమించిన ఆధునిక కన్యక వాలకమును—రెండు రెండు పృథగ్బింబములుగా గానవచ్చును."

ఇందెంత యర్థమున్నదో యూహింపుఁడు. మార్పు అనివార్యమె. కాని ఆ మార్పులను సారస్వతమునందు లీనమధురములుగా దిద్దుకవి యెంత ప్రౌఢుఁడు గావలెనో, ఏ సాధనాంతరముల నవలంబింపవలెనో తలపోయుఁడు.

## భావగీతములు

ఇప్పుడు చిన్నచిన్న పొత్తములు వెడలుచున్నవి. వీనిని ఆంగ్లమందలి 'లిరికు' కావ్యముల ననుసరించి భావగీతములని పిలుచుచున్నారు. ఇది కేవలము మనవారెఱుంగని పంథ కాదు. లాక్షణికులు వాకొనిన ఖండకావ్యము లిట్టివే. మేఘదూత నెఱుఁగనివా రుండరు. మహాకవి కాళిదాసుని హృదయ పరిపాకమాపద్యములయం దెంత భావమోహనముగా కేంద్రీకృతమైనదో ఎఱుఁగుదుము. భాగవతము జదవని తెనుఁగువారు లేరు. అందన్నియెడలకంటె గొన్ని స్థలాంతరములలో రసమునకు స్థాయియే కుదిరినట్లు తోఁచును. భ్రమరగీత లిందుల కొక యుదాహరణము. ఒక్కొక్క పద్యమునందు ఒక్కొక్క హృద్యభావము మనసు నలంకరించుచున్నది. గోపికల వియోగవేదన యెంత నిశిత మధురమోఃపోతనతరళపద సరళియును అంతసమ్మోహనాస్త్ర సూత్రమై 'శ్లోకైక రమణీయ' మ్మను ఉదాత్తకావ్యలక్షణమును బ్రతికించుచున్నది. కారణమేమి? కేంద్రభావమంత మాధుర్యవిశిష్టముగ నుండుటయే. గోపికలు వలచిన శ్రీకృష్ణ వియోగము నిందు వ్యాజస్తుతిగాఁ గవి గ్రహించినాఁడు. కాని నిజమునకుఁ బోతనమహాకవి యాత్మవేదనయే యిందు స్ఫుటమగుచున్నది. లీలాసంవరణమైన పరమాత్మను పోతనహృదయ మెంత యార్ద్రసుకుమారముగా వలచెనో తద్వియోగము నెంత కఱకుగా ననుభవించెనో, భ్రమర గీతలయందుఁ బ్రతిపదము నందును మెదలుచున్నది. పోతన భావోత్కంఠ యింత నిశితముగా నీ గీతలలో లీనమైనది గావుననే రసోపలబ్ధి కింత లాలనీయమైన స్థాయి కుదిరినది.

ఖండకావ్యములు వ్రాయు ఆధునికకవులు ఈ రహస్యమును మనసునం దుంచుకొనుట లగ్గు. పండితులు వీనిని కేవలము విజాతి భాషాసంప్రదాయ ఖండమునుండి మన సారస్వతవనమునందు దింపరాబడినవని నిరసింప నక్కర లేదు. పూర్వలక్షణములందున్న ఒకానొక కావ్యాంగమునకే ఇప్పుడు పృథగ్వికాసము ప్రాప్తించినదని సమరసింపుటయొగ్గు. ఈఖండకావ్య శీర్షికక్రింద నానావిధ కావ్యరచనా చర్చయును వచ్చును. అందులకు నాకిచట అవకాశము లేదు.

## ప్రయోగ పరిణామము

ఆధునికకవులు శబ్దప్రయోగములవల్ల 'నిరంకుశులు'గా నున్నారని యొక వాదము కలదు. కవియై కావ్యము నుజ్జీవింప జేయవలెను గాని శబ్దప్రయోగము వల్ల తప్పక 'నిరంకుశుడు'గా నుండవలయు ననియే నాకాంక్ష. ఈ మర్యాదగూడ కేవలము నవీనముకాదు. శయ్యను బాటించిన నన్నయభట్టారకునకును, శైలిని దోహదించిన తిక్కన కవిబ్రహ్మకును సూక్ష్మమందరమైన భేదము కలదు ఈ భేదము ప్రయోగసరణి ననుసరించి రేకెత్తినదే. త్రికవుల ప్రమాణముల నటుంచి ప్రయోగస్వాతంత్ర్యము వహించిన కవులు ప్రబంధ నిర్మాతలలోఁ బలువురు కలరు. ఉత్తమకావ్య మనదగు అముక్తమాల్యదయందు ఈ ప్రయోగవిధానము కవికలమున కెంత సంపూర్ణ విధేయమై అందచందములు మోసెనో సహృదయు లెఱుంగుదురు. నన్నయ తిక్కనలకుఁగల భేదముగూడ నొకతీరున విశదీకరింప వచ్చును. సావిత్రి విషాదమందును, శకుంతల సాధ్వసకంపనము నందును, అర్జునుఁడు మత్స్యయంత్రము తెగనేయు కలకలము నందును నన్నయ శయ్యాలాలిత్యము నుయ్యాల లూగుచునే యున్నది. తిక్కన యట్లుకాదు. ద్రౌపదీ సౌకుమార్య సౌందర్యముల నయనోత్సవము నుఁడి, ఉత్తర గోగ్రహణ కోలాహలమునకు దరమి, ఒక్క విసరులో ఉత్తర పెండ్లి సంబరమున మంగళహారతులు వినుపించును. భావమునకు భాష నింత పరమవిధేయముగ నొనర్చు మహాకవి శిల్ప మనన్యము. ప్రయోగస్వాతంత్ర్యములను దోషములుగా సిద్ధాంతీకరించి నచో భావపుష్టిగల ప్రబంధములు చాల ఈ దోషమున కగ్గమగు ననుట విస్పంశయము. ఈ పోరాటము చాలదూరము వచ్చినది. కాని తేలిన సారాంశమేమియో చూడవలసి యున్నది. ప్రయోగమునకు బహుత్వసిద్ధి యున్నదని సంప్రదాయవాదులును ఒప్పుకొనుచున్నారు. కాని త్రికవులకు దక్కినవన్నియు తప్పులేయని

వారివాదము. కవి యొకమారు స్వతంత్రించి ప్రయోగమును వాడిన తరు
అది సహృదయలోక పరిచయిముచే సాధుపై బ్రదికినది; కాన అది నవీనుల
బ్రయోగయోగ్యమే అని యిప్పటి వారి మతము. ఎట్టులైనను భావమున
దృష్టి కేంద్రమగుచున్న ఈ కాలమందు ప్రయోగమునకు వైరళ్యము నాపా
చుట భాషా కల్యాణమునకు సహకారి కాజాలదు.

## గీతి

సారస్వతము సాధ్యమైనంత జాతీయముగ నుండవలయునని చెప్పి
ఇందులకు వంగమహారాష్ట్ర వాఙ్మయములే సాక్షాధారములు. జాతి సారస్వత
నందు గీతికి జాల ప్రధానమైన స్థానముకలదు. మన లాక్షణికులు 'పదకవిత
త్రోసి రా జనిరి. చిత్రమైన ఒక నాగరికత కలవారైన మన రసికులు పాట
నాదరింపరైరి. అందుచే నిరాదరమే దాని పాలైనది. రాను రా నీకవిత జీర్ణ
యస్తమయావస్థకు వచ్చినది. కాని వంగ మహారాష్ట్ర సారస్వతములందు
సాహిత్యమున కీగతి పట్టలేదు. ఇందులకు నాకొక్క కారణము కనుపట్టుచున్న
ఆదియందు ఈ గీతి కవిత కవలంబన మిచ్చినవారు సాధులు. చైతన్య
అంతకుముందు చండీదాసు మొదలగువారు తమ భావలోకమునెల్ల గీతియ
ప్రసాదించిరి. తుకారాము, రామదాసు మున్నగు మహారాష్ట్ర యోగులుగూడ
గీతికి బ్రాధాన్యమిచ్చిరి. వారిహృదయము లెట్లు లోకసంగ్రహమునకై పరితపి
నవో, వారిబుజాలమీది ఏకతారీలును నట్లే మ్రోగినవి. దాన మోహపడి ప్ర
సంతానమును పరవశగీతములను బాడినది. కవి యర్థించిన యావేశము తాం
మాడినది అంత ధన్యతయు బ్రాపించినది. వంగమహారాష్ట్రమందు సాధు
భక్తి యధికము. అందుచే వారిపాటలను బ్రజాహృదయముల నాటుకొని
ఇప్పటికి సైతము సంధ్యాకాలములయందు సావేశముతో బాడబడుచున్న
మన కట్లు కాలేదు. మన కవులయందు యోగులు చాలతక్కువ. మన వేమన
లున్నారు. కాని మనలాక్షణికులు వారిపేరైన నెత్తలేదు. హృదయ మోహన
లగు అనేక రసవద్గీతలనుండి ఒక్క ఉదాహరణమైన వారివ్రాతలలో గానరా
ఎట్లుకలిగిన నేమి, ఎంతనీరస నికృష్టమైనదైనను పద్యమునకు గౌరవమ
పడినది. ఎంత రసోత్కృష్టమైన దైనను పదమునకు నిరాదర నైచ్యమే
కొనినది. కారణములు రసికులు చర్చింతురుగాక. చెప్పవచ్చినదేమ

సారస్వతము వెదచల్లు భావములు ప్రజాహృదయములందు ప్రవేశించవ
ఆ ప్రజాహృదయ ప్రవేశమునకు గీతి సాధనమైనట్లు పద్యము కానే
మహాకవి రవీంద్రుని యుదాత్త వాఙ్మయము వంగజాతీయ గతిభ్రమణ
కెంత సహకారమైనదో నేనిందు వేఱ చెప్పనక్కరలేదు. గీతియొక్క ప్రం
నమును చక్కగా వినియోగించిన వారిలో రవీంద్రమహాకవి ఆధునిక కాలవ
అగ్రగణ్యుడు. మండల సభలు జరిగినవి. ఆంధ్రమహాసభలు కదచినవి. గ్ర
లయ ప్రచారము వచ్చినది. కాని ఆంధ్రదేశమందు ఏకగ్రీవముగ బాడ
'జాతీయగీత' మొక్కటి యుదయింపలేదు. కారణమేమి? కవుల ముఖములయ
ఆంధ్రభాషా మధువున్నది. కాని కవుల హృదయములందు ఆంధ్రజాతీయత
సన్నిహితము లయియున్న మహారాష్ట్ర వంగములను దిలకింపుడు. ఎన్నిజాతీ
గీతలు ఆబాలగోపాలముచే శ్రోతవలరెగు ధూళిగూడ పుష్పొదియగునట్లు పాడ
చున్నవో వినుడు. మహాకవులు గీతి నాదరించినగాని ఈ లోటు తీరదు. ర
జనాభిరుచి తదభిముఖత్వమును సూచించినపుడుగాని ఈమార్పు కలుగదు.

## గద్యరచన

వర్తమానావస్థయందు గద్యరచన జరుగుటలేదని వాదించుట య
కము. ఏదో ఒక నవల చదువరుల చేతులలోనికి వచ్చుచునే యున్నది. ఏ
జీవితచరిత్ర ప్రకటింపబడుచునేయున్నది. కాని జాతీయ పరత్వముగా రచ
సాగుటలేదని నా సందియము. ఇట్లంటినని కేవలాభావన్యాయము నాశ్రయించ
లేదు. చాలినంతలేదని నాయర్థము. నవలలువ్రాయు రచయితలు ఆంధ్రదేశసౌంద
మును తాము ముందుంచుకొనవలెను. ఆంధ్రసంప్రదాయములను బాటింపవలెన
ఆంధ్రుల వేషభాషలను బోషింపవలెను. సాటి సభ్యతలయందు ఆంధ్రసభ్య
కేమి లక్షణత్వమున్నదో వాని నుద్ధరించి ప్రకాశింపజేయవలెను. ఇందుకు

గీ. అరికి జయమిచ్చి తిరిగిన ప్రాణపతికి
పసుపునీళ్ళు తోడిన వీరవనిత చరిత
తెలుగు చెలుల నుద్బోధించు దేశ్యరచన
లంకురించు ... ... ...

ఇందు రణతిక్కన భార్య ఎంత విస్పష్టముగ ధ్వనించుచున్నదో యో
కింపుడు. ఐతమ్మకథ నాంధ్రపురంధ్రు లెఱుగరు. ఈస్థితి దేశబాంధవు లర్థింప

దగినది కాదని నేనిచట చెప్ప నక్కఱలేదు. ఆంధ్ర రచయితలు ఆంధ్రనాయిక లను రసోచితముగా నభిమానింపవలెను. కథలలోను, ఖండకావ్యములలోను, నవలలలోనుగూడ ఈమార్పు సత్వరము కలుగవలెను. ఇట్టిలోపములు సవరించు కొనుటకు రచయితలందరును సమావేశమై పరస్పరాభిప్రాయములను వెల్లడించు కొనుట మంచిది.

గద్యరచన క్రింద నింక కొంత చెప్పవలసియున్నది. ద్రౌపదీపాత్రౌచితీ పోషణమునందు తిక్కన మహాకవి పెట్టిన వన్నెలెట్టివో ప్రకాశింపఁజేయవలెను. ఉత్తమ ప్రబంధముల యందున్న ఉదారగుణ వైభవమును సహస్రముఖముల వెల్లడించవలెను. దీనినే సమాలోచనమని వంగీయులు వాడుచున్నారు. ప్రాచీన సాహిత్యమునుండి యిప్పటికిసేతము రచయితలు మాసపత్రికలలో నపూర్వ విషయములను మణులను త్రవ్వినట్లు త్రవ్వి యెత్తుచుందురు. ఉత్కృష్టమగు వ్యాసరచనలేమి యొక కొఱత. మతాభిమానముగల పండితులు కొందఱుగలరు. కాని 'వీరశైవము ఆంధ్రదేశ చరిత్రయం దేస్థానము నందఁగల'దని చర్చించిన వారు గానరారు. సంస్కృత సారస్వతమునకు ఆంధ్రాలంకారికులు సలిపిన దోహద మెట్టిదో మనవారెఱుఁగరు.

హైందవ సమష్టి శిల్పము నందు ఆంధ్ర చిత్రకారుల కెంత సంబంధ మున్నదో ఎందును చర్చింపఁబడి యుండలేదు. స్థాలీపులాకన్యాయముగ వ్యాస రచనకు వస్తు నిర్దేశము నిచట సూచించితిని; కాని, వేత్త లెఱుఁగరని కాదు.

## శాస్త్ర చరిత్ర వికాసము

శాస్త్రమనఁగా తర్కాదులని మనయర్థముకాదు. రాసాయనిక భూగోళములు మున్నగునవి. ఈ విషయమై పరిశ్రమ జరుగు చున్నది. కాని, జనసామాన్యము నాకర్షించు గ్రంథమొకటి కాలేదు. 'బాబు జగదానందరే' వ్రాసినట్లు ప్రకృతిశాస్త్ర మును కథలుగాఁ గల్పింపవలెను. ఆయన వ్రాసిన 'ప్రకృతీ ఓ ఇతిహాస్' అను కథలను వంగదేశమునం దాడువారుగూడ చదువుదురు. ఇందులకు గారణమేమన, ఆయన రసోచితములగు కల్పనలతో విషయములను సింగారించెను. 'గ్రావిటీ' వాదమును బోధించు సందర్భమున ఆయన యద్భుతమగు నవలవంటి కథను జిత్రించెను. సందర్భవశమున నిది సూచించితిని. మహారాష్ట్రమునందు 'భూపరి చయ'యను విలాసగ్రంథమొక్కటికలదు. ఆగ్రంథకర్త తాను భూయాత్రసలుపు

చున్నట్లును, శిష్యునకు ఆయా ఖండాంతర శీతోష్ణ వైచిత్ర్యములను పరిచయము, జేయునట్లును ఒక సరస కల్పనము నాశ్రయించెను. శాస్త్రజ్ఞులకు పద్ధతి భేదములను సూచించితిని గాని నాకీ విషయమందు అధికారముండి కాదు.

## నవలలు

ఆధునికులకు నవలలయందే దభిరుచి యధికముగ నున్నమాటనిజము. ఎచ్చటం జూచినను నవలలు నవనవముగాఁ బ్రకాశించుచున్నవి. కాని, ఒక శోచనీయస్థితి బయలుపడుచున్నది. నవలపఠన మెంతవ్యాప్తియందున్నదో, అందలిభావములంత వ్యాపకము నందుటలేదు. కారణము ప్రాజ్ఞుల విమర్శకదృష్టికి విడుచుచున్నాను. 'జీవనప్రభాత్' వంటి నవల యొక్క ఛాయ మన తెనుఁగున నింతవఱకు బయలు దేరలేదు. మనరచయితలు ఏ హిమాలయ ప్రాంతమందలి బయళ్ళలోనో, ఏరాజపుత్రస్థానపు ఎడారులలోనో ఒక పాంథుని ప్రవేశపెట్టుదురు; కాని, కొండవీటి కొండలోయలలోను, భద్రాచలపు టడవులలోను కథా పాత్రమును ప్రవేశపెట్టి చూపరు. మనకీదృష్టి పూర్ణముగా మారి అసలు తెనుఁగురచన బయలుదేరవలెను. వేనిట్లంటిరని అభావతర్కమును తడవఁగూడదు. ఇప్పటికి నీభాషాంతరీకరణము లను గణింపలేదనిగూడ గణింపరాదు. ప్లూటార్కు వర్ణిత చరిత్ర కంటె శ్రీనాథ వర్ణిత పల్నాటివీరుల చరిత్రలు అధిక ప్రయోజనకరములుగా నెన్నఁదగినవి.

## విమర్శనము

మన సారస్వత మీశాఖయందు చాల గర్హ్యదశ యందున్నది. సోదర సారస్వతములతోఁబోల్చి పరిశీలించినపుడు ఈభేదము మరింత గాఢముగఁ గానవచ్చును. ఇంతవఱకును విమర్శనమన్న 'ఇచట' అఖండయతికి జడలు పెరిగినవి. ఇచట సంధిఁ గలపలేదు. ఇందు లక్షణము లంకలపాలైనది' అనివ్రాయు వ్రాతగాండ్రు లెక్క కెక్కువగ నున్నారు. సానుభూతితో వాఙ్నిధులయందున్న అపూర్వరత్నముల నెత్తువా రరిది. ఈ సందర్భమున నిదమిత్థమని చెప్పుటకే అసాధ్యముగ నున్నది. నవీనుల విమర్శనలు పూర్వలాక్షణికములను మొదలంట త్రోసివేయుచున్నవి. ప్రాచీనులవిమర్శకలు గతానుగతికములయినపురాణపథముల నుండి ఒక అంగుళమైనను కదలకున్నవి. రెండును శోభనప్రదమగు సారస్వత వికాసమునకు దోహదకర్మలు కావు. మార్గము మధ్యగా నున్నదని నా యూహ. అందులకు ఉదారదృష్టిగల యుభయభాషావిదులు ముందుకు రావలసియున్నారు.

ఇటీవలి విమర్శలయందందందు ఇట్టి శుభపరిణామమును సూచించిన చిహ్నములు గలవు. గతసంవత్సర వంగీయ పరిషదధ్యక్షుల యుపన్యాసమునందలి ముక్కల నిందు పొందుపఱపక విడువలేకున్నాను. "వర్తమానావస్థయందు జాతిజీవనమున లీనమగుచున్న మార్పు లనంతములు. ఆ భిన్న భిన్నోజ్జ్వల దశలన్నియు సాహిత్యమునందు బింబించుచున్నవి. ఈసమయమున దార్శనికుని హృదయకౌశలము లతీవనిశిత ప్రతిభావ్యాకోచములై యుండవలెను. సారస్వతమునందు నిషేధింపఁదగిన దానికంటె వ్యాఖ్యానించి విశదము చేయవలసిన దెక్కువయున్నది. ఈ యపూర్వవస్తు సమాలోచనమును పాఠకలోకమునకుఁ బరిచయ సరళమొనరించు చమత్కార కార్యమె వర్తమాన దార్శనికుని యుదాత్త సామర్థ్యము"*.

వంగ సాహిత్యమునందు సమాలోచనశాఖ చాలవఱకు బెంపొందినది. భగవద్గీతలపై వ్రాయఁబడిన వ్యాఖ్యానములు దాదాపు 22 కలవు. ఉపనిషత్తులపై వ్రాసిన వ్యాసములు అపారములు. ఈ ధర్మవాఙ్మయము వలన నెంత జాతీయత దీపించినదో అది మహాశయుల భావనకే వదలుచున్నాను.

ఇందు నాటకాదులగురించి చెప్పలేదు. సామాన్య రచనక్రిందవచ్చు పత్రికా వ్యాసప్రసక్తినిగూడఁ దడవలేదు. ఇంక ననేకములు ప్రమాదవశమున తప్పిపోయియుండును. అందులకు పండితుల యుపేక్షాపక్షపాతమును వేడుచున్నాను. మన సారస్వతమును ఇతర సారస్వతములతో సరిచూచినపుడు స్వస్వరూపావస్థలు బయటపడును. అట్లు చేయగాఁ దోచిన యూహలే ఇట్లు వెల్లడించితిని.

రాయప్రోలు సుబ్బారావు

---

* గ్రంథాలయ సర్వస్వము. ప్రథమ సంపుట : తృతీయ సంచిక.

# ఏలపాటలు

ఆదికవుల కరుణార్ద్ర చిత్తమే వారి కవితా ప్రాశస్త్యమునకు హేతువైనది. రామకథా విధాతను గూర్చి కాళిదాస మహాకవి

"శ్లోకత్వ మాపద్యత యస్య శోకః"

అని ప్రశంసించెను. ఆత్మానాత్మ వివేకము కలిగి జగములనెల్ల సమదృష్టితో గారవించుచు, సత్వగుణంబుల కాటపట్టులయి బరగు మునీంద్రులే యాదికవులుగ నెంచబడుచున్నారు. వీరియనుభవ నివేదనమే వేదమై, పూజ్యమై మెప్పొంది యున్నది. వీరిబోధనములే సకలరాజన్య సమాదరణీయములై జాతీయ సంఘాల యాధారములై స్మృతులుగ బరిణమించినవి. వీరి యంతఃకరణ విన్యాసములే కావ్యరత్నములై రాజిల్లుచున్నవి. స్వానుభవమును ప్రకటింపు తెరవులందలి భేదములచే శ్రుతి స్మృతి కావ్య భేదములు కలుగుచున్నవి.

తస్మాద్వా, ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః, ఆకాశా ద్వాయుః.
వాయో రగ్నిః అగ్నేరాపః. అద్భ్యఃపృధివీ. పృథివ్యాఓషధయః.
ఓషధీభ్యోన్నం, అన్నాత్పురుషః.

—శ్రుతి.

మాతృదేవోభవ – పితృదేవోభవ – ఆచార్యదేవోభవ,
యా న్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని, యా
న్యస్మాకగ్ం సుచరితాని. తానిత్వయోపాస్యాని నోఇతరాణి.

—స్మృతి.

షష్టివర్ష సహస్రాణి జాతస్య మమ కౌశిక,
దుఃఖేనోత్పాతశ్చాయం న రామం నేతుమర్హసి,
విప్రయుక్తోహి రామేణ ముహూర్తమపి నోత్సహే,
జీవితం ముని శార్దూల న రామం నేతుమర్హసి.

—రామాయణ కావ్యము.

ఈ మూడు వాక్యముల శైలిని పరికించినచో మొదటిదియగు ప్రతివచనమందు స్వానుభవము సాధువుగ జెప్పబడియున్నది. రెండవదానియందు అజ్ఞాధికారములతో నిర్దేశింపబడియున్నది మూడవదానియందు హృదయమర్మముల భేదింపురీతి వర్ణింపబడియున్నది. ఈ మూడు వాక్యముల వలనను చదువరుల మనఃస్థితి యౌన్నత్యమును బొందుచున్నది. ఆనందము కలుగుచున్నది. మనస్సున కొక విధమగు వికాసము, సంతోషము, ప్రీతియు నేర్పడుచున్నవి. కాని యీ వాక్యములయందు అర్థగౌరవము కొరకుగాని, రచనాసౌష్ఠవము కొరకుగాని కవి యత్నించినట్లగుపడదు. తనబుద్ధికి తోచినరీతి సూటిగా సాధుపదములతో తన యభిప్రాయమును చిత్రించెను. "ఋషీనాం పునరాద్యానాం వాచ మర్థోనుధావతి" అనువాక్య మీ మాటయందును స్పష్టమగుచున్నది. పూర్వకవులు శబ్ద సౌష్ఠవ మభిలషించరు. అలంకారముల నపేక్షించరు. వృత్తముల విస్తరించరు. శబ్దశాస్త్రముల గౌరవించరు. నిర్మలమై, పవిత్రమై, నిర్హేతుకమై, యాత్మప్రేరితమయిన మనోవిన్యాస ప్రాబల్యమే వీరి కవితానైపుణ్యమునకును, వీరి నిరుపమ కల్పనాశక్తికిని కారణమగుచున్నది. మహాకవులందరును మంచిద్రష్టలై యున్నారు వీరి పంచేంద్రియముల గ్రహణశక్తి సామాన్య మానవులందుకన్న మిక్కిలి వికసించియున్నది. ఈ బాహ్యేంద్రియ విస్ఫుటమునకు తోడు వీరి యాధ్యాత్మిక దృష్టియు బలుతెరంగు లధికముగ నుండును.

"అతిచతురకవేర్దృష్టిరప్యుజ్ఝితోర్వీః ప్రాప్య వ్యోమ్నాంతరాళం పునరపి సహసా విందతే ధ్యాన ముర్వీః."

వీరి మానసము కడుమెత్తనైనది. వీరియంతఃకరణ జగద్వ్యాప్తమైనది. వీరిరాగద్వేషములు, సుఖదుఃఖములు, క్రోధానుకంపములు స్వవిషయములందు గాక జగద్ధితార్థములగు తావుల వ్యక్తమగుచున్నవి. తన్నెంత మరచితే కవి యంత మిన్నయగునని కొందరు రసజ్ఞులు చెప్పుచున్నారు. వాల్మీకి కిరాతునిపై కోపగించినరీతి 'ధురంధర'ను చిత్రకారునిచే చిత్రింపబడియున్నది, అందు వాల్మీకి నిస్పృహతో 'మానిషాద ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీ స్సమాః' అనిపలుకునట్లగపడును. కాని వీని చర్యయం దామహర్షి కెట్టి మనస్తాపము కలుగలేదు. లోకహితమే వీని యాత్మప్రవృత్తికి కారణము. 'గద్యవాల్మీకి' యని పేరొందిన 'విక్టరుహ్యూగో' మహాకిరాతుల వర్ణించుపట్లగూడ నెట్టి నిస్పృహయే చూపట్టును. 'అయాగో', 'రిచ్చర్డుదిథర్డు', 'మాక్బెత్తు' మున్నగు క్రూరులయెడ 'షేక్స్పియ'

రీట్టి నిస్పృహయే ప్రకటించుచున్నాడు. మహాకవులరీతి ఇదియే తొల్లిటి కవులందు విశాలమైన ప్రకృతి పరిజ్ఞానమునకు తోడు తాముచూచిన విషయముల యెడ మహా యోగీంద్ర సాధ్యమగు నిస్పృహ గాన్పించుచున్నది.

కావున పూర్వకవుల తెరవులలో ప్రపంచానుభవము అంతఃకరణ పారిశుద్ధ్యము, నిస్పృహయు గోచరించుచున్నవి. వీనికితోడు కావ్యాలంకార రాహిత్యము శాస్త్రనిబంధనా గర్హణయు విశదమగును. వీరికి భావమే కావ్యోద్దేశమగుచున్నది. అలంకారము నిరుపయోగమగుచున్నది. ఈ విధముగ నుత్పన్నమయిన సత్కవిత్వము కాలపై పరీత్యమునంజేసి యనేక మార్పులఁ జెంది శబ్దాలంకార చమత్కార పూరితములగు రీతుల జెలరేగి రుచిభేదములును, పాకభేదములును, వృత్తభేదములును తామరతంపరలై యతిశయిల్లి విద్వజ్జనానందకరమై లోకహితము కానేరక కావ్యోద్దేశమును సమర్థింపజాలక చెడియున్నది.

శిష్టాసభంగా సద్వర్ణ్యా నిర్దోషాద్గుణా మృదుః,
నానాభంగీ విలాసాచే త్కృతి ర్వికృతి రన్యథా.

మున్నగు కావ్యలక్షణము లేర్పడి యున్నవి. ఒకే అర్థమును సూచించు నీదిగువ పాదముల రెంటిని బరికించి కావ్యసాధనములందలి భేదముల గమనింపుడు.

"సముద్ర ఇవ గాంభీర్యే స్థైర్యే చ హిమవానివ."

"కుపితరాఘవ ఘనక్రూర నారాచంబు
తనువుదాకని నాటి వనధిరాజు,
క్రుద్ధకుంభోద్భవ భ్రూలతా కౌటిల్య
విహృతి క్రుంగని నాటి వింధ్యశిఖరి,
......గాంభీర్య సారమునను
ప్రకటధైర్య కళాకలాపముల యందు"

తొల్లిటి కవుల సూటియు, ఇటీవలివారి వక్రగతులను పై యుదాహరణములవలన స్పష్టమగు చున్నవి.

సంస్కృత కావ్యరీతులు వాల్మీకి కాలమునుండి మురారివర కేగతి విస్తరించి వికృతి జెందియుండెనో, ఆంధ్రకవితా రూపములుగూడ జంగమకథలు,

సుద్దులు, ఏలపాటలనుండి యాముక్తమాల్యద, వసుచరిత్రాది జటిల ప్రబంధ ముల రూపము నాగతినే జెందియున్నది. తొల్లిటి కవితారీతులు పండితజనదూషితములై, సభాగర్హితములై, పామరజనానందకరములై నీచాశ్రయము జెందియున్నవి. కొన్ని కొన్ని తావుల నివి శృంగార దూషితములై యున్నవి.

యదా ప్రకృత్యైవ జనస్య రాగిణో
భృశం ప్రదీప్తో హృది మన్మథానలః,
తదాత్ర భూయః కిమనర్థపండితైః
కుకావ్యహవ్యాహుత నివేశితాః.

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారును, శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారును ఆంధ్రమునంగల తొల్లిటికావ్యరూపముల యందలి చందములగూర్చి యనేక తావుల ముచ్చటించియున్నారు. నన్నయ నన్నెచోడులకు పూర్వము జలువన్నెల గన్న తెనుగుబాసలో దేశీయకావ్య సాధనము లనేకము లుండినవి. ఇట్టి సాధనములే ప్రస్తుతము సంస్కృతాంగ్ల సారస్వత ప్రభావమున మార్పొందని యాంధ్రసీమలలో వాడబడుచున్నవి. హైందవ పాశ్చాత్య విద్యాసంస్కారమొందిన దేశభాగములలో సైతము జనసామాన్య మీకవితాసాధనముల వలననే తమకు వలయు హితవాక్యములను, నీతిబోధను, కావ్యరతియు గైకొనుచున్నది. సంస్కృతాలంకార నిబంధనల ననుసరించి రచింపబడిన కావ్యముల జదువువారు తెలుగుదేశములో ఒక లక్ష యుండవచ్చును. అదియును సంశయాస్పదమే. కాని దేశీయకావ్య సాధనముల వలన ఆనందము జెందువారు కోటి ఏబదిలక్షల జనమునకు తగ్గియుండరు. దీని కారణమేమి?

సంస్కృతాలంకారముల ననుసరించి వ్రాసినవారు ప్రౌఢకవులు. వారు పల్లెనాటిలోని మిద్దెకొంపలో కూర్చుని హిమాలయ తుషారములను వర్ణించుచుందురు. రానురాను వారి కన్నులు మూతవడినవి. సిఘంటు పదసముదాయ మభివృద్ధి జెందెను. వారు మాటల పోగులల్లురి. వారి రసములు, ఆలోచనలు, వారి పదసామగ్రి, కావ్యరీతులును సంస్కృత సారస్వతమునుండియో, పారసీనుండియో, ఆంగ్ల వాఙ్మయమునుండియో దొంగిలింపబడినవేకాని యాంధ్ర సారస్వతమునకు జెందినవి కావు. ఆంధ్రుల ప్రత్యేక జాతీయతను జూపించునవి కావు. ఆంధ్రవాణియొక్క పూర్వసంప్రదాయముల సూచించునవి కావు.

అచ్చతెనుగు ప్రబంధములు సైతము సంస్కృత కావ్యరీతుల ననుసరించెడివే. వీనిలో చాలభాగము రసరహితముగ నున్నవి. ఏలపాటలం దీదోషములు లేవు. అవి చక్కని దేశీయ పదములతో యాంధ్రుల తొల్లిటి యభిప్రాయములను జిత్రించు చున్నవి. ఇందలిపదము లు సూటియైనవి. సూటియగుటయెగాక చిన్న పిల్లలకును, చిన్నసంస్కారముగల జాతులకునుంగల పదలోపమున మిక్కిలి యందముగ నున్నవి. మనము బైసికిల్, ద్విచక్రి, పదచాలిని మున్నగు ప్రౌఢ పదములతో చూపు త్రొక్కుడు బండిని ఏల పాట కారకుడు 'దారలు తొక్కే మరలబండీ' అనే ముద్దుమాటలతో వర్ణించియున్నాడు. పూర్వకవుల రీతులలో ఇట్టి బాలకవాచాలత్వమే ముఖ్యాంశముగ నున్నది. ఇందలి సౌకుమార్యము, రామణీయకమును, ప్రశాంత సౌందర్యమును సామాన్యముగ ప్రౌఢ కవిత్వము నందు గోచరించవు. అదియునుగాక ఏలపాటలలో తెనుగుభాష సార్థకోపయోగ మును జెందుచున్నది. అది తెనుగురాగాల యాశ్రయమైన సంగీతమున కుపక రించెడి భాష. దీని స్వీయవ్యక్తి భక్తి శృంగార రసములకు సంబంధించిన ప్రశాంతమాధుర్యము. ఒక్కొక్క దేశభాష కా యా దేశీయభావముల ననుస రించెడి స్వీయవ్యక్తి యేర్పడుచుండును. హిందూస్థానీ వీరబీభత్స రసములకు ముఖ్య సాధనము—సంస్కృతము కరుణరసమున నేర్పడినది. ఆంగ్లభాష వ్యావ హారిక ధూర్త వినయమునకును ప్రకృతి చాంచల్యమునకును తగినభాష. ఆంధ్ర మటులనే భక్తిశృంగార రసముల వలన జనించు ప్రశాంత మాధుర్యమున కునికి పట్టు. ఏలపాటలలో యీ నైజవ్యక్తి కడుదూరము గోచరించును. ఏలపాటలు మహాప్రబంధములు కావు. ఉపక్రమ జోపసంహారములతో అందముగ దీర్చినవి కావు. ఎట్టి కావ్యాలంకారముల వెలుగున వీని బరీక్షించినను వీనియం దసంపూర్ణ తయు, దూష్యగ్రామ్యమును గోచరింపక మానవు. కాని యాంధ్రదేశాభిమాన మున తెలుగు మానిసుల హృదయసీమలు రగులునప్పుడు, తెలుగుశిల్పములు, తెలుగు దుకూలములు, తెలుగువంటలు, తెలుగు దినుసులే వారి మానసమును తృప్తిపరచునప్పుడును, తెలుగే వారి పరమదేవతయై బరగునప్పుడును ఏల పాటల లోపము లంతలోపములుగ నిలువనేరవు. ఆంధ్రుడు సంస్కృతసార మపారముగ జదివి కాళిదాస మయూరాదుల రమణీయ భణితులయం దోలలాడు గాక! ఆంగ్లసారస్వతపు వివిధ భావాంతరాళములజొచ్చి చెన్నొందు గాక! పారసీకపు గాన సౌకర్యమున మైమరచుగాక! పూర్వపశ్చిమ ఖండముల వివిధ భాషల సొంపు తిలకించుగాక! వాని భావవాహక నైపుణ్య మెట్టిదైనను నగు గాక! రాత్రి వీథులవెంట గుంపులై దేశీయగాన క్రమములతో దేశీయచ్ఛందో

బద్ధమైన ఏలపాటలను పాడు సోమరి పిల్లగాంద్ర ప్రభావమున కా విదేశభాషా సౌందర్యములు పోలజాలవు. ఈ పాటలు మన హృదయమును కరగించును; మనసు నుత్సాహ పరచును; ఏదోయొక క్రొత్తరసము, ఒక నూతనశక్తి మన దేహమున జొచ్చి పులకరింపజేయును. వాని ప్రభావము వినినవారికే గోచరించును. భక్తికీర్తనలు, తత్వములు ఎంత సామాన్యమో ఏలపాటలుకూడ నంత సామాన్యమే. శృంగార రసప్రధానమగు కీర్తనలలో సామాన్యముగ విప్రలంభ శృంగార మధికముగనున్నది. పూర్వరాగమున విచారము తక్కువ; హెచ్చరిక ఎక్కువ. విప్రలంభమున విచారమధికము.

"నాకు నీకూ దూరమాయె
నల్లకొండా లడ్డమాయె
చంద్రగిరి చీరె లంపవోయి"

కరుణాత్మకమగు విషాదము బహు రుచికరముగ వచ్చుచుండును.

"రావిచెట్టెక్కావు రాగాలు తీశావు
రాలిపోతవు లంజకొడుకో రెంకయ్యా"

దయ, జాలి, ప్రేమవలని భయము ఇంత చక్కగా సంస్కృతాంధ్రాంగ్లేయ కావ్యములలో నెచ్చటను మాకు స్ఫురించలేదు. "ప్రేమపశ్యతి భయాన్యపదీని"యను భారవి సుభాషిత మీ వెంకయ్యపాటలో పాటలో మూర్తీభవించి యొప్పుచున్నది. స్వస్థానమును వీడి, యాత్మగౌరవమును విడనాడి, వీధుల పాలయి చెడిపోవుచున్న ప్రియురాంద్రయెడ భర్తలకును, తల్లిదండ్రులకును, అన్నదమ్ములకును గలుగు విచార మీ దిగువ దొమ్మరిపాట నతిక్రమించి వర్ణించిన కవు లెవ్వరు?

"రంగులైన చీరెకట్టి
బజారంచు రెవికె తొడిగి
బజారుపాలైతివే
రమణి ముద్దుల గుమ్మా!"

నాయకా నాయికల సంభాషణలలో సంస్కృత కవుల చమత్కారము లనేకములు ఏలపాటలలో గానుపించును.

నామగడూ వాడ కెళ్ళే
నాకు తోడూ ఎవరు లేరూ!
కోడికూ సే వేళ దాకా
తోడురారా వన్నెకాడా!

టననాటంకచలో.

శృంగార విలాస వర్ణనలలో సంస్కృతాలంకారిక సమ్మతములగు పద్య రత్నములతో సరియగు నీ క్రింది ద్విపదములోని యందమును చదువరులు ఖరికించెదరు గాక:

"చింతచెట్టూ చిగురు చూడూ:
చిన్నదాని యీడు చూడూ:
అద్దములో నీడ చూడూ:
ఇద్దరికి జోడు చూడూ:

టననాటంకచలో.

ఇందలి స్వారస్యము, ఉపమోత్ప్రేక్షరూపక నిదర్శనాద్యలంకారములలో దేనిలోనూ చేరక వీనియన్నిటి రుచిని కలిగి ప్రకృతిని ఇక్కగవర్ణించుచు, శృంగార పర్యవసాన సంపాదనకు వలయు భావముల ప్రకటించుచు, తేటగు పదములతో అర్థవేగము, క్రియాత్వరితమును గలిగియుండుటచే-ఈ ద్విపదము నకు సరియగునవి బహు అరుదుగ మాత్రమే గోచరించును.

"పశ్యమే పార్థ రూపాణి శతశోఒథ సహస్రశః"అను తావున వ్యాసుల వారును, కాసెట్టీ, మరయసు"అ పరస్పరానురాగము నభివర్ణించునెడ విక్టరు హ్యూగో మహర్షియు నీ తెలుగు ఏలపాటలోని ద్విపదమును సమీపించు చున్నారు.

పై నొక తావున చెప్పిన రీతి తెలుగు ఏలపాటలలో కొంత చక్కని పసి తనము కాన్పించుచున్నది.

నరసాపురమునుంచీ
నలిగినలి గొస్తంచే
తాళ్ళాపాలెముకాడా
తగిలింది జరమూ।

జరము చలిజరము పులకరము౹
దణ్ణం దణ్ణామంటే
వదలాదే జరిమూ౹ జరమూ!

ఇది ఎంత పసిపాగా నున్నదో చూడండి! ఎంత జాలికరము! ఎంత భయంకరము౹ వానికి తగిలిన చలిజ్వరకంపమే మనలగూడ బాధించునట్లగ పడుచున్నది.

విటుని మాయలకు లోబడి లోకమెట్టిదిమో గుర్తెరుగని పసిదాని మాట లీ పాటలో విశదముగ చిత్రింపబడి యున్నవి

"కొత్తా కోరంకిదాక వస్తావంటే పిల్ల?"
"కొత్తా కోరంకివాక వస్తాగానీ, నన్ను
కొట్టకుండ తిట్టకుండ ఉంటావంట్రా?"

ఈ వరమెంత యమాయకముగ నున్నది? ఎంత చిన్నటి వార్తగ దోచు చున్నది? ఎంత రసవంతముగను, స్వభావోచితముగను, నిజముగను ఉన్నది.

ఏలపాటలలో కొన్ని నీతి బోధకములగు విషయములు గూడ గలవు.

"తల్లి పిల్లనిడసి
యాడు సేసుకున్న భార్య నిడిసి
దొమ్మరదాని యెంటపోతే
ఓలు మెడకు యేసెరా!
కల్లుతాగి ఒళ్ళుమరచి
కైపుయెక్కి తిరగబోకూ
పెళ్ళిసేసీ పంపుతారూ
పెందలకాడే మేలుకోరా!

టపనాటంకథలో.

కొన్ని తావులలో మాత్రము 'ఓమరు ఖయ్యాము' చెప్పెడి రీతి విషయ వ్యాపార పారవశ్యమున ఒడలెరుంగక సంచరించెడు దురుపదేశములు గాన వచ్చును; కాని ఇవియు నా మహాకవి వాక్యములబోలె బీభత్సరసోదయహేతు వులై నీతి విధాయకములగు వాక్యములుగ నుపయోగించు ననుటకు సందియము లేదు.

"రారా పోదాము సారాయి తాగుదము
వారామేసి రోజులకు వళ్ళుతెలియకుందాము.
రారపోదాము.
ఏలూర్బజారుచూడు సేవలమ్మగుడిచూడు
సారైదుకాణంచూడు సారమైన సీకుల్పాదు"

కాని ఇట్టివియును స్త్రీ విషయమున పాడబడు శృంగార గీతములోని ప్రయోగములను శృంగార రసాస్వాదనార్థ ముపయోగించునట్లగపడుటలేదు. వానిని పాడునపుడు ఒక విధమగు ఉద్రేకము, ఆనందము, సంతుష్టియు నుద్భవించును. ఆంధ్రుని హృదయాంతరంగమున మాతన సౌభాగ్యములును, నూత్న రసవిలాసములును జిందులాడును. చిరకాలమునుండి విడనాడి మరపొందిన మిత్రుల దర్శించిన తెరంగున నీ ఏలపాటల సురుచిర కీర్తనము తెలుగుభాషాభిమానుల మానసము నుల్లసిల్ల జేయును.

ఈ పాటల రూపమున దేశీయగీతములు దేశచరిత్రలు దేశభక్తియు నేర్పవచ్చును. ఉత్పలమాల శార్దూలాది వృత్తము లింతవరకు ప్రజాసామాన్యమున జేరలేదు. ఇకముందు జేరునను ఆశయులేదు. ప్రజాసామాన్యమున ప్రాకి వన్నెకెక్కిన కీర్తనలరీతుల నవలంబించి మనము గరపదలచిన విషయముల నందు ఇమిడ్చినచో త్వరలో ఆంధ్రదేశమున నూతనాభిప్రాయములు విస్తరింపగలవు. చదివినవారా కొద్దిమంది. చదువనివా రసంఖ్యాకులు. వీరివద్దకే రసజ్ఞులును కార్యజ్ఞులునునగు పండితులు తమ 'జ్ఞానదివ్వె' ను తేవలయును గాని జనసామాన్యము వారి వద్దకు రానేరదు. వారి మార్గముల ననుసరించినగాని వారికి మన అభిప్రాయములు ఆదర్శములు జేరనేరవు.

సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లేయ భాషావిశారదుడు*

---

*గ్రంథాలయ సర్వస్వము, ద్వితీయ సంపుటము, ప్రథమ సంచిక.

# శ్రీనాథుని గ్రంథములు

శ్రీనాథమహాకవి ప్రణీత కావ్యములలో హరవిలాసమను నది యొకటి. ఈ మహాకావ్యము యొక్క యొక ప్రతియుఁ దెనుఁగుదేశమునందు లేకుండ లోపించి యుండెను. సీతారామాచార్యుల కాలమున దీనిని ఆంధ్రలోక మెఱుఁగదు. అఱవ దేశములో, తంజావూరు పుస్తకభాండాగారమునందు దానిని సంపాదించి యాంధ్రుల కొసంగిన యశస్సు శ్రీ వీరేశలింగము పంతులుగారిది. దానిని మొదటఁ బ్రకటించిన గౌరవము సరస్వతీ పత్రికాధిపతులది.

హరవిలాసమనునది శివమాహాత్మ్యమును వర్ణించుచుట్టిన యేడాశ్వాసముల పద్యకావ్యము. ఇది యవచి తిప్పయసెట్టికి నంకితము చేయఁబడినది. కొండవీటిని ౧౩౮౦-౧౪౦౦ వఱకుఁ బాలించిన కుమారగిరి యొద్ద నీ సెట్టి సుగంధ భాండాగారాధ్యక్షుఁడుగ నుండెను. కవివర్ణన లతిశయోక్తులు కావేని ఈతఁడు ద్వీపాంతరములతోను, దేశాంతరములతోను వర్తకము చేయుచుండిన కోట్యధీశుండుగఁ గానవచ్చుచున్నాఁడు. కావునఁ జరిత్ర విషయమున ఈ కావ్యమధికాదరణీయము. కాని ప్రస్తుత మా విషయమును గుఱించి విచారింపఁ దలఁపలేదు. ఈ కావ్యమునందు శ్రీనాథుని కావ్యముల గాలనిర్ణయముచేయుటకు మంచి సాధనము కలదు. అందును గుఱించి యిచ్చటఁ గొంత చర్చించెదను.

కృతిపతి యొక్క తమ్ముఁడైన తిరుమల సెట్టిని వర్ణించుచుఁ గవి యిట్లు వ్రాసి యున్నాఁడు :—

చ. "హరిహరరాయ పేరోజిసహా సురధాణ గజాధిపాది భూ
వరులు నిజప్రభావ మభివర్ణనసేయఁ గుమారగిర్యధీ
శ్వరుని వసంతవైభవము సర్వము నొక్కఁడ నిర్వహించు మా
తిరుమలనాథ సెట్టికిని ధీగుణభట్టికి నెవ్వ రీడగున్.

ఈ పద్యమునందు ముగ్గురు సమకాలికులైన రాజులపేళ్ళు చెప్పఁబడి యున్నవి. వీరిలో హరిహరరాయలు విజయనగరాధీశుఁడు. ౧౩౭౭ మొదలు ౧౪౦౪ వఱకు రాజ్యము చేసెను. 'ఫేరోజీసహా' బహమనీరాజు. ౧౩౯౭ మొదలు ౧౪౨౨

వఱకు రాజ్యము చేసెను. కుమారగిరి కొండవీటి రాజు. ఈతఁడు శ్రీ జయంతి రామయ్యగారి మతమున ౧౩౭౭ మొదలు ౧౩౭౮ వఱకు రాజ్యము చేసెను. *శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి మతమున ౧౩౮౩ మొదలు ౧౪౦౦ వఱకు రాజ్యము చేసెను. ¹ఈ ముగ్గురు రాజులు బ్రతికియుండి స్వస్వరాజ్యములను పాలించుచుండినకాలము శ్రీ జయంతి రామయ్యగారి యభిప్రాయము ప్రకారము ౧౩౭౭-౧౩౯౭ రెండు సంవత్సరములు. శ్రీ వీరభద్రరావుగారి యభిప్రాయము ప్రకారము ౧౩౯౭-౧౪౦౦ నాలుగు సంవత్సరములు. ఇట్లు హరవిలాస నిర్మాణ కాలము మనము ఒకరెండు సంవత్సరముల అంతరముతో సరిగఁ గనుఁగొనఁ గలిగితిమి. ౧౪౦౦ వ సంవత్సర ప్రాంతమున ననఁగా ౧౩౭౮ లోనో, ౧౩౭౭ లోనో, కుమారగిరి ప్రభుత్వపుఁ జివరకాలమున, ఈ కావ్యను వ్రాయఁబడినదని స్పష్టపడుచున్నది. దీనిని బట్టి యితర కావ్యములయొక్క కాలనిర్ణయము చేయ వచ్చును.

శ్రీనాథకృతమైన కాశీఖండమునందు ఈ క్రింది పద్యము కలదు :—

సీ. చిన్నారి పొన్నారి చిఱుతకూకటినాఁడు
        రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూగుమీసాల నూత్నయౌవనమున
        శాలివాహన సప్తశతి నొడివితి
సంతరించితి నిండు జవ్వనంబునయందు
        హర్షనైషధకావ్య మాంధ్రభాషఁ
బ్రౌఢనిర్భర వయఃపరిపాకమునఁ గొని
        యాడితి భీమనాయకుని మహిమ

ప్రాయమింతకు మిగులఁ గైవ్రాలకుండఁ
గాశికాఖండమను మహాగ్రంథమేను
దెనుఁగు చేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి.

---

1 Epigraphia India Vol. VIII. Page 13.
1 ఆంధ్రుల చరిత్రము; ౩ వ భాగము. ౧౮౧ వ పుట.

ఈ పద్యమునందలి "చిన్నారిపొన్నారి చిఱుతకూకటి"కిఁ బదునాఱేండ్లనియు "నూనూగు"నకు నిరువదియైదేండ్లనియు, నిండు జవ్వనము"నకు ముప్పదియైదనియు, "వయః పరిపాకమునకు" ఆఱువది యేండ్లనియు మనము సాధారణముగ నర్థము చేసికొనవచ్చును. హరవిలాసమునందు నైషధము పేర్కొనఁబడినది. కావున హరవిలాసమునకుఁ బూర్వమైదేండ్లక్రింద నైషధము రచింపఁబడిన దనుకొందము. హరవిలాసమునకు మనము ౧౪౦౦ల ప్రాంతము కాలమేర్పఱచినందున, నైషధకాలము ౧౩౯౫ అగును. అప్పటికి శ్రీనాథుఁడు ౩౫ సంవత్సరముల వాఁడనుకొనిన ౧౩౬౦వ సంవత్సరప్రాంత మాతని జన్మకాల మగును. ఇఁక మరుద్రాట్చరిత్ర ౧౩౭౬ లోను, శాలివాహనసప్తశతి ౧౩౮౫ లోను, నైషధమందుఁ బేర్కొనఁబడిన పండితారాధ్య చరిత్రము ౧౩౮౫ లోను, భీమఖండము ౧౪౨౦" లోను, కాశీఖండము ౧౪౩౦ లోను రచింపఁబడి యుండవచ్చును. "శివరాత్రి మాహాత్మ్యము" అను శ్రీనాథ విరచిత కావ్యమొకటి ఆంధ్రసాహిత్య పరిషత్తువారికి దొరికినది. *"అది భిక్షావృత్తియను జంగముల మతమువారికి నంకిత మొనర్పఁ బడినది. దానిగుఱించి మనకు నధికము తెలియువఱకును అది ౧౪౩౫-౮ ప్రాంతమున రచింపఁబడినట్లు మనమెంచుకొందము. ౧౪౧౦లో ఫిరంగిపుర శాసనమును, ౧౪౧౩లో ఆలపాడు తామ్రశాసనములును, ౧౪౧౬లో అమీనాబాదు శాసనమును-శ్రీనాథుఁడు కొండవీటి రెడ్లయొద్ద విద్యాధికారిగ నుండి రచించినట్లు కనఁబడుచున్నది. [1]శ్రీనాథుఁడు ౧౪౪౦ ప్రాంతమునఁ గీర్తిశేషుఁ డైనట్లు మన మూహింపవచ్చును. ఏలయన, "కాశికా విశ్వేశుఁ గలిసె వీరారెడ్డి" యను చాటువువలన నీతఁడు రాజమహేంద్రవరము రెడ్లప్రభుత్వము అంతరించు వఱకుండెననియు, తరువాతఁ గొద్దికాలములోనే మృతుఁడయ్యెననియు అనుకొనవచ్చును. "అల్లాడ వేమారెడ్డి శాసనములు ౧౪౩౭-౩౮ తరువాతఁ గానవచ్చుటలేదు. వీరభద్రారెడ్డి శాసనములు ౧౪౩౩-౩౪ తరువాతవి లేవు. ౧౪౪౩-౪౪ వఱకు రాజమహేంద్రవరము విజయనగర రాజుల పాలయినట్టును, రెడ్ల ప్రభుత్వ మంతరించినట్టును మనము రెండవ దేవరాయల

* పరిషత్తువారికి దొరికిన ప్రతి నాలుగాశ్వాసాల అసంపూర్తి ప్రతి. అయిదాశ్వాసాల సంపూర్ణప్రతి సంపాదించి మిత్రులు డా॥ బి. రామరాజుగారు ఇటీవల ప్రచురించారు.

—పురిపండా

1 Epigraphia Indica Vol. XI. P: 315.

ద్రాక్షారామమందలి శాసనమును బట్టి నిశ్చయింపవచ్చును. కావున శ్రీనాథుఁడు ౧౪౪౦ కంటె, దరువాతఁ బ్రతికియున్నట్లు నిదర్శనము లేవియులేవు. శ్రీనాథుఁడు మొత్తము మీఁద నెనుబది సంవత్సరములు బ్రతికి యుండెనని తేలుచున్నది. ఇట్లు పైని శ్రీనాథుని గుఱించి మనము తేల్చుకున్న కాలము లన్నియు నీ క్రింది విధముగ పట్టికారూపమున నీయవచ్చును.

క్రీ. శ. ౧౩౬౦ జన్మకాలము.
౧౩౯౬ మరుత్తరాట్చరిత్ర రచనాకాలము.
౧౩౮౫ శాలివాహన సప్తశతికాలము.
౧౩౯౫ ఆంధ్రనైషధ కాలము.
౧౪౦౦ హరవిలాసకాలము.
౧౪౧౦ ఫిరంగిపుర శాసనకాలము.
౧౪౧౩ అలపాడు తామ్రశాసనకాలము.
౧౪౧౬ అమీనాబాదు శాసనకాలము.
౧౪౨౦ భీమఖండకాలము.
౧౪౩౦ కాశీఖండకాలము.
౧౪౩౫ శివరాత్రి మాహాత్మ్యకాలము
౧౪౪౦ మరణకాలము.

పల్నాటి వీరచరిత్రమును ఎప్పుడు వ్రాసినది తెలియదు. అయినను హర విలాసము రచించిన కాలము (౧౪౦౦) మొదలుకొని భీమఖండము రచించిన కాలము (౧౪౨౦) వఱకును వేఱుకావ్యములు రచించినట్లు కానరాదు. కావున ఆ కాలమునందు నీగ్రంథమును శ్రీనాథుఁడు రచించియుండునని మనమూహింప వచ్చును.

పైని చెప్పినదంతియు హరవిలాసము యొక్క నిర్మాణ కాలమును బట్టి చేయఁబడిన యూహ. కాని హరవిలాసము కుమారగిరిరెడ్డి కాలమునందు రచింపఁ బడలేదనియు, శ్రీనాథుని చరమదశయందు వ్రాయఁబడియె ననియుఁ జెప్పు పూర్వ పక్షమొకటి కలదు. ఇదివఱకు శ్రీనాథుని గుఱించి వ్రాసినవా రందఱును ఇట్లే

వ్రాసినారు.* కాని యిందుకు వారు కారణములను ఇచ్చియుండలేదు' మన మాకారణములను ఊహించి నివారింప వచ్చును. హరవిలాసము చివర గ్రంథముగ నెంచుటకును, ౧౪౦౦ లో రచింపఁబడినది కాదనుటకును హరవిలాస గ్రంథమునందు నేవిధమైన యాధారమును కానఁబడదు. అది కుమారగిరియొక్క పెద్దసెట్టికి నంకితము చేయఁబడినది. కావున నది కుమారగిరి కాలమునందే రచింపఁబడె ననుకొనుట స్వాభావికము. కుమారగిరి చనిపోయిన తరువాత ౩౦ సంవత్సరములకో ౪౦ సంవత్సరములకో వ్రాయఁబడిన దనుకొనుట యస్వాభావికము. ఇదియుఁగాక ఈ గ్రంథమునందు, కృతిపతిని ఆతని బంధువులను గుఱించి వ్రాసిన యీ క్రింది గద్యపద్యముల వలన కుమారగిరి సేవలో వీరుండగ నీగ్రంథము వ్రాసినట్లు మన మూహింపవయును; గాని, కుమారగిరి చచ్చిపోయిన తరువాత నలుబదియేండ్లకు వెనుకటి సంగతులు జ్ఞాపకము తెచ్చుకొని వ్రాసెననుట పొసఁగనేరదు

"...కర్పూర వసంతరాయుఁడును...మాణిక్య సింహాసనాధీశ్వరుండును... వశీకృత నిఖిలభూభుజుండును...నయోధ్యానగర స్వామియో యనఁబరఁగి జంబూద్వీపభూభువన మండలీమకుట మండనాయమానంబగు కొండవీటిపురంబు రాజధానిగాఁ గీర్తిలతాధిష్ఠితాష్టాదశద్వీతాంతరాళుండు కొమరగిరి నృపాలు వలన నాందోళికాచ్ఛత్రచామర తురంగాది రాజ్యచిహ్నములువడసి యమ్మహారాజునకుం బ్రతిసంవత్సరోత్సవంబునకుం దగిన... సుగంధద్రవ్యంబు లొడఁ గూర్చియుఁ జీనిసింహళ తవాయి హురుమంజి జలనోగి ప్రభృతి నానాద్వీపనగరాకరంబులగు

* హరవిలాసమును మొదట ప్రకటించినవారు (శ్రీ పోలవరము జమీన్‌దారుగారు) "హరవిలాసము ౧౪౪౦ ప్రాంతములను రచించినట్లు స్పష్టమగుచున్నది" యని వ్రాసిరి. 'శ్రీనాధుని చారిత్ర'మను బహుమతి వ్యాసము వ్రాసిన శ్రీ కూనపులి లక్ష్మీనరసయ్యగారు తమ గ్రంథమునందు" (హరవిలాసము) ఈతని యంతిమ గ్రంథమని నేనూహించెదను." (పు ౩౭) యని యభిప్రాయపడిరి. శ్రీ వేంకటరాయ శాస్త్రిగారు దీనిని శ్రీనాథుని చివర గ్రంథమని యభిప్రాయ పడిరి. (సర్వంకషటీక పు. ౧౧.)

'పెదకోమటి భూపాలుఁడు మరణము నొందిన తరువాత తాను రాజమహేంద్రపురముఁ జేరక మునుపు హరవిలాసమును రచించి...తిప్పయసెట్టి కంకితము గావించెను' (ఆంధ్రుల చరిత్రము. మూడవభాగము, ౨౨౪ పుట.) అని శ్రీ వీరభద్రరావుగారి యభిప్రాయము.

ధన...గౌణిక్యంబులు తెప్పించియు...సదాచారుండును ననవిఖ్యాతిగాంచిన యవచి దేవయ తిప్పప్రభుండొక్కనాఁ డాస్థానమండపంబున సుఖోపవిష్టుండై" (౧-౭).

మ. "ఖుసిమీరన్ సురధాణి నిండుకొలువై కూర్చున్నచో నీకరా
ళ్యసనంబు న్నుతియించు రా యవచితిప్పా (౧-౨౨)"
"...కుమారగిర్య ధీ
శ్వరుని వసంతవైభవము సర్వము నొక్కఁడ నిర్వహించుచున్. (౧-౨౩)"

"కొమరగిరిరాజదేవేంద్రు కూర్మిహితుఁడు" (౧-౨౪)

క. "కొమరగిరి వసంతనృపా
గమకవివర గంధసార కస్తూరీ కుం
కుమ కర్పూర హిమాంభ
స్పముదంచిత బహుసుగంధిశాలాధ్యక్షా. (౧-౩౦)

ఇట్లు, హరవిలాసము వ్రాయునప్పుడు కుమారగిరి బ్రతికియుండెననియు కొండవీటిలో రాజ్యము చేయుచుండెననియు, అతనియొద్ద పెద్దసెట్టిగా అవచి తిప్పయ యుండెననియుఁ జూపు వాక్యము లీ గ్రంథమునందుఁ బెక్కులు గలవు. ఇట్టి వాక్యములున్నను, కుమారగిరి చనిపోయిన తరువాత, తిప్పన అధికారమూడి పోయిన పిదప, హరిహర పేరోజుశాహాలు కీర్తిశేషులైన యెన్నియో వత్సరము లకుఁ దరువాత నీ కావ్యము రచింపఁబడియెనని చెప్పుటకంటె విపరీతమైన సిద్ధాంతము మఱియొకటి యుండదు ఇది కుమారగిరి రెడ్డికాలమున రచింపఁబడలేదని చెప్పనెడం-నైషధము పెదకోమటి వేమారెడ్డి కాలమున వ్రాయలేదనియు, భీమ ఖండము అల్లాడవేమ వీరభద్రులు బ్రతికియుండగఁ జెప్పఁబడలేదనియు, నొప్పు కొనవలసివచ్చి విపరీత సిద్ధాంత ప్రసంగము ప్రాప్తించును.

ఈ ప్రకార మతఃప్రమాణముల వలన నిది ౧౪౦౦ వ సంవత్సర ప్రాంతముననే వ్రాయఁబడియెనని చూపి, యిఁక దీనికిఁ బ్రతికూలములైన బహిఃప్రమాణముల విచారించెదము.

హరవిలాసము ౧౪౦౦ లోనిది యని చెప్పుటకు నడ్డముగ రెండు పూర్వ పక్షములు రావచ్చును. ఒకటి హరవిలాసమునందు నాంధ్రనైషధమును పేర్కొనుట.

రెండవది కృతిపతియైన తిప్పయ్యయొక్క వయస్సునకు సంబంధించినది. ఈ రెంటిని క్రమముగా విచారింతము.

ఆంధ్రనైషధము పెదకోమటి వేమారెడ్డియొక్క మంత్రియైన మామిడి సింగన్నకు నంకితము చేయఁబడినది. * పెదకోమటి వేమారెడ్డి కొండవీటి రాజ్యమును కుమారగిరిరెడ్డి తరువాత, ౧౪౦౦ మొదలు ౧౪౧౫ వఱకు శ్రీ వీరభద్రరావుగారి మతప్రకారమును, ౧౩౯౮ మొదలు ౧౪౧౫ వఱకు శ్రీ రామయ్యగారి మతమునను, ఏలెను. కావున కుమారగిరి కాలములో వ్రాయఁబడిన హరవిలాసము నందు నాంధ్రనైషధమును పేర్కొనుట యెట్లు సంభవించును ? అందుచే హరవిలాసము తరువాత వ్రాయఁబడినది యని పూర్వపక్షము. మొదట చూచుటకు నీ పూర్వపక్షము కొంత బలవత్తరమైనదిగాఁ గానవచ్చును. కాని కొంచెము ఆలోచించిన యెడల నీ పూర్వపక్షమునకుఁ బ్రత్యుత్తరమున్నదని తోఁచును. పెదకోమటి వేమారెడ్డి ౧౪౦౦ లో కొండవీటి రాజ్యమునకు వచ్చినను అంతకుఁ బూర్వమేమియులేని యష్టదరిద్రుఁడు కాఁడు. కొండవీటి వంశములోనివాఁడు. పెద్దకుటుంబమువాఁడు. ఈ క్రింది వంశవృక్షము వలన ఇతనికిని ఇతని పూర్వపు కొండవీటి రెడ్డిరాజులకును గల సంబంధము తెలియఁ గలదు.

---

*నైషధమును అంకితమందిన మామిడి సింగన్న అనవేమారెడ్డికి మంత్రి యని శ్రీ జయంతి రామయ్యగారును ( Epigraphia Indica, vol. XI. p. 315, foot note). రాజమహేంద్రవరము నేలిన వేమారెడ్డికి మంత్రియని శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారును (శృంగార నైషధము, అవతారిక, పు. ౧౧). కుమారగిరిరెడ్డికి మంత్రియని శ్రీ కేతవరపు వేంకటశాస్త్రిగారును (ఆనంద ముద్రాక్షరశాల శృంగారనైషధము పీఠిక ౧౮), వ్రాసియున్నారు. గాని శృంగార నైషధమునకుఁ జివర చివర కావ్యోపసంహారముగాఁ గవిచే వ్రాయఁబడిన గద్యయందు 'పెదకోమటి వేమభూపాల కరుణాపాత్ర' యని వ్రాయఁబడి యుండుటచే, కృతిపతి పెదకోమటి యొక్క కుమారుడైన వేమారెడ్డికి మంత్రిగ నుండెనమట స్పష్టము.




ఈ వంశవృక్షము శాసనములను, వేమభూపాలీయమ్ అనుకావ్యమును అనుసరించి వేయఁబడినది. ఇందు ప్రభుత్వముచేసినవారికి ఒకటి రెండు అంకెలు వేయఁబడి క్రింద గీటుగీయఁబడినది. అందు నైదవవాఁడు పెదకోమటివేమ. ఈతనిపేరు వేమ; తండ్రిపేరు పెదకోమటి; కావున ఈతనిని పెదకోమటివేమ యందురు. ఈతఁడు 'మాచ'ని వంశములోనివాఁడు. మాచని తమ్ముఁడైన '౧వేమ'(ఈతనినే ప్రోలయవేమ యందురు). మిక్కిలి శూరుఁ డగుటచే కొండవీటి రాజ్య మాతనికే పోయెను. ఇట్లు కొండవీటిరాజ్యము రెండవవంశమునకు బోలునను 'మాచ' అతని రెండవకొమారుడైన 'పెదకోమటి' అనామధేయులుగ నుండ లేదనియు, రాజ్యము చేయుచున్నవారికిఁ దోడుగ నుండిరనియు మనమూహింప వచ్చును.[1] వేమభూపాలీయమునందు వీరిని గొప్పరాజులుగఁ గవి వర్ణించినాఁడు. అతిశయోక్తిని వదలినను, కొన్ని గ్రామములు బూతాదినిమిత్తమైనను వీరిక్రింద నుండెనని యెంచుట ప్రమాదము కానేరదు. కావున పెదకోమటి కుమారుఁడైన వేమారెడ్డి, కుమారగిరిమరణానంతరము రాజ్యమునకు వచ్చుటకుఁ బూర్వము ఒక చిన్న జమీందారుగను రాజవంశమునందు గౌరవముగలవాఁడుగను ఉండెననుటకు సందేహములేదు. శ్రీనాథుఁడా కాలమున నాతనిమంత్రియైన మామిడి సింగన్నకు నాంధ్రనైషధమును అంకితమిచ్చి వేమరాజునకు మంత్రియని వర్ణించుటయందు

1 ఎఱ్ఱాప్రగ్గడ హరివంశమందలి కృత్యాదిపద్యములును, వేమభూపాలీయ మందలి మాచ పెదకోమటులకు సంబంధించిన వర్ణనలను చూడనగును.

విరుద్ధమేమియులేదు. అనఁగా కుమారగిరి కొండవీటిలోఁ బ్రభుత్వము చేయు చున్నప్పుడు ఆతని పెత్తాత మనుమఁడగు పెదకోమటి వేమారెడ్డికూడ కొండవీటికి రాజు గాకపోయినను ఒక చిన్న జమీందారుగ నుండెను. వాలుగూళ్ళుగలవారినిఁ గూడ పెద్దరాజులుగను, వారియొద్దనున్న గుమాస్తాలను మంత్రులుగను వర్ణించుట మన కవుల సంప్రదాయమని యాంధ్రకావ్య పాఠకులకు నేను వేఱుగఁ జెప్ప నక్కరలేదు. ఈ పెదకోమటిని నాయకునిగఁ జేసి వామనభట్టబాణుఁడను కవి సంస్కృత గద్యమునందు 'వేమభూపాలీయ'మను కావ్యమొకటి వ్రాసినాఁడు. దానిలో ఈతనిని ఈతని తండ్రితాతలను మహచ్చక్రవర్తులుగఁ జెప్పినాఁడు!

పెదకోమటి వేమారెడ్డి అనవేమునికాలమున (చివరికాలముననైయుండును) ప్రభువుగ నుండెననియు, నాతనికి మంత్రులుండిరనియుఁ జూపుటకు నాంధ్ర నైషధములోనే యొక యాధారమున్నది. కృతిభర్తయైన సింగన్నయొక్క పెద్దన్న అనవేమభూపాలునియొద్ద మంత్రిగనున్నట్లును (౧-౨౭) పినతండ్రియైన నామన్న వేమరాజునొద్ద మంత్రిగనున్నట్లును (౧.౩౦) చెప్పబడియున్నది. పినతండ్రిని గుఱించిన పద్యము ఈ క్రింద నీయబడుచున్నది:

శా. స్వామిద్రోహరగండలాంఛనునకున్ సంగ్రామగాండీవికిన్
వేమక్ష్మాపతి కార్యభారకలనా విఖ్యాతధీశక్తికిన్
నామామాత్యున కన్యరాజ్య నిటలాన్తర్న్యస్త భాగ్యాక్షర
స్తోమాపాకరణ ప్రవీణునకు మంత్రుల్ సాటియే యెవ్వరున్?

ఇందుఁజెప్పబడిన వేమక్ష్మాపతి పెదకోమటి కుమారుఁడైన వేమారెడ్డియే. ఏలయన (౧) ఆ కాలము కొండవీటికి సంబంధించినవాఁడు వేఱు వేమారెడ్డిలేఁడు; (౨) ఈ పద్య మెచ్చటి ప్రకరణమునుండి తీసికొనఁబడియెనో ఆ ప్రకరణము నందు ననఁగా నాంధ్రశృంగారనైషధ పీఠికయందు నంతటను వేమశబ్దము పెద కోమటి వేమపరముగనే వాడఁబడియున్నది. ఒకానొకరు వేమ అనఁగా అనవేమ అని అర్థముచేసినారు. కాని దానిని ఒప్పుకొనుటకు వీలులేదు. శాసనములందును గ్రంథములందును అనవేముని అనవేముఁడే యందురుగాని వేముఁడని యెచ్చటను వ్రాసియుండలేదు. 'వేమ' యనఁగా ప్రోలయవేమయైనను కావలెను; 'కాటయవేమ' యైననుకావలెను; 'పెదకోమటివేమ'యైననుకావలెను; లేదా 'అల్లాడివేమ'యైనను కావలెను. సందర్భానువశమున నితరవేము లక్కడ నన్వయింపరు; గనుక వేమ

యనఁగా నైషధభర్తయైన సింగన్నకు రాజైన పెదకోమటివేమన యనియె గ్రహింపవలెను. ఈ రీతిగా నీ వేమారెడ్డి అనవేమారెడి చివరకాలమునను, కుమార గిరిరెడ్డి కాలమునను ఒకచిన్న ప్రభువుగ వారికి సామంతునిగనో, వారి రాజ బంధువుగనో యుండెను. ఆ కాలమున నైషధ మాతని మంత్రి కినుకిశ మీయఁ బడెను. తరువాత కుమారగిరి చనిపోగా రెండవకుటుంబములోఁ బురుషులెవ్వ రును లేనందున పెదకోమటివేమారెడ్డి కొండవీటి రాజ్యమునకువచ్చెను. అప్పుడు శ్రీనాథుఁడు విద్యాధికారిగ నుండెను. ఫిరంగిపురశాసనాదుల వ్రాసెను. ఇట్లు మొదట నైషధము వ్రాయఁబడినది; తరువాత హరవిలాసము రచింపఁబడినది. కావున మొదటి పూర్వపక్షమునకు సమాధానము వచ్చినది.

హరవిలాసము ౧౪౦౦వ సంవత్సరప్రాంతమున వ్రాయబడియెననుటకు నింకొక పూర్వపక్షము రావచ్చును. హరవిలాసమువందుఁ గవి కృతిభర్తకు బాల సఖుఁడని చెప్పఁబడియున్నది. (౧ ౮.) కృతిభర్త యీ క్రింది పద్యము (౧.౭.) వలన వృద్ధని తోఁచుచున్నది :

క. కంటిని విశుద్ధసంతతి
వింటి పురాణములు పెక్కు విశ్వము వొగడన్
మంటి బహువత్సరంబులుఁ
గొంటి యశోధనము సుకవికోటి నుతింపన్.

కృతినందిన అవచితిప్పయ వృద్ధయిన, నాతని బాలసఖుఁడు గూడ వృద్ధే కావలయునుగదా. మా లెక్కప్రకారము హరవిలాసము రచనాకాలము (౧౪౦౦) వఱకు శ్రీనాథుఁడు నలుబదియేండవాఁడుగ నున్నాఁడు. కావున ఈ పూర్వపక్ష మంత బలవంతమైనదికాదు. 'మంటి బహువత్సరంబులు' అని యేఁబది యేండ్లు సమీపించినవాఁ డనవచ్చును. 'బాలసఖుఁడు'అనఁగనే తూచినట్లిద్దరికిని ఒక్కటే వయస్సుండ నక్కరలేదు. ఇద్దఱికి నేడెనిమిది సంవత్సరములు భేదముండ వచ్చును. శ్రీనాథుఁడు చిన్ననాఁడే పెద్దబుద్ధులుగల యప్రతిమ ప్రతిభాశాలిగనుక నాతనికంటెఁ బెద్దవారుకూడ నాతనితోఁ జెలిమిచేసియుండుట యాశ్చర్యముకాదు. ఈ విధముగ రెండు పూర్వపక్షములును ఖండితములగుటచే హరవిలాసము౧౪౦౦ ప్రాంతమున వ్రాయఁబడియెనన్న మన మూలసిద్ధాంతము నిశ్చలముగ నిలిచినది.

## ఉపసంహారము

శ్రీనాథమహాకవియొక్క గ్రంథముల కాలనిర్ణయముచేయుటకు నిదియొక ప్రయత్నము. ఇంతియకాని రాయిగ్రుద్దినట్లును, వ్రాసుతూచినట్లును ఈ సంవత్సరముననే యీ గ్రంథము తప్పక నిర్మింపఁబడినదని చెప్పుటకు నీ వ్యాసము వ్రాయఁబడలేదు. శ్రీనాథుఁ డాంధ్రవాఙ్మయంబున మిక్కిలి ప్రసిద్ధిచెందినవాఁడు. ఆతని కాలనిర్ణయమును, ఆతని గ్రంథముల కాలనిర్ణయమును పీలయినంతవఱకు సాధారణముగఁ జేయఁ బ్రయత్నించుట మనకర్తవ్యము; గనుక నే నొకవిధముగ దారి చూపితిని. క్రొత్తశాసనములుగాని, క్రొత్తగ్రంథములుకాని బయలుదేరి లెక్క యంతయుఁ దప్పినఁ జెప్పలేను. కాని, ఉన్నసాధనములే యాధారములుగ నిల్చెనేని పదిసంవత్సరములు హెచ్చుతగ్గుగ నేను వేసినలెక్క నిల్చునని నా తాత్పర్యము.

కొమర్రాజు వేంకటలక్ష్మణరావు*

---

* గ్రంథాలయ సర్వస్వము. ద్వితీయ సంపుటము. ప్రథమ సంచిక.

# అప్పకవి కవితా సిద్ధాంతములు

తల్లియెడఁ గల గుణములు కొన్ని బిడ్డ గ్రహించును. అంతమాత్రానఁ దల్లి గుణము లన్నియు బిడ్డలకుఁ గలవనికాని, బిడ్డయందలి గుణము లన్నియు నెచ్చు దక్కువలు లేక తల్లి కుండి తీరవలయు ననికాని మనము నిర్ణయింపలేము. లక్ష్య లక్షణ సంబంధము నిట్టిదే. లక్ష్యమును బట్టి లక్షణము నిర్ణేయముగాని, లక్షణమునే పూర్తిగా నాధారముగాఁ గొని లక్ష్యమును నిర్ణయింపరాదు. లక్షణస్వరూపమును లక్ష్యమెంత చక్కఁగాఁ బ్రదర్శించునో లక్ష్యస్వరూపమును లక్షణమంత చక్కఁగాఁ బ్రదర్శింపఁజాలదు. కారణ మేమనఁగా; లక్ష్యము స్వతంత్రము; లక్ష్యపర తంత్రము లక్షణము. కావుననే లక్ష్యమునుబట్టి లక్షణము మార్పాటు నాశ్ర యింపవలసినదే కాని, మనమెంత పట్టుపగ్గాలతోఁ బట్టుకొన్నను లక్షణము లక్ష్య మును నిశ్చలముగా నియమింపఁ జాలదు.

హిందువుల సాహిత్య ప్రపంచమున సామాన్యముగఁ బై న్యాయ మాచర ణకుఁ దేఁ బడలేదు. వారిజీవితము లక్షణమునకుఁ గింకరము. ప్రకృతానుకూల ముగ సాహిత్య ప్రపంచమని యంటినిగాని, నిజముఁ బరీక్షించినచో భరతఖండ వాసుల సర్వపరిచలనములకును నియమస్వరూపమగు లక్షణమే యూఁతకోల. మనజీవితమున నీతి మొదలగు విషయముల లక్షణములకే ప్రాధాన్య మనుట సత్యము. కొంతవఱకును బారతంత్ర్య మంగీకరింపవలసియున్నను శిల్పములందుఁ గూడ లక్షణములకే ప్రాముఖ్య మొసంగితిమేని యది యుపజ్ఞాబలమును స్వాతంత్రఁ ర్త్తిని నిర్బంధించి నిర్మూలించును. అందఱు కవులును లక్షణకింకరులై యుండగా నాంధ్రకవులు మాత్ర మెట్లు విభిన్ను లగుదురు ? వారును లక్షణమును బట్టియే లక్ష్యముల నిర్మించుకొనిరి. మఱియొక విశేషము; లక్షణములఁ బట్టియు లక్షణ ముల నిర్మించికొనిరి ఒక లాక్షణికునకు వేఱొక లాక్షణికుఁడు కింకరుడు. "గల్ల" శబ్దము పయోగింపరాదని యొకఁడు నియమింపగా "చెంప" శబ్దమును ప్రయోగింప గూడదని వేఱొకఁడు వచించెను. ఒకఁడు వలదన్నది మఱియొక్కఁడు కూడనే కూడదని నియమించును. అతనికి చక్కఁగా నున్నచో నితని కది విడువరానిది ఇట్లు వీరి కసగాల వ్రేటున లక్ష్యము లిరుప్రక్కలఁగాని వెనకఁగాని కన్నెత్తి.

చూడవయ్యెను. అట్టి యాంధ్రలాక్షణిక ప్రపంచములో నొక్కఁడును, ముఖ్యుఁడు నగువాఁడు "కానునూరి యప్పకవి"

ఆంధ్రలాక్షణికులలో నితనికున్న సార్వజనీనత యితరులకు లేదు. తన లక్షణగ్రంథము నుపోద్ఘాతంబున.

"తెనుఁగునకు నవశ్యం బిది; దీనిఁ జదివి
చెప్పిన ప్రబంధము జగత్ప్రసిద్ధి నొందు;
నురక రచియించినది యప్రయోజక మగు"

నని తానే ఘోషించెను. నేఁటికిని గవితకు వలయు సాధనములని నేపండితునైన నడిగితిమేని "అప్పకవీయముఁ జదువు"మని యతఁ డాదేశించును. ఇతఁడు లక్ష్యమునుబట్టి లక్షణమును నిర్ణయించువాఁడును; లక్షణమును బట్టి లక్ష్యమును నియమించువాఁడును గాక, లక్షణముల నూతగాఁ గొని లక్షణమును గూర్చిన వాఁడని మొదలే సూచించితిని. నిష్కళంకమగు ప్రాచీన ప్రత్యయము గలవాఁడు. పాణినికి శిష్యుఁడై యాంధ్రవ్యాకరణమును, వ్యాసులకు శిష్యుఁడై యాంధ్రభారతమును 'కలికాదిని' నన్నయభట్టారకుఁడు రచియించెనని నమ్మినవాఁడు,* ఇతని సిద్ధాంతము లనఁగా గీర్వాణలాక్షణికులయు, నాంధ్రప్రాచీన లాక్షణికులయు, ననువాదములే కాని స్వోపజ్ఞములు గావు; అవియును విన్నవో కన్నవో యగునుగాని, పరిశోధితములై కడపటి లాక్షణికుల సిద్ధాంతముల ననుసరించునవి గావు. ఇతని యలంకారములు ముప్పదియెనిమిది. ఇతని కన్నను కనీసము నూఱు సంవత్సరములకు ముందే అప్పదీక్షితు లలంకారములు నూట యిరువదికన్న నెక్కువ గలవని నిర్ణయించిరి. మూర్తికవి నరసభూపాలీయమున డెబ్బది యనియెను. కావ్యలక్షణము గూడ నీతనియెడ నపరిపూర్ణము. దోషరహితాలంకారసహిత శబ్దార్థములే యితని కావ్యము. రసవత్త్వమును, గుణవత్త్వమును గీర్వాణ లాక్షణికుల కావశ్యకము. రసమును విడిచినను 'మూర్తి' గుణములను విడువలేదు. మహాకావ్యమునకు లాక్షణిక సామాన్య మంగీకరించిన యావశ్యకవర్ణనములు పదునెనిమిది. అప్పకవి యిరువది రెండనుచున్నాఁడు.

---

* పాణినియుఁ గలికాది నున్నవాఁ డనియే ప్రాచీనుల సిద్ధాంతము.

పై విషయములన్నియు నతఁడూరకే తాఁకి విడిచినాఁడు గావున నందలి యౌచిత్యానౌచిత్యములఁ జర్చించుట నా యుద్దేశముకాదు. అతఁడే తెలిసియో, తెలియకయో యాశ్రయించు కవితాసిద్ధాంతములు కొన్నిమాత్ర మిట వివరింపఁ దలఁచితి.

(అ) "పద్యరాశిని గూర్పఁగఁబడుదు కావ్య"మని యితని సిద్ధాంతము. అనఁగా కవితాశబ్దమునకు నితఁడు గద్యమును లక్ష్యముగాఁ బరిగణింపలేదని మనము నిర్ణయింపవచ్చును. "గద్యపద్యోభయమయం కావ్యం కావ్యవిదో విదుః" అని వచించుచు గీర్వాణలాక్షణికులు కాదంబరీ దశకుమారచరిత్రాదు లకుఁగూడ కావ్యత్వమునంగీకరించిరి. తెనుఁగున నట్టి వచనకావ్యములు లేనేలేవో, ఉండియునప్పకవికటాక్షమునకుఁ బాల్పడునంతభాగ్యముఁ బడయలేదో, కారణ మిదియని వచింపలేను; కాని, యెట్లును గద్యమందును కవిత్వముగలదని మన లాక్షణికుఁడంగీకరించనులేదు; ఆలోచింపనులేదు. లాక్షణికులమాట యటుండ నిచ్చి లక్ష్యముల రచించువారిని జూచినను, ఈ యిరువదవశతాబ్దమునఁ గూడ గద్యమునందుఁ గవితలేదని భావించువారనేకులున్నారు. దీనికిఁ గొంతకార ణమునుగలదు. పద్యము (ముఖ్యముగా తెనుఁగున) నియమభూయిష్ఠము. ఛందో భంగము దోషములలో మొదటిది. కావున నది రాకుండఁ బద్యమల్లవలయునన్న జీవకళయగు భావమునకు గొంత గౌణత రాకపోదు. గుణములకూర్పును దప్పక, యతిప్రాసముల యథాస్థానమున నుంచుచుఁ బద్య మల్లవలయునపుడు తదను గుణములగు పదములను గూర్చుట భావబోధకములగు పదముల మార్చుట యావశ్యకకృత్యములగును. కావున పద్య రచనయందుఁ బదములకున్న ప్రాము ఖ్యము భావమునకుఁ గల్గించుట కష్టతమ కార్యము. గద్యమునం దట్లుగాదు. నియమములేదు కావున పదప్రయోగము కవికి స్వాధీనము. అట్లగుట గద్య కావ్యమునందు భావమునకు విస్తరమును సారళ్యమును సహజత్వమును ప్రౌఢి మయుఁ గొంతయేని గుంటుపడఁగూడదు. కవియుఁ గవితయు భావమునకు దాసులుగా నుండవలయును. చదువరులకుఁ బద్యకవిపై నున్నంతదయ గద్య కవిపై నుండదు. పద్యమునం దధికపదములున్నచో గమనింపక విడుతురు. తక్కువయైనచో నధ్యాహరించుకొందురు; భావబోధకపదములు స్థలవ్యత్యా సమును జెందియుండెనేనియు నోపికమై సవరించికొందురు; భావపుష్టి యెంత కొంచెముగ నున్నను తమ భావనాబలమున నెక్కువచేసికొని యభినందింతురు. పైలోపములేమాత్రమున్నను గద్యకవిని వాచకులు మన్నింపరు; మన్నింపరాదు

గూడ. తోఁటతలుపుఁదెఱచి లోపలఁ జొరఁబడి గంపెఁడుపూలఁ దెచ్చువాని కంటె ముండ్లకంచెలో ద్రోవఁజేసికొని దాఁటిపోయి రెండుపూలు దెచ్చి యిచ్చువాఁ డెక్కువ యభినందనీయుఁడు. ఇది న్యాయమనికాదు; జనస్వభావము. కావుననే పద్యకవికన్న గద్యకవికి భావనాబలమును, కల్పనాశక్తియు, శిల్పచాతుర్యమును చాల నెక్కువ వలయును. ఈ న్యాయమును మనసున నుంచుకొనియే భట్టబాణుఁడు కవిసామాన్య దురూహములగు కల్పనాసహస్రములచే 'ప్రకటాటోప పదబద్ధ'యగు 'సరస్వతి'చే, కాదంబరీ హర్షచరిత్రముల రచించి లోకమును భ్రమింపఁజేయఁ జాలినాఁడు. తిలకమంజరి, వేమభూపాలచరిత్రము మొదలగు నొండు రెండుగ్రంథములుదప్ప పై కాదంబరీ హర్షచరిత్రముల ననుసరించుటయుఁ దరువాతఁ గానరాదు. చెప్పవచ్చినదేమనఁగా సామాన్య గద్యముకన్న సామాన్యపద్యమే జనుల కభినందనీయమనుట. గీర్వాణమున విక్రమార్క భోజచరిత్రాది గ్రంథములు అనేక పద్యకావ్యములకన్న నెంతో మేలుగానున్నను వానిని మనవా రెంత యనాదరణమొనర్చియున్నారో మా చదువరు లెఱుఁగనిదికాదు. నాలుగతిశయోక్తులతో రెండుపద్యములల్లి పురవర్ణనము చేసి 'బలే' యనిపించుకొనుట విడిచి, నాలుగుపుటలు నిండునన్ని శ్లిష్టోపమల వేర్చి కూర్చుట కెవఁడు ప్రయత్నించును? కల్పనాప్రధానముగాక నప్రధానమగు కావ్యమైనను ఈ న్యాయమునకు లోపడకపోదు. తిక్కనామాత్యుని భారతమును మార్పు లేక వచనముగా వ్రాసిచూడుఁడు. తిక్కన చూపినాఁడనుకొన్న రసమాధురి నెవ్వడైన ననుభవింపఁగలఁడేమో యపు డెఱుఁగఁగలరు. కావుననే కవియనువాఁడు పద్యమును మన్నించునంత గద్యమును మన్నింపఁడు;

పై విషయమునకు వేఱొకకారణముగూడఁ గొంతవరకు వచింపవచ్చును. అపూర్వ ప్రతిభాశాలులగు గీర్వాణలాక్షణికులు కవిత్వమునందలి యవయవములన్నియుఁ బ్రత్యేకముగ విమర్శించి వేఱుపఱచిరి. అలంకారములు, గుణములు, రీతులు, రసములు, పాకములు, వ్యంజనాలక్షణాది వృత్తులు మొదలగునవన్నియుఁ గవితాకన్యకకుఁ గరచరణాదులవంటివి. అవన్నియు నేఁడు ప్రత్యేకశాఖలై ప్రయత్నాధ్యేయములయ్యెను. ఇది తెలియనిది కవిత రానేరదను నమ్మిక బయలుదేఱెను. దానిచే వీని సముదాయమే కవితయనుటకు మాఱుగ వీనికిమించిన కవితాపదార్థము వేఱొండుగలదను నభిప్రాయము వ్యాపించెను. అది యేది? పదముల కూర్పే. ఏ విషయముల నా పదములకూర్పుచే బోధింపవలయునో యట్టి పై కవితావయవములన్నియు లాక్షణికశాసనమునకు లోఁబడి నియమితములయ్యెను. రచించువాని భావనాబలమునకు స్వాతంత్ర్యము నశించెను. కవిత్వము

నకు విషయమును మార్గమును నిర్ణీతములైనవి. లాక్షణిక పితామహుఁడగు కాళిదాస కవిచక్రవర్తి తన రఘువంశమున నైదవసర్గలో ముప్పదిశ్లోకములు వ్రాయువఱకును రఘువంశనాయక రాజధాని "సాకేత"మని సూచింపకుండినను, పదునాఱవసర్గలో నతఁడు వర్ణించిన "సాకేత" నగరము జనవిరహితమై నశించి "కరుణావస్థ"కుఁ బాత్రమైనదేయయ్యెను-మన కవులకు మాత్రము గ్రంథారంభమున సర్వసౌభాగ్య సంభృతమగు నగరమునువర్ణించుట విడువరాని విధియయ్యెను. "నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయవర్ణనైః" అని లాక్షణికు లందఱు 'నగర'మున కగ్రస్థానమిచ్చినపుడు వారికింకరులు కవు లవిధేయులగుదురా? తక్కినవర్ణనములు వెనుక ముందయ్యెను మనలాక్షణికుఁడు గూడ "పురము"నకు మొదటిపూజ యిచ్చుట మఱవలేదు. వర్ణనీయమగు నగరము కవులందఱకు నోంకారమువలె నాదిమమై యొకటైనప్పుడిఁక వర్ణనమార్గములు మాత్రము వేఱెట్లగును? నగరము వర్ణింపవలసినప్పు డందువచ్చు నవాంతర పదార్థములన్నియేయని తెలిసిపోయినవి. విభిన్న విషయములు లేనప్పుడు కల్పనాశక్తి యెంతయున్నను అది యితరుల కల్పనముల నాధారముగాఁ గొనవలయుట తప్పనిది. చూడుడు, మన కవులలో సౌధములు వర్ణింపనివారులేరు. కొందఱు సౌధములకు బదులుగాఁ గోటగోడలనో కొండలనో వర్ణనవిషయములుగాఁ గైకొనియున్నారు. పైవాని యౌన్నత్యము వర్ణించుట విడువరానిది. సంబంధాతిశయోక్త్యలంకారము నూఁతగాగొని యవి యాకసము నొరయుచున్నవనవలయును. ఆ మాటనే యనేకులు వచింపవలసి సామాన్యముగఁ బరాభిప్రాయ దాసులైనారు. విస్తరభీతిని దీని నింతటితో విడిచి, విషయసౌలభ్యమునకై వారి పద్యములను కొన్నిటి నుదాహరింతును :

చ. తమము నడంచుచున్ వెలుఁగు తత్పురగోపుర శాతకుంభకుం
భముల విచిత్ర సన్మణి గభస్తి వితానములన్ విచిత్ర వ
ర్ణములగు నాత్మవాహముల నమ్మక పల్మఱుఁ జూచి యన్యవా
హములని సంశయ ప్రణిహితాత్ముఁ డగున్ హరిదశ్వుఁ డెప్పుడున్.

—నన్నయ, భా. ఆది. అ. ౧ ప. ౩౩

క. చనిచని యచ్చోటం జి
క్కెనొకో తారకములనఁ బ్రకీర్ణరుచులఁ ద
ద్ఘన వప్ర ప్రాగ్భాగం
బున ఖచితములైన వజ్రములు చెలువొందున్.

—తిక్కన. నిర్వచ. అ. ౧. ప. ౪౩

శా. అర్కేందూపల రత్ననిర్మితమహా హర్మ్యాగ్ర భాగంబులన్
దార్కొన్ దారక మండలంబుఁ గని ముగ్ధస్త్రీలు రేలప్పురిన్
గర్కంధూపల సన్నిభంబయిన ముక్తాజాలమన్ చింతిచేఁ
దర్కింపన్ దిలకించి నవ్వుదురు గంధర్వాంగనా పల్లవుల్.

—శ్రీనాథుఁడు. భీమఖం. ఆ. ౫. ప. ౨౨

చ. అహరహమున్ బ్రభాతముల హర్మ్య తలోపరి చంద్రశాలికా
గృహములఁ గామినీ సురతకేళి విసూత్రిత హారమౌక్తిక
గ్రహణ పరాయణంబులగుఁ గావునఁ దన్మతి భ్రాంతతారకా
గ్రహములఁ జంచులన్ గమిచి క్రాయుఁ బురిం జిరుప్రోది పావ్రముల్.

—సంకుసాల నరసయ్య, కవికర్ణర. ఆ. ౯. ప. ౧౦౨.

ఉ. సౌరణగండ్లరాఁ గౌదమ చుక్కలు పట్టి సతుల్ కవాటముల్
చేరువ మౌక్తికంబులని బిల్లలు పుత్తురు తమ్మటుంచుఁ బొ
ల్పారు వితానహారముల యందొక హారత వ్రేలి ప్రొద్దుపోఁ
గా రతి డస్సి గొద్బులకుఁ గాఁ దెరువన్ జను విచ్చి మేడలన్.

—కృష్ణరాయలు, విష్ణు. ఆ. ౩. ప. ౧

ఉ. వంచనఁబొంచి చేరువకు వచ్చిన చంద్రుని జింకనేసి హ
ర్షించియుఁ దత్సుధారస నిషేచనచే నది బావకున్కి వీ
క్షించియు నేటు దప్పెనని చేవిలునప్పులుఁ బాఱవైచి లా
జ్జించి చరించుచుండుదురు చెంచెత లగ్గిరి సానుభూములన్,

—తిమ్మన, పారిజా. ఆ. ౨. ప. ౮౨

ఉ. చందన గంధులందు మణిసౌధ తలంబులఁ గొండ్లి సల్పగా
నం దతిదివ్య చిత్రముల యం దొకరై యనిమేష భామినుల్
కందళితాద్భుత స్ఫురణఁ గన్గొని తన్నటనాంత గీత ని
ష్యంద సజీవచిత్రముల సందడి నేఁగుదు రప్పురంబునన్.

-భట్టుమూర్తి. వసుచ. ఆ. ౧. ప. ౧౦౪.

ఇంత చాలును. ఇందుఁ బ్రత్యేక కవుల విభిన్నకల్పనలకు విషయభేదము లేమిచేఁ గలిగిన యత్యంత సమీప బంధుత్వమును వేఱుగ విప్పి చూపనక్కఱ లేదు. ఇట్లందఱు, వర్ణింపవలసిన విషయములన్నియు లాక్షణిక నియమితములై యభిన్నములగుటచేతను, కవిఁ గావలయునని తహతహపడువాఁడు వాని నెఱ

గనిది ముందడుగు పెట్టరాదు కావునను, కవి చేయవలసినపనులు, చేయఁబోవు పనులు, సర్వావగతము లయ్యెను. కావ్యమునఁ బదములందే తప్ప నర్థములందు 'నవ్యత' చాలవఱకు నశించినది. కాన మన కవులు నొకరు చెప్పిన మాటయే పదములు మార్చి చెప్పఁ జొచ్చిరి. ఆ మాటలను ఛందోనియమాదులకైన లోపడక గద్యరూపముగ గంటకు నాలుగు కావ్యములుగా రచించెనేని చదువరు లతని నేమిచూచి 'కవి' యందురు? కావున నందఱెఱిగిన విషయములను సులభముగా వచనరూపమున రచించువానికంటె, యతిప్రాసాది నియమములకు లోనై, కొన్ని శబ్దాలంకారములను తోడుచేసికొని పద్యరూపముగ రచించు వాఁడు గౌరవార్హుఁడు గాకపోయినను శ్లాఘార్హుఁ డనుటలో సందేహమేమి? ఈ కారణము చేతనే ప్రబంధకవులు క్వాచిత్కముగ గద్యముల వ్రాసినను అవి పద్యములకంటె దుర్గ్రాహతరములుగా రచించిరి. ఇదియే క్రమక్రమముగ గద్యమునకుఁ గవితాప్రాతత్వమును దప్పించినదని నా యాశయము. ఏ విషయము వచించినను బద్యరూపముగనే రచింపవలసివచ్చెను. కావుననే మన లాక్షణికుఁడును కవితా గంధముగూడ లేని వ్యాకరణ చ్ఛందోరూప విషయము లన్నియుఁ బద్యముల మూలముగనే శాసించెను. లేకున్న నతఁ డప్పకవి యగు టెట్లు?

(ఆ.) ఇతని మతమునఁ గవిత్వ మలంకార ప్రధానమే గాని రసప్రధానము గాదు.

"సావాగ్యా రసవృత్తి స్సాధ్వ్యోహి రసో యథాతథం కవిభిః"

అను మూలశ్లోకమును వ్యాఖ్యానము చేయుచు,

తే. తగ రసాశ్రయ వాక్యసంతతులఁ గూర్చి
కావ్యము లొనర్చువార పో కవు లనంగ
నట్లు గావున నేభాషనైనఁ గవితఁ
బలుకువారికి సాధింపవలయు రసము.

అని విధిలేక వచించినాఁడు. మఱియొకచోట 'రస సంప్రసక్తిచేఁ బొసగును బద్యంబు' అని వ్రాయుటయుఁ గొననాల్కమాటయే. వర్ణము, పదము, వాక్యము, అర్థము, భావము, రసము, పద్యము, కావ్యము అను నెనిమిది పదార్థములలో పూర్వపూర్వము లుత్తరోత్తరములకుఁ గారణము లగునని సీస

పద్యము నాలుగు పాదముల యెనిమిది తున్కలలో నిమిడించి వ్రాయునపు డత నికిని తెలియక వచ్చిన మాట. ఇతని సత్యమైన సిద్ధాంతమును,

గీ. ఆశుధారా కవిత్వములందు శయ్య
లుపమ లుత్ప్రేక్షలును లేక యుండుఁ గాన
నెంత చర్చించినను పద్య మంత సార
వంత మగుఁగాన నిలుకడ వలయుఁ గృతికి.

అను పద్యము ఘోషించెడిని, కృతియందు 'చర్చింప' వలసిన విషయ ములు 'ఉపమ లుత్రేక్షకులు'నే కాని రసముగాదు. ఒకవేళ లాక్షణిక పక్ష పాతులు గొందఱు అలంకారములు రసోపస్కారకములు కావున కృతియం దలంకారములే ముఖ్యములని యందురేమో! కాని ప్రతిపద్యమునందును రస ముండియే తీఱునా? మనకు తొమ్మిదేగదా రసములు? పురసూర్య చంద్రోద యాది వర్ణనములందుఁ బ్రతిపద్యము నందును బై తొమ్మిది రసములలో నేదే నొకటి వచ్చునట్లు వ్రాయఁదరమా? అట్లు వ్రాయ లేమేని నప్పు డలంకారముల ప్రయోజనమేమి? అట్లుగాక యలంకారము లున్నచోట్ల నెల్ల రసదేవత సరస్వతి వలె గుప్తగామినియై మనకెఱుఁగరాక యుండునని వచింపనగునా? మఱియు రసప్రధానమైన పద్యములందును అలంకారోపయోగమును గూర్చి,

'దోషహానం గుణాధానం కర్తవ్యం నియమాత్కృతే
కామచారః పునః ప్రోక్తోఽలంకారేము మనీషిభిః

అని ప్రాచీన గీర్వాణ లాక్షణికుల సిద్ధాంతము దీనినాధునికులు దోష నిరాసప్రధాన వాదమే కాని యలంకారముల యావశ్యకతను కాదన యంగీక రించిరి. నిజముగ నలంకారముల ధర్మము రసోపస్కరణమే యైనచో వాని నెట్లెంత వఱకు నుపయోగింపవచ్చునో కూడదో కవియే నిర్ణయింపవలయుఁ గాని మనము నియమింపఁ జాలము. మఱియుఁ గవికి రసమే యుపాస్యదేవత యగునేని యితఁ డలంకారశాస్త్రము నెంత మఱచిన నంత మేలు. అలంకార ములు రసాధీనములుగాని రసములంకారాధీనముగాదు. కావున కవి కలంకారశాస్త్ర పరిచయము యోగికి సంసారవాసన వంటిది.

(ఇ.) కావ్యమునకు జీవకళ ధ్వని. ధ్వని ప్రధాన ముత్తమ మనియు, వాచక వ్యంగ్యార్థములు తుల్యముగా నున్నచో మధ్యమ మనియు, ధ్వనిరహిత మధమ

మనియు, నీకడపటి దర్థప్రధానముగాక శబ్దప్రధాన మయ్యేనేని నధమాధమ మనియుఁ గావ్యమును లాక్షణికులు విభజించిరి. అప్పకవి యీ విభాగమార్గమునే తడవలేదు. ఇతని యుదాహరణ మార్గమును బట్టి యూహించితిమేని ఇతని మతమునఁ గవిత్వము రెండు దెఱఁగులు:-౧. అర్థప్రధానము. ౨. శబ్ద ప్రధానము. రెండవది చిత్రకవిత్వము, బంధకవిత్వము, గర్భకవిత్వము నని మూఁడు విధములు. కవితను గూర్చి యితఁడిచ్చిన యుదాహరణము లన్నియు నీ రెండవ తెగకుఁ జేరినవే. అప్పకవి సామర్థ్య మావిషయమునందే చూపఁబడినది. శబ్ద ప్రధాన కవితను మన లాక్షణికు లెంత తీవ్రముగా నిరసించిరో యంతకన్నఁ దీవ్రముగా నది ప్రబలినది. కారణము అర్థప్రధానకవితయందుగల నియమ బాహుళ్యమే. ఈ నియమ బాహుళ్యమే కల్పనా ప్రపంచమునకు మార్గదర్శకము. కల్పనా విషయములు పరిమితము లైనప్పుడు ప్రత్యేక కవులయందుఁగల కల్పనాశక్తియుఁ బరిమితము గావలసి వచ్చెను. శబ్దప్రధానకవితయం దింతకన్న నెక్కువ విశాలమగు నవకాశము గలదు. భాషాపాండిత్య మెంతయుండిన నంత విస్మయనీయముగాఁ గల్పింపవచ్చును. అప్పకవియందు శబ్దకల్పకత యర్థకల్పకత లేదు. ఐన నతఁడు గర్భచిత్ర బంధ కవిత్వములను వివరించుచో 'కవులకుఁ జెవులపండువులుసేయు' 'శ్రవణ సుఖం బొనర్చు'నని వ్రాయుచు నవి హృదయానందకములు గావల తెలిసియో తెలియకయో సూచించి విమర్శకులకు విస్మయముఁ గల్గించుచున్నాఁడు.

(ఈ.) ఇతని ముఖ్య కార్యములలో నొకటి కవులను విభజించుట. నేనెఱిఁగినంతవఱ కితఁడే యీ విభాగమున కాదిమకర్తయని యూహించెదను. కవు లేడు దెరఁగులు.

౧. వివేకి : 'గణవర్ణశబ్దార్థ గుణదోష నికరంబుఁ బరికించి' కబ్బముఁ గూర్చువాఁడు.

౨. వాచకుఁడు : అను ప్రాసనియమము వదలక కవిత్వమల్లువాఁడు.

౩. రౌచికుఁడు : కావ్యమంతయు 'మృదుమధురోక్తుల వెదకి'నించువాఁడు.

౪. అర్థార్థి : మితపదములలో నతివిపులార్థము నిమిడించు వాఁడు.

౫. శిల్పార్థి : యమకములు నాశ్రయించు వాఁడు.

౬. భూషణార్థి : అలంకార నిరతుఁడు.

౭. మార్దవానుగతుఁడు : సరళ పదములతో సరళార్థమును జూపుచు రసముఁ బ్రతిపాదించు వాఁడు.

ఒక్కకవియెడ నొక్కటేగుణము లభించుట యరుదు. కావున నీ విభాగము గుణప్రాధాన్యముఁ బట్టి యుండును. వివేకికి మన మప్పకవిగానే లక్ష్యముగా గైకొన వచ్చును. ఏలయనఁగా దక్కిన యే కవిగాని యితడు వచించిన 'గణవర్ణ శబ్దార్థ గుణదోష'ములఁ బరికించు నోపిక కలిగి యుండఁడు. వానిని జూపుటకై చాలఁ బరిశ్రమించినవాఁడు కానఁ దాను రచించిన 'అంబికా వాదము' మొదలగు గ్రంథముల యందు ఆ నియమములను దప్పక 'పరికించి' యుండు ననుట నిస్సందేహమా. రామరాజభూషణునందును, బమ్మెరపోతన యందును వాచకత్వము గలదు. రౌచికులు తిమ్మన, చేమకూర వేంకటపతి మొదలగువారు. శ్రీకృష్ణ దేవరాయఁర్థారి. శిల్పార్థిని ప్రత్యేకముగా మన కవులలోఁ గనుఁగొనలేము. యమకరత్నాకర నళోదయాది కావ్యములు యమకమునకే ప్రత్యేక గీర్వాణ వాఙ్మయమునఁ గలవుగాని తెలుఁగున వా ద్రాత్రోవ నాశ్రయించిన వారు నాకుం జూడ లేరు.

తే. "అనుచు ననుచారియై విప్రుఁడరుగు దేరఁ
దేర గాండివ మిడి యస్మద్ధియ మహిమ
మహిమడుంగ మడుంగగు మనసు మాయ
మాయగన్నులఁ గ్రమ్మఁ గ్రమ్మఱితి నేను."

క. "మొనయం గనకా సీతా
మొనయం గనకాద్రి ధరుఁడె ముడితను పవనా
తనుపవనాహతి నొనఁగక
తనుపవనా మదన నీయుదంచిత కరుణన్."

మొదలగు పద్యము లొండు రెండు సోమనాథ రామరాజభూషణుల యెడ వికీర్ణములై తెనుఁగున లభించును. ఇంచుమించుగ మన కవులందఱు భూషణార్థులు. మార్దవానుగతుఁడు పెద్దన, లేక తిక్కన.

పై విభాగమును చక్కగా విమర్శించితిమేని కవిత్వమను పదమునకు మనలోగల సత్యమైన యర్థము పదముల కూర్పేకాని వేఱుకాదను టనుగ్రహము. శిల్పార్థియు వాచకుఁడును శబ్దాలంకారజీవులు గావున భూషణార్థి యను పదమున కర్థాలంకార లోలుపుఁడనియు, మార్దవానుగతునియెడ "సరళ పదములు" గాక

రసముఁ జూపుటయే ముఖ్యమనియు మనమర్థముఁ జేసికొంటిమేని, ఇవి రెండు తప్పఁ దక్కిన విభేదము లన్నియుఁ గేవలము శైలి యనఁబడు పదముల కూర్పునే యవలంబించి యుండునవి. అర్థాది మనకంటె కర్థప్రధానుఁడుగా గాన వచ్చునుగాని విమర్శించితిమేని విపులార్థములను బోధించు పదముల వెదకి కూర్చుటయే యతని ప్రధాన కార్యమని తోఁచును. కవితా చర్చయందు భావ శిల్పమునకుఁ గల ప్రాధాన్యము పదశిల్పమగు శైలికి లేదని విమర్శకరాద్ధాంతము. మఱియు శైలి భావమునకుఁ బ్రతిబింబము గావున దానికి ప్రత్యేక స్వరూపమే లేదని కొందఱ మతము. తలఁపునకు విపరీతమగుమాట యుండదుగావున భావభిన్నమగు శైలిగాని శైలివ్యతిరిక్తమగు భావముగాని యున్నదనుట న్యాయముగాదని యీ రెండవతెగవారి వాదము. కాని తలఁపును మీఱినమాట వ్యవహారమున నుండదు. మనము సామాన్యముగ మాటాడునప్పుడు పదముల కూర్పును గూర్చి యోజింపము. కాని కావ్యమున నట్లుగాదు. అది కేవలము భావ ప్రధానముగాదు; మఱి శిల్పప్రధానము కావున తలఁపునుబట్టి మాటలును మాటలఁ బట్టి తలఁపును సంస్కరించుకొనవలసియుండును. భావము మహోన్నతమైనను దానిని బోధించు పలుకులును దదనుగుణముగ నున్ననేకాని కవితయందు నిలువదు. కావున శైలియను పదార్థమొండు గలదనియు దానియెడను గవికి దృష్టి యావశ్యకమనియు వచింపకతీరదు. అనఁగా నెంతవఱకుఁ బదశిల్పము భావ పోషకమగునో యంతవఱకే కాని, భావౌన్నత్యమున కేమాత్రము భంగము గలిగించునట్లున్నను దానిని దిరస్కరించుట కవికిఁ గల ప్రథమధర్మము. ఎందాఁక నది భావానుసారి యగునో యందాఁక నది భావముతో నేకీభవించి ప్రత్యేకత లేక యుండును. అప్పుడే యది హృదయానందకము. అట్లుగాక సార్థైకతత్పరమై భావమును లక్షీకరింపదేని శ్రవణమాత్రానందకము గావచ్చును. ఇదే శబ్ద ప్రధాన కవిత.

అప్పకవి కవి విభాగమున కిదియ ముఖ్యావలంబనము. కాని యతని యభిప్రాయము ననుసరించి గర్భకవి, బంధకవి చిత్రకవులను మఱిమూవురీ విభాగమున జేరవలసి యుండెను. యమకమునుబట్టి యొకనిని, అనుప్రాసమును బట్టి యొకనిని విభజించినవాఁడు పైవిభాగము నేలవదలెనో యెఱుఁగను. ఇట్లే "మృదుమధురోక్తుల"కును "సరళపదముల"కును భేదముఁ గనిపెట్టిన వాఁడు, దీర్ఘసమాసములకును, విరళ పదములకును వ్యత్యాసమేల చూపలేదో?

నిజముఁ జూడఁ బోయినఁ గవుల విభజించుటయే యయుక్తము. మన యిష్టానుసారము వారు విభజింపఁబడువారుకారు. ప్రతిభామహత్త్వము కొలఁది వారు ప్రాచీనరూపముల వదలి నవనవ రూపములఁ దాల్తురు నేఁటికిఁ గవిత్వము ముగిసియుండెనేని కవుల విభేదములను ముగిసియుండి లక్షణాధీనములై యుండును. మనము చేయగలిగినదెల్ల నీవఱకు వాఙ్మయము నలంకరించిన కవుల స్త్రోతవలనెల్లఁ బరికించి యవి యిన్నితెరఁగులని లెక్కవేయుటయ. అప్పకవియు రాఁగల కవుల మార్గములను యోగదృష్టిచే గ్రహింపఁగల్గి వ్రాసినవాఁడు కాఁడనుట సత్యమేయైనను పై నేను విన్నవించినట్లు పదముల కూర్పును బట్టి విభజించుటచే నతని విభాగము పరిపూర్ణముకాలేదు. ఇదివఱకుఁగల యాంధ్ర కవులను భావశిల్పమును బట్టి విభజించితిమేని వారు ముత్తెరగు లగుదురు:-

(౧) భావుకుఁడు: అనఁగా ప్రపంచగతులన్నియుఁ దనమనోదర్పణమునఁ బ్రతిబింబింపఁజేసుకొని తన్మయతఁ జెందువాఁడు. తన కావ్యమునందలి పాత్రముల యాకారము తాను ధరించి మనల ధరింపఁజేయువాఁ డనుట. ఈ గుంపునకుఁ జేరు కవులందఱు సామాన్యముగఁ గథాకథకులుగా నుందురు. కవిత్రయమ్ము, పెద్దన మొదలగు కొందఱే తద్గుణ ప్రధానులు. అందును మొదటి యుదాహరణము తిక్కన.

(౨) బోధకుడు: తన మనోగతులన్నియుఁ బ్రపంచ హృదయములఁ బ్రతిఫలింపఁజేయువాఁడు. ప్రపంచము తన్ననుసరింపవలసినదే కాని తాను ప్రపంచగతుల నంతగా ననుసరించువాఁడు కాఁడనుట. మనుష్య జీవితమును గాని, ప్రకృతి సౌభాగ్యమునుగాని యితఁడు మనమందఱమును జూచెడు కనులతోఁ జూడఁడు. ఇతని కవిత్వమునం దొకవేళ కథ గ్రహింపఁ బడినను అందలి పాత్రములు కవి ప్రతిబింబములే కాని సాధారణ ప్రపంచమధ్యమున దర్శనీయములుగావు. ఇతనికథ భావమునకుఁ బోషకము; భావము కథాపోషకముగాదు. ఈ తెగలోఁ గొందఱు కవులు నీతి ప్రధానులు. నేనెఱిఁగినంతవఱ కాంధ్రవాఙ్మయమున నిందాఁక నీ తెగవారే ప్రబలియుండిరి. వేమన, బద్దెన మొదలగు వారిని లక్ష్యముగాఁ గైకొనవచ్చును. మఱి భావప్రధానులై భావగీతముల రచించు నాధునికకవులు రెండవతెగవారు; శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు మొదలగువారు.

(౩) కల్పకుఁడు: అనఁగా తనకుఁగాని ప్రపంచమునకుఁగాని యనుభవ గోచరములు గాక, యట్టివి రచించువారికిని వినుట కలవాటు పడిన వారికిని దప్పఁ దక్కినవారి కర్థముకాని భావములఁగల్పించువాఁడు. అలంకారముల

యెడఁ దక్కిన కవులకంటె నితనికే దృష్టియు నావశ్యకతయు నెక్కువ. రామరాజభూషణుఁడు మొదలగువారియం దీగుణము ప్రబలినది. తత్పూర్వులగు సోమ శ్రీనాథాదులందును లేకపోలేదు. వీరే ప్రబంధకవులు.

పై విభాగము భావప్రధానము. శాబ్దికుని నాలవవానిగాఁ గైకొనవచ్చును. శబ్దమునే ముఖ్యముగాఁ గొనిచేయు ద్వ్యర్థ, గర్భ, చిత్ర బంధాది కవిత్వము లన్నియును నీజాతికిఁ జేరినవి. ఆంధ్రకవులలో నందఱయందును గొంత పై నాలుఁగులక్షణములును గలిగియే యున్నవి. విశేషమేమనగా నొకరిద్దరు దప్పఁ దక్కినవారందఱును జాలవఱకు శాబ్దికులే.

(ఉ) నేనీ వ్యాసమునఁ బలుమాఱు రామరాజభూషణుని నుదాహరణముగాఁ గైకొంటిని. నేనే మన లాక్షణికునకు సమకాలికుఁడనై యుంటినేని యతని సిద్ధాంతములను నేనెంత తీవ్రముగా ఖండించి యుండినను మన్నించి యుండును గాని యీ యపరాధము మాత్ర మతని కతిదుస్సహముగా నుండి యుండును. ఏలనగా.

"ఉపమ గలిగిన శయ్యల నొప్పి యున్న
నంధ్రభవుని కావ్యంబు గ్రాహ్యంబుగాదు.
పాయిసం బైన సంస్కార పక్వమైనఁ
గాక మృష్టంబు హవ్యంబు గానియట్లు."

అని ప్రథమముననే విషమగణము వేసి శాసించినాఁడు. వెండియు 'ధరణీసురుడుఁ' 'కవియనఁ బరఁగు'నని నియమించినాఁడు. కావుననే రేఫలకార ములకు యతి చెల్లదనువిషయమును దెలుపుచో విపరీత వ్యాఖ్యానముఁ జేయుచు నుదాహరించిన 'లోలం బాలక యోర్తువచ్చె' యను పద్యపాదము దప్ప నతని గ్రంథములనుండి యొకపద్యమైన నుదహరింపఁడయ్యె. మఱియు నితని కారామ రాజభూషణుని 'కాపుకవిత్వపు మాటల'యం దెంత రోఁతయోకాని, కవుల నందఱను గ్రంథాదిని స్తుతించుచో

"రామరాజ విభూషణ రత్నఖచిత
చారుమస్త కలాపాపహారి వాక్య
గౌరవముఁ బెక్కు భంగుల గణనచేసి"

యని యయ్యలరాజు రామభద్రుని బొగడుచు, నతని వలన మన భట్టునకు సంభవించినదని మనవారు చెప్పుకొను నవమతి నెత్తిపొడిచినాఁడు. కాని మన లాక్షణికుఁ డెయ్యది కవిత్వమని భావించెనో యట్టి కల్పనా ప్రధాన ప్రపంచమున సామ్రాజ్య పీఠము నధివసించుట కెన్నఁటికైనా ననురూపుఁడైన వాఁడు రామరాజభూషణుఁడే యనియు-నిష్పక్షపాతముగాఁ బరీక్షించితిమేని అయ్యలరాజు రాముని 'బాఁపన కవిత' యతనియెడ నేర్చుకొనవలసిన దెంతయో కలదనియు నా నమ్మిక. ఐనను నా దుడుకుఁదనము మన్నింప నప్పకవి మతానుసారులను వేఁడుకొనుచు నింతటితోఁ జాలించెదను.

రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ*

---

* గ్రంథాలయ సర్వస్వము. ద్వితీయసంపుటము. ప్రథమసంచిక.

# గ్రంథరచన

ప్రపంచము పుట్టి ఎంతో కాలమైనది. ఎన్నో యుగములు కడచినవి. ఎన్నో రాజ్యములు ఎన్నో సామ్రాజ్యములును వెలసినవి; అడుగంటి పోయినవి. ఎందఱో జ్ఞానులును, భక్తులును, శాస్త్రజ్ఞులును, మహాయోధులును, దేశాభిమానులును, పరోపకార పరాయణులును బయలుదేఱి, తమ తెలివితేటల చేతను, మంచిపనులచేతను లోకమును బాగుచేయ ప్రయత్నించి కొంతవఱకు బాగుచేసినారు; గతించినారు. తరువాత ఎన్నో క్రొత్తరాజ్యములును, సామ్రాజ్యములును తలలెత్తి ఇప్పుడు వెలయుచున్నవి. ప్రాతవియు కొన్ని మరల పైకి లేచుచున్నవి. లోకోపకారకములగు సత్ప్రయత్నములు జరుగుచున్నవి.

అయిన-పూర్వుల అనుభవముగాని-ఇప్పటివారి అనుభవముగాని, పూర్వుల బుద్ధివిశేష ఫలములుగాని—ఇప్పటి వారి బుద్ధివిశేష ఫలములుగాని మనకు తెలియుట ఎట్లు? ఎంతకాలమో శ్రమపడి సమకూర్చిన జ్ఞానధనము మనకు ఒక్కసారియే అబ్బుట ఎట్లు? ఇప్పుడున్న పండితుల వల్లనే స్వయముగా జ్ఞానము గడింప వీలు సరిగా లేకున్నప్పుడు గతించిన పూర్వుల జ్ఞానము వారివల్లనే సంపాదించి మనకొనుటకు అసలే వీలు లేదుకదా! ఇఁక సాధనాంతరములు ఏవైన ఉన్నవా? లేవా? దైవానుగ్రహమున లేకపోలేదు, ఉన్నవి. అవి బుద్ధిమంతులగు పూర్వులే కనిపెట్టినారు. వారు తమ జ్ఞానము తమతోడను-తమ తోడివారి తోడను నశించిపోక స్థిరముగా ఉండునట్లు చేయుటకై వ్రాత కనిపెట్టినారు. ఆ వ్రాత రూపమున తమ జ్ఞానము తమ కాలపువారి మేలుకొఱకును, తరువాతవారి మేలుకొఱకును నిలుచునట్లు చేసినారు. తరువాత బుద్ధిమంతులు కూడ అటులే చేయమొదలుపెట్టినారు; చేయుచున్నారు. వ్రాఁత రూపమున వెలయుచున్న జ్ఞానపు గనులే గ్రంథములు; అక్షరాత్మకములగు ఈ గ్రంథములే నిజముగా అక్షరములగు నీ గ్రంథములే లోకజ్ఞానము కలిగించు ప్రబల సాధనములు. ఈ సాధనముల వల్లనే ఎందఱో తాము బాగుపడి—తోడివారిని బాగు చేయుటకు తగిన స్థితిలోనికి వచ్చినారు; వచ్చుచున్నారు. (గ్రంథములకే కావ్యములు అని మఱి ఒక పేరు.) అందుచేత గ్రంథరచన అత్యావశ్యకము. పెక్కుమాటలేల? గ్రంథరచనయే లేకున్న మనలోకము ఇప్పటి ఉన్నత స్థితిలో నైన ఉండి ఉండదు. ఇది శిలాక్షరము.

## గ్రంథ రచన అనగా నేమి ?

గ్రంథములు చేయుటయే గ్రంథరచన. గ్రంథములు చేయుట అని చెప్పుటచేత, ఒక గ్రంథమును చూచి దానికి మఱి ఒక ప్రతి వ్రాయుట గ్రంథ రచనకాదు. అయిన, మఱిఏమి ? స్వభావసిద్ధములగు సంగతులుగాని-అనుభవ సిద్ధములగు సంగతులుగాని-శాస్త్రసిద్ధములగు సంగతులుగాని-ఆయా కాలముల యందు జరిగిన సంగతులుగాని-అనుభవమును బట్టి బుద్ధివిశేషముచే కల్పించిన సంగతులుగాని-పై తరగతులలో కొన్నికొన్ని తీసికొని కలిపిన సంగతులు గాని ఒకదానితో ఒకటి సంబంధము కలిగి ఉండునటుల-చక్కని భాషలో-మనసు కరిగించునట్టి ఒప్పిదమగు శైలిని-జ్ఞానము కలిగించియో-నీతి బోధించియో ఆనందము కలిగించుటకు సహజశక్తిచేత స్వయముగా కూర్చి వ్రాయుటయే గ్రంథములు చేయుట. పై లక్షణములుకల ఒక భాషలోని గ్రంథములను వేరొక భాషలోనికి తెచ్చుటయును గ్రంథరచనగానే ఎన్నిక కాంచుచున్నది. గ్రంథ రచనకే కవిత్వము అని మఱి ఒకపేరు.

పై సంగతులను బట్టి, గ్రంథరచనకు (౧) సహజమగు కవితాశక్తి (౨) మంచి ప్రపంచ జ్ఞానము (౩) చక్కని భాషాజ్ఞానము (౪) తగినంతశైలి జ్ఞానము అను నాలుగు సాధనములు ప్రధానములు అని తట్టును. ఇందులో కవితాశక్తి కావ్యలక్ష్మికి ప్రాణము. ప్రపంచజ్ఞానము శరీరము, భాష వాహనము, శైలి వస్త్రాద్యలంకారము అని చెప్పవచ్చును. కాన, గ్రంథరచన చేయఁ గోరువారికి ఈ సాధనములను గూర్చి కొంతవఱకైనను తెలిసికొనుట ముఖ్యము. కాఁబట్టి, ఒక్కొక్కటిగా తీసికొని వీనినిగూర్చి సంగ్రహముగా చర్చించి చూడ నగును.

### ౧ కవితాశక్తి

ఆయాగుణములు మనకు పూర్వవాసనవల్ల వచ్చునట్లే కవితాశక్తియు పూర్వవాసనలవల్లనే వచ్చును. పూర్వవాసన హెచ్చయిన కొలఁదిని కవితా శక్తియు హెచ్చగును. కొందఱు మహాకవులును-కొందఱు సాధారణ కవులును అగుటకు కారణము పూర్వవాసన యందలి హెచ్చుతగ్గుల భేదమే. కవితాశక్తితో సంబంధించిన పూర్వవాసన ఏమియులేనిచో కవితాశక్తి అబ్బనే అబ్బదు. మహా పండితులు కొందఱు నాలుగు ముక్కలుకూడ కూర్పఁజాలకపోవుటయే ఇందుకు తార్కాణము. అందుచేతనే పెద్దలు ఋషుల అంశలేనివారు కవులుకానేరరని చెప్పిరి. కవితాశక్తి సామాన్యపు భాగ్యముకాదు. దానితో సమానమగు భాగ్యము

మఱియొకటి లేదనియే చెప్పనగును రాజర్షి భర్తృహరి అందుచేతనే కదా 'సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్' అని అనుభవముచేత చెప్పినాఁడు, చూచితిరా? సుకవిత ఉన్నయెడల రాజ్యముకూడ అక్కఱలేదట! కాఁబట్టి దైవానుగ్రహమున కవితాశక్తి అబ్బినవారు అది సరిగా వాడుకచేసి అందువలన తాము మేలు పొంది, లోకమునకు మేలుచేయ యత్నించవలె. ధారాజలము కాలువలమూలమున పండ్లచెట్ల పాదులకు చేర్చి, అవి ఫలించున ట్లొనర్చి ఆ ఫలము లనుభవించి సుఖపడుటకు అవకాశము కలిగించు విధమున, సహజమగు కవితాధారను లోకజ్ఞానమూలమున సద్విషయములకు చేర్చి, వాని ఫలము లనుభవించి లోకులు సుఖపడుటకు అవకాశము కలిగింపవలెఁగాని ఉప్పు పఱ్ఱలలో చేరి వ్యర్థమగు ధారాజలమువలె కవితాధార దుర్విషయములతో చేరి వ్యర్థమగునట్లు చేయరాదు. ప్రయత్నించి కవితాశక్తి అంకురించునట్లు కూడ జేసికొననగును.

ఎండకాలమున భూమిలో అణగియుండు విత్తనమువలెను, వేరువలెను, దుంపవలెను కవితాశక్తి చిన్నతనమున కవుల మనస్సున అణఁగి యుండును. తొలకరి వానలుపడి భూమి నానిన పిదప మొలకెత్తు విత్తనము మొదలగు వానివలె కవితాశక్తియు అక్షరజ్ఞానము కలిగి, మంచి గ్రంథములు చదువ మొదలుపెట్టిన పిమ్మట బయలుపడును. కాలమునకు వానలు సరిగా కురియుచుండిన యెడల మొలకెత్తిన మొక్క నవనవలాడుచు పెరిఁగి, పూచియో, కాచియో పండియో లోకులకు మేలుచేయునటుల కవితాశక్తియు క్రమక్రమముగా సద్గ్రంథములు చదువుటచేతను, సృష్టి చిత్రములు కనిపెట్టుచుండుట చేతను జ్ఞానమభివృద్ధి పొందిన కొలఁదిని మనోహరముగా దినదినాభివృద్ధి నొంది, పురాణరూపముననో, ప్రబంధరూపముననో, నాటకరూపముననో, నవలరూపముననో, మఱి ఏదో తరగతి గ్రంథరూపముననో వెలువడి లోకులకు మేలు చేయఁజాలును.

కాని లోకమునకు సరిగా మేలుచేయుటకు తగియుండు కవిత్వమునకు కొన్ని సంస్కారములు కావలయును. సంస్కారములేని కవిత్వము అడవి వంటిది. అడవిలో పండ్లచెట్లును ఉండును; ముండ్ల చెట్లును ఉండును. పూలపొదలును ఉండును; ముండ్ల పొదలును ఉండును. ముండ్లమొక్కలు మొదలగునవి ఉండిననేమి? వాని జోలి మనకెందుకు? అని అనుకొనుటకు వీలులేదు. అడవిలోనికి అసలే వెళ్ళకపోయిన ఏమియును భయములేదుగాని, వెళ్ళితిమా వాని జోలి మన కక్కఱలేదనుకొన్నను వానికి మనజోలి తప్పక కావలసియుండును. అడవిలో కాలుపెట్టినప్పటికి అవి తమ ప్రభావము కనఁబఱుప మొదలుపెట్టును. పువ్వుల కొఱకుఁ

గాని, కాయల కొఱకుగాని, పండ్లకొఱకుగాని ఆశపడిన వారికి ముండ్లముద్ర తాతాచార్యులగారి ముద్రయే. ముండ్లమొక్కలు మొదలగునవి పూలమొక్కలు మొదలగు వానితో కలిసిమెలసి ఉండుటయే ఈయవస్థకు కారణము. ఇందువల్ల తేలినదేమి? అడవివల్ల లోకమునకు మేలుతోపాటు కీడును కలుగును. ఇట్లే సంస్కారములేని కవిత్వము వలన అక్కడక్కడ గుణములు ఉన్నను వానితో పాటు దోషములును కలసి ఉండును గావున మేలుతోపాటె కీడును కలుగును. దోషములే హెచ్చయిన ఇఁక చెప్పవలసిన దేమున్నది? "సిరి అంటదు, కాని చీడ అంటును" అను సామెత ఎవరికి తెలియదు? నీతి పట్టుపడుట దుర్లభము గాని దుర్నీతి పట్టుపడుట సులభము. చక్కని భాష స్వాధీనము కాదుగాని పాడుభాష సులువుగ స్వాధీనమగును; కాదు, స్వాధీనము చేసికొనును- దుర భ్యాసములు పట్టుపడుట సుకరముగాని వదలుట దుష్కరము. కాన, సంస్కారములేని కవిత్వమువల్ల తుదకు మేలుకంటె కీడే హెచ్చుగా కలుగును కాఁబట్టి, కవిత్వము అడవివంటిది గాక పూలతోఁటవంటిది కావలయును. సంస్కారములు పొందిన కవిత్వము పూలతోటవలెనే ఉండును. కవిత్వము కళలలో ఒకటి; పూలతోట వేయుటయును కళలలోనే చేరును. రెండింటియందును మనుష్యుల బుద్ధి వాడుక కావలెను. రెండింటి వల్లను పొందఁదలఁచు ఫలము ఆనందమే. పూలతోఁటలో నేల అంతయు సదనుచేసి-బాటలు వేసి, తోఁటమాలి ఆయా పట్ల పూలమొక్కలును-పండ్ల చెట్లును వేసి-పూలపొదరిండ్లుకట్టి-తీఁగెలు ప్రాకించి-తగిన దోహదములుచేసి-పూచునవి పూచునట్లును--కాచునవి కాచునట్లునుచేసి, సమస్తేంద్రియములకును ఆనందము సమకూర్చును. పనికిమాలిన గడ్డిగాదములు గాని-బాధించు ముండ్లచెట్లుగాని పూలతోఁటయందు పొడకట్టవు. అట్లే సంస్కారములు పొందిన కవిత్వమందు-గ్రంథరచనయందు-స్వభావసిద్ధములయి మృదు మధురములగు శబ్దములును-గంభీరములగు అర్థములును-కల్పనలును-నీతులును-ఆదర్శములును-ఉచితములగు రసములును-గుణములును కానవచ్చుచు మనస్సు కరఁగించి-ఆనందమున తేల్చునుగాని- స్వభావ సిద్ధములుగాక వెంటనే మొగము మొత్తించు చెవికింపుగాని మోటమాటలును-సాంకేతిక పదములును-చొప్పదంటు అర్థములును-కల్పనలును-దుర్నీతులును-దురాదర్శములును-ఔచిత్యము పాటింపమిచే అసహ్యకరములగు రసములును-దోషములును కానరావు.

కవిత్వ సాధనములలో కవితాశక్తి మొదటిదిగాన దీనికే మొదట సంస్కారము కావలసియుండును. దీని సంస్కారము ప్రారంభమైనచో తక్కిన సాధ

నములకును సంస్కారము ప్రారంభమైనట్లే. ఏమందురా? కవిత్వసాధనము లన్నియు బీరకాయ పీచువలె ఒండొంటితో సంబంధము కలిగి ఉండునవిగాని- "నీళ్ళకు నీళ్ళు ప్రసాదమునకు ప్రసాదము" అనునటుల దేని కది వేఱై సంబంధము లేకుండునవి కావు. కవిత్వ ఫలవృక్షమునకు కవితాశక్తి వేరు, ప్రపంచ జ్ఞానము మాను, భాష కొమ్మల మొత్తము. శైలి పూవులును పండ్లును అని చెప్పనగును. కవిత్వ తత్వము కరతలామలకము చేసికొనఁ గోరువారు ఈ అంశము మనస్సున గుర్తుగా ఉంచుకొన నగును.

మన శరీరమున వాయువునకు ఊపిరితిత్తులును, రక్తమునకు గుండెలును ముఖ్యస్థానము లగునట్లు కవితాశక్తికి కవిత్వములో ఆలోచన భాగము ముఖ్య స్థానము. ఏ విషయమును గూర్చికాని ఆలోచించుట గాలి ప్రోగుచేయుట వంటిది. మంచిగాలితోపాటు చెడుగాలయును కలసి ఉండును గాన కీడు కలుగకుండుటకు వానిని విడఁదీయవలెను. చెడుగాలులను మంచిగాలినుంచి విడఁదీయుట కష్టమగు పని అని వేరే చెప్పనక్కఱలేదు. ఇట్లే, ఆలోచనచేయునపుడు మంచి తలఁపు లతోపాటు చెడు తలఁపులును వచ్చును. అవి విడఁదీయుట కష్టమైనను విడఁదీయక తప్పదు; విడఁదీయవలె. చెడుతలఁపులు వేరుపురుగుల వంటివి. కవితాశక్తి కవిత్వ వృక్షమునకు వేరు. అట్టిచో చెడుతలఁపు వేరుపురుగులను తీసివేయకున్న కవితావృక్షము ఏపు తగ్గి చచ్చునుగాని ఎదిగి ఫలింపదు. చెడుతలఁపులు లేకుండునటులచేసి మంచితలఁపులు మాత్రము నిలుపుటయే కవితాశక్తికి చేయవలసిన సంస్కారము. ఇట్లు సంస్కారము పొందిన కవితాశక్తి నిర్మలమగు చల్లగాలివలెను, ఏపుగా నెదిగి ఫలించు చెట్టువలెను కీడు రవంతయు కలిగింపక, మేలేచేసి, ఆనందమున తేల్చును.

## కవితాశక్తి వృద్ధి పొందుటకు సాధనములు ఏమి?

౧. చక్కగా ఆలోచించుట, ౨. సృష్టి చిత్రములను సరిగా కనిపెట్టుట, ౩. మంచి గ్రంథములు చదువుట-అను మూడును కవితాశక్తిని వృద్ధిపొందించు ముఖ్యసాధనములని చెప్పవచ్చును. ఈ సాధనములన్నియు ఒకదానితో నొకటి సంబంధము కలిగి ఉన్నప్పుడే కవితాశక్తి బాగుగా అభివృద్ధి పొందును గాని ప్రత్యేకముగా ఒక్కొక్కటియే ముఖ్యముగా తీసికొనునప్పుడు అట్టి అభివృద్ధి కలుగదు. అందులో గ్రంథములు చదువుటవలన కలిగిన జ్ఞానమే ముఖ్యముగా చేసికొని గ్రంథరచన చేసినయెడల పాడినదేపాటగా ఆయాగ్రంథములలోని

సంగతులే మరల చెప్పుట తటస్థించును. ఇది వ్రాసినవారికి వ్యర్థప్రయాసము; చదువువారికి వ్యర్థమగు కాలక్షేపము. ఇక మూలగ్రంథములలోని అంశములు సరిగా గ్రహింపక వ్రాసినయెడల విపరీత జ్ఞానము కలిగి, కీడుకూడ కలుగును. అంశములు సరిగా గ్రహించినను, భాష స్వాధీనమైనది కాకున్న, మంచిశైలి పట్టువడకున్న రసపుష్టి చెడును. అందుచేత కవితాశక్తి వృద్ధిపొందక పోవుటయే కాక తగ్గికూడ తగ్గిపోవును. కాన, ఉభయభాషా పాండిత్యము కలవాడే తర్జుమా చేయుటకు పూనుకొన వగును. గ్రంథములు చదువుటతోపాటు సృష్టిచిత్రములు సరిగా కనిపెట్టుచు స్వయముగా ఆలోచించుచు నుండినయెడల జ్ఞానము వృద్ధి పొంది, దానితోపాటు కవితాశక్తియు చక్కగా వృద్ధిపొందును.

మంచిగ్రంథములు చదువుట మొదట ప్రారంభింపవలయును. దానితో పాటు ఆయా విషయములను గూర్చి అవకాశ మున్నపుడెల్ల సృష్టిచిత్రములను కనిపెట్టుటయును కూడ మొదలుపెట్టవలెను. ఇట్టిస్థితిలో చెప్పు కవిత్వము సాధారణ కవిత్వము. ఇది కవిత్వమునకు బాల్యావస్థ. పైగ్రంథములలోని అంశమునే ఆధారముగాఁ గల కవిత్వము పోఁతపాలబిడ్డ. సహజమగు తల్లిపాలతో పెరఁగు బిడ్డకు ఉండు శరీరపటుత్వముగాని, ఉత్సాహముగాని, కళాకాంతులుగాని, ఆకర్షణశక్తిగాని పోఁతపాలబిడ్డకు నుండుట పట్టిది.

ప్రపంచమునకు పరాత్పరుఁడే తండ్రి; పరాత్పరుఁడే తల్లి. అట్లే కవితా లక్ష్మికి కవియే తండ్రి; కవియే తల్లి. సముద్రము తఱవఁగాఁ బుట్టిన అమృతము లక్ష్మికి ఆహారమైనట్లు కవిహృదయమును తఱవఁగాఁ బుట్టు మంచి తలఁపులే కవితాలక్ష్మి పెరఁగి, ఎప్పుడును నిండు జవ్వనమున ఉండుటకు త్రాగుపాలు. పలుపలుకులేల? మంచి తలఁపుపాలే కవితాలక్ష్మికి సహజమగు ఆహారము. లోకజ్ఞానము కలిగినపిమ్మట చక్కఁగా ఆలోచించుచుండుటవల్లను, సృష్టిచిత్రములు కనిపెట్టుచుండుటవల్లను, మంచి గ్రంథములు చదువుటవల్లను, పెద్దలతో కలసిమెలసి ఉండుటవల్లను, మంచితలఁపులు పుట్టును. మంచితలఁపులే ఆధారముగా చేసికొని చెప్పు కవిత్వమే మంచి కవిత్వము. ఇదే భర్తృహరి చెప్పిన 'సుకవిత;' ఇదే కవిత్వమునకు యౌవనావస్థ. దేవతలు ఎప్పటికిని త్రిదశులే అయినట్లు మంచికవిత్వమునకు ఎప్పటికిని యౌవనావస్థయే. ఈ అవస్థలోనికి వచ్చిన కవిత్వము ఎన్నాళ్ళకైనను చెక్కుచెదరదు; ఎక్కడనైన గౌరవమునకు పాత్రమగును. ఎవరికైనను మనసు కరగించును; ఉత్సాహము పెంచును; మేలు

కలిగించును; మేలు చేయించును. అందుచేసి ఆనందమున-సాధారణపు ఆనందము కాదు-బ్రహ్మానందమున తేల్చును. కాబట్టి గ్రంథరచన చేయు అభిలాషకలవారు ఇట్టి కవితాశక్తిని సంపాదింప ప్రయత్నింతురు గాక!

## ౨. ప్రపంచజ్ఞానము

జ్ఞానము కలిగించి అందువలన ఆనందము కలిగించుట కవిత్వధర్మము. కావున, కవిత్వము చెప్పఁదలఁచు వారికి ప్రపంచజ్ఞానము అత్యావశ్యకము. ౧. ప్రపంచమును స్వయముగా కనిపెట్టుట ౨. పెద్దలవల్ల తెలిసికొనుట ౩. మంచి గ్రంథములు చదువుట—అను మూడు సాధనముల వలన ముఖ్యముగా ప్రపంచ జ్ఞానము కలుగును.

### -ప్రపంచజ్ఞానము సంపాదించుట ఎట్లు?-

మనకు జ్ఞానేంద్రియములు ఉన్నందుకు ఫలము అవి సరిగా వాడుక చేయుటయే. లోభికి ధనము ఉన్నను దానివలన ఫలము కలుగనట్లు తెలివితక్కువ వారికి జ్ఞానేంద్రియము లున్నను ఫలము మాత్రము కలుగదు. కన్ను, చెవి-అను రెండును జ్ఞానేంద్రియములలో ముఖ్యములు అయినను, తెలివితక్కువవారు అవి కూడ సరిగా వాడుక చేయరు. కనుగ్రుడ్డి, వినుచెవుడు-అను సామెత వారిని బట్టియే వచ్చినది. సృష్టిచిత్రములు చూచి, వాని విశేషములను కనిపెట్టి, జ్ఞానాభివృద్ధి చేసికొని, సర్వేశ్వరుని మహిమ తెలిసికొని, ఆనందించి, అట్టి ఆనందము తోడివారికి పంచిపెట్టుటయే కన్నులున్నందుకు ఫలము. ఇట్లే, చెవులున్నందుకు ఆయా ధ్వనులు విని, వాని విశేషములు కనిపెట్టియు, ముక్కున్నందుకు ఆయా వాసనలు మూర్కొని, వాని విశేషములు కనిపెట్టియు, నాలుక ఉన్నందుకు ఆయారుచులు చవిచూచి వాని విశేషములు కనిపెట్టియు, చర్మము ఉన్నందుకు ఆయావస్తువులను తాఁకి వాని విశేషములు కనిపెట్టియు జ్ఞానము అభివృద్ధి చేసికొన వలెను. ఇట్లు జ్ఞానాభివృద్ధి చేసికొనుచు, మన మానందించుచు, అట్టి ఆనందము మన తోడివారికి పంచిపెట్టుచుండవలెను. ఈ ఆనందమును పంచిపెట్టిన కొలఁదిని పెరుగునదేకాని తఱుఁగనిదికాదు.

అయినను, ప్రపంచమంతయు స్వయముగా కనిపెట్టుట ఎవరికిని దుర్లభము-ప్రపంచమున లెక్కలేని లోకములు కలవు. మనపూర్వులు లోకములు పదునాలుగుగా ఎన్నినారు. చంద్రమండలాదులును లోకములుగానే ఎన్నిక చెంద

నవి. అంగారక మండలము మన భూలోకము వంటిది కావచ్చునని ఈ నడుమనే పరిశోధకులు కనిపెట్టిరి. మన 'కుజ' శబ్దము వీర పరిశోధనముల కేమైన ఆధారమైన దేమో! మన భూలోకమును గూర్చియే మనకు ఇప్పటికిని పూర్తిగా తెలియదు. భూలోకపుమాట ఎందుకు? మనదేశమునుగూర్చికాని—అంతదాఁక అక్కఱ లేదు—మనరాష్ట్రమున గూర్చి కాని—అదియును వదలివేయుదము—మన జిల్లాను గూర్చి కాని—అంతయు అవసరము లేదు—మన తాలూకాను గూర్చికాని అదియును వద్దు—తుదకు మనమున్న ఊరినిగూర్చికాని మనకు పూర్తిగా తెలియనప్పుడు "ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికెక్కునా" అని అన్ని లోకములగూర్చియు పూర్తిగా తెలియుట ఎట్లు? అనేకలోకములను గూర్చి మనుష్యుల ఎవరికిని ఇంకను ఏమియును తెలియదు. పురాణాదులలో ప్రత్యక్షములుకాని కొన్ని లోకములనుగూర్చి కానవచ్చు సంగతులు నిజములో కావో తెలిసికొనుటకు అధారములు ఏమియు కానరావు. సూర్యాదిలోకములను గూర్చి మిడిమిడి జ్ఞానము మాత్రము కలదు. భూలోకమునుగూర్చి కొంతవఱకు స్పష్టమగు జ్ఞానముకలిగినది. కాని, ఇదియును ఆయా ప్రకృతి శాస్త్రములు అభిమానముగా చదివినవారికే. ఒకశాస్త్రము బాగుగా తెలిసిన వారికి మఱిఒక శాస్త్రము బాగుగా తెలియుట అరిది. అనేకశాస్త్రములు పూర్తిగా తెలిసికొనుటకు మన ఆయుస్సు చాలదు. దీనికితోడు "దుర్భిక్షములో అధికమాస"మన్నట్లు మనుష్యులందఱికిని భాష ఒకటికాదు. ఎన్నోభాషలు ఉన్నవి. ప్రతిభాషలోను అన్నిశాస్త్రములును లేవు. అందుచేత శాస్త్రజ్ఞానము సంపాదింపవలె ననుకొన్న పెక్కుభాషలు నేర్చుకొనవలె. తల్లిభాషయే సరిగా నేర్చుకొనలేని వారికి పైభాషలు నేర్చుకొనుట సులభమా? దీనికి ఎంతోకాలము పట్టును. ఇంతేకాక, జ్ఞానసంపాదనమునకు ధనలోపము—యోగ్యతాలోపము—సంసారబాధలు మొదలగు అడ్డుకూడ ఎన్నో ఉన్నవి. అందుచేత ప్రపంచజ్ఞానమంతయు పూర్తిగా సంపాదింపఁ గలుగుట ఎవరికిఁగాని అందని ద్రాక్షపండు. అయినను, మనచేతనయినంతవఱకు ప్రయత్నించి ప్రపంచజ్ఞానము సమకూర్చుకొనవలె.

ఇదివఱకు యుగయుగములనుండి పూర్వులు సంపాదించినట్టియు, ఇప్పటివారు సంపాదించి నట్టియు ప్రపంచజ్ఞానము గ్రంథరూపమున సిద్ధముగా వున్నది. కాఁబట్టి గ్రంథములు చదివి మనము మొదట ప్రపంచజ్ఞానము సంపాదింపవలయును. ఆ జ్ఞానము పునాదిగా చేసికొని, దానిమీఁద స్వయముగా కనిపెట్టుట, పెద్దలవలన తెలిసికొనుట అను సాధనములతో కవితాభవనము కట్టవలయును.

ఇందుకు పూనుకొను మనవారికి ఆంధ్రులకు స్వభాష చక్కఁగా వచ్చి ఉండవలె; మన రాజభాష ఇంగ్లీషుకూడ దానిలో గ్రంథరచనకుఁ గాకున్నను జ్ఞానసంపాదనమున కైనను తగినట్లు రావలె. సంస్కృతము కూడ అట్లే వచ్చిఉండవలె. ఈ మూఁడు భాషలును వచ్చి వాని యందలి గ్రంథములు చదివి జ్ఞానము సంపాదించుకొని, సృష్టి చిత్రములను వీలగునంతవఱకు స్వయముగా కనిపెట్టుచు తెలియని సంగతులు పెద్దల వలన తెలిసికొనుచు కృషిచేసిన యెడల తగినంత ప్రపంచజ్ఞానము కలుగును. అప్పుడు ఆ యా విషయములను గూర్చి బాగుగా తెలియును. అందుచేత గ్రంథరచనకు పూనుకొనుటకు అర్హత కలుగును. అన్ని విషయములను గూర్చియు అందఱికిని తెలిసి ఉండుట కష్టము గాన, ఎవరికి ఏ విషయములయందు ఎక్కువ ఆసక్తి ఉండునో వారు ఆ విషయములను గూర్చి సాధ్యమైనంత వఱకు తెలిసికొన ప్రయత్నింప వలయును. అటుల బాగుగా తెలిసిన విషయములను గూర్చియే గ్రంథరచన చేయవలెను. అట్లు చేసనచో ఆ గ్రంథములు వ్రాసిన వారికిని ఆనందదాయకములు గాక మానవు. కాన గ్రంథరచనయం దాసక్తి గలవారు మంచి ప్రపంచజ్ఞానమును సంపాదించుటకై శ్రద్ధ వహింపనగును.

## ౩. భాషాజ్ఞానము

ప్రపంచ జ్ఞానము కలిగినంత మాత్రమున గ్రంథరచన సాధ్యము కాదు. ఏ భాషయందు గ్రంథరచన చేయఁదలఁతుమో ఆ భాషయందు మంచి పాండిత్యము ఉండవలయును. అందుకు నిఘంటు జ్ఞానమును, వ్యాకరణ జ్ఞానమును ఆవశ్యకములు. అంతేకాదు, అలంకార శాస్త్రమును, ఛందశ్శాస్త్రమును తెలిసి ఉండవలె. భాషలోని ప్రమాణగ్రంథములు చదువవలె. అప్పటికి భాష కొంత వఱకు స్వాధీన మగును. గ్రంథరచనకు అవకాశముకలుగును. కావున భాషాజ్ఞానము గ్రంథరచనకు ముఖ్యము. భాషాజ్ఞానము లేనియెడల మనస్సున ఎన్ని మంచితలఁపులున్నను అవి దరిద్రునికోరికలవలెనే లోలోన అణఁగి జీర్ణము కావలసినవేకాని క్రియారూపమును పొందజాలవు. ఇఁక చక్కని భాషాజ్ఞానము ఉన్నయెడల ధనవంతుని కోరికలు మేడలుగానో, మిద్దెలుగానో, కోటలుగానో, తోటలుగానో, నగలుగానో-మఱి ఏ రూపుననో పరిణమించు విధమున మనస్సులోని మంచితలఁపులన్నియు పురాణములుగానో, ప్రబంధములుగానో, నాటకములుగానో, నవలలుగానో చరిత్రములుగానో, శాస్త్రములుగానో, ఇఁక మఱి ఒక రూపముననో మారి కర్తలకును లోకులకును కూడ ఆనందము కలిగించును.

## ఆంధ్ర భాషాజ్ఞానము అభివృద్ధిచేసికొనుట ఎట్లు ?

ఒండొంటితోకలసి అర్థమిచ్చు శబ్దములసమూహమే భాష. కాన ఆంధ్ర భాషాజ్ఞానము కావలయుననిన మొదట ఆంధ్రశబ్దజ్ఞానము ఉండవలయును. అనఁగా గ్రంథరచనకు పనికివచ్చు ఆంధ్రశబ్దములన్నియును గ్రంథరచనచేయు వారికి తెలిసిఉండవలెను. ఇందుకు నిఘంటువులు చదువవలయును. ఇదేమి బాధ ? ఇంగ్లీషు భాషాజ్ఞానము సంపాదించుటకు ఇట్టి ఏర్పాటు అవసరములేదే అని ఇంగ్లీషు చదువుకొనిన మనవారు అనవచ్చును. కాని, భాషాస్వభావములు వేఱుగానుండునుగాన భాషాజ్ఞానము సంపాదించు పద్ధతులును వాని ననుసరించి కొంతవఱకు వేఱుగా ఉండకతప్పదు. ఇంగ్లీషులో సాధారణముగా పదములు సంధికి లోనుకావు. తెలుఁగులో కొంతవఱకు సహజముగానే పదములు సంధికి లోనగును. అందుచేత పదముల సహజరూపము మాఱును. దీనికితోడు మొదటి నుండియు మొన్నమొన్నటివఱకును తెలుఁగులో వచనరచనకంటె పద్యరచనయే హెచ్చుగా కానవచ్చుచున్నది. పద్యరచనలో ఛందోనియమములనుబట్టి సంధి మరింత ముదిరినది. అందుచేత, మన గ్రంథములలో సహజమగు శబ్దస్వరూపము చాలవఱకు తెలియరాదు. కాన ఇంగ్లీషు గ్రంథములలో ఆ భాషాస్వభావమును బట్టి సాధారణముగా సహజరూపములతో ఉండు పదములకు తెలియనప్పుడు అకారాదినిఘంటువులలో అర్థముచూచుకొని భాషాజ్ఞానము క్రమక్రమముగా అభివృద్ధి చేసుకొనునంత సులువు మనభాషయందు లేదు. కాఁబట్టి కంఠస్థమగునట్టు పద్యరూపమున ఉన్న నిఘంటువులు వల్లింపలేకపోయినను మనస్సునకు శబ్దస్వరూపము తట్టి ఉండునంతవఱకైనను ఆంధ్రనామ సంగ్రహము-ఆంధ్రభాషార్ణవము-సాంబనిఘంటు-వేంకటేశాంధ్రము మొదలగు నిఘంటువులు చదువుట అవసరము. ఇందులో పదవిభాగముతోడను-అర్థముతోడను ఉన్న నిఘంటువులు ముందు చదువవలయును. ఇట్లు చదివినయెడల శబ్దజ్ఞానముతోపాటు పర్యాయపదజ్ఞానమును కలుగును. ఇట్టి జ్ఞానము 'లక్ష్మీనారాయణీయము' అను అకారాది నిఘంటువువల్ల కూడ కలుగును. కాన ఆ యా పద్యనిఘంటువులు చదువుటకు బద్ధకించువారు ఈ అకారాదినిఘంటువు తెలియనిపదము వచ్చినప్పుడెల్ల చూచుచుండవలయును. సంస్కృత శబ్దజ్ఞానముకొఱకును, సమాసజ్ఞానముకొఱకును వాడుకచేయవలసిన అకారాదినిఘంటువు 'శబ్దరత్నాకరము'. ఇందువలన సామాన్యముగా తెలుఁగు గ్రంథములయందు వాడుకగు అన్నిశబ్దముల మొదటి స్వరూపమును తెలియును. శబ్దార్థజ్ఞానము బాగుగా సంపాదించదలంచు ఓపికపట్టిశబ్దరత్నా

క్రమము మొదటినుండియు చివరవఱకును ఎన్ని పర్యాయములు తిరుగవేసిన అంత మంచిది. ఇట్లు శబ్దజ్ఞానమును, దానితోపాటు అర్థజ్ఞానమును సంపాదించుకొననగును. ఈ శబ్దార్థజ్ఞానము భారత భాగవతరామాయణాది గ్రంథములు వీలగునపుడెల్ల చదువుచు, మనుచరిత్ర, వసుచరిత్ర, ఆముక్తమాల్యద రాఘవ పాండవీయము మొదలగు ప్రబంధములు వ్యాఖ్యానములతో చక్కఁగా చదివిన యెడల బాగుగా బలపడును.

కాని ఇంతతో భాషాజ్ఞానము పూర్తికాదు. నిఘంటువులు చదువుటవల్ల శబ్దముల మొదటిరూపములే బాగుగా తెలియును. భారతాది గ్రంథములు చదువుటవలన ఆయా శబ్దములు పొందు వివిధరూపములు పొడకట్టునుగాని ఆ వివిధ రూపములను గూర్చిన జ్ఞానము సరిగా పట్టుపడదు. ఈ వివిధరూపముల జ్ఞానము గ్రంథరచనకు అత్యావశ్యకము. ఇది వెంకయ్య వ్యాకరణము, బాలవ్యాకరణము, ప్రౌఢవ్యాకరణము మొదలగు వ్యాకరణములు స్వయంకృషితోపాటు గురుసాహాయ్యము కూడ పొంది చదివినఁగాని కలుగదు. వచన గ్రంథరచన చేయువారికైనను వ్యాకరణజ్ఞానము తప్పక ఉండవలయును. ఇంతేకాదు, తెలుఁగున గ్రంథములు రచించువారికి ఆంధ్రవ్యాకరణ జ్ఞానమేకాక, సంస్కృత పదములును, సమాసములును తెలుఁగున వాడకతప్పదు కావున సంస్కృతవ్యాకరణ జ్ఞానము కొంతవఱకైనను ఉండితీఱవలయును. ఇందుకూడ స్వయంకృషితోపాటు గురుసాహాయ్యము కావలయును. ఇంగ్లీషువచ్చినవారు ఇంగ్లీషులో సిద్ధాంత కౌముది ననుసరించి వ్రాసిన 'ఖేలు సంస్కృతవ్యాకరణము' చదువనగును. పద్యకవిత్వము చెప్పఁదలఁచువారు ఛందోజ్ఞానమును సంపాదించుటకు సులక్షణ సారము, అప్పకవీయము చక్కఁగా చదువవలయును. ఇది స్వయముగా చదువుకొనుచు తెలియనిచోట్ల పెద్దలనడిగి తెలిసికొనవలయును.

కావ్యలక్షణములు, దోషములు మొదలగువానిని గూర్చి జ్ఞానము సంపాదించుటకు నరసభూపాలీయము మొదలగు గ్రంథములు చదువవలయును. ఇటుల నిఘంటుజ్ఞానమును, వ్యాకరణజ్ఞానమును, ఛందోజ్ఞానమును, కావ్యలక్షణాది జ్ఞానమును సంపాదించినయెడల భాషాజ్ఞానము సమకూడును. కాఁబట్టి గ్రంథరచన చేయఁగోరువారు పైన వివరించినవిధమున చక్కని భాషాజ్ఞానము సంపాదించవలె.

సంస్కృతగ్రంథములను తెలుఁగులోనికి తేఁదలఁచువారికి సంస్కృతమున మంచిజ్ఞానము సంపాదించుట ఆవశ్యకము. సంస్కృతకావ్యములు కొన్నియు,

నాటకములు కొన్నియు, తెలుఁగు టీకలతో ఉన్న భగవద్గీతలు మొదలగు తక్కిన గ్రంథములు కొన్నియు చదివినయెడల సాహిత్యజ్ఞానము కలుగును. రామాయణాది గ్రంథములకును, రఘువంశాది కావ్యములకును కొంతవఱకును తెలుఁగున వ్యాఖ్యానములు ఉండుటచేతను, సంస్కృతనాటకములు కొన్ని తెలుఁగులోనికి తర్జుమా అయి ఉండుటచేతను స్వయంకృషి చేసి సంస్కృతమున సాహిత్యము సంపాదించుటకు సదుపాయ మేర్పడినదిగాన గ్రంథరచన చేయఁగోరువారు దీని వలన సంస్కృత భాషాజ్ఞానము సంపాదించుకొననగును. అవసరములని తోచిన సంస్కృత గ్రంథములను తెలుఁగులోనికి మార్చనగును.

ఇఁక, ప్రకృతి శాస్త్రజ్ఞానము, చరిత్రజ్ఞానము మొదలగు పలురకముల జ్ఞానము సంపాదించుటకును, అట్టి జ్ఞానము ఇంగ్లీషు రాని మన ఆంధ్రసోదరులకు సమకూర్చుటకును ఇంగ్లీషులో తగినంత అర్థజ్ఞానము కలుగువఱకును గ్రంథరచన చేయఁగోరువారు కృషిచేయవలెను. ఇట్లు ఆంధ్రభాష యందును, సంస్కృతభాష యందును, ఇంగ్లీషుభాష యందును తగినంతజ్ఞానము కలిగినఁగాని మన భాష యందు చక్కఁగా గ్రంథములు చేయుటకు శక్తి కలుగదు.

మఱి ఒకమాట, ఏ భాషయందు గ్రంథములు రచింతుమో ఆ భాషయందు అభిమానముండవలెను. లేనిచో భాషాస్వభావము పోయి భాష చెడును. ఆంధ్ర గ్రంథములు రచించువారి ఆంధ్రగ్రంథముల యందే రచనాకాల మందైనను అభిమానముండవలె. ఆంధ్రభాషా స్వభావమును బాగుగా పాటించవలె. కాని, సంస్కృతము అభిమానముగా చదివినట్టియు, ఇంగ్లీషు అభిమానముగా చదివినట్టియు మనవారు కొందఱు ఆభాషల సంప్రదాయములు తెలుఁగు గ్రంథరచన లోనికి తెచ్చి, ఆంధ్రభాషకు సహజముకాని కావ్యరచన చేయుటవలన మన భాషా స్వభావముచెడి, తెలుఁగు పదములతో కూడి ఉన్నను ఆ భాష తెలుగు భాష మాత్రము కాకుండుట తటస్థించుచున్నది. ఇట్టి భాషా సాంకర్యముగల గ్రంథములు ఎన్నిటికిని సద్గ్రంథములుగా ఎన్నికకు రానేరవు.

భాషాజ్ఞానము బాగుగా ఉన్నవారే గ్రంథరచనకు అర్హులు అర్హులువ్రాసిన గ్రంథములే స్థిరముగా నిలుచును. అవే మేలు కలిగించి ఆనందము సమకూర్పగలుగును. కాఁబట్టి తెలుఁగు గ్రంథరచన చేసి తోడివారికి మేలు చేయవలయునను ఉత్సాహముగల మనవారు భాషాభిమానము కనఁబఱుపనగును. చక్కని భాషాజ్ఞానము సంపాదింప ప్రయత్నింప నగును.

## శైలి జ్ఞానము

కవితాశక్తి ఉన్నఁగాని ఏ విషయమును గూర్చిగాని ఆలోచనయే సాగదు. ప్రపంచజ్ఞానము ఉన్నఁగాని ఏ విషయమును గూర్చికాని సరిగా వ్రాయుటకు అవకాశము కలుగదు. భాషాజ్ఞానము ఉన్నఁగాని ఏ విషయమును గూర్చికాని దోషములు లేకుండ గ్రంథరచన చేయుటకు వీలులేదు కవితాశక్తియు, ప్రపంచజ్ఞానమును, భాషాజ్ఞానమును ఉండి గ్రంథరచన చేసినను శైలి తగినది కానియెడల గ్రంథము జనరంజకము కాఁజాలదు. జనరంజకము కాని గ్రంథము నిష్ఫలము.

కావ్యలక్ష్మికి శైలి ఐదవతనము. గ్రంథమునకు శైలిలోపము కలిగిన యెడల 'అన్నియును ఉన్నవి కాని ఐదవతనము లేదు' అను సామెత దానియెడల సార్థకమగును. ఐదవతనము లేని స్త్రీ శోభింపనట్లే శైలి లోపముగల గ్రంథము శోభింపదు. శబ్దములు సుశబ్దములు కావచ్చును. అర్థములు సరిగా ఉండవచ్చును; భావములు మంచివే కావచ్చును. దోషములు లేకపోవచ్చును; పాండిత్యప్రకర్షము కానరావచ్చును-కాని ఇవన్నియు గ్రంథమునకు వన్నె తేఁజాలవు. వన్నె తేఁగలది శైలియే. శైలి లోపములేని గ్రంథము రసవంతమై, మనస్సు కరఁగించి, ఆనందమున ఓలలాడింపఁజాలును. శైలి లోపముచేత వన్నెకు రాకపోయిన గ్రంథములు మన భాషలో కొన్ని ఉన్నవి. వాని స్థితియే శైలి గ్రంథరచనకు ఎంత ప్రధానమో ఢంకామీఁద దెబ్బవేసి చాటుచున్నది. కాన, గ్రంథములు రచింపఁ బూనుకొను వారికి శైలిజ్ఞానము అత్యావశ్యకము.

## శైలి అనఁగా ఏమి?

ఆయాసంగతులు చక్కఁగా మనస్సునకు ఎక్కునట్లు గ్రంథములు వ్రాయుటయే శైలి. కావ్యలక్ష్మికి శైలి ఐదవతనమని ఇదివఱకే అనుకొన్నాము. అయిన, ఐదవతనమునకు ఐదు వన్నెలు ఉన్నవి. శైలికికూడ ఐదు వన్నెలు ఉండవలెనే; అవి ఏవి?" అని అడుగవచ్చును. వన్నెలు లేకున్న శైలి గ్రంథమునకు వన్నె తెచ్చునది ఎట్లగును? ౧. రసములు, ౨. వృత్తులు, ౩. పాకములు, ౪. గుణములు, ౫. అలంకారములు అనునవే శైలితో సంబంధించిన వన్నెలు. ఇవే మనస్సును కరిగింపఁ జాలిన గ్రంథరచనా సాధనములు. ఈ వన్నెలతోకూడిన భాషలో గ్రంథము వ్రాయువిధమే శైలి.

## మంచిశైలి పట్టుపడుట ఎట్లు?

తగినంత కవితాశక్తి సహజముగానే ఉన్నవారికి ఆశక్తివల్లనే మంచిశైలి వచ్చును. కాని, అట్టిశక్తిలేనివారు మంచిశైలి పట్టుపడునట్లు చేసికొనుటకు మంచిశైలిలో వ్రాసిన గ్రంథములు పలుసారులు చదువవలెను. ఈ విషయమున ఇంతకంటె మంచి సాధనము మఱి ఒకటి లేదు. కావున, గ్రంథరచనకు పూనుకొనఁ దలఁచువారు భారతము మొదలగు మంచిశైలిలో వ్రాసిన గ్రంథములు వీలగునప్పుడెల్ల చదువవలెను. ఇటుల చదువుటవల్ల సహజకవితాశక్తి వృద్ధి అయి దానితోపాటు మంచిశైలియు పట్టుపడును. శైలి జ్ఞానము కొఱకు గ్రంథములు చదువునప్పుడు తక్కిన విషయముల మీదకంటె గ్రంథశైలియందే దృష్టి ఉంచవలెను.

సాధారణముగా శైలి 'సులభశైలి' 'కఠినశైలి' అని రెండు విధములు. వీనిలో కఠినశైలి భాషాజ్ఞానమును పరీక్షింపవలసిన పెద్ద పరీక్షలకు చదువువారికొఱకు ఉద్దేశించి వ్రాయు గ్రంథములయందే వాడుక చేయనగును. కాని, తక్కిన గ్రంథములలో వాడుక చేయరాదు. కావున, సాధారణముగా గ్రంథ రచనయందు అవలంబింపవలసిన శైలి సులభశైలియే. సులభశైలిని వ్రాసిన గ్రంథములె పలువురకు మేలు కలిగించును. ఆనందము సమకూర్చును. కాబట్టి, గ్రంథరచన చేయువారు సులభశైలిని వ్రాయుటకే ప్రయత్నింప నగును.

'అమ్మో! గ్రంథరచనకు ఇంత కష్టపడవలెనా!' అని మనవారు కొందఱు-కవితాశక్తి కొంత అబ్బినంతమాత్రమున ప్రపంచజ్ఞానముగాని, భాషాజ్ఞానముగాని శైలిజ్ఞానముగాని సరిగా సంపాదింపకయే రచనకు సిద్ధపడువారు-అడుగవచ్చును. భర్తృహరి చెప్పిన సుకవితా సామ్రాజ్యమును, దాని వలన బ్రహ్మానందమును పొందఁ దలఁచువారు, తాము బాగుపడి తోడివారిని బాగుచేయఁ దలఁచువారు, తక్కిన విషయములలో వలెనే ఈ గ్రంథరచనా విషయములోకూడ కష్టపడవలెః కష్టపడకున్నయెడల ఫలము కలుగదు. కవితా సామ్రాజ్యముగాని, బ్రహ్మానందముగాని అక్కఱలేనివారు కష్టపడనక్కఱలేదు. కష్టపడుటకు మొదలుపెట్టినయెడల కష్టము కష్టమనిపించదు. కావున, క్రొత్తగా గ్రంథరచన చేయువారు తాము వ్రాసిన గ్రంథములు తోడివారికి మేలుచేయఁగలిగిన స్థిరముగా ఉండుటకు అన్ని విధములగు జ్ఞానము సరిగా కలుగువఱకును తమ వ్రాఁతలు గ్రంథ సాహాయ్యమువల్లను పండితుల సాహాయ్యమువల్లను చక్కబఱచుకొనవలెను. మంచి గ్రంథములు చేయుటకు తగిన జ్ఞానము సంపాదించి కవితాసామ్రాజ్య సుఖము లనుభవించి, తాము బ్రహ్మానందమున తేలి తోడివారిని బ్రహ్మానందమున తేల్పవలెను.

మారేపల్లి రామచంద్రశాస్త్రి*

---

* గ్రంథాలయ సర్వస్వము. ప్రథమ సంపుటము. ద్వితీయ సంచిక.

# భాషాశాస్త్ర నిర్మాణము

పందొమ్మిదో శతాబ్దారంభమున భాషాశాస్త్రనిర్మాణ విషయమునఁ గ్రొత్త దృక్పథమేర్పడినది. పూర్వపరిశోధకులు కొన్నిభాషలను గూర్చిమాత్రమే యాలోచించుచుండెడివారు. ఇప్పుడు ప్రపంచమందలి యనేక భాషల పరస్పర సంబంధమును గూర్చియేకాక, యా యా ప్రత్యేకభాషల నిర్మాణమునుగూర్చియు, నాయా భాషలయందలి వ్యాకరణరూపముల చరిత్రమును గూర్చియు సూక్ష్మపరిశోధనము లారంభమయినవి. ఐరోపాఖండమున భాషల విషయమున నీ చారిత్రకదృష్టికిఁ గారణ మచటి శాస్త్రజ్ఞులకుఁ గ్రొత్తగా సంస్కృతభాషాపరిచయము కలుగుటయే. ఇంగ్లీషువారును ఫ్రెంచివారును నిందయాలో ప్రభుత్వముకొఱకుఁ బెనుఁగులాడుచుండిన కాలమున నీ దేశపు నాగరికతనుగూర్చియు, భాషనుగూర్చియు, వాఙ్మయమునుగూర్చియుఁ దెలిసికొనఁ బ్రయత్నించిరి. ఫ్రెంచిమిషనరీయగు కోర్డో (Coeurdoux) సంస్కృతపదములకును లాటినుపదములకునుగల సంబంధమును దెలుపుచు నొక వ్యాసము వ్రాసెను. ఇంగ్లీషు విద్వాంసుఁడగు సర్ విలియమ్ జోన్సు భాషాశాస్త్రమున సంస్కృతము ప్రాధాన్యమునుగూర్చి వ్రాయుచు "సంస్కృతభాషా ప్రాచీనతవిషయమై భేదాభిప్రాయము లుండవచ్చును; కాని, దానినిర్మాణ మద్భుతమైనది. అది గ్రీకుభాషకంటె సంపూర్ణమైనది; లాటినుకంటె శబ్దసంపదయందు విశాలమయినది; గ్రీకులాటినుభాషల రెంటికంటె నెక్కువసంస్కారము నొందినది. దానికిని నీ రెండుభాషలకును, క్రియాధాతువులవిషయముననను, వ్యాకరణరూపముల విషయముననను దగ్గఱసంబంధము కలదు. ఈ సంబంధము యాదృచ్ఛికముగాదు. భాషాశాస్త్రజ్ఞుఁ డీ మూడుభాషలను సరిపోల్చునపు డవియన్నియు నేకమాతృక నుండి యుత్పన్నములైనవని తలపకపోఁడు. ఆ మాతృక నేఁడు లేకపోవచ్చును. ఇట్లే గాథికు కెల్టికుభాషలను సంస్కృతముతో సాజాత్యము కలిగినవని యూహింపవచ్చును. ప్రాచీన పెర్షియనుభాషయు నీ కుటుంబమునకుఁ జేరినదనియే చెప్పవచ్చును" అని తెలిపెను; కాని యాతడు తనవాదమును సమర్థించుట కాయా భాషలందుఁ దగినకృషిని జేయలేదు. సంస్కృతభాషాపరిచయమువలన భాషాశాస్త్రమునకుఁ గ్రొత్తమార్గము ననుసంధిపఁ గృషిచేసినవారిలో "ష్లెగెల్" (Schlegel) అను నాతడు ప్రథముఁడు. కాని యీతఁడు తత్తద్భాషలయందలి పదము లేధ్వని పరిణామసూత్రములచే వేర్వేఱురూపములఁ దాల్చినవో, యట్టి విషయమునుగూర్చి

కృషిచేయక, పైకి స్పష్టముగఁ గానవచ్చు కొన్ని పోలికలనుమాత్రము గుర్తించి తృప్తినొందెను. అతడుచేసిన సిద్ధాంతములలో ముఖ్యమయినది ప్రపంచమందలి భాషలను (1) సంస్కృతముతో సంబంధించిన భాషలు (2) తక్కినవి అను రెండువర్గములుగా నేర్పఱుచుట.

ష్లేగెలు తరువాత నాతనిమార్గమునఁ గృషిచేసినవారిలో బాప్ (Bopp) గ్రిమ్ (Grimm), రాస్క్ (Rosk) అనువారు ముప్పురును ననేకభాషలతోఁ బరిచయముఁ గలుగఁజేసికొని, వానిలోఁ గొన్నిటికిఁ బ్రత్యేకముగ వ్యాకరణములను వ్రాసి యాయా భాషలకుఁగల సూక్ష్మసంబంధములను గుర్తించి భాషాశాస్త్రమున ధ్వనిపరిణామసూత్రముల నేర్పఱుపఁ బ్రయత్నించిరి.

రాస్కునభిప్రాయముగన లిఖితాధారములేని యాయా జాతుల చరిత్రమును భాషామూలముననే తెలిసికొన సాధ్యమగును. మతము, ఆచారములు, రాజశాసనములు, సంస్థలు అన్నియును మాఱిపోవచ్చును. కాని సాధారణముగ భాష మాత్రము స్థిరముగ నిలుచును. దానిస్వరూపము కొంతవఱకు మాఱవచ్చును. అయినను గొన్ని వేలసంవత్సరములు గతించినను నా స్వరూపము గుర్తింపరానంత యెక్కువగామాఱదు. ఒకభాష కితరభాషలతోడి సంబంధమును దెలిసికొనుటకు దాని నిర్మాణమునుగూర్చి యాలోచింపవలయును. కాని ప్రత్యేకపదములనుగూర్చి యాలోచింపఁగూడదు. పదముల నొకభాషనుండి మరియొకభాష యెఱవు తెచ్చుకొనవచ్చును; కాని వ్యాకరణరూపముల నెరవు తెచ్చుకొనదు. మిక్కిలియుఁ జిక్కయిన వ్యాకరణ నిర్మాణముగల భాష మాతృకకు దగ్గఱగనుండును. భాష యెంత సంకీర్ణమైనదైనను నందలి యత్యావశ్యకములకు పదము లితరభాషల పదములతో సంబంధించియుండిన యెడల, నాయా భాషలు పరస్పరసంబంధము గలవని చెప్పవచ్చును. ఈ విషయమున సర్వనామములును, సంఖ్యావాచక పదములును ముఖ్యములు. రెండుభాషల యక్షరములందు (ధ్వనులయందు) సామాన్య పరిణామము కాన్పించుచున్నయెడల, నా భాషల నిర్మాణవిషయమున సాదృశ్యము కాన్పించుచున్నయెడల, నా భాషలకుఁ బరస్పరసంబంధముగలదని నిశ్చయముగఁ జెప్పవచ్చును.

ఈ యభిప్రాయమున ననుసరించి రాస్కు ఆర్యభాషాకుటుంబమున నంతర్భాగముల నేర్పఱిచెను. ద్రావిడభాషలకును సంస్కృతమునకును సంబంధములేదని మొదటతెలిపిన యాతఁ డీతడే. గ్రిమ్ (Grimm) బాప్ (Bopp) లాయా భాషల విషయమున సూక్ష్మవిమర్శనములుచేసి, కొన్ని ధ్వనిపరిణామసూత్రముల నేర్పఱి

చిరి. బాప్ (Bopp) భాషలనన్నిటిని మూఁడువర్గములుగ నేర్పఱిచెను. (1) ధాతువులుగాని ప్రత్యయములుగాని లేనిభాష. ఉదా: చీనాభాష. ఇట్టిభాషలయందాయా పదములు వ్యాకరణమందున్న స్థానమునుబట్టి యర్థస్ఫూర్తి కలుగును. (2) ఏకాక్షర ధాతువులుగల భాషలు: ధాతువు లితరధాతువులతోఁజేరి వివిధ వికారములను బొందుటచేత వివిధవ్యాకరణరూపము లేర్పడును. ఉదా: సంస్కృతము; మొద. (3) ద్వివర్ణక ధాతువులుగల భాషలు, లేక మూడు వ్యంజనములుగల ధాతువులు మూలముగాఁగల భాషలు. ఉదా: అరబ్బీ, హీబ్రూ, మొదలైన సెమిటికుభాషలు. ఇ దాయావ్యంజనముల యంతరమునవివిధాచ్చులుచేరి వ్యాకరణరూపము లేర్పడుచుండును. ఈ విభాగమునుగూర్చి తరువాతికాలమున నభిప్రాయభేదములేర్పడినవి.

పైవారి తరువాత భాషాశాస్త్రమునఁ బేరుగడించినవాఁడు హుంబోల్టు (Wilhelm Von Humboldt). ఇతని యభిప్రాయము ప్రకారము భాష యొక వస్తువుకాదు; అది పరిపూర్ణత నొందినదికాదు. అది చైతన్యము. అది యూహలను దెలుపుటకు వాగింద్రియమూలమున మనస్సు చేయుచుండు నిరంతరకృషి... భాష యేకము; ప్రత్యేకపదములును వాక్యములును భాష కాఁజాలదు. భాషను పదములుగ విభజించి సూత్రములనేర్పఱుచుట యది మృతదేహమునుకొని యిచ్ఛవచ్చునట్లు దానిని భేదించుటవంటిది. భాషలో నేదియు నిలుకడగాంచియుండదు; అది చైతన్యవంతమయి చలనాత్మకమైయుండును. భాష యొకచో నిలుకడగాంచుటకుఁ దావులేదు. అది వ్రాతయందును నిలువఁజాలదు. అందు నశించిన భాగమును మనస్సునందు పునస్సృష్టి చేసికొనుచుండవలెను. భాషయనునది భాషింపఁబడవలెను; ఇతరులకు బోధపడవలెను. లేకున్న దానికి వ్యక్తిత్వము లేకుండును. ఎంత యనాగరక భాషయైనను సంపూర్ణచైతన్యముగల వ్యక్తియే. దానిమాట్లాడువారి మనఃపరిణత నది తెలియఁజేయును. భాషను మాట్లాడువారి మనఃపరిణామమునననుసరించి యాభాషయందును బరిణామము గలుగుచునే యుండును. ఈ పరిణామమునందు నూతనసృష్టి గలుగుచుండు నవస్థయు నా సృష్టి మందగించి నిలుకడగలిగిన యవస్థయు నను రెండవస్థలుండును. మొదటి యవస్థయందు భాషాప్రయోజనమునుగూర్చికంటె భాషనుగూర్చియే శ్రద్ధ యెక్కువగనుండును. అందుచేతఁ గ్రొత్త వ్యాకరణరూపము లేర్పడుచుండును. రెండవయవస్థయందా సంపూర్ణ వ్యాకరణరూపములు శిథిలములయి యంతకంతకు నంతరించుచుండును. మనస్సు విషయ ప్రకటనమునుగూర్చి యెక్కువగ నాలోచించునప్పుడు భాషనుగూర్చి యంత శ్రద్ధవహింపదు. కావున నీ యవస్థయందు

భాష యెక్కువమార్పులకు లోనగును. అభిప్రాయప్రకటనయే ముఖ్యమని తలంచి వ్యాకరణరూపములందలి సూక్ష్మభేదముల నీ యవస్థయందు లక్ష్యపెట్టరు.

పందొమ్మిదవ శతాబ్దారంభమున నైరోపాయందలి భాషాశాస్త్రజ్ఞుల వ్రాఁతల యందుఁ గొన్ని ముఖ్యవిషయములను గమనింపవచ్చును. (1) సంస్కృతభాషకుఁ బ్రాధాన్యము వచ్చెను. ఏ భాషయందలిరూపము చరిత్రమును దెలుపవలసినను మొదట సంస్కృతరూపము నెత్తుకొనవలెను. సంస్కృతభాషాపరిచయములేని భాషాశాస్త్రజ్ఞుడు గణితశాస్త్రము తెలియని జ్యోతిష్కునివంటివాడని మాక్సుమ్యూల్లరనెను. (2) ఈ కాలమున శాస్త్రజ్ఞులాయా భాషలయందలి పోలికలనుమాత్రము గుర్తించుచుండిరికాని, భేదములనుగూర్చి శ్రద్ధవహింపలేదు. (3) ఆ కాలపు శాస్త్రజ్ఞులు సాధారణముగా వ్యవహారభ్రష్టములగు భాషలనుగూర్చి యెక్కువ కృషి చేయుచుండిరి. వ్యవహారమందున్న భాషలనుగూర్చి యాలోచించినపుడైనను, వారు వానియందలి పురాతనరూపములను గుర్తించుటయందే యెక్కువ శ్రద్ధ వహించుచుండిరి.

పందొమ్మిదవ శతాబ్దమధ్యమున శాస్త్రజ్ఞుల దృక్పథమునఁ గొంతమార్పు కలిగెను. ఒక మూలభాష వివిధభాషలుగ నేర్పడియుండెనని వారు గ్రహించినను, భాషలేలమాఱును ? సజాతీయములయిన యొక భాషకును మఱియొక భాషకును నంతటి భేదము గలుగుటకుఁ గారణమేమి ? యను ముఖ్య విషయములను గూర్చి వారాలోచింపలేదు. బ్రెడ్స్డార్ఫ్ (J. E. H. Bredsdorff) అనునతడు పదముల యందలి మార్పులకు (1) తప్పుగా వినుట. తప్పుగా నర్థము చేసికొనుట (2) ఒకమాట యథాస్వరూపమున స్మృతికి రాకుండుట (3) వాగింద్రియము లందలి దోషము (4) అలసత;- భాషయందలి మార్పులకు పదికి తొమ్మిది వంతున నిదియే కారణమని యాతని యభిప్రాయము (5) స్వరసామ్యమునుబట్టి క్రొత్తపదముల నేర్పఱచుట (6) స్పష్టోచ్చారణమునకై ప్రయత్నము (7) నూతన భావ ప్రకటనావశ్యకత, అనునవి కారణములుగ నిరూపించియున్నాఁడు. ఈ కారణములలోఁ గొన్నిటిని దరువాతి వారంగీకరింపలేదు.

ఈ కాలమున భాషాశాస్త్రమునఁ గలిగిన క్రొత్తపద్ధతి యాశాస్త్రము భాష యేరీతిగా నుండవలెను? ఎట్టిభాష యుత్తమభాష? యను విషయములను నిర్ణయించుటగాక వృక్షశాస్త్రము మొదలగు శాస్త్రములందువలె భాషయందు గానవచ్చు

వివిధ విషయములను క్రోడీకరించి వర్గీకరించి వాని స్వరూపము నున్నదున్నట్లు చెప్పుట. ఈ పద్ధతి ననుసరించి పందొమ్మిదవ శతాబ్దము మధ్యమున ననేక భాషల స్వరూపము నిర్ణయింపఁ బ్రయత్నములు జరిగెను. ఆయాభాషల యథార్థ స్వరూపములనుబట్టి మ్యాక్స్‌మ్యూలరు(Maxs Muller) మొదలగువారు ప్రపంచ భాషల నన్నిటిని వానివాని లక్షణముల ననుసరించి వివిధభాషాకుటుంబములుగ నేర్పఱిచిరి. ఇట్లేర్పడిన యనేక కుటుంబములందలి ప్రత్యేకభాషల లక్షణములను నొకభాషయందలి ధ్వనులు మఱియొక భాషయందు బరిణమించిన తీరుననుసరించి యా కుటుంబములోని భాషలన్నిటికిని నొక మాతృక యుండవలెనని యూహించి యా మాతృక భాషాస్వరూపమును నిర్మింప విద్వాంసులు పూనిరి. అందు ప్రాచీన ఇండో-జెర్మానికు మాతృభాషా నిర్మాణమును గూర్చి యెక్కువ కృషి జరిగెను. ఇందుకొఱకు 'స్వరశాస్త్రము' (Phonetics) నెక్కువ నభివృద్ధి చేసికొన సాగిరి. కాని యీ మూలభాషా నిర్మాణ విషయమున ననేకకారణములచే శాస్త్రజ్ఞులు కృతార్థులు కాలేదు. వారీవిషయమున నవలంబించిన పద్ధతి తీవ్రమగు విమర్శకు గుఱియైనది.

పందొమ్మిదవ శతాబ్దము నంతమువఱకును పాశ్చాత్య పండితులు భాషాశాస్త్రమునఁ జేసిన కృషినిగూర్చి యింతవఱకును సంగ్రహముగాఁ దెలుపఁబడినది. ఆ తరువాత నీశాస్త్రమునుగూర్చి నిరంతరకృషి జరుగుచునేయున్నది. నేఁడు భాషాశాస్త్రమున మఱియొక యుగ మారంభమయినదని చెప్పవచ్చును. ఈ క్రొత్తయుగమును గూర్చి విట్నీ (Whitney) "పూర్వకాలమున నశాస్త్రీయముగ పదముల వ్యుత్పత్తులను నిర్వచించుటకును నేఁటి పద్ధతికిని జాల భేదము గలదు. పూర్వులేర్పఱిచిన వ్యుత్పత్తుల నిప్పటివారు కొన్నియెడల శాస్త్రసాధ్యములని యొప్పుకొన్నను దగినంత ప్రమాణములేక వానిని పరిగ్రహింపరు. ఎంత చిన్న విషయమైనను దానికి సంబంధించిన యితర విషయముల నన్నిటిని నేఁటి వారొకచోఁ జేర్చుకొందురు. అనేక విషయముల పరిశీలనము చేసినఁగాని నేఁ డెవ్వరును సిద్ధాంతము చేయరు. భాషాశాస్త్రజ్ఞుఁడు నేఁడు శబ్దరూపముల నన్నిటినిఁ జేర్చి ప్రతిశబ్దము చరిత్రమును బత్యేకముగ శాస్త్రపద్ధతి ననుసరించి యేర్పఱుచుకొనును అని చెప్పియున్నాఁడు నేఁటి శాస్త్రజ్ఞులెన్నో స్వరపరిణామ సూత్రముల నేర్పఱుచుకొని క్రొత్తసిద్ధాంతములను చేయుచున్నారు. నేఁడు వ్యవహార భ్రష్ట భాషలు కాక, జనవ్యవహారమందున్న జీవద్భాషలు పరిశోధనమునకు గుఱియగుచున్నవి. సంధి, స్వరము, అర్థపరిణామము, మొదలగు ననేక విషయములను గూర్చి విద్వాంసులు సూక్ష్మచర్చల జేయుచున్నారు.

—చిలుకూరి నారాయణరావు *

---

* గ్రంథాలయ సర్వస్వము. జూన్. 1937. సంపు. 11 సం. 2

# కవిత్వతత్వము

హిందువులు కవిత్వమునకు ఉన్నతమైనస్థానము కల్పించిరి. సంసారవిష వృక్షమునకు అమృతోపములైన ఫలములలో కవిత్వ మొకటియని భావించిరి. "సుకవితా యద్యస్తి రాజ్యేన కి"మ్మని రాజ్యభోగములనుగూడ తృణప్రాయముగ తిరస్కరించిరి. ఏ మనుజుడైనను నాగరకత, సభ్యత, విజ్ఞానము, రస పకృతి యభివృద్ధియగుకొలది, జ్ఞానేంద్రియవినోదములను సుఖములను ఆశించు చుండును. జీవితాదర్శకము హెచ్చుకొలది, కొన్నికొన్ని యభిరుచులు నిశితము లగుచుండును. అట్టి మనుజుడు రమణీయపదార్థములను నిరంతరము దర్శించు టకును, మృదుమధురధ్వనులు వినుటకును, భావోద్రేకములగు కావ్యములను చదువుటకును అభిలషించుచుండును. అందువలన ఏ జాతియైన నాగరకత వహించియున్నకాలమున జాతీయశిల్పము పలువిధముల నభివృద్ధిఁ జెందును; శిల్పమునందును, కవిత్వమునందును జాతీయహృదయము ప్రతిఫలించుచుండును. ఈకళలు అభివృద్ధియగుకొలది జాతీయాభివృద్ధిచెందును; క్షీణించుకొలది జాతియు క్షీణించును. ఈ న్యాయము చరిత్రకారులకు కొంతవఱకు తెలిసియేయుండును కావుననే "అధఃపతితమైన జాతులను పునరుద్ధరించుటయందు కవులకు అగ్ర స్థానము కల"దని యొక పరాసు మహాశయుడు చెప్పియున్నాడు.

కవికిని సామాన్యమానవునికిని గల భేదమేమి? సామాన్యమానవుని భావ ప్రపంచమున రసానుభూతి యత్యల్పము. కవి భావప్రపంచము నిస్సీమము. రసానుభూతి యనంతము. సామాన్యునికి నొక్కవర్ణముతో గనుపట్టుపదార్థము కవి భావదృష్టికి ఇంద్రధనుర్వర్ణములతో గోచరించును. కవుల వాక్యములందు సర్వవ్యాప్తమగు సౌందర్యము, మాధుర్యము గలదు. దీనినే యొక సంస్కృత కవి యిట్లు నిర్వచించుచున్నాడు.

శ్లో॥ ప్రతీయమానం పున రన్యదేవ<br>
వస్త్వస్తి వాణీషు మహాకవీనాం<br>
యత్తత్ ప్రసిద్ధావయవాతిరిక్తం<br>
విభాతి లావణ్యమివాంగనానాం.

కవిత్వ మననేమి ? దాని యాదర్శక మేమి ? ఉపయోగ మేమి ?

కవిత్వము శాస్త్రమా ? లేక కళయా ?

కొందఱు లాక్షణికులు శాస్త్రమనియు, మఱికొందఱు కళయనియు నిర్వ చించియున్నారు. కాని వారెవ్వరును పరిపూర్ణసత్యమును జెప్పియుండలేదు.

కవిత్వము శాస్త్రకళలసమ్మేళనము. అయినను శాస్త్రమునకన్న కళాప్రకృతియే కవిత్వమున కాలంబము. ఛందోగతి శాస్త్రసంబంధమైనది. భావము, రసము, కల్పన కళాసంబంధమైనవి. కవిత్వమునకు కళాప్రాధాన్యము సూచించి, కవిభావమునకు విశాలమైన విహారక్షేత్రమునిర్మించిన సంస్కృతలాక్షణికులలో మమ్మటుడు, పండితరాయలు అగ్రగణ్యులు. ఆంధ్రలాక్షణికులకు స్వతంత్రమార్గములు లేవు గాన వారు సంస్కృతపద్ధతులనే యవలంబించిరి. ఆంధ్రకవులలో కవిత్వము శిల్పమనియు, కళయనియు ప్రప్రథమమున తెలిసికొన్న మహాకవి తిక్కన.

మ. "అమలోదాత్తమనీష నే నుభయకావ్య ప్రౌఢిఁబాటించు శి
ల్పమునం బారగుడం గళావిదుఁడ"

నని నిర్వచనోత్తరరామాయణమున తిక్కయజ్వ వ్రాసికొనియుండుటయే యందుకు తార్కాణము.

కళాతత్వనిర్వచనమున గొన్ని మతాంతరములు గలవు. అందు హిందువులకును పాశ్చాత్యులకును ఆదర్శకమున చాల భేదమున్నది. పాశ్చాత్యుల మనస్సు బహిర్ముఖము. హిందువుల మనస్సు అంతర్ముఖము. కావున పాశ్చాత్యశిల్పము అనుక్షణచంచలమైన బాహ్యప్రకృతిని చిత్రించును. హిందూశిల్పము ప్రకృతిహృదయము యొక్క గంభీరతను, అఖాతమును చిత్రించును. అట్లయిన నెవరి యాదర్శకము ఉత్తమమైనది? ప్రకృతిననుసరించుట కళాధర్మమా? లేక ప్రకృతి లోపములు పూరించుటయా ?

కవులు, శిల్పులు, చిత్రకారులు, సృష్టికర్తలు; అనుసరించువారుగారు. అనుకరణమున నూత్ననిర్మాణమునకు స్థానము లేదు. ఎట్లనుకరించినను మూలికను సరిపోలియుండదనుట అందరు శిల్పులు ఒప్పుకొన్నవిషయమే. అట్లయిన ప్రకృతి ననుసరించుట యెందుకు ? ఒక్క నిదర్శనము గనుఁడు. జలదగర్భములు చీల్చు

కొని నక్షత్రమండలము నొరసికొను శిఖరములతో ప్రకృతి కల్పనా చాతుర్యమును వేనోళ్ళ చాటించు హిమవత్పర్వతము ప్రత్యక్షముగ కన్నుఁగట్టుచుండ, చూచి యానందింపక, ఆఱంగుళముల కాగితముపై చిత్రింపఁబడిన మంచుకొండనుగాంచి యానందించు మానవుఁడుండునా? సౌందర్యవతి యగు కాంత సకలోపచారములు సేయ కన్నుల యెదుట నిలువఁబడి యుండ ఆ తొయ్యలిని నిరాదరించి, ఆమె ప్రతికృతిని గని సంతోషించు మూఢుఁడుండునా? చిత్రమున వర్ణసమ్మేళనము గలదు; ఛాయయు గలదు, కాని ప్రకృతియందు ప్రతిబింబించు జీవవిలసనము నిర్జీవవర్ణనమున లేదు. అట్లయిన నిట్టి శిల్ప మెందులకు? దీని కొక యుపయోగము కలదు. పైరుపచ్చలు, కాలువలు, నదులు తోటలు, కొండలు మున్నగువాని సంబంధములేని పట్టణవాస్తవ్యులకు చిత్రపటములైనను కొంతవినోదము గలిగించును. ఇంగ్లాండునందు ప్రతిగృహమునను సూర్యోదయము, సూర్యాస్తమయము చిత్రించిన పటములను మేజాబల్లలపై యుంచుకొని యుందురట! ఇది సహజమే. వారికి సూర్యోదయాస్తమయముల రామణీయకము దర్శించుభాగ్యము పలుమారు లభ్యపడదు. పొగమంచు, ఫ్యాక్టరీలపొగ యిందుకు ప్రతిబంధకములు. అట్టివారికి ఆలాటి చిత్రము లావశ్యకములు గాని, మనోహర కిమ్మీర వర్ణనములు ప్రసరింపఁజేయు ప్రత్యూషమును, సంధ్యను ప్రతిదినము సందర్శించు భారతదేశీయులకు ఇటువంటి శిల్పము అనావశ్యకము. ఈ కళను "బోధకకళ" లేక "అనుకరణకళ" అని పేర్కొనవచ్చును. కాని యిది ఆదర్శక శిల్పముగాదు.

ఇంగ్లీషు శిల్పి రతీదేవిని చిత్రింపవలయునని యనుకొనిన ఒక్కసుందరిని తనకు ఆదర్శకముగ దగ్గర గూర్చుండఁబెట్టుకొని, ఆమె ఆకారమును పటముపై చిత్రించి, ఆ చిత్రమునకు రతీదేవి యని పేరు పెట్టును. అంతకన్న మఱియొక మనోహరాంగి యుండెడు పక్షమున ఆ చిత్రకారుడు తన పూర్వచిత్రమును చింపివేయవలసి వచ్చును. అందువలన పాశ్చాత్య చిత్రకారుని చిత్రమునకును ఆదర్శకమునకును స్థాయిలేదు. అదే చిత్రమును హిందూ శిల్పి చిత్రింపవలసిన యెడల ఏమి చేయును? ప్రథమమున తన భావఫలకమున నొక సౌందర్య స్వరూపమును చిత్రించుకొని యనంతరము దాని ప్రతిబింబమును పటమునకు మార్చును. దీనిని శిల్పలాక్షణికుఁడైన శుక్రాచార్యుఁడు ఇట్లు నిర్వచించుచున్నాడు.

శ్లో॥ ధ్యానయోగస్య సంసిద్ధ్యై ప్రతిమా లక్షణం స్మృతమ్
ప్రతిమా కారకో మర్త్యో యథా ధ్యానరతో భవేత్.
తథా నాన్యేన మార్గేణ ప్రత్యక్షేణాపివా ఖలు
దేవానాం ప్రతిబింబాని కుర్యాచ్ఛ్రేయస్కరాణిచ.

చిత్రకారుడు చిత్రించిన సుందరాంగి ప్రపంచమున లేకుండవచ్చును. కాని అది చిత్రకారుని లోపముగాదు. ప్రకృతిలోపము. శిల్పి భావము ప్రకృతిని వెనుక వేసి పోవుచుండును. ప్రకృతి ఇంతవరకు సంపూర్ణముగ పరిణమించినదని యెవ్వరు చెప్పగలరు? శంపాలతాంగిని చంద్రాస్యను, కోకిలస్వనను, పద్మాయత నేత్రను కవి సృష్టించినాడు; శిల్పి నిర్మించినాడు. ఇక ప్రకృతి ఇటువంటి సుందర విగ్రహమును సృష్టించుట కెన్నివేల యేండ్లు గడపవలయునో యెవ్వ రెఱుగుదురు? కవి నిర్మించు స్వరూపము అస్వాభావికము గావచ్చును. మానవ ప్రకృతికి అతీతము గావచ్చును. అయినను అట్టి సౌందర్యరాశి, అట్టి భువన మోహిని మానవుని భావవీధిని విహరించునపుడు ఎంత ఆనందము, ఎంత పార వశ్యము, ఎంత రసానుభూతి గలుగును!

ఇదియే కవిత్వాదర్శకము! ఇదియే కవిత్వోపయోగము! ఇదియే కవిత్వ సందేశము! కవిత్వమునకును ఇతర శిల్పములకును నొక్క భేదమున్నది. కవిత్వము ప్రతిక్షణ భిన్న విషయముల ప్రదర్శించు సినిమెటోగ్రాపు వంటిది. ఇతర కళలు చలనములేని యేకప్రకృతిని మాత్రము సూచించు మ్యాజిక్ లాంతరు బొమ్మల వంటివి.

మానవుని ఆత్మ ఆనందమయమైనది. సౌందర్యమయమైనది, జ్ఞానమయమైనది. ఆత్మకును బుద్ధికిని మధ్యనున్న తెర పలుచన యగు కొలదిని ఆత్మసౌందర్యము జ్ఞానము కళల మూలమునను ఇతర విద్యల మూలమునను లోకమునకు వ్యక్తమగును. ఆత్మ దీపము వంటిది. శిల్పములు లాంతరుకువేసిన వివిధవర్ణములుగల అద్దముల వంటివి. పొగక్రమ్మకున్న సద్దములద్వారా దీపకాంతి ప్రసరించునటుల కళల మూలమున ఆత్మ తన సౌందర్యమును ప్రకటించును.

నీతి బాహ్యమైన కళ కళగాదని రస్కిను, టాల్‌స్టాయి మున్నగు కొందరు కళావిమర్శకులు నుడివియున్నారు. కాని కళయొక్క దృష్టి నీతియందును అవినీతియందును లేదు. కవిత్వ తత్త్వమును గనుడు.

శ్లో॥ "నియతికృత నియమరహితాం, హ్లాదైకమయీాం
అనన్యపరతంత్రాం నవరసరుచిరాం నిర్మితి
మాదధతీ భారతీ కవేః" —మమ్మటుడు.

"రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం" —పండితరాయలు

"రసాత్మకం వాక్యం కావ్యం" —విశ్వనాథుడు

కవిత్వము నిస్సీమమైనది; నిర్బంధరహితమైనది; హ్లాదైకమయమైనది; అనన్యపరతంత్రమైనది; నవరసరుచిరమైనది; రమణీయార్థమును ప్రతిపాదించునది.

ఇందెక్కడ నీతి, యవినీతి యను శబ్దములు లేవు. ఈ సందర్భమున స్విన్ బోరన్ అను ఆంగ్లేయ కవి వాక్యములు స్మరణకు వచ్చుచున్నవి.

The work of a poem has properly nothing to do with its moral meaning or disign.

కవిత్వము హృదయరంజకమైనది. దీని సహాయమున అమృతము ఊరింపవచ్చును. విషము పోయవచ్చును. కవిత్వము జనుల హృదయమును తాకునది కావున ప్రజాహృదయమున కెక్కింపదలచిన యే విషయము నైనను కవితామృతమున సమ్మిశితముచేసి ఆయామార్గదర్శకులు ప్రజలకు అందిచ్చిరి. ధర్మబోధకులు, మతబోధకులు, శాస్త్రబోధకులు కవిత్వము నాశ్రయించి తమయుద్దేశముల నెఱవేర్చుకొనుటకు దానినొక సాధనముగ చేసికొనిరి. అంత మాత్రముననే కవిత్వాదర్శకము ధర్మము, మతము, శాస్త్రము అని నిర్వచించుట సాహసము. కవిత్వమువలన హృదయము వికసించును. మనః ప్రపంచము విరివి యగును. భావములకు శిక్ష యలవడును. రసానుభూతి యభివృద్ధి యగును. కవిత్వమును గురించి తన యనుభవమును 'కోల్రిడ్జి' ఇట్లు చెప్పుకొని యున్నాడు.

Poetry has been to me its own exceeding great reward; It has soothed my affictions; it has multiplied and refined my enjoyments· it has endeared solitude; and it has given me the habit of wishing to discover the good and beautiful in all that meets and surrounds me·

కవిత్వము ననుభవించు నప్పుడు కవిభావ మర్మమును భేదించి తాను కవితో నేకీభవించు నప్పుడు హృదయపు సరిహద్దులు అనంతరస ప్రపంచమున విలీనమైపోయి పాఠకు డానందమయుడై యుండును. దీనినే జర్మను కవిశేఖరుడు 'గిటే' ఇటులు చెప్పియున్నాడు.

Each age has sung beauty
He who perceives it, is from himself set free

కవిత్వమును దాని యుపయోగమును చర్చించితిమి. ఇఁక వస్తువిషయ మాలోచింతము.

కవిత్వము రమణీయార్థ ప్రతిపాదనము. ఇఁక రమణీయార్థమును నిర్ధారించుటెట్లు ? కొందఱికి రుచించునది మఱికొందఱికి రుచించకపోవచ్చును. కొందఱికి రమ్యముగా నుండునది మఱికొందఱికి వికారముగ గనుపట్ట వచ్చును. రామణీయకము హృదయపరిపాకము ననుసరించి పలువురకు పలు విధములుగ దోచుచుండును. సౌందర్యవతియగు కులకామినిని అనాదరించి, కురూపియగు నొక పరాంగనతో సంబంధము చేసికొన్న యొక మనుష్యుని చూచి "ఓయీ సౌందర్యవతిని వదలి కురూపిణి నేల ప్రేమించుచున్నావు? అని యడిగిన "అయ్యా, నా కన్నులు పెట్టుకొని చూడుము" అని ప్రత్యుత్తర మిచ్చును.

"A thing of beauty is a joy for ever" అని కీట్సు అను ఆంగ్లేయ కవి యొకడు మనోహరత్వమునకును ఆనందమునకును గల నిరంతర సంబంధమును వచించియున్నాడు. కాని ఇది స్థూలన్యాయము. ఆకారమునకు మాత్రము సంబంధించినది. ఆనందమునకును రమణీయత్వమునకును ఎడతెగని సంబంధ మున్న యెడల అందుకు భిన్నమైన నిదర్శనములు లోకమున కనుపట్టగూడదు. అయినను కనుపట్టుచున్నవి. ఒకనికి మనోహర రూపిణియగు కులకాంత గలదనుకొనుడు. ఆ కాంతను గాంచినప్పుడెల్ల అతని మనము ఆనందించు చుండును. కాని హఠాత్తుగా తన భార్య తనకు విశ్వాసపాత్ర గాదు. కులట అని తెలిసికొన్నంతనే భావవికృతి కలుగును. సౌందర్యవతి యగు భార్య హేయ పాత్ర యగును. మొగము చూచినంతనే చంపబుద్ధి పుట్టును. సౌందర్యమేమైన నశించెనా ? లేదు. ఇప్పుడు ఆకార రమణీయతకును ఆనందమునకును గల సంబంధ మేమయినది ?

మరియొక నిదర్శనము గనుడు. భార్య రూపవతిగాదు, సుశీలవతి, పరిచర్యచేసి పతిమనము హరించు చుండును. ఆమెను గాంచినప్పుడు భార్య

అంగవికారము మనమున పొడగట్టదు. ఆమె ప్రేమ, సద్గుణములు, వినయము, మనము నాకర్షించును. దీనినిబట్టి చూడ స్థిరమైన రామణీయకము ఆధ్యాత్మికమైనది. కాని ఆకృతి విశేషముల నవలంబించి యుండునది కాదు.

రామణీయకము వృద్ధిచేయుటకు అలంకారము లావశ్యకములా ? ఆవశ్యకములు కాకపోయినను కొన్ని యలంకారము లుండవచ్చును. అలంకారములందు భేదములు కలవు. కాలక్రమమున అభిరుచి ననుసరించి అలంకారములు మారుచుండును. గ్రామములలో వీధిభాగవత మాడు నటకులు గాజుబిళ్ళలు చెక్కిన కొయ్యనగలను ధరించుకొందురు. ఆ నగలు సుందరములని అనుకొన్న కాల మొకటి యుండియుండును. నేడు పట్టణముల నాటకరంగములందు నటకులు ధరించుకొను అలంకారములను రమణీయములని మన మానందించుచున్నాము. ఇక భావికాలమున ఇప్పటికన్న నాగరికత యభివృద్ధిచెంది, యీ యలంకారములు మోటువని మన సంతతివారు పరిహసింప వచ్చును. నాగరకత యభివృద్ధి యగుకొలది రసప్రకృతి విరివియగుకొలది రామణీయకము యొక్క యాదర్శకము హెచ్చుకొలది యలంకారములు సూక్ష్మములుగను, అల్పములుగను పరిణమించుచుండును. స్వభావసిద్ధము గు సౌందర్యము లేని కాంత ఆ లోపమును పూరించుటకు అలంకారముల సహాయము గోరును. శాకుంతల కే యలంకారము లుండినవి ? వల్కలాజిన వసనము, పువ్వుల దండలు, లాక్షారాగము— ఈ యలంకారము లామె దేహము నాశ్రయించి సార్థకములైనవి. అట్టి శాకుంతల అలంకారము లెఱుగని వనకన్య శుద్ధాంతకాంతల పరిచయము గల్గిన దుష్యంతుని చిత్తము నాకర్షించెను.

కవిత్వమున భావప్రకటనము, రసము హెచ్చుకొలది డాంబికము దగ్గును. డాంబికము తగ్గుకొలది అలంకారములపై ఆశ మట్టగించును. కవిత్వము నిరలంకృత మన్నంత రసహీనముగ నుండవలయునని నాభావముకాదు. రవీంద్రనాథ టాగూరు గారు తన గానమును గుఱించి యిట్లు చెప్పుకొని యున్నాడు.

My song has put off her adornments; She has no pride of dress or decoration; They would come between thee and me; Their jingling would drown thy whispers.

ఈ సందర్భమున కళాపూర్ణోదయములోని సుగాత్రీ శాలీనులకథ స్మరణకు తెచ్చుకొనవలయును. వ్యాసము పెరుగునని కథ వ్రాయలేదు.

—దువ్వూరి రామిరెడ్డి*

---

* గ్రంథాలయ సర్వస్వము. 1921. భా. 2. సం.5

# ఆంధ్ర కవితాకళ - తదితర మనోజ్ఞకళలు

వాపీకూప తటాకాదుల యందలి జలము భాగీరథీ జలబిందు సంపర్కమునఁ బావనమగు తీరునను, ఘృతాభిఘార సంస్కారము వలన ద్రవ్యములు పవిత్రములగు వడువునను గీర్వాణభాషాసంపర్కవశమున నాంధ్రభాష పవిత్రమగుచున్నది. మరియును లోకవ్యవహారమున కనుకూలించు తీరున సర్వదా మన ముపయోగపఱచుకొను వెండి నాణెములను ముద్రించునపుడు ముమ్మందు స్వల్పాంశము, సువర్ణమును రజతములో గలిపి కరగించి నాణీయములను గొట్టుదురు. అప్పుడుగాని వాని కనుకూలమగు పటుత్వము లభింపదు. అట్లే గీర్వాణభాషా సంపర్కము లేశమాత్రమున లేనియెడల నాంధ్రభాషకు బాటవము గలుగనేరదు. ఇదియును గాక సంస్కృతభాషా సారస్వతము మనకుఁ బిత్రార్జిత ద్రవ్యము. కావున దానికి హాని కలుగకుండ భద్రపఱచి యుంచుకొని కాపాడుచు నభివృద్ధిఁ జేసికొనుచు సమయానుసారముగా నవసరము గలుగునపుడు దాని నుండి స్వల్పమాత్రము గ్రహించి వినియోగపఱచి కొనవలసి యుండును. మనకుఁ గేవలము స్వార్జిత ద్రవ్యమువంటి యాంధ్రభాషా సారస్వతమునో దుర్వినియోగము మాత్రము చేయక సముచిత మార్గమున యథేచ్ఛముగా వినియోగ పఱచుకొనుటకు మనకు స్వాతంత్ర్యము గలదు. కాబట్టి యాంధ్ర కవితావిషయికమగు నీ యుపన్యాస ప్రారంభమున మంగళాచరణమునకుఁ బోలె రెండు మూడు విషయములను మాత్రము సంస్కృత భాషా సారస్వతము నుండి గ్రహించి వినియోగించి పిమ్మట సమస్తమును గేవలాంధ్రభాషా సారస్వతము నుండియే యథేచ్ఛగా వినియోగ పఱచెదను. అక్కడక్కడ భాషాంతర పండిత సంప్రదాయములను గూడ నుదహరించి చర్చించుటయు విజ్ఞానాభివర్ధకమగుట వలన వానిని గూడ స్వీకరించి వినియోగించుచున్నాను.

కాళిదాసమహాకవి యభిజ్ఞాన శాకుంతలమునందు,

"రమ్యాణి వీక్ష్య, మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకీ భవతి యత్సుఖితోఽపి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని"

అని చెప్పియున్నాడు. రమ్యములగు వస్తువులను వీక్షించు నప్పుడును మధురములగు శబ్దముల నాకర్ణించునపుడును హాయిగా సుఖపడు నదియైనను జీవ వుత్కంఠను జెందుట కలదు. అట్టి కళవళపా టనునది (యేలోయెఱుకపడక) భావమున స్థిరముగా నాటుకొని యుండు జన్మాంతర సంస్కార వాసనలు తలం పునఁ బడుట వలన గలుగును, అని దీని తాత్పర్యము. వేదశాస్త్రముల యందు ప్రామాణ్యబుద్ధిగల యార్ష సంతతి వారమగు మనము జన్మాంతర స్మృతి సంస్కార సిద్ధాంతము నంగీకరింతుము. ఈ విషయమును భగవానుడగు పతంజలి మహర్షి యోగదర్శనమున.

"తత స్తద్విపాకానుగుణానా మేవాభివ్యక్తిర్వాసనానాం",
"జాతి దేశ కాలవ్యవహితానా మప్యానంతర్యం
స్మృతి సంస్కారయో రేకరూపత్వాత్"
"తాసామనా ద్విత్వరాశిషో నిత్యత్వాత్"

అను మూడు సూత్రముల మూలమున సిద్ధాంతీకరించి యున్నాడు. "కర్మ విపాకానుగుణముగా సంస్కారములు వ్యక్తములగును. స్మృతి సంస్కా రము లేక రూపము గలవి గనుక జాతి దేశకాల వ్యవహితము లయినను వాని కానంతర్యము గలుగును. మహామోహ రూపమగు నవిద్య యనాది గావున స్మృతి సంస్కారములకుఁ గూడ ననాదిత్వము" అని యాసూత్ర సిద్ధాంతము. గీర్వాణ సారస్వతము నుండి యీ మాత్రము గ్రహించి వినియోగ పఱచు కొనుచున్నాను.

కాళిదాసమహాకవి రచించిన శ్లోకములోని పూర్వార్ధము సమగ్రముగాఁ బ్రస్తుతోపన్యాస విషయముతో సంబంధము గలిగియున్నది. ఉత్తరార్ధమైనను గేవల ప్రస్తుత ప్రశంస కాకపోవుటయే కాక యుపన్యాస విషయముతోఁ గొంత సంబంధము గలిగి యున్నది; ముందు ముందు సరిపెట్టుకొనఁ దగియుండును.

సర్ మానియర్ విలియమ్సు మహాశయుఁ డీ శ్లోకమును :

"Not Seldom in our happy hours of ease, when thought is still, the sight of some fair form·

Or mournful fall of music breathing low, will stir strange fancies, thrilling all the soul with a mysterious sadness, and a sense of vague yet earnest longing, can it be that the dim memory

of events long past, or friendships formed in other states of being. And flits like a passing shadow the spirit?"

అని యింగ్లీషు భాషలోనికి మార్చి దాని తాత్పర్యము నా రీతిని వ్యక్తీకరించెను. మఱియు నాతఁడు కాళిదాసును గుఱించియు నభిజ్ఞానశాకుంతలము గూర్చియు;

"No one can read this act (IVth) nor indeed any act of the play without being struck with the raciness and elevation of its author's genius, the exulerance and glow of his fancy, his ordent love of the beautiful his deep sympathy with natural and nature's loveliest scenes, his profound knowledge of the human heart, his delicate appreciation of its most refined feelings, his familiarity with its conflicting sentiments and emotion"

అని వ్రాసెను. కాళిదాస మూలశ్లోకములోని పూర్వార్ధమును సర్ మోనియర్ విలియమ్సుగారి యభిప్రాయములోని "his ardent love of the beautiful" అను మాటలను మనసున గీల్కొల్పి సమయము వచ్చినపుడనగా మరియొక గడియకు స్మరింతురుగాక! ఏమనగ నవి ప్రకృతవిషయముతో సంపూర్ణసంబంధము గలిగియే యుండును. తక్కిన భాగములును గొంత సంబంధము గలిగియేయుండును. కావున నవియును విస్మరణీయములుగావు.

మన ప్రాచీనులు లోకసంగ్రహము కొఱకనేకములగు విద్యలను గళలను మనకుఁ బ్రసాదించి యున్నారు. విద్యలలోఁ బ్రధానములు పదునాలుగని కొందఱు జెప్పుదురు. ప్రధానకళలు మాత్ర మఱువదినాలుగని యందఱు నంగీకరింతురు. విద్యలను గూర్చిన చర్చ మనకిప్పు డవసరము లేకపోయినను గళలలోఁగొన్ని విద్యామూలకము లగుటచేత విద్యాప్రశంసయుఁ జేయవలసి వచ్చినది. విద్యలలో ధనుర్వేద గాంధర్వవేదములు పరిగణింపబడినవి. మల్లయుద్ధ వ్యూహ రచనాదులు ధనుర్వేదములోని కళలు. నృత్తగీత వాద్యాదులు గాంధర్వవేదకళలు. కాఁబట్టి యిఁక మనము విద్యాప్రశంస నటుంచి కేవల కళా విషయమును మాత్రమే విచారింతము.

వాగింద్రియ వ్యాపార ప్రదర్శన యోగ్యమగునది విద్యయనియు మూఁగ వాఁడయినను నిర్వర్తింపగలది కళయనియును సామాన్య లక్షణము. కాని యీ లక్షణము నిర్దుష్టముగాఁ గనబడదు. కళలకు మనలోఁ గ్రియలనియును

నామాంతరము. అఱువదినాలుగు కళలలో ననేకములు కేవల కార్మికములును బారి శ్రామికములును నయి జీవయాత్ర కనుకూలపడుచున్నవి వాని నటుండనిచ్చి సుప్రసిద్ధములును, సముత్కృష్టములును, మనోరంజకములును నగు నతిప్రధాన కళలను మాత్రమే విమర్శింతము. వీనినే మనోజ్ఞకళలని (Fine Arts) యందురు. పశ్చిమఖండ పండితులు మనోజ్ఞకళా విమర్శనమును సమగ్రముగా దెలుపు శాస్త్రమును రచించుకొనిరి.

అది మనోజ్ఞవస్తు మీమాంస యనఁబడును, (Aesthetics the science or philosophy of the beautiful, of taste or of the fine arts) శిల్పకళ (Architecture), మద్దారు శిలాలోహాది క్రియాలాపనము (Sculpture), చిత్రలేఖనము (Painting), గానకళ (Music), కవిత్వము (Poetry) అను నీయైదును మనోజ్ఞకళలు (Fine Arts) అని వారును మనమును నంగీకరింతుము. మన ప్రాచీనులు మృద్దారులోహ శిలా క్రియాకలాపమును వేర్వేరు కళల క్రింద విభాగించి యున్నను వాని నన్నిటిని బ్రధానకళయగు శిల్పకళలోనే చేర్చుకొనుట వలన మనోజ్ఞకళలు నాలుగేయని మనవారి యభిప్రాయము. ఈ మనోజ్ఞకళలలో గాన కవిత్వములు శ్రోత్రేంద్రియ గ్రాహ్యములును దక్కినవి నేత్రేంద్రియ గ్రాహ్యములును గాఁబట్టి శ్రవ్యకళలు (Arts of the ear), దృశ్యకళలు (Arts of the eye) అని పేర్కొనబడుచున్నవి. ఇట్లే గాన కవిత్వములు వాగింద్రియ ప్రాధాన్యములగుట వలన వాచ్యకళలు (Speaking Arts) అనియుఁ దక్కినవి రూప నిర్మాణ ప్రాధాన్యము లగుటంజేసి నిర్మితకళలు (Shaping) అనియును జెప్పుదురు. మఱియును దేశకాల ప్రాధాన్యమును బట్టి గానకవిత్వములు కాలిక కళలు (Arts of time) తక్కినవి వైదేశికకళలు (Arts of space) అనియును బేర్కొనబడుచున్నవి. ఇంతయేకాక గాన కవిత్వములు వాచికకళలు (Vocal Arts మిగిలినవి కాయిక కళలు (Manual Arts) అనియును జెప్పుదురు.

ప్రధానములగు నీ కళలు నేత్రశ్రోత్ర గోచరములయి తద్వారమున మనసునకెక్కి మనోజ్ఞములగును. కాఁబట్టి దృశ్య శ్రవ్యభేదమును వాచికకాయిక భేదమును మాత్ర మంగీకరించి సామాన్యధర్మమగు మనోజ్ఞతను సుస్పష్టముగాఁ బేర్కొనకుండుట న్యాయముగాదని యెంచెనో యనఁ గాళిదాసమహాకవి "రమ్యాణి వీక్ష్య మధురాంశ్చనిశమ్య శబ్దాన్" అని యంతటితోఁ జాలింపక "పర్యుత్సుకీభవతి" అనియు "చేతసాస్మరతి" అనియు మానసికత్వమునుగూడ వివరించి యున్నాడు.

కాళిదాసవిరచితమగు శ్లోకమును సర్ మోనియర్ విలియమ్సుగారి ప్రశంసా వాక్యములను స్మరింపదగిన సమయమిదియే. మనోజ్ఞకళలు నేత్రశ్రోత్రగ్రాహ్యములై తద్ద్వారమున మనోజ్ఞత నలవరుచుటయేకాక విలక్షణమగు పర్యుత్సుకతను గూడఁ గలిగించుటయుం గలదని కాళిదాసాదుల యభిప్రాయ మీ విషయమునఁ దెలిసికొనఁదగియుండును. లోకములోని సమస్త వైచిత్ర్యములను బ్రదర్శించునది ప్రకృతి (Nature). మనుష్యునకింద్రియగోచరము లగుచుండు వైచిత్ర్యములను మాత్రము ప్రదర్శించునది కళ (Art . కాఁబట్టి కళాప్రదర్శనమునకు బ్రాగ్భావన (Preneditation) పరమావశ్యకము. ప్రకృతి కీనియమములేదుగదా ? కళాప్రదర్శనమునఁ బ్రదర్శకులకుఁ దదితరులకును నానందానుభవము గలుగుచున్నను నిర్మమత్వము (Dis-interestednes) మాత్రము మనోజ్ఞకళలకుఁ బ్రధానగుణము. ఎట్లనిన:- కవితాగానములయందుఁగాని నాటకాదులయందుఁగాని ప్రదర్శింపఁబడు ననురాగము (Love) కృత్రిమమే కాక యరాగాభినయము మాత్రమేయగును. అది అందఱిసొమ్మేకాని యొక్కరిది కానేరదు. యథార్థానురాగము (True love) ప్రకృతిధర్మము. ఇట్లే తక్కిన విషయములును.

ఇంతటితో నీ చర్చను జాలించి మనోజ్ఞకళలకుఁగల పరస్పర సంబంధమును విచారింతము.

దృశ్యకళలకు శిల్ప చిత్రలేఖనములకు రూపరేఖావిలాసములు (line light and Shade and Colour) ప్రధానములు. మనలో రూపము (light and shade) మొదటిది. రేఖ (line) రెండవది. పశ్చిమఖండ పండితులలోఁ బ్రాచీనుల మతమున రేఖ (line) మొదటిది. రూపము (light and shade) రెండవది. వారిలోని యాధునికులు గొందఱు మనతో నేకీభవించుచున్నారు. మఱికొందఱు రేఖ (line) ను బూర్తిగాఁ బరిత్యజించి రూపవిలాసములను మాత్రమే గ్రహించుచున్నారు.

మఱియును శిల్పకళాప్రదర్శనమునకును వ్యక్తిపరిమాణమునుబట్టి పొడుగును, వెడల్పును, లోతు, దళసరులను (length, breadth, thickness or depth) ఇమిడియుండఁదగిన స్థలము (space) కావలసియుండును. చిత్రలేఖనకళాప్రదర్శనమున కన్నానో పొడుగువెడల్పులమాత్రమే యిమిడియుండదగిన సరళప్రదేశము (plane surface) కావలయును. ఈ రెండుకళలయందును నేదోయొక్క కాలమును నేదోయొక్క ప్రదేశమును మాత్రమే సుస్థిరముగఁ బ్రదర్శింపబడును. శిల్పకళయందు దూరస్థితములందు సజాతీయ విజాతీయ

పదార్థముల ప్రదర్శనము సాధ్యముగాదు. చిత్రలేఖన కళయందుమాత్రము దవ్వుదూరములతో నిమిత్తము లేక దృష్టిపథమునఁ బడఁదగిన సకలవైచిత్ర్యములను బ్రదర్శింపసాధ్యపడును. మఱియును రూపరేఖా విలాసములన్నింటిలోఁ గాని కొన్నింటిలోఁగాని చిత్రలేఖనమున వస్తుప్రదర్శనము మనోజ్ఞముగాఁ గావింపవచ్చును. శిల్పకళయం దది వీలుపడదు.

ఇఁక దేశికములగు కళలనుండి కాలికములగు కళలకు దిగిచూతము. అతి గంభీరమగు నంతరాళమునుండి యగాధమగు కాలసముద్రములోనికిఁ జెంగున దాటుట దుష్కరకార్యమని తోచకమానదు. కాని దేశకాలములు రెండును నీర క్షీరన్యాయమునఁ గలసిమెలసియుండుటవలన నొకదానినుండి యింకొకదానిని జేరఁబోవుట మిక్కిలి సులభకార్యమని తలంపదగును.

దృశ్యకళలచేఁ బదర్శింప ననువుపడని వైచిత్ర్యములను శ్రవ్యకళలగు గాన కవిత్వములు ప్రదర్శింపగలవు. వానికి దేశకాలనిర్బంధములు లేవుకాని కవిత్వ సంబంధములేని కేవల నాదాత్మకమగు గానమునకు మాత్ర మంతటి ప్రజ్ఞలేదు. కావున శిల్ప చిత్రలేఖన గాన కళలు ప్రదర్శించు సకల వైచిత్ర్యములను గవితాకళ యొక్కటే ప్రదర్శింపగల సామర్థ్యము గలది. కాఁబట్టి మనోజ్ఞకళలన్నిటిలోను సర్వోత్కృష్టమగునది కవితాకళయని యంగీకరింపవలసి యుండును.

ఇప్పటికిఁ బ్రస్తుతాంశమున కందుబాటుదూరమునకు వచ్చితిమి.

ఏకైకభాషాకవిత్వ ప్రశంస ప్రసక్తించునపుడు తోడ్తోన దానిని జర్చింపఁ బూనుటకన్నఁ బ్రథమమునఁ గవిత్వసామాన్యమును జర్చించిచూచుకొని పిమ్మట విశేషమును జర్చించుకొనుట సమంజసపద్ధతి. కాఁబట్టి కవితయనునేమో తొలుత విమర్శింతము.

చేతనాచేతనప్రకృతివైచిత్ర్యముల నన్నింటినిగాని కొన్నింటినిగాని విన వింపయిన నియమక్రమపద్ధతిని బ్రయోగింపఁబడు శబ్దజాలముచే ననుకరించుట వలనఁగాని యాకోశించుటవలనఁగాని భావోద్రేకమును వ్యక్తీకరించుటయు విజృంభింపఁజేయుటయుఁ గాలికకళయగు కవితయనబడును, (Poetry is a time art of which the business is to express and arouse emotion by imitating or evoking of all or any of the Phenoumena of life and the nature by means of words arranged with musical regularity) అని పశ్చిమఖండ పండితులు నిర్వచించుచున్నారు. వీరిమతమున

బద్యరూపముగా నుండునదియే కవితకాని గద్యరూపముగా నుండునది కవిత కాదు. ఫ్రెంచిపండితులు కొందఱుమాత్రము గద్యముగూడఁ గవిత్వమని యంగీక రింతురు. మనలో గద్యము పద్యము, పదమునుగూడ కవితయే.

కవితాప్రభావము నిరుపమానము. కవితాశక్తి నిరంకుశము. వాగ్రూప మున వ్యక్తపఱుపఁదగిన సకలపదార్థములను, సకలధర్మములను, సకలవైచిత్ర్య ములను వేయేల సచరాచరంబగు లోకమునందలి సకలవిషయములను మనః ఫలకమున నైపుణ్యముతోఁ జిత్రించి ప్రత్యక్షముసేయు సామర్థ్యముగలది కవిత. పరంపరారూపమైన కార్యకారణప్రణాళిక, జడచేతనముల వివిధ వైచిత్ర్యములు, నానావిధ దశాంతర్దశలు, కాలసూత్రమునకు లోఁబడు వివిధ పరిణామములు, వివిధావస్థలు, వివిధభావములు కవితాకళకు లొంగినట్లు తక్కిన ఏ కళకు లొంగవు. భాషయందలి లోపముచేత భావవ్యక్తీకరణమున కనుకూల మగు శబ్దజాలము లభింపకపోయినను, ఉన్నవానితోనే సమగ్రముగా భావమును వ్యక్తీకరించుశక్తియుఁ గవితకుఁ గలదని చెప్పనగును.

ఇంతవఱకుఁ దెలుపఁ బడిన సంప్రదాయసిద్ధములగు విషయములన్నియు నాంధ్రభాషా కవిత్వమునకును నన్వయించును.

కావ్యప్రబంధ రూపమగు సారస్వతమునందుఁ గవి తాను గొంతమాటాడి పాత్రవర్గముచేఁ గొంత మాటాడించునది యొక తెగ. పాత్రవర్గమును నోరెత్త నీయక కవియే మాటాడునది మఱియొక తెగ. కవి తాను పెదవి గదపక పాత్ర వర్గము చేతనే మాటాడించునది మఱియొక తెగ. దీనినే రూపకమని యందురు. ఆంధ్రమున మొదటి రెండు తెగల కావ్యములే చిరకాలమునుండి లభించుచున్నవి. మూఁడవ తెగ యిప్పుడిప్పుడు పొడసూపుచున్నది. భావిదశ యెట్లుండునో చెప్పఁజాలము. ఏమనినఁ బ్రకృతమునఁ బ్రచలితములగు నాంధ్రనాటకాది రూప కములను జూడగా నిరుత్సాహము గలుగుచున్నది. తెలిగింపఁబడిన సంస్కృత రూపకముల నటుండ నిచ్చి క్రొత్తగా రచింపఁబడుచున్న తెలుఁగు రూపకములను గొన్నింటిని బరిశీలించితిమేని వానిని రూపకములని పేర్కొనుటకే యనువు పడదు. గద్యపద్యాత్మకమగు కథోపకథన మాత్రమెల్ల రూపకమనవలసి వచ్చెను. వివక్షితార్థ ప్రతిపాదనము గాని యితివృత్త విస్తరము గాని చమత్కా రిత్వము గాని వాని యందు స్ఫుటముగాఁ బొడకట్టదు. ఈ రీతి దృశ్యప్రబం ధముల వలన నాంధ్రరూపక సారస్వతము వన్నె కెక్కఁజాలదు.

ఇప్పుడు వివరించిన భేదములు గల యాంధ్ర సారస్వతమునందలి కవిత్వకళకు శిల్ప చిత్రలేఖన గాన కళలతోఁ గల సంబంధమును మనమేరీతిన సమన్వయము చేసికొనఁగలమో యోజింతము. ఈ పని తలపెట్టినప్పుడు ముందుగాఁ గవికిని గవిత్వమునకును లోకమునకును గల సంబంధమును దెలిసి కొనవలసి యుండును. కావున సంగ్రహముగా విన్నవించుచున్నాను.

చందురుఁ డభ్రమున్ దివము
సైకతముల్ నదులు న్నగంబులున్
గందరముల్ గొలంకులు వ
నంబులు మున్నగు రమ్యవస్తువుల్
జెందుఁ గృతార్థతన్ గవుల
చేతనె; వారును లోకవిశ్రుతిం
గందురు వానిచే; నిదియె
కాదె యొసంగుట పుచ్చుకొంటయున్.
కవిత యొనర్చి సంతతము
గానము సేయుచు దాని తోడిదే
భువనమటంచుఁ దెల్పు మగ
మొల్కయొకం డరుదయ్యె నేని పై
భవము దొలంగి లోక మొక
భంగి నిరర్థకమౌ ననం దగున్
గవియును గాఁదతం డితర
గాథలు వేలకొలంది సెప్పినన్.

కావుననే

మలయ సమీరణం బొలయ
మంజుల కుంజవనాంతసీమలన్
మలయుచు గంధబంధుర సు
మప్రకరంబులఁ గాంచి సొక్కుచున్
జలజసరోవిహారములు
సల్పుచు వెన్నెల లందు నిల్చుచున్

గలకలలాడు లోకమును
గాంచి కవీంద్రులు మిన్నకుందురే?

అని యీ తీరునఁ గవనమును వెల్లివిరియించు సుకవుల పలుకులెట్టివన్న;

చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము
గలిగినను—సౌరభముఁ జలువయుఁ దలిర్పం
బొలుపెసఁగు కప్పురపు బలుకులకుఁ గోమలత
నెలకొనిన-సౌరభముఁ జలువపసయుం గో
మలతయును గలిగి జగముల మిగులఁ బెం
పెసఁగు మలయపవనంపుఁ గొదమలకు మధురత్వం
బలవడిన-సీడు మఱి కలదనఁగవచ్చుఁ గడువెలయఁ
గల (యా) సుకవి పలుకులకు నెంచన్.

అని పింగళ సూరకవి చెప్పియున్నాఁడు. ఇట్లత్యంత స్తవనీయమగు నాంధ్రకవిత్వము సహజమార్దవ మాధుర్యములు గలిగి యమృతధారా సంపాతంబునం బోలె మనలఁ దనియించును. అవ్యక్తమధురమగు గానామృతమునకు సువ్యక్తమధురమగు నాంధ్రకవితామృతము తోడ్పడి యాంధ్రలోకమును నిరంతరానందామృత మహాసముద్ర తరంగములలో నోలలాడించుచున్నది.

అవ్యక్తమధురమై కేవల నాదైక రూపమగు గానమునే రామరాజభూషణుడు.

"వీనులవిందై యమృతపు, సోనల పొందై యమందసుమచలదళినీ, గానము క్రందై యాస్వన, మానంద బ్రహ్మమైన"దని వచించెను.

రసోచితమగు సాహిత్య సంపదగల కవితను గలస్వనముతో సమ్మేళన మొనరించు నప్పుడు మనకు గాన కళాప్రభావము సువ్యక్తమగును. ఆ యానందము నిరుపమానము. సంగీతసాహిత్యముల సమగౌరవము "సకలా మోదక తాళవృత్తగతుల"ను మనోహరముగా మనకవులు విశదపఱచి యున్నారు.

శిల్పకళా నైపుణ్యమును బ్రత్యక్షముగాఁ జూపించు శిల్పకారులకన్న సుకవులు తమ కవితా నైపుణిచే మనకు దానిని దేశాంతర కాలాంతరముల యందు మనోగోచరము గావించుచున్నారు. తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర విగ్రహము

మనకెక్కడ గావలసిన నక్కడ నెప్పుడు గావలసిన నప్పుడు మనోగోచరమగు నట్లు పింగళ సూరకవి.

"మృదు పదాంబుజములు, మెఱుఁగుటందెలుఁబైఁడి దుప్పటియును, మొల ముప్పడియును, మణిమేఖలయు, బొడ్డుమానికంబును, వైజయంతియు, నురమున నలరు సిరియు, వగదహస్తము, కటివర్తిలుకేలు, శంఖము, చక్రమును దాల్చుకరయుగంబు, తారహారంబులు, చారుకంఠంబు, నిద్దపుఁజెక్కులును, నవ్వుదళుకు పసలు। మకరకుండలములును దామరలఁ దెగడు, కన్నులు మనోజ్ఞనాసయుఁ గలికి బొమలు, ముత్తియపు నామమును రత్నముకుటవరము, నెసఁగఁగనుపట్టు శ్రీ వేంకటేశుఁ" జూపుచున్నాడు. మఱియు నాతండు,

"కుటిలకచా! యెఱుంగుదువె
గొబ్బున నేఁ జని కొల్వుకూటము
క్కటి కడనుక్కి యారయక
కట్టెదుటన్ బటికంపు గోడఁ బ్ర
స్ఫుటముగ దానియందు హరిఁ
జూచుచు మ్రొక్కఁగ వెన్కనుండి య
ట్టిటు మొగమంచు నవ్వె సభ
యెల్లను దన్మణి భిత్తి యున్నదే?"

అని యడిగి శిల్పకళా చాతుర్యమును బ్రత్యక్షము సేయుచున్నాఁడు.

కవి స్వయముగాఁ దన కళా నైపుణ్యమును మాటలతోఁజెప్పి విగ్రహమును నిర్మింపుమని శిల్పకారునిఁ జిత్తరువును వ్రాయమని చిత్రకారునిఁ బ్రోత్సాహము చేయుచున్నాఁడోయన,

"మెఱుఁగారు ముంజియు • మేని కోమలికంబు గడుదిట గుణము గులుకాడు మొగంబు, పసుపు గోచులయొప్పు • బ్రహ్మతేజంబును, జారు కృష్ణాజిన ధారణంబు, తళుకు జన్నిదము మే • దావి బొట్టును జిన్ని పట్టవర్ధనమును జిట్టితడుపు, మొలవంక యుంగరం • బుల సొంపు, దండపుగోలయు, సన్నపు • వ్రేల సిగయు, నొప్పు బ్రహ్మచారి•యొకఁ దేఁగుదెంచెఁ • బుస్తకము గొంచు మిగుల సంభ్రమమున"

అని.యొక బ్రహ్మచారిని మాటలతో మనకుఁ జూపించుచున్నాడు,

నేర్పరియగు చిత్రకారుడు చిత్రించిన చిత్తరువును జూచి చూడఁగానే విద్యాగంధమెఱుంగని పామర జనులైనను బాలికా బాలకులైనను దాని మనోజ్ఞతఁ జప్పునఁ గ్రహించి యొకానొక విధమగు నానందము ననుభవింతురు. కవియగు నాతఁడో తన యానందమును బట్టజాలక మనోభావమును గవిత్వ రూపమున వెల్లడిచేయును. ఒక జవ్వని చిత్తరువును జూచి యొకకవి మనసు నిలువబెట్టుకొనఁజాలక,

"పలుకక పల్కరించు గతిఁ । బాడక పాడిన రీతిఁ దేనియల్
చిలుకఁగ నవ్వకేనగిన । లీలఁ గనుంగొనుచున్న నాదు క
న్నుల కతిసుందరంబగు మ । నోజ్ఞపు జిత్తరువందు నున్న నీ
చెలువము గాంచి నేను నొక । చిత్తరువైతినిగాదె కోమలీ"

అని కొనియాడి యంతటితోఁ జాలించక.

"వలుద నిగారపుం బటువు
వట్రువ యబ్రపు నిబ్బరంపు గు
బ్బలు తెలినీటి పోల్కిఁ గను
పట్టెడు సన్నని జిల్గుపయ్యెద
న్వెలువడి త్రుళ్ళి పైకుబికె
వీలఁటె గోలలకేల చేలముం
గలికిరొ కేలఁ గప్పవు—"

అని సిగ్గువిడిచి యడిగి చప్పునఁ దెలివితెచ్చుకొని

"—అటుగాదఁటె చిత్తరువందుఁ గోమలీ ?"

అని సరిపుచ్చుకొనెను. ఆహా ! చిత్రలేఖన కళాప్రభావము ! విద్వాంసుల నయినను విమోహితులను జేయఁజాలునుగదా!

శిల్పకళకన్నఁ జిత్రలేఖన కళయెక్కువ సౌకర్యము గలదైనను దేశ కాలానురోధముచేతను జలాచల విశేషానురోధముచేతను జిత్రకారుని హస్త లాఘవ మొక్కొక్కప్పుడు కట్టుపడి పోవుచుండును. దృష్టిగోచరములగు కొన్ని కొన్ని వైచిత్ర్యములను లిఖించి చూపఁజాలకుండఁ జిత్రకారునికి నిర్బం

ధము గలుగవచ్చును గాని చిత్రపటమునఁ జూడ ననువుపడని . చిత్తరువుము మాటల నేర్పున మనకుఁ జూపింపగల కవికి మాత్ర మట్టి నిర్బంధములేదు.

"రవిగాననిచోఁ గవిగాననేర్చు" నన్న మాట సత్యమే యనవచ్చును.

శ్రీనాథకవి చెప్పినట్లు

"తటకున నస్తమించు" రవిని జిత్తరువునఁ జూడజాలము.

అల్లసాని పెద్దనకవి యనుగ్రహించిన,

"సహసానఖంపచస్తన దత్తపరిరం" భాది సౌఖ్యములను మీకుఁ జిత్రకారుఁ డొసంగలేడు.

సర్వజ్ఞ సోమనాథకవి,

"అరచందురు డెందములోఁ

జొరఁ బారి వణంకు తోఁక ; చుక్కయ పోలెన్

నరకుండేసిన బాణము

హరి నిటలతటంబు నాటి ; యల్లల నాడెన్"

అని చూపిన యుపమానోపమేయములను జిత్రకారుఁడు చూపఁ జాలడు.

మఱియు నాతని యుషాస్వప్నములోని "లోఁగిటికిరాని రూపంబుఁ గౌఁగిటికిన్ రాని పొందు" జిత్తరువున లభింపనేరవు.

పింగళి సూరకవి వలె నేచిత్రకారుఁడును జవ్వనులచేఁ బంతాలాడించుచు నుయ్యాల లూగించుచు నుండఁజాలడు.

బమ్మెర పోతనామాత్యుడు కడుపొట్టి వడుగును గగనమున కెక్కించి సత్యలోకమును దాటింప నెంచగా,

"ఇంతింతై వటుఁడింతయై మఱియుఁ దా
నింతై నభో వీథిపై
నంతై తోయదమండలాగ్రమున క
ల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై
నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్ర
హ్మాండాంత సంవర్ధియై.

పరమేశ్వరుఁడాతని మనోరథమీడేర్చి లోకమున కీపద్యము చదువునపు డెల్లఁదానారూపమునఁ బ్రత్యక్షమగుచుండెను.

ఇట్లు విమర్శించిచూడఁ గవితా కళ, శిల్పగాన చిత్రలేఖన కళలకన్న మిన్నయని నిరాతంకముగా సిద్ధాంతము సేయఁదగియుండును. భాషామాధుర్యమును బట్టి మనోజ్ఞకళావైదగ్ధ్యమును గవితా నైపుణిచే లోకమునకుఁ బ్రసాదింపగల సామర్థ్యమే మన యాంధ్రభాష కత్యధికముగాఁ గలిగియుండుట మన యదృష్టఫలమని చెప్పనగును. స్వదేశ భాషాభిమానముగల సంస్థానాధీశుల సమాదరణము చేతను సత్కవుల సామర్థ్య ప్రదర్శనము చేతను మహాజనుల యానుకూల్యము చేతను మన యాంధ్రకవిత శాశ్వతమగు లోకఖ్యాతిని గడించునట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించుగాక!

—ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మ*

---

* గ్రంథాలయ సర్వస్వము, 1924 అక్టోబరు.

# లక్ష్య లక్షణములు

అయ్యయ్యో ! ఇయ్యయోమయంబై వెలుఁగు తెలుఁగుబాసలో రసాభాసం బుగా వికటరూపమగు శకటరేఫముయొక్క సదసద్భావంబులకు నిర్ణాయకంబైన యాధారంబు నిర్ణాయకంబగుటవలననే యర్వాచీనుల కేకాదు, ప్రాచీనులకు సైతము సమీచీనముగా సమకూడనేలేదుగదాయని నే నూహించుచున్నవాఁడ.

1. ఆంధ్రభాషలో లఘ్వలఘురేఫములు రెండు నుండునేని, 'సప్తత్రింశ దిహ'యని యిముడకనా, తోచకనా షట్త్రింశదత్రతే యనియే సూత్రకారులేల సూత్రించిరి? 'రస్త్వత్రగృహ్యతేద్వివిధ', రయోస్తు నిత్యంస్యా' దిత్యాది సూత్రములందు రేఫద్వైవిధ్య వైధర్మ్యంబులు సూచించిరిగదా యందురు. నిజమే, ఇదే సంశయాస్పదంబుగా నున్నది. ఇందు వాగానుశాసనాశయము బహు గూఢమగుటచే భ్రాంతిజనకమగుచున్నది. అయినను, వారి యభిప్రాయ మిదియ కావచ్చు ననఁజాలిన కొన్నియుక్తులుగల వెట్లన్నను :—

2. శకటరేఫము వికృతిభాష కాగంతుక వికృతియేకాని, ప్రకృతిగాదు. సదేశదేశత్వాది కారణంబులచే ద్రవిడ త్రిలింగభాషలు తిలతండులన్యాయంబునఁ గలసియుండుట చిరకాలమునుండియు సిద్ధించియున్నది. కావుననే ద్రవిడభాషకు నియతమైన శకటరేఫములుగల శబ్దములు త్రిలింగభాషలోఁ జేరి వ్యవహరింపఁ బడుచుండుటచే నవి విభాగించుట దుష్కరంబనియు, సంప్రదాయమే శరణం బనియుందలఁచి 'అన్వేచాను ప్రవిశంతి శబ్దయోగవశా'త్తని దిఙ్మాత్రముగా సూచించి, సూత్రకారు లూరకుండి రింతియకాని 'యాంధ్రభాషలో శకటరేఫ మున్నదని వారి యభిప్రాయముగాదు. కాని—

'ఊఁద పలుకుచోట నాగిఁదేల్చి పలికిన
రేఫగాదు శకట రేఫగాని
తద్భవపుఁబలుకుల దవిలిన యారేఫ
రేఫగాని శకటరేఫగాదు

అని యిట్లొక లక్షణమేర్పఱచి, కఱ్ఱి-కఱి, తొఱ్ఱి-తొఱి, గొఱ్ఱె-గొఱియ, పుఱ్ఱె-పుఱియ, అని యిట్టితరగతి గలవి శకటరేఫములని, శ్రీ-సిరి, స్మరుఁడు-

మర్గుడు, గర్వము—గరువము, అని యిట్టితరగతులవి శకటరేఫములు గావనియుఁ గొందరి అభిప్రాయము.

3. అప్పకవి సారతర భారతరత్నాకరంబువలన, యత్నాతిశయంబున సమృద్ధిగానుద్ధరించి, యేర్చికూర్చిన రేఫఱకార ముక్తాప్రవాళమాళికలకు వైర మూలికలగు పోలికగా బహుజనపల్లి సీతారామాచార్యులవారు ప్రాచీనకవి ప్రయోగ పురస్సరంబుగా వక్ష్యమాణశబ్దంబుల వ్రాసియుండుటయేగాక వారు శుద్ధద్రావిడు లగుటచే ద్రవిడభాషలో శకటరేపమున్నదనియుం గూడ శబ్దరత్నాకరములోఁ జూచాయ నేర్పఱచిరేకాని యాచాయవేర్పఱచరైరి. తత్కారణము ద్రవిడభాషలో వలెనే త్రిలింగభాషలో సైతము నీతముగా శకటరేఫమున్నదని తలంచుటయే యని నిశ్చయించి తదుభయభాషాభిజ్ఞులైన ప్రాజ్ఞులొకప్పుడు చెప్పఁగాఁ గొన్ని పదంబుల విభజించినాఁడఁ గాని యావచ్ఛబ్దవిభాగార్హకాల మనుకూలముగాఁ దట స్థించినదిగాదు. అయినను బ్రయత్నము విడువలేదు.* తడువులేదు దానిం బ్రక టించుటకు.

4. ఇదిగాక కాకనూరి యప్పకవి ప్రభృతులు సాహసనిభృతులై తాము లక్షణకర్తలయ్యు, నయ్యయో లక్షణరీతులు లాతులకేకాని తమకు గమకింపం బనిలేదనియే కాఁబోలు నభయులై యుభయరేఫ సాంగత్యాదిక మగత్యముగా నచ్చటచ్చట నిచ్చలు విచ్చలవిడిగాఁ బ్రయోగింపుచువచ్చిరి. అందు ముందుగా నప్పకవి చెప్పి తప్పిన జాడం జూడుఁడు :

'గీ. కబ్బముల రేఫమునకు ఱకారమునకు
మైత్రిగలుగమి కవిశిఖామణులు ప్రాస
వైరమనుచును గలుపరు వానినెందుఁ
గూర్తురారెండు నెఱుఁగక కుకవిజనులు.'

అని యప్పకవీయ తృతీయాశ్వాసమునందును,

'ఆ. వారిజాతనేత్ర త్ర్వావిపత్యయాంతార్థ
ముల వచించు, తెలుఁగు పలుకులకును
బైస్వరంబులుండు పట్టుల ప్రకృతి భా
వంబుగాని, సంధి వాడపడదు.'

---

* ఈ పని పార్వతీశ్వరకవిగారు పూర్తిచేయకయే పరమపదమునకేగిరి.

అని యందే పంచమాశ్వాసంబునందును విరుద్ధముగాజెప్పి తద్విరుద్ధముగా నతండే

'మ. పురిటింటం బసిబిడ్డచందమున వాపోవంగ నాఁడాత్మలో
మురువొప్పన్ విషదిగ్ధముగ్ధకుచయై ముద్దాడురాకాసి గు
త్తెతిఁ గిష్టంబుగఁ బాలుద్రావుమిషచే నిర్జీవనకాలంబునన్
ధరణిం గూల్చిన నందపుత్త్రివలనన్ దార్కాణధర్మస్థితుల్,

అని యందే 4 ఆ. దీని తృతీయపాదమునందు రేఫ ఱకారములకుఁ బ్రాస మైత్రియు, క్త్వార్థత్వంధి వైచిత్రియుం గలుగఁ జెప్పినాఁడు. మఱియు నందే

కలిక. తఱిని సద్గురు నుతులు దాపరించిన సదయ
పెరిమి నాగపురంబు పెక్కలించిన విజయ

అనియు, అందే 5 ఆ.

'క. శేరుచునొయ్యన దగ్గఱఁ
జేరుచు నురుముష్టిహతికిఁ జిక్కక వేగం
దారు చహంకృతిఁ గ్రమ్మఱ
దూఱు చధోక్షజుఁడు మల్లుఁ ద్రుంచె ననంగన్;

అనియు నందే 2 ఆ.

ఆ. ఱేని నామమునకుఁ గ్రిందివంకను మీఁది
వంకయందు నుండు వర్ణములకు.

అనియు నిట్లచ్చట రేఫఱకారములకు యతిప్రాస సాంగత్యము మాత్రమే కాదు, మఱియు నిట్టి దోషంబులు పెక్కగాఁగలవు. సంయుక్త రేఫమునకును శకటరేఫమునకును మైత్రియే యున్నదన్నచో లక్ష్యలక్షణములు వ్రాయకుండుట కేమి కారణము? మఱియు నందే 4 ఆ.

'శా. కారాగారమునుండి...... ...... ......చె
ల్వారంబల్లెను నిల్వఁబొల్చుహరికిన్ వాలారనే మ్రొక్కెదన్.'

అని యిట్లఖండయతిగా దానే ప్రయోగించియుండియు,

'ఉ. అన్నపు తండ్రియట్ల వినుమంతియ కాదట మీఁద రాజవే
మన్న గొఱంతలేదు మణిమండన ముఖ్యములైన కానుకల్'

అనెడు రామాయణపద్యములోని రెండవపాదమందున్న యఖండయతిని నిషేధించి, 'మణిహారము లాడిగ' నని యా మహానుభావుఁడే కాదా దిద్దినాఁడు!

'క. అతిథి నిను గోరెనేనియు
మతిఁ గిఁకిరిపడక యోల మాసపడకనీ'

అని భారతానుశాసనిక ప్రథమాశ్వాసములో నఖండయతిగాను,

'గీ. యవనికాంతరమున నోల మాసగానియె.'

అని నైషధ 4 ఆ. (97) లో స్వరయతిగాను ప్రయోగము లగపడు చుండ లేదా?

కాఁబట్టి లక్షణకర్తలందఱు నొకరిపైనొకరు పోటీగానే చెప్పిరిగాని సూటిగాను, నిర్మత్సరముగాను, నిష్పక్షముగాను, నిర్దుష్టముగాను గ్రంథము లొనరించిరని నమ్మఁజాలము.

'మ. బలభిద్వహ్ని పరేతరాజ వరుణున్ పర్యుత్సుకత్వంబు సం
ధిలఁ గూర్చుండిరి యొండొరుం గదిసి... ...

యను పద్యములో ,గూర్చుండిరి యొండొరుం గదిసి, యనుచోట గుడి మీఁద విసంధిగా శ్రీనాథుఁడు చెప్పెనని చెప్పుచు,

'క. విరచించెను శ్రీనాథుఁడు
ధరణిని శృంగారనైషధంబునఁ గూర్చుం
డిరి యొండొరుసని కానక
పరమపురుషక్రియలఁ బ్రకృతిభావము గలదే!'

అని అప్పకవి శ్రీనాథు నధిక్షేపించియుండగా "ప్రథమోత్తమ పురుషయోః కిమాదిత్వాత్ ప్రాయస్తు స్యాత్ క్త్వ మాదికస్యేత్యే ఇతి వక్ష్యమాణ వాగనుశాసన సూత్రేణచ-ప్రథమేచోత్తమేచైవ క్రియతోవాభవేచ్చ్యుతిః, నిత్యమన్యస్యవికృతా క్త్వార్థేతో నభవే త్సదేతి వికృతివివేకకారవచనాచ్చ సంధి ర్వైకల్పిక ఇతి జ్ఞేయం. ఏవంస్థితే,

'బలభిద్వహ్ని పరేతరాజ వరుణుల్ పర్యుత్సుకత్వంబు సం
ధిల గూర్చుండిరి యొండొరుం గదిసి... ...
'సిద్ధిగాంచిరి యవిముక్త సీమయందు'

నిత్యాదిస్థలేషు శ్రీనాథాదీనాం భ్రాంతిత్వం వద న్నప్పకవి స్స్వయమేవ బిభ్రామ.

అని యహోబలపతిపండితుం డప్పకవి నాక్షేపించె. ఇట్లెన్నియో మత భేదంబులు గలవు. గావునఁ బురాతనమహాకవి ప్రయోగంబులఁ గన్న మత్సర ప్రధాన లక్షణగ్రంథంబు లెక్కువగావని నా యభిప్రాయము.

"శాస్త్రప్రయోగవచస శ్శాస్త్రం బలవదుచ్యతే,
అనిష్పన్నపదేతేన ప్రయోగాశ్రయణం మతమ్.
భాషేయ మమితా తత్ర దేశ్యాచిత్ర స్వభావయుక్,
తచ్చిత్ర తాతు ద్రష్టవ్యా పూజ్యపాద సుభాషితే."

అని యధర్వణాచార్యుల వారును,

"వక్తా వాచస్పతిర్యత్ర శ్రోతా శక్ర స్తథాపితే,
శబ్దపారాయణ స్యాంతం నగతౌశవు కే వయమ్.
తథాపి కించి త్కస్మైచిత్ ప్రతిబోధాయ సూచితమ్.
బోధయేత్కియ దుక్తిజ్ఞో మార్గవిత్స హయాతికిమ్.
ప్రమాణ మకలంకస్య పూజ్యపాదస్య లక్షణమ్."

అని ధనంజయాచార్యులవారును, *

'ప్రయోగశరణా వైయాకరణాః'

అని యభియుక్తులును, మున్నుచెప్పిన ప్రమాణ వాక్యములనే నమ్మి తద్విలక్షణ గ్రంథములలోఁ జిక్కువడక చక్కని కవిప్రయోగంబులే శరణ్యం బుగాఁ గవితాసరణిం బురణించి ప్రసిద్ధికెక్కినవారే బుద్ధిమంతులని తలంతును.

నేనిట్లు వ్రాయుటకు వారివారి మతభేదంబుల నిందఁ దెలుపుటకే కాని నిందఁ గొలుపుటకు గాదు. కావున న హి నిందా న్యాయజ్ఞులిది నాయజ్ఞతగా దలఁపరని తలంపుచున్నవాఁడ.

4 - 4 - 1894 —మండపాక పార్వతీశ్వరకవి.

---

* దీనినిబట్టి యీ వాక్యములు అధర్వణునివని చెప్పిన కందుకూరి వీరేశ లింగం పంతులుగారి వాక్యము లబద్ధములని తేలుచున్నది. (మం.పా. 2)

• తెలుఁగు 1920.

# అభిధ లక్షణ వ్యంజన

తెలుగున అరసున్నలును శకటరేఫలును పాటించనపుడు అర్థంకావడము కష్టమని కొందరు తగవాడుచున్నారు; గావున దానిని చర్చించ నవసరము గలిగినది. భాషలో అర్థమును బోధించునవి ఇతరములు అనేకములున్నవి. వాటిని బట్టి అర్థము స్ఫురించును. చూడండి :—

—: అ భి ధ :—

పదమునకును అక్షరమునకును గల సంబంధమునకు శక్తి అందురు. అది పదమందుండి దాని అర్థమును స్ఫురింపచేస్తుంది. ఆ శక్తి మూడు విధాలు— అభిధ, లక్షణ, వ్యంజన అని.

అభిధ అంటే 'ఆ పద ముచ్చరించగానే ఆ యర్థము స్ఫురించుగాక' అని చేసుకొన్న సంకేతము. ఈ సంకేతము 1. లోక వ్యవహారముబట్టి, 2. పెద్దల ఉపదేశమునుబట్టి, 3. వాక్యశేషమునుబట్టి, 4. సంయోగమునుబట్టి, 5. వియోగమును బట్టి, 6. అన్యశబ్ద సన్నిధినిబట్టి, 7. ఔచిత్యమునుబట్టి, 8. స్థలమును బట్టి, 9. కాలమునుబట్టి, 10. ప్రకరణమునుబట్టి ఉండును. ఇంకను కొన్ని గలవు. ఇందుకు ఉదాహరణములు :

1. 'కమ్మెచ్చు పట్టుకో, దాని కన్నమున బంగారు తీగనుంచుము. పట్టుకారుతో తీగనుబట్టి సాగతీయుము' అన ఒక బంగారు పనివాడు తన క్రింద పని చేయువానితో అనును. వారిద్దరి వ్యవహారమువల్ల అదివరకు కమ్మెచ్చు అంటే ఎరుగనివానికి కమ్మెచ్చు అంటే తీగ సాగించుటకు ఉపయోగించే కన్నములతో నిండిన ఒక పనిముట్టు అని తెలియును.

2. జపాన్ జాజిచెట్టుకు ఇంగ్లీషువారు నైట్ క్వీన్ అంటారు అని పెద్దలు చెప్పుటవల్ల తెలుస్తుంది.

3. 'పట్టెడ తెచ్చినాడు. ఆమె మెడ నుంచినారు. దాని సీలకు పోడి అంటించినారు' అన్నప్పుడు మొదటివాక్యము చెప్పగానే పట్టెడ మంచము పట్టెడా? బంగారుపట్టెడా? లేక పనివారు బంగారువస్తువులుచేసే దుకాణ? అని సందేహము కలుగును. వాక్యశేషమువల్ల బంగారుపట్టెడ అని స్ఫురించును.

4. రథమునకు పూన్చిన 'మావులు' అన్నప్పుడు రథ సంయోగమువల్ల గుఱ్ఱములేగాని మామిడి చెట్లుకావని తెలియును.

5. ఇట్లే వియోగమువల్ల కళ్యాలులేని మావులు.

6. అన్నలు, తమ్ములు; ఆకులు, పోకలు అన్నప్పుడు అన్న ఆకు అను పదములవల్ల తమ్ములు అనగా కనిష్ఠసోదరులనే అర్థముగాని పద్మాలు కావనిన్నీ, పోకలంటే పోకచెక్కలుగాని రాసులు గావనిన్నీ స్పష్టపడును.

7. ఉగ్గు త్రావించిరి అన్నప్పుడు ఉగ్గు అంటే పిల్లలకు దోయు నెయ్యి మొదలగునవి కలిపిన పదార్థముగాని వస్త్రము మొదలగువాని మడతలు కావని స్పష్టము.

8. చెట్టున పళ్ళున్నవి; పళ్ళులేని నోరు-స్థలమునబట్టి అర్థము స్పష్టము.

9. 'పగలు చుక్కలు గనుపించవు' ఇచ్చట నక్షత్రములేకాని గురుతులు గావు అని కాలమునుబట్టి స్పష్టము.

10. 'నదిని దాటుటకు కలము దెమ్ము' అంటే ఓడ యని ప్రకరణమును బట్టి అర్థము స్పష్టము. వ్రాత కారంభించునపుడు కలముదెమ్ము అంటే లేఖిని అర్థము.

ఈ విషయము ఒకటో రెండు మాటలలో గుదిర్చి వ్రాయవచ్చును. ఇంకను విస్తరించవచ్చును. ఇది యొకవిధమైన విభాగము. ఇదంతయు అభిధాశక్తి విచారము. ఈ శక్తి బోధించే అర్థము వాచ్యార్థమని, ముఖ్యార్థమని అనబడును.

## లక్షణ

ముఖ్యార్థమును చెప్పితే కుదరనిచోట దానిని సంబంధించిన మరి ఒక అర్థము సూచించునది లక్షణ అనబడును. ఇంగ్లాండ్ జర్మనీ పోట్లాడుచున్నవి అనునపుడు ముఖ్యార్థము జర్మనీదేశము ఇంగ్లాండ్‌దేశము. అవి అచేతనములు గావున వాటికి పోట్లాట సంభవింపదు. కావున ఆ దేశముల ప్రజలు అని అర్థము.

ఈ అర్థములకు లక్ష్యార్థమని పేరు. అతడు వాదములో పెద్దపులి - ఇచట పెద్దపులి అంటే వ్యాఘ్రము అన్న అర్థము సందర్భించదు. కావున పెద్దపులి యందున్న గుణములు-ప్రతిఘటించినవారిని గెలిచి పోనివ్వకుండ మొదలగునవి.

ఇది అముఖ్యార్థము గౌణము, లక్ష్యము అనబడును.

## వ్యంజన

ముఖ్యార్థబాధ లేకుండ అన్యార్థమును స్ఫురింపజేయునది. లక్షణలో ముఖ్యార్థబాధ ఉన్నది. ఇదియే ఈ రెంటికినిగల భేదము. 'అబ్బాయీ! తెల్లవారిది' - ఈ మాట తండ్రి తన కుమారునిగూర్చి అనునది. ప్రొద్దెక్కువరకు నిద్రించినచో కార్యము చెడును గావున 'మేల్కొనుము' అను నర్థమును స్ఫురింపజేయును. ఈ అర్థము ముఖ్యార్థము కాదు. ముఖ్యార్థము సూర్యోదయ మయినది అని. ఈ ముఖ్యార్థమునకు బాధలేకుండగనే అన్యార్థమగు "మేల్కొనుము" అను నర్థమును స్ఫురింపజేయుచున్నది. కావున దీనిని వ్యంజనాశక్తి యందురు. దీనివల్ల స్ఫురించు నర్థము వ్యంగ్యము.

ఈ మూడు అర్థములు స్ఫురింపజేయు మాటలకు వరుసగా వాచకములు, లక్షణములు, వ్యంజకములు అని పేర్లు.

—బంకుపల్లి మల్లయ్యశాస్త్రి *

* తెలుగు 1919 మొదటి సంపుటము.

# కాసట బీసట

'కాసట బీసట' యను శబ్దము వాడుకయందు కకారాదిగ వినఁబడు చున్నది. శబ్దరత్నాకర గ్రంథకర్త సీతారామాచార్యులవారు దీనిని 'గాసట బీసట' యని గకారాది పదముగా గ్రహించియున్నారు.* దీని యాద్యక్షరము పరుషమో సరళమో నిర్ణయించుటకుఁ దగిన యాధారము గానరాలేదు మన యాంధ్రభాషయందిట్టి సందిగ్ధపదము లనేకములు గలవు. అట్టివానిలో 'కకారాదులా? గకారాదులా? అను సందేహము గొల్పునవియుఁ గొన్ని కలవు.[1]

౧. గ్రక్కదలు=కదలు+కదలు. (క్రక్కదలు లేక గ్రక్కగలు?) ఇట్లే గొప్పలు, గొండెము మొ. (ఇవియొక గణములోనివి.)

౨. గండరించు—కండరించు?, గాదిలి—కాదిలి? ఇత్యాదులు వేఱొక జాతిలోనివి.

౩. గనుపు—కనుపు; గదప—కదప; గుంట—కుంట; మొ. మఱియొక తెగలోనివి. ఇట్టిభేదము లింకను గలవు.

"కకార మాద్యక్షరముగాఁ గల (తెలుఁగు) పదములు (కొన్ని) కాలక్రమమున గకారాదులుగా వాడుకలోనికి రావచ్చు"నని చెప్పుటకుఁ దగినహేతువు మన భాషయందుఁ గానవచ్చుచున్నది. ఏదియన, 'ప్రథమ, ద్రుతము మొదలగువానికి బలమైన కకారము గకార మగు'నను నియమము మన యాంధ్రమునఁ గలదు దానంజేసి వ్రాఁతనుబట్టియు వినికినిబట్టియు 'కకారాది పదము' 'గకారాది పదముగా' నుచ్చరింపఁబడుచుఁ గ్రమముగ మాఱిపోవుచున్నది.

ఉదా: కదుచు-గదుచు; కనుక-గనుక; కానుగు(చెట్లు)-గానుగు; ఇత్యాదులు గ్రంథములఁ బరుషాదులయ్యు వ్యవహారమున సరళాదులై యున్నవి. పదాది

---

1 సూర్యరాయాంధ్ర నిఘంటువు శబ్దరత్నాకరంలోని పదమే ఉదాహరించి వూరుకుంది. —పురిపండా.

2 ఇలాటి సందేహంలో పడే 'పూర్వగాథాలహరి' కర్త 'కిందముడు' అనే సంస్కృత శబ్దానికికూడ 'కిందముడు' అనీ, 'గిందముడు' అనీ రెండు చోట్లా వివరణ మిచ్చాడు. —పురిపండా.

గకారము కకారముగా మాఱిపోవునట్టి సూత్రము లేమింజేసి గకారాది పదము కకారాది పదముగా వ్యవహరింపఁబడ నేరదు.

ఈ హేతువులను బట్టియు, వాడుకను బట్టియుఁ బ్రస్తావమున నున్న శబ్ద మును 'కాసట బీసట' యని కకారాది పదముగానే నేను గ్రహించితిని. ఇఁక దాని యర్థమును గూర్చి యించుక విమర్శించెదను.

శబ్దరత్నాకరమున 'గాసట బీసట' కు 'సలక్షణముగాని చదువు' అని యర్థము వ్రాయఁబడి, దానికి నెఱ్ఱాప్రెగ్గడ ప్రయోగ ముదాహరణముగా నియ్య బడినది. ఈ యర్థము నాధారముగాఁ జేసికొని బ్ర. శ్రీ. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారు తమ నన్నయ భట్టారక చారిత్రమున

"నన్నయ భట్టునకుఁ బూర్వ మీ తెలుఁగు(బాస) గాసటగా నుండెడిదని (యెఱ్ఱన) వెక్కిరించుచు వ్రాసినాఁడు. 'గాసట బీసట' యనఁగా సంస్కార శూన్యమైన భాష- అనఁగా కోదు భాషవంటిదని మనవారు నిఘంటువుల యందు వ్రాసికొనియే యున్నారు...." అని సీతారామాచార్యులవారి యర్థమునకుఁ డిప్ప ణము వ్రాసినారు

పట్టాభిషేక సంచికయందు బ్ర. శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు రాజరాజనరేంద్రుని తండ్రి విమలాదిత్యుని కాలమున క్రీ. శ. ౧౦౧౮ సం. వ్రాయఁబడిన (ఏడువాడల పాలెపు) శాసనములోని విషయముల వివరించు సందర్భమున.

'అన్నిటియందును దీని యందు శోధింపఁ దగినది నన్నయ భట్టునకుఁ బూర్వమునం దుండిన 'గాసట బీసట' యగు నాంధ్ర భాష......ఈ శాసనము లోని భాష 'కాసట బీసట' గా నేకలదని తలఁచు చున్నాను......." అని వ్రాసి పిమ్మటఁ దచ్ఛాసనము నుదహరించి యున్నారు. ఆ శాసనములోని కొంత భాగము నిచ్చట జూపుచున్నాను.

"స్వస్తి సకాల బుధజన సంస్తూయమాన సూర్యవంశోద్భావ రామభట్టా రకావరప్రసాద లబ్ధ రాజాభిషేకా సంపతిశాఙ ధ్వజ పీతాంబరపతి గరుడ దష్య సధ్వజ మాదుపుర పరమేశ్వర వేంగిపుర బ్రహ్మఘోషణా క్రయా శ్రీమాత్మా శాయాధిపతి యాయ్సవఱా కామారాజు శ్రీమ్మతేఅమారాజు శ్రీమత్ యినన్నడి బెదంగ్గరాజు శ్రీమత్ శోడపరాజు శ్రీమత్ కాలియుగ కణ్ణరాజూ శ్రీమత్ మనార్వెల గారుణ్ణు స్వస్తిసకాబ్దంబుల్డొంభ నూటానల్వాది యగునేట్ఠీ......పడ వాలు నడపనేయకునకు అగ్రహారంబులతోడి పాడి యిచ్చి అగ్రహారంబ కానుగ

చెరువులు దయసేసి యిచ్చిన సాసనము పూర్వతః *పోంగొట్టావిసీము, మసీమం నైరత్యతః కవుఱూటిసీమ మసీమం...పశ్చిమతః పోలిపూణ్డిసీమ మశీమమ్......దీని నెడపక నడపిరేని ఆఱూదివేలేంణ్డు స్వర్గమ్మననుందం గాన్తురు...నరసిన వారు అఱువవేలేండ్లు నరకయోని నుణ్డుదురు........"

ఈ శాసనములోని గీర్వాణభాష సయితము (ఆంధ్రభాష కంటెను) దోష భూయిష్ఠమై యుండుటచే నది లేఖకుని మహిమమని యెంచనగును. గాని నన్నయకు బూర్వ మాంధ్రభాష యిట్లే యుండెడిదని తలంపవలను పడదు. లేఖన విషయమున మొన్న మొన్నటికి యిప్పటికిని గల భేదమే యపారమనుట మన తాతల నాటి తాటియాకుల పొత్తములు నేఁటి మన వృద్ధుల చేవ్రాళ్ళు (ఒంమ్మంగ్గి వెంకట నరసింహ్వాం, కంద్దుల లత్సంన్న వ్రాలు.) అన్కే నమస్కారమ్లు చేశీ చాయంగల వింన్నపమ్లు—మొదలగు వానిఁ గనినవారికి విశదము. కావున నన్నియకు మున్ను తెలుఁగుబాస లక్షణ విరుద్ధమై (కాసట బీసటయై?) యుండెడిదని నిరూపించుటకీ శాసన మాధారము గాఁజాలదుగాని నన్నియ భట్టారక చారిత్రము లోని "నన్నయకుఁ బూర్వపు శాసనము లన్నియు సంస్కృతముననే యున్నవి. కాని, తెలుఁగున నొక్కటియులేదు. దీనిచేఁ దెలుఁగు నన్నయకాలము వఱకు వ్రాయఁబడు నవస్థవఱకే రాలేదని తెలియవచ్చు చున్నది."

"తెలుఁగుబాసయందు నన్నయభట్టారకు నాఁటికొక్క చిన్నశాసనమైన లేకుండుట చూడ నన్నపార్యునినాఁడే తెలుఁగు వ్రాయఁబడు స్థితికి వచ్చినదని తెలియ వచ్చుచున్నది." (65, 66పు.)

---

* ఈ శాసనములోని తెలుఁగుబాసగల యీ భాగమునకును; నన్నయ భట్టారకుడు వ్రాసిన నందంపూడి శాసనములోని తెలుఁగుబాసగల భాగమునకును భేదమంతగాఁ గానరాదు. అందుల యొండు రెండు వాక్యములను మాత్రమిచ్చుట విచ్చుచున్నాను. "పూర్వతః ఇయ్యేరియుం బిల్లెమ పెద్దవ్రూణ్డియుం బొలగరసున పల్లమున కొణ్డియ గుంట నడమ సీమా... నైరుత్యతః ఇయ్యేరియు నెరపులయు ముందరము నయుం బొలగరుసున ముయ్యలికుట్ర సీమా. పశ్చిమతః ఇయ్యేరియు ముందమునయు మడకుటితియుం బొలగరుసున ముయ్యలికుట్ర సీమా...'

ఇత్యాదులగు బ్రహ్మయ్యశాస్త్రిగారి వాక్యము లాధారరహితములుగఁ జేయుటకు మాత్రము (ఈ శాసనము) సాధన మగుచున్నది.

ఇఁక 'కాసట బీసట' శబ్దమునకు "సంస్కార శూన్యమైన (కోదుభాష వంటి) భాష" యను పై వ్యాఖ్యానము సరిపడినదేమో విచారింతము. ఈ శబ్దమునకు మూలమైన

ఉ. భాసుర భారతార్థముల భంగుల నిక్క మెఱుంగ నేరమిం
'గాసట బీసటే' చదివి గాథలు ద్రవ్వ తెనుంగు వారికిన్
వ్యాసముని ప్రణీత పరమార్థముఁ దెల్లము సేసినట్టి య
జ్ఞాసనకల్పులౌ దలఁతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్

అను పద్య మెఱ్ఱాప్రెగ్గడ నృసింహపురాణము లోనిది. దీనికిఁ బై టీప్పణమును బట్టి, "భారతార్థముల సత్యము నెరుఁగ నేరకపోవుటచేత 'సంస్కార శూన్యమైన భాష' చదివి గాథలు త్రవ్వుచున్న తెలుఁగువారికి..." అను తాత్పర్య మేర్పడుచున్నది గదా!

(అ) (సంస్కృత) భారతార్థముల నిక్క మెఱుంగఁజాలక పోవుటకును సంస్కార శూన్యమైన (తెలుఁగు) బాస చదువుటకును గల చుట్టరికమేమో! దీనిఁ జదివిన దాని నిక్కమెట్లు దెలియును?

(క.) బ్రహ్మయ్యశాస్త్రిగారి మతమున నన్నియకు మున్ను తెలుఁగునఁ గవిత్వమే కాక వ్రాఁత సదుపులు సహితము లేవు.* వ్రాఁతలేని దానిని జదువుట యెట్లు? గాథలు ద్రవ్వట యెట్లు? చూ. పై పద్యము 2 పాదము.)

---

* చూ. నన్నియభట్టారక చారిత్రము—"నన్నియ తెలుగుబాసను శాసించువరకు దీనిని ప్రజలు తమతమ యభిప్రాయముల వెల్లడించు పనికి మాత్రము వినియోగించు చుండిరి. కాని చదవను, వ్రాయను వినియోగించుటలేదు. (64.పు.)

2. ఈ భాష యాకాలమున నింటికడ మాటలాడుకొనుటకు మాత్రమే వాడబడు చుండెడిదిగాని తదితర వ్యవహారమునకు వాడఁబడుటయేలేదు; వ్రాతలోనే పెట్ట బడెడిదికాదు..." (65. పు.)

3. నన్నపార్యుని నాఁడే తెలుఁగు వ్రాయఁబడు స్థితికి వచ్చినది." (66. పు) ఇత్యాదులు.

ఈ రీతిని విచారింపగా, 'కాసట బీసట' శబ్దమునకు సంస్కార శూన్యమైన భాష—వ్రాఁత సదువులు లేని భాష (కోదు బాసవంటి భాష) అని వ్యాఖ్యానము సేయుట వలనఁ బై పద్యమంతయు భావశూన్యమగుచున్నది. కావున దాని కాటిప్పణము సెల్లదు.

పై టిప్పణమున కాధారమైన శబ్దరత్నాకరములోని 'సలక్షణముగాని చదువు అను నర్థము నింమకగ నాలోచింతము. [కాసట బీసటే చదివి=సలక్షణముగాని చదువునే చదివి (సీతారామాచార్యులవారు.)]

ఆచార్యులవారి మతమున నన్నయకు మున్ను తెలుఁగున గవిత్వమును, గ్రంథములును గలవు. మఱియు లక్షణమును నేర్పడియుండెను. (చూ. శబ్ద రత్నాకరము భాషాప్రశంస-10 పేరా.) కావున నన్నియాదులచే రచింపఁబడక పూర్వము భారతగ్రంథము ఏదో సలక్షణముగాని చదువున నుండెడిదనియు, దానినే చదువుకొని తెలుఁగువారు దానియర్థము దెలియనేరక గాథలు ద్రవ్వుచుండెడి వారనియు సీతారామాచార్యులవారు భావించియుందురని తోఁచెడిది. ఎట్టి లక్షణ శూన్యమైన భాష యందు భారతముండియున్నను దాని యర్థముల భంగుల నిక్కమెక్కడకుఁ బోగలదు? రామాయణము పాట, భారతము పాట, బొబ్బిలి పాట మొదలగునవి సలక్షణముగాని తెలుఁగుభాషయం దెన్నియో యున్నవి. కాని వాని సత్యార్థములు మాత్రము మాటువడినట్లు కానరావు. ఈ రీతి నెటుచూచినను ఆచార్యులవారి యర్థము సయితము సరిపడియుండలేదు.

కావున 'కాసట బీసట' శబ్దమును ఎఱ్ఱాప్రెగ్గడ మహాకవి ఎట్టి భావముతో నేయర్థమునఁ బ్రయోగించినాఁడో కనుఁగొందము.

రాజరాజ నరేంద్రునకుఁ బూర్వము భారత గ్రంథము "బహుభాషల బహు విధముల" నుండెడిది. * ఆర్యమత విరుద్ధ ధర్మములఁ బ్రబోధించు నితర (జైనాది) భారతముల (విక్రమార్జున విజయాదుల) కంటె బ్రాహ్మణ (వేద విహిత) ధర్మములఁ బ్రతిపాదించు వేదవ్యాస మహాభారతమే మన యాంధ్రులకు నధిక విశ్వాసపాత్రమైయుండెను. కాని యందలిభాష గీర్వాణభాషయై యుండుటచే

* రాజరాజునకు మున్నే జైనభారత రామాయణాది గ్రంథము లాంధ్రమున నుండెడివనియు మతవివాదములచేఁ దక్కిన జైనబౌద్ధాది గ్రంథములతో పాటు అవియును దగ్ధము గావింపఁ బడెననియు కొందఱ యభిప్రాయము. ఇది సత్యమేని కావచ్చును. (నన్నియ భారతము తరువాత నవి నశించియైన నుండవచ్చును.)

నది ఎవ్వరో సంస్కృతపాండిత్యము గలవారికిఁ గాక యితరులకు దుర్గ్రాహ్యమై యుండెను. కావున మనవా రా గ్రంథమును దద్భాషా వేత్తలు సదివి చెప్పఁగావిని తెలిసికొనవలసిన వారైరి. ఎల్లచోటుల నెల్లవేళల సంస్కృతపండితులొనఁ గూడుట గష్టమగుచు వచ్చెను. మఱియు వ్యాసభారతమును దెలిసికొను నభిలాషమును బెద్దయగుచు వచ్చెను. అట్లగుటంజేసి తెలుఁగువారు గీర్వాణభాషయం దున్న యమ్మహాభారతమునే చదివి-అంతకుమున్న సంస్కృత పండితులవలన వినినవి కొన్ని జ్ఞప్తియందుండియు, గొన్ని యుండకయు, గొన్ని తెలిసియుఁ గొన్నికొన్ని తెలియకయు - ఎట్లో యర్థము చెప్పుకొనుచు నుండిరి. మఱియు, జైనాదిభారతములు (విక్రమార్జున విజయాదులు) వ్యాసభారతమునకు విరుద్ధము లైన ధర్మములను, కథలను గలవై వినఁబడుచుండెను. దానంజేసి 'భాసుర భారతార్థముల భంగుల నిక్కమెఱుంగ నేరక' మన తెనుంగువారు 'గాసట బీసటే-తెలియనిభాష (అన్యభాష) యందున్న (భారత) గ్రంథమునే చదివి గాథలు ద్రవ్వుచుండిరి. కావుననే బహుభాషల బహువిధముల, బహుజనముల వలన వినుచు భారత బద్ధస్పృహులైయున్న తెనుంగువారికి నాంధ్ర మహాభారత మొకటి గావలసివచ్చెను.

ఆ సమయమున నాంధ్రదేశ చక్రవర్తి, మనుమార్గవర్తి, పరమపవిత్రుఁడు, ధర్మమిత్రుఁడు, నిర్జితశాత్రవనరేంద్రుఁడు, రాజరాజనరేంద్రుఁడు, బ్రాహ్మణ (వేద) మతోద్ధారకుఁడై నన్నయ భట్టారకునిచే నారాయణ భట్టాదుల సాహాయ్యమున 'తెనుంగువారికి వ్యాసముని ప్రణీత పరమార్థము దెల్లముసేయు' మహాభారతాంధ్రీకరణమునకు గడంగునట్లు చేసెను.

కావున 'కాసటబీసట'* అనఁగా తెలియని యర్థము. పై యర్థముగాకున్న నచ్చట వేఱొక యర్థము పొసఁగదు. నేఁడును హిందూస్తానీ, ఇంగ్లీషు మొదలగు నన్యభాషల మాటాడకొని వారినిఁజూచి యవి తెలియనివారు "ఏదో 'కసట బీసట' మాటాడుచున్నారు. మాకు తెలిసినదిగాదు" అని చెప్పుచుందురు.

—నడకుదుటి వీరరాజు. •

---

* 'కాసట బీసట' అనునది - 'కాసరకూసర', కొక్కిరి బిక్కిరి, చీకిలి మాకిలి, చిఁపర సాఁపర, వంకర టింకర ఇత్యాది జాతిలోనిది.

• సారస్వత సర్వస్వము. రక్తాక్షి ౧ సంపు ౧౨ సంచి.

# శిష్ట భాష

శ్రీ రావుసాహెబు, మహోపాధ్యాయ, హిందూకేసరి గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారితో నాకు పాతిక సంవత్సరాలనుంచి విశిష్ట పరిచయము కలదు. వ్యావహారిక భాషా వివాదమునకు అంకురారోపణము చేసిన మహోత్సవములో నేనున్నూ చందన తాంబూలా లందినవాడనే. ప్రారంభదశలో వారి వాదము నొల్లక తీవ్రముగా ఎదురుకొనుటకు నేనుద్యమిస్తిని. పంతులుగారు నా అభిప్రాయము గ్రహించి వ్యావహారిక భాషలో ముద్రితములున్నూ అముద్రితములున్నూ ఆయన వైద్య జ్యోతిష ధర్మశాస్త్ర గ్రంథాలను, వ్యాఖ్యానములను, శాసనములను వేవేలు నాకు చూపి నా అభినివేశమును సడలించినారు. నాడు మొదలుగ వారి అనుచరవర్గములో చేరి నా ఉడతాభక్తి చూపుచుంటిని. ఆ దినములలో పెక్కండ్రు పండితప్రకాండులు పంతులుగారిపై తమ వాగ్వజ్ర వర్షధార నిరంతరము కురిపించిరి.

అయినా పంతులుగారు మహామేరువువలె చలింపక తాము పూనుకొన్న కార్యము దక్షతతో సాగించి నేడు సంపూర్ణ దిగ్విజయము పొందినారని సంతోషముతో విన్నవిస్తున్నాను. నేటి వార్తాపత్రికలూ, నవలలూ, చరిత్రగ్రంథములూ వ్యాఖ్యానములూ మొదలైనవన్నీ వారి యశఃపతాకలై దశదిశల నెగురుతున్నవి. వేనవేలు విపక్షులు సపక్షులైనారు. ఆగ్రహ మనుగ్రహమైనది. అపశబ్దము సుశబ్దమైనది. మ్లేచ్ఛు లార్యులైనారు. సర్వమూ తారుమారై తారకము ముట్టినది. సభాముఖమున పంతులుగారిని ఎదుర్కొనే గ్రాంథికాభిమాని నే దరిది. స్వపక్షాభిమానముతో కొంతమంది పండిత కవిచంద్రులు పగటింటి చంద్రులై వెలవెలబారి కనబడుతున్నారు. స్వార్థపరత, దంభము, మోసము ఎంతోకాలము నిలిచి ఉండలేవు. తత్త్వము తలలలో నాటుకొన్నది.

శ్రీ రామమూర్తి పంతులుగారి వాదములో సత్యమున్నది. దేశ పరిస్థితుల లోనూ భాషాపరిస్థితులలోనూ కూడా పూర్వాచారపరాయణులు మార్పులకు సహించరు. సంస్కర్తలు రెండింటిలోనూ ప్రకృతి కనుకూలమయిన మార్పు లంగీకరిస్తారు. పూర్వాచారపరాయణు లేవిషయములోనూ స్వాతిశయమును నిర్ధారణగా

చెప్పరు. తెలుగు భాషకు నన్నయగారి భారతభాగము సమగ్రలక్ష్యమున్నూ చిన్నయసూరిగారి వ్యాకరణము సమగ్రలక్షణమున్నూ కాజాలవు. నన్నయ భారతములో నూటికి 70 సంస్కృత పదములున్నూ 30 తెనుగు పదములున్నూ కదా ఉన్నవి! సూరిగారి వ్యాకరణము తన నీతిచంద్రిక రూపములకయినా సరిపడక ఉన్నదికదా! జీవద్భాషలు అర్థములోను, శబ్దస్వరూపములోనూ, పదప్రయోగ విధానములోనూ కూడా మారుతూ ఉంటవి హిందీభాషలో 'య'కార స్థానమున 'జ'కార ముచ్చరిస్తారు. 'కృష్ణ' శబ్దమునకు 'క్రుష్ణ', 'క్రిష్ణ', 'కిత్త' మున్నగు అపభ్రంశరూపములు పెక్కులు తెలుగులో వచ్చినవి. 'అనుమానము' సంస్కృతములో ప్రమాణవిశేషము; తెలుగులో సందేహము. ఈవిధముగా భాషలో మార్పులు కనబడుతున్నవి. సంస్కృతభాష కూడా వ్యవహారములో ఉన్నంతవరకూ మార్పు పొందుతూనే వచ్చినది. వైదికకాలములోని సంస్కృతము వేరు, లోకములోని సంస్కృతము వేరు. వాటికి అనుశాసనములు వేరువేరుగా ఉన్నవి. వ్యాకరణములన్నీ ఒకనాడు పుట్టినవికావు. ఒక కాలమున అసాధువు లయిన శబ్దములు కాలాంతరమున సాధువు లవుతవి. కాళిదాసుని 'విశ్రామ' శబ్ద ప్రయోగము పాణినీయము ప్రకారము అసాధువు; కాని వ్యాకరణాంతరముచే సాధువు. భాష శిష్టవ్యవహారములో మారినపుడు వ్యాకరణము కూడా మారవలెను. ఒకే వ్యాకరణము భాషకు శాశ్వతముగా మంగళసూత్రము కట్టి స్వాధీనము చేసుకొనజాలదు. కుమ్మరికుండ లనువలె వైయాకరణుడు శబ్దములను పుట్టింపఁజాలడు. భాషాశిష్టులు(లోకజ్ఞానము గలవారు)సభలలో వాడేభాష 'భాష'గాని కేవలము పామరులు వాడేభాష 'భాష' కాదు. అట్టి శిష్టభాషనే గ్రంథములలో వాడుట సంప్రదాయము. కాలానుసారముగా మారిన భాషకు వ్యాకరణములు వ్రాయుటకూడా ప్రాచీనసంప్రదాయమే. ఇందుకు "వనుగాత్రి" మొదలయినవి తార్కాణములు. ఇంతేకాక ఏఅనుశాసనమైనా భాషను సమగ్రముగా సంస్కరింప జాలదనీ, అట్టి విశిష్టవ్యవహారమే సంస్కారముగా గ్రహింపదగినదనే పాణిని "పృషోదరాదీని యథోపదిష్టమ్" అను సూత్రముచే సోదాహరణముగా సూచించినాడు. ఈఆశయమునే 'భవేద్వర్ణాగమాద్ధంసః సింహో వర్ణవిపర్యయాత్, గూఢాత్మా వర్ణవికృతేః వర్ణనాశాత్ పృషోదరమ్." అని అభియుక్తులు వివరించి ఉన్నాడు. శిష్టవ్యవహారములో వర్ణాగమ విపర్యయ వికార లోపములు కనబడితే అవి దూష్యములు కావని మనము గ్రహించడమే న్యాయము,

నన్నయాదులకు అప్రసక్తములయిన పదపదార్థములు వేవేలుండిపోయినవి. నేడు నవీనములైన భావములూ, పదార్థములూ కుప్పలుతిప్పలుగా ఉదయించినవి. పూర్వాచార పరాయణులు నవీన శబ్దసంతతికి ప్రాచీన వ్యాకరణపద్ధతి ననుసరించి ప్రకృతి ప్రత్యయ విభాగాదులు చేస్తూ ఉన్నారు. అట్లుకాగా శబ్దము నవీనమున్ను ప్రకృతి ప్రత్యయ విభాగాది రూపసంస్కారము ప్రాచీనమున్ను అయి శాశ్వతకు భంగము కలిగిస్తున్నది. శాశ్వత ననుసరించే భాషను సంస్కరించవలెను. తమ ఆశయములను పరులకు వెల్లడించడమే భాషయొక్క ముఖ్య ప్రయోజనము అదే సిద్ధించబోని యెడల భాష వ్యర్థము. విశేషించి మాతృభాషలలో ఝడిత్యర్థ స్ఫూర్తికే ముఖ్యస్థాన మివ్వవలెను. 'ఫిజిక్సు' మున్నగు శాస్త్రవిషయములను నన్నయాదుల భాషలోగాని కేవల పామరభాషలోగాని వ్రాస్తే అర్థస్ఫూర్తికాక పరివర్తన ప్రయోజనమే క్షీణిస్తుంది. విజ్ఞానాభివృద్ధికిన్ని వ్యవహారసిద్ధికిన్ని శిష్ట భాషే ఉపకరిస్తుంది. భాషకు విచ్ఛిత్తి విశేషమును కలిగించడము కూడా ఒక ప్రయోజనమే. తార్కికుడు "శుష్కో వృక్షః తిష్ఠ త్యగ్రే" అని చెప్పగా కవి "నీరస తరు రిహ విలసతి పురతః" అని చెప్పెనట. వీటిలో అర్థ మొక్కటే అయినా విచ్ఛిత్తిలో అంతరమున్నది. కవులు తమ రసముల కనువైన భాషను వారే సేకరించుకొంటారు. శృంగారరసములో అతిదీర్ఘ సమాసాదులు ప్రయోగిస్తే అందులో రసాస్వాదమే కలుగదు. ఏ పద్ధతిలో, ఏ సందర్భములో రసపుష్టి కలుగుతుందో అది కవులకే తెలుస్తుంది. నిఘంటువులలో "ఏహ్యము"* మొదలైన అపశబ్దములు ఎక్కిపోయినవి. ఆ నిఘంటువులు అల్లకల్లోలముగా ఉన్నవి. అట్టి సాహాయ్యముతో తమకు అసహజమైన భాషలో కవిత్వమల్లితే అది రసాస్వాదన కలిగిస్తుందా ? తమ కావ్యరచనకు రసానుకూలమైన భాషను కవులే చూచుకొనవలెను. వారు నిరంకుశులు. ఈ భాషావివాదములతో కవుల కంతగా ప్రసక్తి లేదు. శాసనములలోని భాష, ప్రాచీనాంధ్రలేఖలు. ప్రాదెనుగుగమ్మ, అప్పారావు గారి భాష-ఇవన్నీ ప్రాచీనాంధ్రభాషా పరిణామములే. "గ్రాంథికభాషే అందరికీ సుబోధము కాని వ్యావహారికభాష అన్ని మండలములవారికి సుబోధముకాదు" అని గ్రాంథికవాదులు వాదిస్తారు. మాండలిక భేదములుంటే నిఘంటువులు వ్రాసి వాటిని చూపండి. గ్రాంథికభాషకు మాత్రం మాండలిక భేదము తప్పేదికాదు. భాషకు ప్రకృతి ప్రత్యయ విభాగము తెలియని వక్రగతి తెచ్చిపెట్టడము మంచిది

---

* సూర్యరాయాంధ్ర నిఘంటువు. ఆంధ్రవాచస్పత్యము, శబ్దరత్నాకరములలో ఈ పదము లేదు. —సంపాదకుడు (ప్రతిభ.)

కాదు. నేడు వార్తాపత్రికలలోనూ, గ్రంథాదులలోనూ "గౌరవనీయులు" అనే పదము ప్రాయికముగా స్వేచ్ఛగా వాడుకచేస్తున్నారు. గౌరవ శబ్దముపైని 'అనీయర్' ప్రత్యయము చేర్చుట కృతకము; కేవలము తప్పు. ఇట్టివే ప్రాముఖ్యము, ఏహ్యము మొదలయినవి పెక్కు పదములు కనబడుతున్నవి. ఇట్టి కృతకభాషను ఆమోదించేవారు శిష్టవ్యవహార భాషను అంగీకరించడానికి వెనుకాడుట న్యాయము కాదు. పామరులు సరిగా ఉచ్చరించలేక తారుమారుచేసిన శబ్దములు సేకరించుటకాని, శిష్టభాషను పరిహరించుట కాని-రెండున్నూ యుక్తిసహములు కావు. అర్ధానుస్వారాది పీడవల్ల సహృదయుల భావములు లోలోపల నమసిపోకుండా వ్యావహారికభాషలోనే వ్రాయుటకు అవకాశము ప్రసాదింపవలెను. "నన్నయ చిన్నయల మార్గానువర్తులే పండితులు; అన్యులుకారు" అని చెప్పుట సమంజసము కాదు. వ్యాకరణ విరుద్ధమైన భాష అంతా నిషిద్ధమే అంటే సంస్కృతేతరములయిన భాషలన్నీ అపభ్రంశములే అవుతవి. అవన్నీ నిషిద్ధములే! ఆ పక్షమున సర్వవ్యవహారహాని సంభవిస్తుంది. అందువల్ల శిష్టవ్యవహారభాషను కాలానుసారముగా సేకరిస్తూ దానినే సంస్కరిస్తూ ఉండవలెను. ఇదే ప్రాచీన భాషావ్యాకరణసంప్రదాయము; ఇదే శ్రీరామమూర్తిపంతులుగారివాదను.

## వారి వాదస్వరూప సంగ్రహము

వైదిక లౌకిక భాషలకు వలెనే గ్రాంథిక భాషకూ వ్యావహారిక భాషకూ కొంత అంతరము ఉన్నది. వ్యావహారిక భాషను గ్రామ్యమని పేరుపెట్టి నిరసించుట తగనిపని. శిష్టవ్యవహారములో ఉన్న భాషలో గ్రంథములు రచించడమున్నూ, వానికిటీవల వ్యాకరణములు పుట్టడమున్నూ సర్వదేశభాషా సత్సంప్రదాయము. ఏసుక్రీస్తు దేశభాషలోనే తన పరమధర్మము ఉపదేశించినాడు. బుద్ధదేవుడు అహింసా దర్మములను నాటి వ్యావహారికభాష అయిన పాళీభాషలోనే ఉపదేశించినాడు. రవీంద్రకవీ, ఆచార్య గిద్వానీ గాంధీమహాత్ముడూ మొదలయిన పండితవరేణ్యులందరూ తమతమ వ్యావహారిక భాషల్లోనే గ్రంథములు రచించి వాసికెక్కి ఉన్నారు. నన్నయాదులు తమకాలములో శిష్టవ్యవహారమున ఉన్న పదములనే సేకరించి గ్రంథములు వ్రాసినారు. వారికాలములో ప్రాదెనుగు, క్రొందెనుగు అని రెండు లేవు. వారి తెనుగు నేటివారికి ప్రాదెనుగు అయినది. తమ భారతపు తెనుగునే చెక్కుచెదరకుండా ఆచంద్రతారకముగా వాడవలసినదని వారు అనుశాసించి ఉండలేదు. గ్రాంథికమునే సర్వత్ర వాడవలసినదని అను

శాసించేవారు దాని నిజస్వరూపమును స్పష్టముగా నిరూపించి అది సామాన్యముగా అందరికీ అలవడుటకు సాధనములుగా కోశములూ, వ్యాకరణములూ మొదలయినవి నిర్మించి దేశము ముంగిట పెట్టవలెను గదా !

నేడు నిలిచిఉన్న నిఘంటువులున్ను వ్యాకరణాదులున్ను ప్రాచీనభాషా స్వరూపమును నిస్సంశయముగా చూపలేవు. పూర్వగ్రంథముల అచ్చుప్రతులకూ, తాళపత్ర ప్రతులకున్నూ చాల భేదము కలదు. ఏ పాఠము విశ్వసనీయమో తెలియదు. అచ్చుపడని తాళపత్ర గ్రంథములు వేవేలున్నవి. ఔపవిభక్తికములు, శకటరేఫము, పదమధ్యమందుండే అచ్చులూ, జాత్యేకవచన బహువచనములు, మున్నగువాని నిజస్వరూపము నిర్ణయించడము ఎవ్వరికీ తరముకాదు. పెక్కు క్రియలకు ప్రేరణార్థక రూపము లేవో తెలియవు. ప్రాచీన కారక మెవ్వరికీ సరిగా పట్టువడదు. ఇట్టి దుస్థితిలో తెలిసీతెలియని సందిగ్ధ ప్రాచీనభాషలో గ్రంథములు రచించిన ప్రయోజన మెవ్వరికీ కానరాదు.

నేటి పండితులు వ్రాస్తూ ఉన్న భాష కృతకభాషగాని వ్యవస్థగల వాస్తవ భాషకాదు. తమకు సుపరిచితము కాని భాషలో గ్రంథములు రచించడము హాస్యాస్పదమే। గ్రాంథికాంధ్ర భాషా రచనకు మార్గదర్శకులగు పరవస్తు చిన్నయసూరిగారి కృతులలో కూడా తప్పులు వెలసినవి. ఇటీవలి మహాపండితుల రచనలలోనూ తప్పులు మీతిమీరి ఉన్నట్లు పంతులుగారు వేనవేలు దృష్టాంతరములు చూపి తమ వాదముయొక్క సత్యతను లోకములో కరతలామలకము చేసినారు. వాడుకభాషలో పలువిధములగు గ్రంథములు రచించుట ప్రాచీన సంప్రదాయ విరుద్ధముకాదని తాళపత్ర ప్రతులూ, తామ్రశిలాశాసనాదులూ, వీధి నాటకములూ, యక్షగానములూ, నీతికథలూ, వ్యాఖ్యానములూ, పిల్లల కథలూ మున్నగువాటిని చూపి తమ వాదములోని సత్యతను పెక్కు విధముల రుజువు చేసినారు. నేటి ఇటీవల పరిష్కర్తలు వాటిని తారుమారుచేసి పరిష్కరించి అచ్చొత్తించి భాషకు మహాద్రోహము చేసినారు. నేటి వ్యావహారికభాషను గ్రాంథికభాషగా అంగీకరిస్తేనే కాని దేశమునకు సర్వవిధములా అభివృద్ధి చేకూరదు. ఎట్టి మహాభాషాపండితుడైనా సర్వ వ్యవహారములనూ ఎన్నడూ గ్రాంథిక భాషలో చక్కబెట్టుకోలేడు. ప్రాచీనాంధ్రము అన్యభాషవలె అభ్యసించవలసినదే కాని మాతృభాషవలె స్వయముగా మనలను వరింపదు. దానిలో భావము లుదయింపకుండా ఉండడమే ఇందుకు తార్కాణము, కాబట్టి శ్రీ శ్రీ

ప్రభుత్వమువారున్ను ఆంధ్ర విశ్వవిద్యాలయము వారున్ను, ఆంధ్ర సాహిత్య పరిషత్తువారున్నూ, ఆంధ్రలోకమున్ను సత్యమును గ్రహించి వ్యావహారిక భాషకు గ్రామ్యాపవాదమును తొలగించి-ఆంధ్ర వాఙ్మయములో సముచితమైన స్థానమును దాని కివ్వవలసినదని పంతులుగారి వాదముయొక్క సంగృహీతమైన సత్య స్వరూపము.

## నా మనవి

క్రూరశాసనములు తలెత్తినకొద్దీ నిరంకుశత్వము చెలరేగి దేశమును విప్లవ సాగరములో ముంచివేస్తుంది. అట్లే గ్రాంథికవాదులు భాషా విషయములో చేసే నిబంధనలున్నూ, నిరంకుశత్వమున్నూ భాషా ప్రపంచమునకు విప్లవము తెచ్చి పెట్టుతున్నవి. నిమ్నగామిని అయిన భాషా స్రవంతికి సైకత సేతువు కట్టుటవల్ల ప్రయోజన మణుమాత్రమూ ఉండదు. ఆ గట్టు నిలువజాలదు. నిలిచినా పొంగి పొరలి జనపదమును ముంచివేస్తుంది. అనువగు తావులందు ఆనకట్టలు కట్టి కాలువలు తీసి జనపదమును నదీమాతృకగా చేయడమే సరళసరణి.

నన్నయాదులు తమ కథావస్తువుకు అనువయిన ఏ కొలది పదములనో స్వీకరించి కృతులు నిర్మించినారు. ఆ పదజాలమునకే భాషా సామ్రాజ్యములో పట్టముగట్టి ఆచంద్రతారకముగా రాజోపచారములుచేస్తూ, మిగిలిన పదములను వెలివేయుట అభ్యుదయహేతువు కాదు; పామరు లుచ్చరింపజాలక తారుమారు చేసిన పదసంతతికి నియంతృత్వ మిచ్చి మిన్నకుండుట కూడా మంచి పద్ధతి కాజాలదు.

తిక్కన నానాజాతి వృత్తుల పనిముట్లకున్నూ ప్రాచీన నవీన భావములకున్నూ వాచకములగు పదములను సర్వవిధములా సేకరించి తన కృతులలో ఉపయోగించి తెలుగుభాషకు పరిపూర్ణతను కలిగించి కవిబ్రహ్మ బిరుదము పొందినాడు. అట్లే ఆయా కాలములందు ఆయా నూతన వస్తువులకున్న నూతన భావములకున్ను సంబంధించిన పదములను శిష్టవ్యవహారము ననుసరించి సేకరించి భాషాసేవ చేయడము తెలుగువారి విధి. పూవులోని మకరందము నాస్వాదింపవలెను; పరిమళము నాఘ్రాణింపవలెను. అంతేకాని రేకుల అందచందములకై తగవులాడుట వృథాప్రయాసము.

శ్రీ రామమూర్తి పంతులువారి వాదలక్ష్మికి చెవగండములు దాటినవి. ఆమె శైశవమువీడి ప్రౌఢయై, జగన్మోహినియై విబుధులకూ పామరులకూ భాషా

మృతము పంచిపెట్టుతూ ఉన్నది. తన హావభావ విలాసములతో సహృదయుల హృదయాలను చూరగొంటూ ఉన్నది.

పండిత ప్రకాండులూ, కవిచంద్రులూకూడా ఆమెకు జోహారు లర్పిస్తున్నారు. పత్రికా ప్రపంచమూ, వాఙ్మయ ప్రపంచమూ కూడా అమె కనుసన్నల మెలగుతున్నవి. పంతులుగారి వాదలక్ష్మికి దిగ్విజయము చేకూరినదని ఘంటాపథముగా చెప్పుతున్నాను. లౌకిక వైదిక విద్వత్పరిషత్తు సమక్షమున ఆమెను సర్వజనాంగీకారముతో సింహాసనమున కూర్చుండబెట్టి సామ్రాజ్య పట్టభద్రను చేస్తున్నాను. ఓహోహో జయజయధ్వానములు. చారిత్రక చతురాననలు శ్రీ చిలుకూరి వీరభద్రరావు ఈ పంతులుగారు ముదిమిచే వణకుచేతులతో ఆమె శిరముపైని మంగళాక్షతలుంచి చిరాయువుగా దీవిస్తున్నారే! ఆమె ద్వాదశ రాజమండలమునను దాసీస్థానము నాక్రమించినదే! ప్రతిపక్షులు కన్నుఎఱ్ఱ చేసినా, పండ్లు పటపట కొరికినా, పరుషవాక్కులతో ధూళి రేగించినా మరి ప్రయోజనములేదు. విగ్రహయానాసన ద్వైధీ భావములకు కాలము గడచిపోయినది. సంధికింకా తరుణము మించలేదు. ఈ సంధి సత్రయాగమునకు ఆధ్వర్యవము చేసే వారెవరో తామే చూచుకోనవలెను. కాదేని కొలది కాలములో సమాశ్రయణమే కర్తవ్యమగును.

కనుక అన్యభాషల మర్యాద ననుసరించి గ్రాంథిక వ్యావహారిక వాదులు ఒక విద్యాపీఠమున చేరి సమరసభావముతో మెలగి విప్రపత్తులు వీడి సర్వగమ్యమగు తోవ నిర్మించుట లెస్స అని విన్నవిస్తున్నాను. ఇదే నే నర్పించు మంగళహారతి!

—తాతా సుబ్బరాయశాస్త్రి*

# కృత్యాద్యవస్థ

లోకంలో ఏదైనా కష్టమైనపని చేస్తే కృత్యాద్యవస్థ అయింది అంటారు. కృత్యాద్యవస్థ అంటే కార్యారంభములో పడే కష్టం. నాకెన్నిసార్లు ఆలోచించినా కావ్యారంభమనే తోస్తుంది. కార్యారంభానికి కష్టంలేదా. అంటే ఉంది. దానికి విఘ్నేశ్వర పూజాదులతో ఆ కష్టం తీరుతుంది. కావ్యారంభానిగ్గూడా తీరుతుంది. గదా అనవచ్చు. మన తెలుగుకవులు చాలామంది అట్లాగే తీర్చుకున్నారు. సంస్కృతంలోలేని కృతియివ్వడమనే సాంప్రదాయంతో తెలుగుకవులకా చిక్కు వదిలింది. కథారంభంలో ఆ చిక్కు మళ్ళీవస్తే మనవాళ్ళు తేలిగ్గా దాటుకుపోయినారు. ఆవూరు కోట వర్ణించడం, వప్రపరిఖలను వర్ణించడం, నాలుగువర్ణాలవారినీ వర్ణించడం, ఆ వూళ్ళో వొకరాజున్నాడు అని పేదరాసిపెద్దమ్మకథవలె అందరుకవులూ తయారుచేశారు. అదుచేత వాళ్ళకావ్యాలను నిందించడంలేదు. కావ్యాల్లో తక్కినభాగాలన్నీ జగదద్భుతకరంగా చేశారు. కాని కృత్యాద్యవస్థ అనేదాన్ని పడ్డారుకాదు.

తెలుగులో ఒకరిద్దరు కృత్యాద్యవస్థ పడ్డవాళ్ళూ ఉన్నారు. పింగళి సూరన వారిలో ప్రధానుడు. ఆయన కళాపూర్ణోదయ ప్రభావతులు రెండింటిలోనూ కృత్యాద్యవస్థ పడ్డాడు. కళాపూర్ణోదయంలోకన్న ప్రభావతిలో యీ అవస్థ యెక్కువ హృదయంగమంగా ఉంది.

సంస్కృతకవులు, అందులో నాటకకవులుపడ్డ యీ అవస్థ శిల్పాచార్యకమా అన్నట్లుంటుంది. ఆ కవులు మొదలుపెడుతూనే అగాధమైన విషయంతో మొదలుపెట్టడమో, ఒక్కసారిగా పఠితను రసాబ్ధిలో మధ్యభాగంలో దించడమో చేస్తారు. వాళ్ళు కావ్యాన్నిచూచే వైఖరియే వేరు. షేక్సుపియరు నాటకాల్లో ఆయన రాబోయేకథలో వుండే సమస్యాఘట్టాన్ని మొదటిరంగాల్లో ప్రదర్శించి వదలిపెడతాడు. తక్కిననాటకం యీ సమస్యాపూరణం. ఆయనకథలో అన్నిభాగాలూ ఒకదానితో ఒకటి అతికితే అతుకవచ్చు, అతక్కపోతే అతక్కపోవచ్చు. పాశ్చాత్య గ్రంథాలు చాలాభాగం యిలా వున్నట్టు తోస్తుంది. కొన్ని అత్యుత్తమ గ్రంథాలూ వున్నవి. ఇబ్సెన్ వ్రాసిన 'Lady of the Tea' చాలా అద్భుతరచన కలది. Tilas Uarner ఒకటి అటువంటిది. ఇంకా ఉన్నవి. ఈ

గ్రంథాల్లో ఉన్న గొప్ప ఏమిటంటే ఆ గ్రంథకర్తల దృష్టి సర్వతోముఖమైనది. ఏ నాల్గుమట్టాలో రమ్యంగా వర్ణించి కావ్యం పూర్తయిందని అనుకోరువారు. సృష్టినంతా ఒక అనంతరితమైన సూత్రంగా భావిస్తారు. ఈ సూత్రంయొక్క ఆది మధ్యాంతాలు అన్యోన్య నివిష్టాలుగా ఉంటవి. ఆది అంతమునందు అంత మాదియందును ప్రతిబింబిస్తవి. ఒకే వస్తువుయొక్క పరిణామం కాని, భిన్నవస్తువుల సమాహారం కాదు. ఇది వాళ్ళ సృష్టి వైలక్షణ్యం. ఇది సంస్కృత నాటక కవులు, ప్రధానంగా కాళిదాస భవభూతులుచేసిన సృష్టి. పాశ్చాత్యులలో ప్రధాన నిర్దిష్టవస్తువు లోకవర్తమాన ప్రదర్శనమే అవటంచేత యీ శిల్పపు బిగువు వస్తుబలములేక సన్నగిల్లినట్టు కనబడుతుంది. కొన్నిచోట్ల అది బాగానే వుండవచ్చు.

ఇట్టి సృష్టిని కావ్యమునందు నిక్షేపించడంలో రెండు పద్ధతులు కనబడు తున్నవి. ఒకటి కావ్యాదియందు కావ్యప్రధానోద్దేశ్యము వ్యంగ్యభూతంగా నిక్షే పించి తక్కిన కావ్యం కావ్యంగా వ్రాసుకుపోవడం. రెండవది కావ్యముయొక్క సర్వాకృతి ఒక మహార్థానికి వ్యంగ్యరూపంవలె చెయ్యడం. ఈ పద్ధతిలో కవికి కృత్యాద్యవస్థయే కాదు, కృతిమధ్యాంతావస్థలు కూడా తప్పవు ఈ రెండోరకాన తన కృతిని దీర్చిన ప్రభువు ఋషి ప్రథమగణంలో చేరుతాడు. వారిద్దఱూ కాళిదాస భవభూతులు. శాకుంతలోత్తరరామచరితలలో వారిట్లాంటి సృష్టిచేశారు. ఈ చెయ్యడంలో వారిద్దఱిమధ్యా కొంత వైలక్షణ్యం లేకపోలేదు.

ఇందులో మొదటచెప్పినటువంటి సృష్టి వారిద్దరినీ మినహాయిస్తే మఱి కొంత మంది చేశారు. భాసుడు, భట్టనారాయణుడు మొదలైనవారు కృత్యాద్య వస్థ మాత్రమే పడ్డారు. ఈ యవస్థ కవికాలములోనే మొదలు పెట్టలేదు. త్రేత నాటి వాల్మీకి. ద్వాపరము నాటి వ్యాసుడూ దీనికి మార్గదర్శకులు.

వాల్మీకి రామాయణము నారంభిస్తూ ఎల్లా ఆరంభించాడు ? అయోధ్యా పుర వర్ణనతో ప్రారంభించలేదు. రాజును వర్ణించిన కథ మొదలుపెట్టలేదు. మునిపుంగవుడైన వాల్మీకి వాగ్విదాంవరుడైన నారదుని 'కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్... ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్ కోఽనసూయకః' అని ప్రశ్నించి తన మహాకావ్యపరమార్థంలోనే మహానాయకుణ్ణి కూడా సంకల్పించాడు. ఆత్మవాన్ అని పరమేశ్వరుణ్ణి ఉద్దేశించాడు. ఈ కావ్యారంభం యుగాలు చన్న తరువాత సామాన్యంగా గోచరిస్తుంది. చిన్న ప్పుడు చదివిన మనుచరిత్రలో పద్యాల్లోని అందం పెద్దయింతరావాత తెలియనట్లు.

కాని దానిలోవున్న ప్రత్యగత భావిస్తే గోచరిస్తుంది. అది అలుప్తమైన విషయం కాదు. కావ్యదృష్టితో గాకుండా, పురాణదృష్టితో చూస్తే ఆయన అడిగాడు ఈయనచెప్పాడు అనటం మాత్రమే పరమార్థం. అది అట్లాగేజరిగినా దాన్ని కావ్యాదియందు నిక్షేపించడం మాత్రం కవితాత్మను దర్శించడం. ఇటువంటి కావ్యాదిసృష్టి యుగధర్మభేదంవల్ల మారుతుంది. వేదచ్ఛందస్సులు మాత్రమే తెలిసివున్న ఆ రోజుల్లో కావ్యాది యిట్లా చెయ్యడమే ఘనం. పైగా ఆ కాలంలో వుండే ధర్మపు బిగువు కాలం గడచినకొద్దీ వచ్చిన ధర్మచ్యుతి లేకపోవడంవల్ల కావ్యంలో గూడా ప్రతిబింబిస్తూ వుంటుంది. నిత్యధర్మానసక్తుడికి వ్యంగ్యం తక్కువకావాలి ; వ్యంగ్యంద్వారా రససిద్ధి అల్పసంస్కారికి.

ఇంక వ్యాసుని కావ్యారంభం చూడాలి వ్యాసుడినాటికి ద్వాపరం చివరికి వచ్చి కలి ముట్టుకోబోతోంది. ధర్మమంతా ఉత్పన్నమైంది. అందుచేత ధర్మ బోధనం చేస్తూ సృష్టియొక్క పరమరహస్యం భారతం చెప్పవలసివచ్చింది. ఆ రహస్యం వాల్మీకినాటికి విస్మృతిపథంలో పడిపోలేదు. వ్యాసుడినాటికి పడ్డది. కనుక ఆ రహస్యాన్ని వ్యాసుడు తన భారతగ్రంథంలో సర్వథా పరామర్శిస్తూ కావ్యపరమార్థం మఱొకళ్ళు మఱోరీతిగా భావించకుండా గ్రంథాదియందే సర్ప యాగకథ ద్వారా ఉపదేశించాడు. భారతమంతా కర్మప్రాధాన్యాన్ని బోధించే గ్రంథం. కర్మ అంటే నిత్యనైమిత్తికం కాదు. ఆగామి సంచిత ప్రారబ్ధాలు. సృష్ట్యాదినుండీ తనయందు ప్రతిఫలించిన బ్రహ్మపదార్థంకలిగిన మూలప్రకృతి యెల్లా పరిణమిస్తుందో అందులో బహుజీవుల కర్మసూత్రం యెల్లా నడుపు తుందో కర్మకు మొదలూచివరా యెక్కడో యీ విషయాలన్నీ ధ్వనితాలయే సర్పయాగకథను యీ మహావిషయాలనే బోధించే భారతగ్రంథాదియందు ఆ మహర్షి నిక్షేపించాడు.

ఆయన భారతాన్ని శంతనుడున్నాడు అనికాని, భరతుడు దగ్గిరనుంచి కాని మొదలెట్టి కథ చెప్పలేదు. హస్తినాపురాన్ని వర్ణించనూలేదు. అయితే సర్పయాగం కథాముఖంగా యెందుకు చేశాడు? సర్పయాగంయొక్క బీజాలు కొన్నివేల యేండ్లకు పూర్వం పడ్డవి. సర్పయాగం కల్యాదిలో జరిగింది. సముద్రమథనం త్రేతాదిలో జరిగింది. సముద్రం మథనమైన తరవాత ఉచ్చై శ్శ్రవము అతిరాన మేస్తోంటే కద్రూ వినతలు చూచి పన్నిదం చరిచారు. ఆసంద ర్భంలో కద్రువ తన కొడుకులు జనమేజయసర్పయాగంలో చచ్చేటట్టు శాప మిచ్చింది. ఈ శాపం తరువాత కొన్నిలక్షల యేండ్లకు యాగం జరిగింది. కర్మ సూత్రం రకరకంగా సాగుతోంది. ఇంతలో ఉదంకుడికథ అనుస్యూతమైంది.

రురుప్రమద్వరల కథ కలిసిపోయింది. ఆస్తీకుడు వచ్చాడు. పరీక్షితుడు చచ్చిపోయిన పామును ఋషిమెడలో వేశాడు. ఇట్లా బహుకథోపనదులను సంగ్రహించుకొని యీ కర్మకథా ప్రవాహం భారత సముద్రాభిగామిని అయింది. ప్రారబ్ధకర్మను మనం గుర్తుపట్టలేము. దారిలో ఆగామి సంచితాలు వస్తవి. ఇవ్వన్నీ కలిసి యేం పరిణామం పొందుతవో తెలియదు. మొత్తానికి యీ సృష్టి అంతా చుట్టిన చాప వంటిది. పఱచినకొద్దీ పోయి చివర కనపడాలసిందే తప్ప అంత వఱకూ కనపడదు. అయితే ఆ చివర పఱచినప్పుడు మాత్రమే లేదు చుట్టినప్పుడూ ఉంది; ఆదిమధ్యాంతముల సమష్టి సంక్షిప్తి యీ సృష్టి అనడం యీ సృష్టిరహస్యాన్ని తను కావ్యాల్లో వ్యంగ్యభూతంగా ఉంచటం యీ కర్మభూమిలో ఉన్న మహాకవులకు తెలిసినదీ చేసినదీ అయిన విషయం. అనుశాసనిక పర్వంలో మొదట గౌతమీ లుబ్ధక సర్పమృత్యు సంవాదమని ఒక ఉపాఖ్యానం ఉంది. అది అనుశాసనికంలో మొదటిది. భారతంలో అనుశాసనిక శాంతిపర్వాలు రెండూ ధర్మాల కాయువుపట్టులు. శాంతి ఆధ్యాత్మికవిద్య నెంత చెబుతుందో, అనుశాసనికం ఆది భౌతికాన్ని అంత చెబుతుంది. ఈ గౌతమ్యాది సంవాదంలో గౌతమి కొడుకు పాము కఱచి చస్తాడు. కిరాతుడు ఆ పామును కట్టి తెచ్చి చంపుతానంటాడు. గౌతమి వద్దంటుంది, పాము నాదేం తప్పంది, మృత్యువు కరవమన్నాడు, కరిచా నంటుంది. మృత్యువు వచ్చి నేను కాలుడి ఆజ్ఞ చేశానూ, నాదేం తప్పు అంటుంది కాలుడు వచ్చి 'యీ కుఱ్ఱవాడు పాముకఱచి చనిపోయే దుష్కర్మ చేశాడు; ఇట్లా చచ్చాడు' అంటాడు "తన యెఱుకయు దేవాలాపములు నొక్క తెఱగై యున్నన్" గౌతమి యిట్లా అంటుంది. వాడు అట్లాంటి కర్మచేసి పాముచేత కఱవబడ్డాడు. నేనిటువంటి కొడుకునే కనే కర్మచేసి యిట్లా కొడుకును కోల్పోయా నంటుంది. ఇది భారతం యొక్క పరమార్థం. దీన్నే వ్యాసుడు తన కావ్యాదియందు సర్పయాగకథ ద్వారా ధ్వనితం చేశాడు. ఆయన పద్ధ కృత్యాద్యవస్థ యిది. కొందఱాధునికులు పాండవులది న్యాయమా? కౌరవులదా? అనీ, అర్జును డెక్కువ వీరుడా, కర్ణుడా అనీ, యిందులో బ్రాహ్మణ బ్రాహ్మణేతరకక్షలు ఉన్నవనీ బహువిధాలుగా ఆలోచిస్తున్నారు. ఈ ఆలోచన యీ కాలాన్నిబట్టి తగినదే కాని వ్యాసుడి కీగోల తెలియదు. తెలుసునని కూడా ఆలోచిస్తే ఆలోచించవచ్చు. వ్యాసుడు జరిగిన కథలో ఆధ్యాత్మికాదిభౌతిక విషయాలు కొన్నిచోట్ల కథారూపంగానూ కొన్నిచోట్ల వ్యంగ్య భూతంగానూ పరమార్థదృష్టితోనే వ్రాశాడు దీనికి భారతంలోఉన్న బహుకథలూ, తద్గ్రంథానికి తిలకాయ

మానంగా వుంది, యిట్లాంటి ఉద్దేశం వ్యాసుడికి లేకపోతే తన్ముఖమునందు నిక్షేపించడం వ్యర్థమూ, గుణరహితమూ అయ్యే సర్పయాగకథ వ్రాయుడు.

కావ్యకళ కల్యాదినుండియేమిక్కిలి విజృంభించిందనిచెప్పాలి. తత్పూర్వం వేదానికి ఋక్కులకే ప్రాశస్త్యం. సృష్టిలో అదేమిచిత్రమో అదియందు సంపూర్ణత్వం, పోనుపోను ఛిద్రత్వం కనబడుతోంది. అన్ని జాతులలోను మహాకవులు తజ్జాతి సారస్వతోదయ ప్రథమకాలాల్లోనే పుట్టారు. అట్లాగే కాళిదాసున్నూ. ఆయన శాకుంతలంలో తీర్చిన తీర్పు అద్వితీయంగా ప్రకాశిస్తోంది. ఆయన తీసుకొన్నది ఒకరాజు కథమాత్రమే. చేసిన సృష్టి శంభుతనువు. దానిలో యజమాని, హోత, సూర్యచంద్రులు, పంచభూతాలూ యిమిడి పోయినవి. ప్రస్తావన నాటకానికి ముఖం కాబట్టి మసక్కార్వార్థ సూచనం దానిలో ఉండాలి కాబట్టి ప్రస్తావన ఎవళ్ళైనా కొంచెం కవులైతే బాగా వ్రాయవచ్చు. కాని కథారంభం చేయడం మాత్రం కాళిదాస భవభూతులకు మాత్రమే తెలుసు. కాళిదాసు వ్రాయబోయేది శృంగారరసవిషయం. తక్కిన రసములకూ శృంగారానికి చాలాభేదం ఉంది. రౌద్రాది రసాల్లో ఉదాత్తత కొంచెంతగ్గినా తగ్గినట్లు కన్పించదు. శృంగారరసం యేమాత్రం పొల్లువచ్చినా అనుదాత్తతవచ్చి గ్రామ్యమై పోతుంది;రచనలో నేకాదు; అభినయంలో కూడాను. చాలామంది నటులు ఉదాత్తతా గ్రామ్యతల మధ్య కల పొలిమేర గుర్తెఱుగక రసాభాసం చేస్తారు. ఇట్టి శృంగారరసాన్ని కాళిదాసు పట్టుకొని కావ్యం యెల్లా ఆరంభించాలో తెలియక చాలా గగ్గోలు పడ్డాడు. ఎకాయెకి శకుంతలను ప్రవేశపెడితే దుష్యంతుడిచేత ఎల్లా మాట్లాడించాలో తెలియదు. దుష్యంతుడే ప్రవేశించినా ఎల్లా చెయ్యడమో కష్టం. ఈ కష్టాన్ని తప్పించుకునేందుకు ఆయన ఒక యెత్తు యెత్తాడు. దుష్యంతుడు లేడిని తరుముతున్నట్లు.

రంగముమీద రథ మెట్లా పరుగెత్తుతుందీ? లేడి యెట్లా పరుగెత్తుతుందీ? వాడు పూర్వుడు గనుక సరిపోయింది. ఆధునికరంగానికి యిటువంటి పరిస్థితులు పనికిరావు. వాళ్ల వుద్దేశం వేరు. లేడి పరుగెత్తటం, రథం పరుగెత్తటం కవి పాత్రల చేత వర్ణింపించి సామాజికుల భావనలో ఆ పరుగెత్తటం కనిపింపచేస్తాడు. దానికి ఆ కాలపు నటకులూ సామాజికులూ కావాలి. ఈ లేడిని యింతమాత్రం కోసమే ప్రవేశపెట్టాడా? పెడితే మాత్రం శిల్పంకాదు, శిల్పమేంచేస్తుందంటే బహు విషయాలను స్ఫురింపచేస్తుంది. స్ఫురితాలూ, వ్యంగ్యాలూ, ధ్వనులూ అధికంగా

ఉన్నకొద్దీ అధికమైన శిల్పం. అదే సౌందర్యం. అనగా భావనాసౌందర్యం. ఈ లేడికాని రథాశ్వాలు కాని కాళిదాసు కావ్యవస్తువును ధ్వనిస్తున్నవి.

"గ్రీవాభంగాభిరామం ముహు రనుపతతి స్యందనే బద్ధదృష్టిః, పశ్చార్ధేన ప్రవిష్ట శ్శరపతనభియా భూయసా పూర్వకాయం;" ఆలేడి మాటిమాటికి వెనుకకు తిరిగి చూస్తోందిట. పశ్చార్ధభాగాన్ని పూర్వార్ధకాయంలో ప్రవేశపెడుతోందిట. కవి తన కావ్యకథను యిట్లాగే ధ్వనించాడు. తన కావ్యపశ్చార్ధ భాగము పూర్వార్ధ భాగంలో ఉంది.! తన కావ్యం మాటిమాటికీ వెనక్కి తిరిగి చూస్తూ లక్ష్యాన్ని వదిలి పెట్టకుండా పోతోంది. ఉదగ్రప్లుతాలతో ఆకాశం మీద ఎగిరిపోతోంది. ఈ ఉదగ్రప్లుతఘట్టాలు, స్తోకంగా ఉర్విని స్పృశించేఘట్టాలు శాకుంతల విమర్శ విషయాలు. కవికే తన కావ్యారంభంలో లానెటువంటి కష్టంలో ఉన్నాడో తెలుసు. అందుకనియే 'ఉత్ఖాతినీ భూమి రియం' అన్నాడు. నేల మిట్టపల్లాలుగా వుందిట. ఇది తన కథలోని యిక్కట్టు. శృంగారరసం ప్రారంభించటం కష్టమని ధ్వనించటం. తాను రథంమీద పోయే వేగాన్ని చెపుతూ కూడా దీన్నే ధ్వనిస్తాడు.

'యదాలోకే సూక్ష్మం వ్రజతి సహసా తద్విపులతాం
య దర్థే విచ్ఛిన్నం భవతి కృతసంధాన మివ తత్"

ఏది సగంలో తెగిపోతుందో అది మళ్ళీ కలుసుకున్నట్లే వుంది. శకుంతల ఉంగరం పారవేసుకోవడం మూలంగా కథ తెగిపోయింది. కాని ఉంగరం దొరికి రాజుకు మళ్ళీ స్మృతి రావడంతో కథ కలిసింది.

'ప్రకృత్యా యద్వక్రం తదపి సమరేఖం నయనయోః'

స్వభావంగా యేది వంకరగా ఉందో అది మళ్ళీ చూస్తే చూపుగా వుంది. దుష్యంతుడు శకుంతలను తిరస్కరించడం వక్రంగా కన్పించినా, దుర్వాసుని శాపం వల్ల, దుష్యంతుడి ధర్మబుద్ధివల్ల న్యాయంగానే తోచింది. శకుంతల వక్రమార్గం పడుతోందని దుష్యంతుడికి కనిపించినా అంగుళీదర్శనంతో అది రాజుకు మళ్ళీ సరిగ్గానే కనిపించింది.

ఇల్లాగా కొన్నిచోట్ల సువ్యక్తంగా కొన్నిచోట్ల వ్యక్తావ్యక్తంగా కాళిదాసు తన కథను పూర్వభాగమంతా ధ్వనిస్తూనే వచ్చాడు.

'తేన మృగ ఏష విప్రకృష్టాంతర్స సంవృత్తః' ఈవాక్యంకూడా దానినే ధ్వనిస్తోంది. ఈ కష్టభూమి దాటింతరువాత తన కావ్యం యెల్లా నడుస్తుందో యిల్లా చెప్పాడు.

'ముక్తేషు రశ్మిషు నిరాయతపూర్వకాయాః
నిష్కంప చామరశిఖా నిభృతోర్ధ్వ కర్ణాః

తన కావ్యం క్లిష్టఘట్టం దాటితే అంత దర్జాగా పోతుందట. ఈ వాక్యానికి ఆయన చతుర్థాంకంలో ఉన్నరచన, సప్తమాంకపు రచన చాలానిదర్శనం. ఇంక తరువాత ప్రతి చిన్నవాక్యమునందు వస్తుధ్వనులు నించి కావ్యాన్ని బిగించాడు. శకుంతలచీర పొదమీద పడ్డది. మళ్ళీ ఆవిడ తీసుకొంది. అప్పుడామె చెలికత్తె 'పరిముక్తాసి' అన్నది. వదిలిపెట్టబడ్డావు అని అర్థము. ఎవరిచేత? ఒక్క పొద చేతనేకాదు, కాశ్యపునిచేతకూడా. దుష్యంతుడు శకుంతలను 'అపితపోవర్ధతే?' అని అడుగుతాడు. తపస్సు సాగుతోందా అని. ఎవరి తపస్సు? ఎటువంటి తపస్సు? కణ్వునిదా? ఆశ్రమములోదా? కన్యాత్వ తపస్సా? దీని అర్థం బహుముఖంగా ఉంటుంది.

ఇల్లా కాళిదాసు కృత్యాద్యవస్థ పడ్డాడు. ధ్వనికి అవధి అయిన అతని రచనలో అవస్థ అపస్థకాదు. ఊరికే నామమాత్రం.

ఇట్లాగే భవభూతికూడా ఉత్తరరామ చరిత్రలో చేశాడు. సంస్కృత నాటకాలంటే కృచ్ఛ సంక్లృప్తితో కూడిన రచనలు. ప్రవేశ నిష్క్రమణాల దగ్గరనుంచీ అర్థవంతాలుగా ఉంటవి. ప్రత్యక్షరమూ ప్రయోజనకారిగా ఉంటుంది. ఉత్తరరామ చరితలోని ఆద్యంతాంకాలు మంత్రశాస్త్రం వంటివి. వర్ణసమామ్నాయంలో ఆద్యక్షరమైన అకారమూ, అంత్యాక్షరమైన క్షకారమూ కలిసి అక్షరమాల అయినట్లుగా భవభూతి అద్యంతాంకాలు రెండూ అల్లాచేశాడు. ఒకరు భవభూతి ప్రథమాంకనిర్దిష్టాలయిన బహువిషయాలను చివరి అంకాల్లో వాచ్యంగా చేశాడన్నారు. ఒకదృష్టికి అది వాచ్యంగా కనపడుతుంది. కాని లక్షణోదిత ధ్వనుల కలిశయించి శ్రీరామ చంద్రుడి పరమపురుషత్వం మహాధ్వనిగా కావ్యంలో కనిపిస్తుంది మొట్ట మొదటనే.

కింత్వనుష్ఠాన నిత్యత్వం స్వాతంత్ర్య మపకర్షతి
సంకటా హ్యాహితాగ్నీనాం ప్రత్యవాయై ర్గృహస్థతా

గృహప్రస్థితుడైన జనకుని మూలంగా సీత విషాదంపొందుతూంటే రాముడామె నిట్లా ఓదార్చాడు. అనుష్ఠాననిత్యత్వము స్వాతంత్ర్యముకు లాగివేస్తుందిట. రాముడు రాజ్యానుష్ఠాన నిత్యత్వం కలవాడు. తనకు స్వాతంత్ర్యం లేదు. అందు కనియే సీతాదేవిని కూడా వదిలిపెట్టవలసి వచ్చింది. ఈ ధ్వని యిందులో లేక పోతే అది శిల్ప మనిపించుకోదు. ఒక ధర్మాన్నిచెప్పడం మాత్రమే అవుతుంది. భవభూతి ప్రథమాంక మంతా చిత్రపటదర్శనం చేస్తూ మాట్లాడిన మాటల్లో రాబోయే సీతా వియోగాన్నే సూచిస్తాడు. ఇది పూర్వార్ధంలో పశ్చార్ధం ప్రవేశించి కావ్యాన్ని కర్మ సూత్రంతో కట్టివెయ్యటం. కథలు భేదమే తప్ప ఆ మహానుభావుల దృష్టిఅంతా ఒకటే. కాళిదాసు రఘువంశంలో దిలీపుణ్ణి రాజ్యాశ్రమముని అన్నాడు. అది భవభూతి రామచంద్రుడి కెంత తగిపోతుంది.

సంస్కృత నాటకాలు చదువుతోంటే కావ్యం యిల్లా యెందుకు మొదలు పెట్టాడు. ప్రతి అంకమూ ప్రవేశకం కూడా యిల్లా ఎందుకు చేశాడు. ఈ మాట యిల్లా యెందు కనిపించాడు, అన్నప్రశ్నలకు సమాధానాలుగా బహుప్రయోజనాలు కనబడుతూంటవి.

ఇది ఒక మహాశిల్ప లక్షణం. ఇది సంస్కృతనాటక సారస్వతంలో నిండి నిబిడీకృతమై వుంది. భాసుని ప్రతిమలో వల్కల వృత్తాంత మిట్లాంటిది. అది దీని కన్న తక్కువరకం. వేణీసంహారనాటక ప్రథమాంకం తక్కిననాటకంతో ఎక్కువ ప్రసక్తి లేని భీముని రౌద్రమంతా కృత్యాద్యవస్థా విషయం. ఆ అంకంలో భట్ట నారాయణుడు చూపించిన నేర్పు తక్కిన అంకాల్లో లేదు. ఆ అంకం వ్రాసిన యెత్తుగడలో తక్కిన పుస్తకం సంబాళించుకో లేకపోయినాడనిపిస్తుంది.

తక్కిన చాలామంది కవులు యీ క్లిష్టమార్గాన్ని పట్టక పాత్రపోషణాదులు, అలంకారాదులు సంవిధాన కల్పనలతో తమనాటకాలు రమ్యంగా చేసుకుంటూ వచ్చారు. ఈ మార్గం వ్యాసకాళిదాస భవభూతులది. తక్కినవారు చేతనైనంత మట్టుకు కొద్దికొద్దిగా సవరించు కొన్నారు.

తెలుగులో పింగళి సూరన్న తన కళాకల్పానా పైదుష్యంచేత కొంతకొంత యీమార్గాన వెళ్ళాడు. కాని ఆయన ఉపక్షుత్యాది శబ్దాలు నిక్షేపించి ఆ రెండవ రకపు చేతలోనే కొంత వాచ్యం చేశాడు.

తిక్కనగారు తాను భారతము వ్రాస్తూ ఉపాఖ్యానాల్లోనే కావ్యరచనా వైదుష్యం వెల్లడిస్తూవచ్చాడు. ఆయన మరుత్తుని కథ ఒకటి అట్లాంటిది. భవిష్యత్కథా సూచన, ఆగామికథాంశ స్ఫురణ చేసేమాటలు ప్రయోగించడం ఆయన చాలాచోట్ల చేశాడు. పదిపద్యాలు దాటిన ఉపాఖ్యానంలోకూడా తిక్కనలో యీ పద్ధతి కనపడుతూ ఉంటుంది.

ఇది భారతీయ శిల్పానికి ఉత్కృష్ట స్వరూపం అనుకోవాలి. ఇలాంటి రచనలో సృష్టిరహస్యం గోచరమవుతూ ఉంటుంది గనక. ఒక రకంగా చూస్తే యిది కావ్య గుణాపాదనయే అనిపించవచ్చు. కాని భవభూతికాళిదాసాదుల తర గతులలో వారి యందే కనబడుతున్నది. ఇట్టి రచన కొన్ని పాశ్చాత్య గ్రంథాల్లోనూ కనబడుతోంది. కాని వాళ్ళు ప్రధానంగా ప్రతిపాదించే విషయాలు రస ప్రధానాలు కాకుండా భావ ప్రధానాలవడం చేతనూ, వారి పరమోద్దేశాలు సంఘగత క్లిష్టపరిస్థితుల విమర్శించుట కావడంచేతనూ వారికి భారతీయులకువలె ధర్మ ప్రాధాన్య బుద్ధి లేకపోవడం చేతనూ, ఇట్టి పద్ధతిలో ఆ కొద్దిమంది మహాకవుల రచనా కించి దూనంగా కనబడుతుంది. వట్టి కావ్యరచనా శిల్పం తీసుకొంటే అందు యీ పద్ధతులు కొద్దిమంది మహాకవులలో లేకపోలేదు.

విశ్వనాథ సత్యనారాయణ *

---

* ప్రతిభ నవంబరు 1936 సంపుటము 1. సంచిక 3.

# తుది విన్నపము

సంఘంలో నిరక్షరకుక్షులు ఎక్కువగా ఉన్నంతకాలం సంఘం వృద్ధిలోకి రాదు. సౌఖ్యమన్నది సంఘంలోని భాగ్యవంతులూ, పెద్దలూ సామాన్య ప్రజలతో పాటు సమానంగా అనుభవించ వలసినదే కాని తామొక్కరే అనుభవించవలసినది కాదు. ప్రజలలో విద్య వ్యాపిస్తేకాని సంఘం వృద్ధిలోనికి రాదు. ఐతే, ప్రజలలో వ్యాపించ వలసిన విద్య ఈ కాలానికి పనికిరాని ప్రాచీన కావ్యాలు, వ్యాకరణాలు చదివించడంవల్ల రాదు. ఇంగ్లండులో కూలివాండ్లు కమ్మర్లు మొదలైన వాండ్లు షేక్స్పియర్, మిల్టన్ మొదలైన మహాకవుల గ్రంథాలు చదవమంటే చదవరు.

"మాకు కడుపునిండా తిండి దొరికే మార్గం చెప్పండి. మా వృత్తులకు సంబంధించే విద్యలు మాకు నేర్పండి" అంటారు. అందుచేత, వాళ్లకోసం ఇదివర కున్న విద్యావిధానమంతా మార్చవలసి వస్తున్నది. కర్మాగారాలున్న ప్రదేశాలకు విద్యాధికులు పోయి వాళ్లకు తెలిసే భాషలో ఉపన్యాసాలిస్తూ, ఉపన్యాస విషయాలు చర్చిస్తూ ప్రజలకు జ్ఞానము, వివేకము కలుగజేస్తున్నారు.

రేడియో ప్రసంగాల వల్లను, పత్రికలవల్లను, పుస్తకాల వల్లను ప్రజలలో విద్య వ్యాపిస్తూ ఉన్నది. ఇంగ్లండు మొదలైన పాశ్చాత్యదేశాలలో కేవలం ప్రజల కోసం పెద్ద సారస్వతం పుట్టి వృద్ధిపొందుతూ ఉన్నది. అది అంతా ప్రజల భాషలోనే ఉంటుంది. ఆ విధంగానె మన దేశంలో కూడా ప్రజలలో విద్య వ్యాపించడానికి అనుకూలమైన గ్రంథాలు కావలెనని ప్రజలు తమ భాషలో వ్రాయడానికి, చదవడానికి సమర్థులు కావలెను.

ప్రజలలో విద్య ఎక్కువగా వ్యాపింపజేయడానికి, నవీనాశయములకు అనుకూలంగా అందరిలోనూ హృదయ పరివర్తనం కలుగజేయడానికి ఎక్కువగాతోడు పడేవి పత్రికలే. కనుక పత్రికా సంపాదకులకు నా విన్నపము తెలియజేస్తున్నాను.

సుమారు 30 సంవత్సరములై వర్తమానాంధ్రభాషాప్రయోజనము గురించి పాటుబడుతూ ఉన్నాను. వ్యావహారిక భాషాగౌరవమును నిలబెట్టడానికి నేను ప్రయత్నిస్తూ ఉంటే దానిని పడగొట్టడానికి ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారు పనిచేస్తూ వచ్చారు.

మొదట నేనూ, నా మిత్రుడు గురజాడ అప్పారావు, మాకు తోడుగా మరి ఇద్దరు ముగ్గురు మాత్రమే ఈ ఉద్యమము ప్రారంభించాము. తక్కిన తెలుగు వారందరూ మాకు ప్రతికూలంగా ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారితో కలిసి మా ఉద్యమాన్ని ఎదిరించిన వారే.

ఆ కాలంలో ఆంధ్ర సాహిత్య పరిషత్తువారి ప్రతిష్ఠా, గౌరవమూ, ప్రాభవమూ ఎక్కువగా ఉండడం వల్లనూ, వ్యావహారిక భాషా ప్రయోజనము సరిగా బోధపడక పోవడంవల్లనూ ఆ పరిషత్తువారి అభిప్రాయము ననుసరించి తెలుగు దేశమందలి పెద్దలందరూ తీర్మానాలు చేసి గవర్నమెంటువారికి ఎక్కువగా ఒత్తిడి కలిగించి వాస్తవమైన దేశభాష బడిపిల్లలు అభ్యసించకుండా చేశారు.

అప్పుడు "నిజమైన సంప్రదాయము" అనే పేరను చిన్న వ్యాసమొకటి రచించాను. అది శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రులుగారు అచ్చువేయించి ప్రకటించారు. అందులో విద్యార్థులు చదువుకొనే గ్రంథాలన్నీ మన పూర్వులు వ్యావహారిక భాషలోనే రచించే వారని కొన్ని నిదర్శనాలు చూపించాను.

దేశంలో అందరూ మీ వాదానికి ప్రతికూలంగా ఒత్తిడి కలుగజేస్తున్నారు. గనుక వ్యావహారిక భాషా ప్రయోజనం అంగీకరింపజాలమని గవర్నమెంటు వారున్ను యూనివర్సిటీ వారున్ను అనడంచేత, తెలుగు దేశమంతా తిరిగి నిజమైన సంప్రదాయం తెలియబరచి ప్రచారం సాగించాను.

పరవస్తు చిన్నయసూరి కావ్యభాషలో తననీతిచంద్రిక రచించి గద్యరచనకు కావ్యభాషా సంప్రదాయం తెచ్చిపెట్టక పూర్వం వ్యావహారికభాషలో సకల విధములైన గద్య రచనలు సాగుతూ ఉండేవనీ రుజువు చేయడానికి వ్యావహారిక భాషలో రచించిన వ్రాతపుస్తకాలూ, మొదట అచ్చుపడ్డపుస్తకాలూ, కొన్ని సంపాదించి అవి పట్టుకొని తెలుగు దేశంలో ఉన్న కాలేజీలకు వెళ్ళి అక్కడి పండితులకూ, ఉపాధ్యాయులకూ చూపించాను. చాలాచోట్ల సభలలో ఈవిషయమై ఉపన్యాసాలిచ్చాను.

1916 సం. నవంబరు 19వ తేదీని కొవ్వూరులోజరిగిన ఆంధ్రసారస్వత మహాసభలో వందలకొలది తెలుగుపండితులూ, కవులూ నావాద మంగీకరించారు. 1919వ సం. ఫిబ్రవరి 28వ తేదీని రాజమహేంద్రవరమందు కీ. శే. కందుకూరి వీరేశలింగంపంతులుగారు అధ్యక్షులుగా వర్తమానాంధ్రభాషాప్రవర్తకసమాజము

స్థాపించుటకు ఏర్పాట్లు జరిగినవి. కాని పంతులుగారు మరి మూడుమాసములకే పరమ పదము పొందుటవల్ల వారి తోడ్పాటు మా సమాజమునకు లేకపోయినది. అయినా మా ఉద్యమం సాగకపోలేదు

1919 సం.లోనే నేను నా "తెలుగు" పత్రిక ప్రకటించి అందులో వ్యావహారిక భాషాప్రయోజనంగురించి ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజం గురించి, ఆంధ్రభాషా పరిణామం గురించి వ్యాసాలురచించి ప్రకటించాను. అవి చాలమంది పండితులూ, కవులూ చదివారు. క్రమక్రమముగా నా వాదము ఆమోదించేవారి సంఖ్య అధికమవుతూవచ్చింది. పత్రికాసంపాదకులందరూ తమ పత్రికలందు వాడుక భాషలో రచించిన వ్యాసాలకు కొంచెము కొంచెముగానైనా అవకాశం కలుగజేస్తూ వచ్చారు.

తుదకు 1926 సం. తణుకులో ఆంధ్రసాహిత్య పరిషత్ సాంవత్సరికోత్సవము జరిగినప్పుడు సభలోనివారు అందరూ కాకపోయినా అనేకులు వ్యావహారిక భాషాప్రయోజనం అంగీకరించారు. దానితో పరిషత్తు పెద్దలు ఉపద్రవము జరిగిపోయినట్లుగా భయపడి అటుపైని జరిగే సాంవత్సరికోత్సవములలో అటువంటి తీర్మానాలు మరికాకుండా ఉండేటట్లున్నూ వ్యావహారికభాషావాదులెవరూ తమ పరిషత్తులో సభ్యులుగాచేరకుండా ఉండేటట్లున్నూ కట్టుదిట్టాలు చేసుకొన్నారు.

దేశంలో అంతకంతకు వ్యావహారికభాషావాదము అంగీకరించినవారిసంఖ్య ఎక్కువగుటచేతను ఆంధ్రసాహిత్యపరిషత్తువారి ఉద్దేశములను అమోదించేవారి సంఖ్య తక్కువగుటచేతను ఆ పరిషత్తు క్షీణించినది; పరిషత్ పత్రిక మరి కనబడదు. నా వాదమును పూర్తిగా ఆమోదించిన నా మిత్రులు 'నవ్యసాహిత్య పరిషత్తు' స్థాపించి 'ప్రతిభ' అనే పత్రిక ప్రకటిస్తున్నారు. ఆ పత్రికేకాదు, అన్ని పత్రికలున్నూ వ్యావహారికభాషాప్రయోజనమును అంగీకరించినవి.

వందలకొలది కవులూ,పండితులూ తమ వాడుకభాషలో రచన సాగిస్తున్నారు. ఇంతమట్టుకైనా నా కృషి ఫలించినందుకు నేను కృతార్థుడనైనానని సంతోషిస్తున్నాను. కాని బడులలోను కాలేజీలలోను ప్రభుత్వమువారున్నూ విశ్వవిద్యాలయములవారున్నూ వ్యావహారికభాషా ప్రయోజనము అంగీకరించేవరకు నా వాదము పూర్తిగా నెగ్గినదని నేను భావించలేను. 'దేశంలో అందరున్నూ మీకు ప్రతికూలంగా ఉన్నారు. గనుక వ్యావహారిక భాషాప్రయోజనం మేము అంగీక

రించ లే' మని గదా ప్రభుత్వమువారున్ను విశ్వవిద్యాలయమువారున్ను 25 సంవత్సరాల క్రిందట అన్నారు.

ఈ 25 సంవత్సరాలలో ఇంతమట్టుకు పరివర్తనం జరిగింది గనుక ఇక నైనా బడులలోను కాలేజీలలోను వ్యావహారికభాష మూలంగా విద్యసాగేటట్టు చూడవలసి ఉన్నది. ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు నాకు 'కళాప్రపూర్ణ' బిరుదు అనుగ్రహించడం నా గ్రాంథికభాషా పాండిత్యానికి కాదుగదా! నా వ్యావహారిక భాషా వాదము ఆమోదించే ఈ గౌరవము నాకు ప్రసాదించారనక తప్పదు.

నన్ను గౌరవించినందుకు నేను కృతజ్ఞుడనే కాని వ్యావహారికభాషా ప్రయోజనము ఆంధ్రవిశ్వవిద్యాలయము వారు అంగీకరించి ఆచరణలో పెట్టిన దాకా నేను పూర్తిగా కృతకృత్యుణ్ణయినానని సంతోషించలేను.

ఈ నడుమ విశ్వవిద్యాలయమువారి తెలుగు పరీక్షలలో వ్యాసరచనకు ఒక విషయంగా రేడియో ప్రసంగములవంటి ప్రసంగమొకటి వాడుకభాషలో విద్యార్థులు రచించేటట్టు ఏర్పరచవలసినదని ఎకడమిక్ కౌన్సిలులో ఒకరు తీర్మానం ప్రవేశపెడితే అది బోర్డాఫ్ స్టడీజువారి అభిప్రాయానికి పంపించా లన్నారు.

ప్రభుత్వమువారు బడులలో ఎందుకూ పొందని దిక్కుమాలిన కృతకాంధ్ర భాషలో రచించినవాచకాలే కావలెనంటున్నారు; వాడుకభాషలో రచించిన పుస్తకాలు "అప్రువ్" చేయమంటున్నారు.

ఎందుచేత? వ్యావహారికభాష అంటే గ్రామ్యమన్న దురభిప్రాయం మన పెద్దలికి వదలలేదు. వ్యావహారికభాషే వాస్తవమైన మాతృభాష అన్న విషయం ఎంతచెప్పినా వారు గ్రహించడంలేదు. ఏమిచేయను? వ్యావహారికభాషను గ్రామ్య మనకూడదని మరిఒకసారి గట్టిగా నచ్చచెప్తున్నాను.

గ్రామ్యశబ్దము పారిభాషిక శబ్దము. గొల్లలు మొదలయిన పామరుల భాష గ్రామ్యమని సంస్కృతసారస్వతములో ఆలంకారికు లన్నారు. లక్షణ విరుద్ధమయిన భాష గ్రామ్యమని తెలుగు పండితులన్నారు. ఏ అర్థంలో చూచినా మన వ్యావహారిక భాషకు గ్రామ్యమన్న పేరు అన్వయించదు.

ఎందుచేతనంటే, నేను గత ٤0 సంవత్సరములనుండీ సమర్థిస్తూవచ్చిన వ్యావహారికభాష శిష్టజన వ్యావహారికభాషేకాని గొల్లలు మొదలయిన పామరులు పలికే గ్రామ్యభాష కాదు.

లక్షణవిరుద్ధమైన భాష గ్రామ్యమన్న సూత్రము మన శిష్టజన వ్యావహారిక భాష కెంతమాత్రము వర్తించదు. ఎందుచేతనంటే ఆ సూత్రము కల్పించిన లక్షణకర్త ఉద్దేశించినభాష భారతాది ప్రాచీనకావ్యములలోని భాష.

అయితే మన వ్యావహారికభాషకున్ను ప్రాచీన కావ్యభాషకున్ను సంబంధమే లేదా అంటే లేకపోలేదు. సంస్కృతసారస్వతంలో వైదికభాషకున్ను లౌకిక భాషకున్నుగల సంబంధంవంటి సంబంధం ఉన్నది.

మన ప్రాచీనకావ్యభాష వైదికభాషవంటిది. వ్యావహారికభాష లౌకికభాష వంటిది. లౌకికభాషకు లక్షణంచెప్పిన పాణిని, కాత్యాయనుడు, పతంజలి లోకంలో ఉన్న వాడుకభాష ప్రమాణంగా గ్రహించి సూత్రాలు, వార్తికాలు, ఇష్టులు రచించారు గాని వాల్మీకివ్యాసాదులు రచించిన గ్రంథాలలోని భాష ప్రమాణంగా చూపించలేదు.

ఇంగ్లండుదేశములో చక్రవర్తిగారు, మంత్రులు, బిషప్పులు, వర్తకులు, ఉపాధ్యాయులు మొదలైన పెద్దలందరూ శిష్టులే. వారి వ్యావహారికభాషలోనే గ్రంథాలు రచిస్తున్నారు, విద్య బోధిస్తున్నారు ఉపన్యాసా లిస్తున్నారు. ఆ భాషలోనే మన గవర్నరుగారు రేడియో ఉపన్యాసాలు ఇచ్చారు.

ఆ విధంగానే న్యాయమూర్తులయిన వేపా రామేశంగారు ఆంధ్రవిశ్వవిద్యాలయ కళాశాలాధ్యక్షు లయిన విస్సా అప్పారావుగారు, పండితులును కవులును అయిన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, విశ్వనాథ సత్యనారాయణగారు మొదలైన పెద్దలు తమ వ్యావహారికభాషలో రేడియో ప్రసంగాలు చేశారు.

వీరందరూ శిష్టులే. వీరిభాష వర్తమాన శిష్టజన వ్యవహారాంధ్రభాష. వీరెవ్వరూ శిష్టులు కారంటే మన ఆంధ్రదేశంలో మరెవ్వరు శిష్టులు కాగలరో నాకు తెలియదు.

వ్యావహారికభాష గ్రంథరచన కుపకరించ దనడానికి గొప్ప కారణంగా భాషలోని మాండలికరూపభేదాలు చూపిస్తూ ఉంటారు కొందరు.

వాడుకభాష ఒక మండలంలో ఒక విధంగాను మరి ఒక మండలంలో మరి ఒక విధంగాను ఉంటుంది.

అక్కడివారి మాటలు ఇక్కడివారికి ఇక్కడివారి మాటలు అక్కడివారికి తెలియవు. సర్కారుజిల్లాలవాండ్లు పప్పు అంటారు. రాయలసీమవారు బేడ అంటారు. వారు 'అద్దె' అంటే వీరు 'బాడుగ' అండారు. వారు 'చెక్క' లంటే వీరు 'వక్క' లంటారు. వారు 'ఆనపకాయ' అంటే వీరు 'సొరకాయ' అంటారు. గనుక వాడుకభాష గ్రంథరచనకు పనికి రాదంటారు.

ఈ వాదం 30 సంవత్సరాలనుండి చేస్తూనే ఉన్నారు. అందుకు సమాధానం చెప్తూనే ఉన్నాను. నా సమాధానం విననట్టుగనే మళ్ళీమళ్ళీ ఆదేవాదం చేస్తూ ఉంటారు, ఖండితమైనవాదం ఎక్కువసార్లు చేస్తూ ఉంటే దానికేమైనా బలం వస్తుందా? లోగడనే ఈ వాదం బయలుదేరినప్పుడు "సరే, మీరన్నమాట నిజమే. ఒక మండలంవారి వ్యవహారంలో పప్పు, అద్దె, చెక్కలు, ఆనపకాయ అనే మాటలున్నవి. అవి రెండోమండలంవారి వ్యవహారంలో లేవు. ఆ రెండో మండలంవారి వ్యవహారంలో వాటికి సరిగా బేడలు బాడుగ, వక్కలు, సొరకాయ అనేమాటలున్నవి. ఇవి మొదటి మండలంవారి వ్యవహారంలో లేవు.

"అయితే ఏమంటారు? తమ మండలములో లేక ఇతర మండలములో ఉన్న మాటలే వాడాలంటారా? ఏ మాటలూ వాడరాదంటారా?

"ఈ మాటలలో ఏదీ వాడకూడ దంటే ఆ విషయం వ్రాయవలసి వచ్చినప్పుడు ఏలాగు వ్రాయడము? ఏ మాట ప్రయోగించడము? సొరకాయా వద్దు, ఆనపకాయా వద్దూ 'అలాబూ' అని సంస్కృతం మాట వాడమంటారా?" అని నేను అడిగినప్పుడు నా ప్రతిపక్షులు ఒకరిమొగము ఒకరు చూచుకొని మారు మాటాడలేక ఊరుకున్నారు.

మాండలిక శబ్దాలు అన్ని భాషలలోను ఉంటవి. అన్నీ సాధువులే, భాషా లక్షణం చేసేవారు ఈ రూపాలన్నీ సేకరించి అనుశాసిస్తారు.

పాణిన్యాదులు అలాగే చేశారు. ప్రాచాం-ఈ రూపము, ఉదీచాం-ఈ రూపము అంటూ అనేకంగా మాండలిక శబ్దాలు అనుశాసించారు.

మన తెలుగు కవులు మాండలిక శబ్దాలు వాడుక చేశారు. 'పప్పు' శ్రీనాథుని హరవిలాసంలోను, 'బేడలు,' ఆముక్తమాల్యదలోను ప్రయుక్తములయి ఉన్నవి. మాండలిక శబ్దాలు వ్యావహారిక భాషాప్రయోగానికి ప్రతిబంధక మనే వారికి లక్షణ సంప్రదాయం తెలియదని చెప్పాలి.

"కేశవ! యాంధ్రులు నానా
దేశంబులయందు నిలిచి తెలుగుకి తత్త
ద్దేశోక్తు లంట బలికిన
నాశబ్దము లన్యదేశ్య జాంధ్రము లయ్యెన్."

అని అప్పకవి చెప్పలేదా? ఆంధ్రభాషార్ణవము, ఆంధ్రనామ సంగ్రహము మొదలయిన నిఘంటువులలో ఈ మాండలీయక శబ్దాలు చేరలేదా? ఇవి అన్నీ శబ్దరత్నాకరములోని కెక్కలేదా?

ఎవరివాడుకలో ఉన్నమాటలు వా రుపయోగిస్తారు. ఆ మాటలు తమ మండలము వారికే కాని తక్కినమండలమువారికి తెలియవన్న విషయం తెలియద మేలాగు? మాండలీయక శబ్దాలనుగురించి మా ప్రతిపక్షులు చేసేవాదం సారం లేనిది. దీనిని గురించి సవిస్తరంగా నా "బాలకవిశరణ్యాల"లో వ్రాసిఉన్నాను. (చూ. పు. 271-274)

ప్రాచీనకావ్యభాష నేడున్న పిల్లలచేత చదివించి అందులోనే వారిచేత వ్రాయించరాదా? అది అందరికీ సామాన్యభాష అంటారు కొందరు. అది అందరికీ అన్యభాషవంటిదే. అది ఎవ్వరికీ పట్టుపడకపోవడములోనే 'సామ్యం' అంటాను నేను. ప్రాచీనకావ్యభాష పట్టుపడవలెనంటే సంస్కృతభాష బాగా రావాలి. తెలుగు ప్రబంధాలు, కావ్యాలు అన్నీ చదివి అందులోని భాషారూపాలు గ్రహించాలి. అర్ధానుస్వార శకటరేఫనిర్ణయాలు గుర్తించాలి. ఇంతచేసినా ఆ కావ్యభాష కొంతవరకు అర్థంచేసుకోవడం సాధ్యమయితే కావచ్చునేమో కాని అది నిర్దుష్టంగా వాడడం ఇదివర కెవరికీ సాధ్యం కాలేదని, సాధ్యం కావడం అసంభవమనీ నేను బాహాటంగా చెప్పగలను. మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారికి, రావుబహదూర్ కందుకూరి వీరేశలింగంపంతులు గారికీ, గ్రాంథికాంధ్రభాష రాదనీ, సంస్కృతభాష రాదనీ వారి గ్రంథాలలోని

తప్పులు చూపించారు కళాప్రపూర్ణ అయిన వేదం వేంకటరాయశాస్త్రిగారు. వారు తప్పులు ఒప్పులుగాను ఒప్పులు తప్పులుగాను చెప్పారని చూపించి ప్రాచీన గ్రాంథికాంధ్రభాష వారికి బాగుగా పట్టుపడలేదని నేను రుజువుచేశాను.

నేను రచించిన మిథ్యాపవాదము, ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజము చదివితే మీకే విషయం స్పష్టమవుతుంది. నాకు పూర్తిగా పట్టుపడిందని నేను చెప్పుకోవడంలేదు. ప్రాచీన కావ్యభాష ఎవరికీ చక్కగా రాదనే చెప్తున్నాను. అది పట్టుపడడం అసాధ్యమని ఎందుకంటున్నానంటే-అది పూర్తిగా తెలుసుకోవడానికి తగిన సాధనాలు తక్కువ.

ఏ కవియైనా తన కావ్యములలో తనకాలంలో ఉన్న భాషంతా పూర్తిగా వాడుకచేయడానికి అవకాశ ముండదు. గనుక కావ్యాలలోనికి రానిభాష మనకు పోయినట్లే కదా. కొన్ని శబ్దాలు అకారమధ్యమములో ఉకారమధ్యములో చెప్పలేము. కొన్ని శబ్దములలోని వర్ణములు పరుషములో సరళములో చెప్పడం కష్టము. ఏకవచనములోమాత్రమే కనబడుతూఉన్న శబ్దాలకు బహువచనరూపము లెట్లుండవో చెప్పలేము; బహువచనములో మాత్రమే కనబడుతూఉన్న శబ్దాలకు ఏకవచనరూపము లెట్లుండవో చెప్పలేము. కొన్నివిభక్తులలో మాత్రమే కనబడుతూఉన్న శబ్దాలకు తక్కిన విభక్తిరూపా లెట్లుండవో చెప్పడం కష్టము. కొన్ని శబ్దాలు కావ్యాలలో ఉన్నా నిఘంటువులలో కనబడవు; కొన్ని శబ్దాలు గ్రాంథికభాషలో కనబడకపోయినా నిఘంటువులలో ఉన్నవి.

గ్రాంథికభాషలో శబ్దరూపాలు ఎట్లున్నవో అర్ధానుస్వారము, శకటరేఫము ఏయే శబ్దాలలో ఉన్నవో, ఎందులో లేవో తెలుసుకోవడము ఎంతకష్టమో చూడండి. ఏదైనా వొకరూపముగురించి తగవువచ్చినా, సందేహం కలిగినా అది గ్రాంథికభాషలో లేదు ; తప్పు అని చెప్పడం ఎంతసాహసమో ఆలోచించండి.

గ్రాంథికాంధ్రము పెద్దపెద్ద పండితులకే సరిగా తెలియనప్పుడు, అది చిన్న చిన్న బడిపిల్లలకు విధించడము కార్యమవునా, కాదా—ఆలోచించండి. లోకంలో ఏదైనా ఒకవృత్తి అవలంబించి బతుకుదా మని ఆలోచించి కాస్త చదువూ వ్రాతా నేర్చుకొని తమకు కావలసిన విషయము బోధించే పుస్తకాలు చదువుకొందామన్న సామాన్యులచేత ధారీతెన్నూలేని ఈ గ్రాంథికభాషలో రచించిన వాచకాలు చదివిస్తే ఏమి ఫలము కలుగగలదు ?

20 ఏండ్లు చదువుకొని 40 ఏండ్లు ఉపాధ్యాయులై ఉన్న పండితులంకే కాని, ఈ గ్రాంథికభాష నాలుగుక్లాసులు చదివి ఏదో ఒకవృత్తి అవలంబించే వాండ్లకు ఎందుకు ఉపచరిస్తుంది? వాండ్లకు వాండ్ల వాడుకభాషలో పొందికగా వ్రాయడము నేర్పి ఉంచే అది ఉపచరించును. అది నేర్పరు. ఈ గ్రాంథిక భాష రాదు. అందుచేత, వాండ్లు రెంటికీ చెడి యథాప్రకారంగా నిరక్షరకుక్షు లవుతారు.

దేశభాషద్వారా విద్య బోధిస్తేనే కాని ప్రయోజనంలేదు. శిష్టజన వ్యావహారిక భాష లోకంలో సదా వినబడుతూ ఉంటుంది. అది జీవంతో కలకలలాడుతూ ఉంటుంది. గ్రాంథికభాష గ్రంథాలలో కనబడేదేకాని వినబడేది కాదు. ప్రతిమవంటిది. ప్రసంగాలలో గ్రాంథికభాష ప్రయోగిస్తూ తిట్టుకొన్నా సరసాలాడుకొన్నా ఎంత హాస్యాస్పదంగా ఉంటుందో చూడండి.

గ్రాంథిక భాష యెడల నాకు ఆదరణ లేకపోలేదు. ప్రాచీన కావ్యాలు చదువ వద్దనీ విద్యార్థులకు నేర్పవద్దనీ నే ననను. కాని ఆ భాషలో నేడు రచన సాగించడానికి పూనుకోవడం వృథా అంటున్నాను. నిర్దుష్టంగా ఎవరున్నూ వ్రాయలేరు. వ్రాయగలిగినా వ్రాసేవారికి కష్టమే, వినేవారికీ కష్టమే. వ్రాసేవాండ్లేమి చేస్తున్నారు? భావం తమ సొంత (వాడుక) భాషలో రచించుకొని గ్రాంథికీకరణం చేస్తున్నారు. అది చదివేవాండ్లు వినేవాండ్లు తమ సొంత వాడుక మాటలలోకి మార్చుకొని అర్థం చేసుకొంటున్నారు. ఎందుకీ వృథా ప్రయాసం?

స్వరాజ్యం కావలె నంటున్నాము. ప్రత్యేకాంధ్రరాష్ట్రం కోసం చిక్కుపడుతున్నాము. ప్రజాస్వామిక పరిపాలనం కోరుతున్నాం. ఇటువంటి పరిస్థితులలో మన ప్రజలకు, సామాన్యజనులకు ఏ భాషద్వారా జ్ఞానం కలుగచేయవలసి ఉంటుందో, ఏ భాషలో గ్రంథరచన సాగించవలసి ఉంటుందో ఆలోచించండి!*

—గిడుగు వేంకట రామమూర్తి

*ప్రతిభ, సంపుటి 4.

# జైన రామాయణము

ప్రపంచమంతయు వాల్మీకి రామాయణము నెఱుగును. కాని శ్రీరాముని వారి కథను జైనులలో చాల భిన్నముగా జెప్పుకొనుచున్నారు. హిందువు లీవిషయము గమనించలేదు. ఈ జైనరామాయణము హేమచంద్రాచార్యులు రచించిన త్రిషష్టి శ్లోక పురుష చరిత్రమను గ్రంథములో నొక ఘట్టమైయున్నది. ఇప్పుడా కథను వివరింతును. వాల్మీకిరామాయణమునకు దీనికిని భేదములున్న భాగములే వివరింతును. తక్కినవి సామ్యములే యని గ్రహింపవలయును.

## ౧వ అధ్యాయము

## రాక్షస వానరోత్పత్తి

భరత ఖండ మందలి వినిత పట్టణమున నిక్ష్వాకు వంశీయుడైన సగర చక్రవర్తి రాజ్యము సేయుచుండెను. అత డొకనాడు వేట కరిగి బాట తప్పి యలసియుండెను. అప్పు డరణ్యమం దత డొక సుందరిని జూచెను. ఇరువురు మోహించిరి. అప్పు డొకడు వచ్చి యా సగరునితో నిట్లు చెప్పెను. "అయ్యా, విద్యాధరులలో నొకరైన సులోచన యను రాజు గగనవల్లభా పట్టణము నేలు చుండెను. అతనికి సహస్రనేత్రు డను కుమారుడును, సుకేశయను కూతురును కలదు. రదన పురాధీశ్వరుడైన పూర్ణమేఘు డను వాడు సుకేశను గోరియు నభీష్టము నెఱవేఱనందున సులోచనుని జంపి రాజ్య మపహరించెను. ఇప్పుడు సహస్రనేత్రుడును తన చెల్లెలగు సుకేశయు నీ యరణ్యమున దాగియున్నారు. తాము సుకేశను పరిగ్రహింప నర్హులు.

అదే ప్రకారము సగరుడు సుకేశను పెండ్లి యాడి సైన్యయుక్తుడై పూర్ణమేఘుని పాఱదోలి తన మఱఁది రదనపురము నేల నియోగించెను. కొంతి కాలమున కీ బావమఱఁదులు తీర్థయాత్ర చేయుచుండ పూర్ణమేఘుడు వీరి కెదురుకాగా సహస్రనేత్రు డతని జంపెను. పూర్ణమేఘుని కొడుకు ఘనవాహ నుడు. భీముడను రాక్షస రా జితని జూచి యిట్లు పలికెను. "అయ్యా, నీవు నాకు పూర్వజన్మమున పుత్రుడవు. నా కాలము సమీపించినది. కావున నీవు నా నవ వజ్రములహారము నిచ్చితిని. నీవు రాక్షస ద్వీపమందలి నా లంకా

పట్టణమునకు పాతాళలంకకు రాజవు గమ్ము" అని అతనికి బట్టము కట్టెను. ఇతనికి మహారాక్షసుడు. అతనికి దేవరాక్షసుడు. అతనికి కీర్తిధవళుడును, అతనికి తటిత్కేశుడును బుట్టిరి. ఇక వానరోత్పత్తి యెట్లనగా:- రత్నపురమును దొల్లి పుష్పోత్తరుడను విద్యాధరుడు రాజ్యము చేయుచుండెను. అతనికి పద్మోత్తరుడను కుమారుడును పద్మ యను కూతురును కలిగిరి. శ్రీకంఠుడను రాజు పద్మను వివాహమాడ దలచి తనవిమానముపై నెత్తికొని పోయెను. పుష్పోత్తరుడు కోపించి శ్రీకంఠుని జంప నుద్యుక్తుడయ్యెను. అప్పుడు పైన జెప్పబడిన కీర్తిధవళు డను రాక్షసుడు వారికి సంధి సమకూర్చెను. కొంతకాలమునకు శ్రీకంఠుడు వానర ద్వీపమునకు రాజయ్యెను. ఇతనికి వజ్రకంఠుడు, అతనికి దధిరథుడు పుట్టిరి.

పైజెప్పిన రాక్షసరాజగు తటిత్కేశు డొకనాడు వానరద్వీపమందు భార్యాసహితుడై యిచ్ఛావిహారము చేయుచుండ నతని భార్యాముఖము నొక వానరుడు బటికిపెట్ట భర్త కోపించి వానిని జంపెను. పిమ్మట పశ్చాత్తప్తుడై వైరాగ్యమును బొంది తన కొమరు డగు సుకేశునికి బట్టము గట్టెను. అచ్చట వానరద్వీపరాజగు దధిరథునకు కిష్కిందుడు పుట్టెను. అతనిని స్వయంవరమందు మందిరమాలియను రాజు కూతురు వరింపగా అశనివేగు డను రాజు కోపోద్దీపితుడై వానర ద్వీపమును జయించి యచటినుండి కిష్కిందుని బారదోలి రాక్షస ద్వీపముపై తన సైన్యమును నడుపగా సుకేశుడును పాఱిపోయెను. ఈ సుకేశుడును, కిష్కిందుడు పాతాళలంకలోను దాగుకొనిరి. అచ్చట సుకేశునికి మాలి, సుమాలి, మాల్యవంతు లను ముగ్గురు కుమారులు పుట్టిరి. మాలి పెద్దవాడైన పిమ్మట తన తండ్రి కపచారము చేసిన రాజును, నతని రాజ్యమును జయింపగోరి బయలుదేరెను. కాని యతడు యుద్ధమందు మరణించెను. అతని తమ్ముడగు సుమాలి కేకసి యనుదాని పెండ్లియాడి దానివలన రత్నశ్రవసుడు, భానుకర్ణుడు, విభీషణు డను కుమారులను, చంద్రనఖ యను కూతును కనెను. వీరి పూర్వికు డిచ్చిన నవరత్నముల హారము సుమాలి దగ్గఱ యుండెను. దాని నెవ్వరును నెత్తజాలకుండిరి. దానిని వేయి సర్పములు గావలి గాచి యుండెను. అట్టి వజ్రహారమును రత్నశ్రవసు డవలీలగా ధరించెను. ఆ నవరత్నములందీ బాలుని ముఖ ప్రతిబింబము జూచి తండ్రి సంతసించి యతనికి "దశముఖ" అను బిరుద మిచ్చెను. భానుకర్ణునికి కుంభకర్ణు డను పేరు వచ్చెను. మఱియు చంద్రనఖకు శూర్పనఖ యని పేరు వచ్చెను.

## ౨వ అధ్యాయము

## రావణుని దిగ్విజయము

దశముఖుడు పెద్దవాడై తపస్సుచేసి యనేక శక్తుల సంపాదించి మండోదరి యనుదాని పెండ్లియాడి ఇంద్రజిత్తను కొడుకును బడసెను. పిమ్మట లంకాపురమును సాధించి దాని కధీశ డయ్యెను. వానరరాజైన కిష్కిందుని కొడుకులగు అదిత్య రాజస్సు, రక్షరాజస్సు అనువారు నరకములో బడినవా రని విని యమరాజును పారదోలి వారిని వానరద్వీపమందు రాజులనుగా జేసెను. ఆదిత్య రాజస్సునకు ఇందుమతివలన వాలి, సుగ్రీవులు పుట్టిరి. రక్షరాజస్సునకు నలుడు నీలుడు పుట్టిరి. వాలి కిష్కింధ నేలెను. దశముఖుడు లంక నేలుచుండెను. దశముఖుడు వాలి పరాక్రమముల వినినవాడై యోర్వక యతనిపై యుద్ధమునకు బయలుదేరి యోడిపోయి బంధింపబడెను. పిమ్మట వాలి యతనిని విడిచిపెట్టి మేరు పర్వతముపై తపస్సు చేయబోయెను. సుగ్రీవుడు తన కూతురగు సుప్రభను దశముఖునకిచ్చి పెండ్లిచేసెను. దశముఖు డంతటితో నూరకుండక రత్నావళియను సందగత్తె నిత్యలోకమున నున్నదని విని దాని దెచ్చికొనదలచి పోవుచు మార్గమధ్యమందు వాలిని జూచి మేరువుక్రింద చేయిపెట్టి పర్వతముతో గూడ నతనిని గూల్పజూచెను. కాని వాలి తన బొటనవ్రేలితో పర్వతము నదుమగా క్రింద నుండిన దశముఖుడు పీడితుడై యనేక సంవత్సరములు రోదనము చేసెను. అందుచేత నతనికి రావణు డను పేరువచ్చెను. రావణు డెట్టకేలకు ముక్తినొంది మారుతరాయడు యజ్ఞముచేయుచుండ జీవహింస చేసినందులకు కుపితుడై యా యజ్ఞముల ధ్వంసము చేసెను. పిమ్మట నలకూబరు డను రాజు ప్రజాపీడకు డని విని వానిని శిక్షింప రావణుడు బయలుదేరెను కాని నలకూబరుని భార్యయగు ఉపరంభ తనభర్తను సన్మార్గమునకుద్రిప్పెద నని వేడుకొనగా రావణుడు క్షమించిపోయెను. పిమ్మట రదనపురరాజ గుణింద్రుని జయించెను. ఇంద్రు డింతవర కజేయుడుగా నుండి యిప్పు డోడిపోయిన వధ్యుడనుచుండ నొకముని యిట్లు చెప్పెను. "నీవు ఆనందమాలి భార్యయగు అహల్యను నవమానించియుంటివి గాన నీ కిప్పు డీ యవమానము కలిగినది." ఇట్లు దిగ్విజయోన్మత్తుడై రావణుడు దన రాజధాని కరుగుచుండ అనంతవీర్యుడను ముని యతనితో నిట్లనెను. "ఓయి, నీవు పరదారాసక్తుడ నగుటంజేసి నీ వింతలో వాసుదేవుని యంశసంభూతుడగు వాని భార్యను జెఱబట్టుదువు. దాని వలన నీకు మరణము వచ్చును". ఈ మాటలు విని రావణుడు కటకటపడి తన్నుతానై కోరని స్త్రీ నింక పొందనని రావణుడు శపథము చేసికొని పోయెను.

## ౩వ ప్రకరణము

## హనుమంతుని జన్మకథ

మహేంద్రపురమునకు మహేంద్రుడను రాజుండెను. అతనికి హృదయ సుందరి వలన అంజనాసుందరి యను కూతు రుద్భవించెను. అనేక రాజు లీ బిడ్డను వివాహమాడ గోరిరి. అందు ఇద్దరు మాత్రము మహేంద్రుని కిష్టులైరి. అందొకడు విద్యుత్ప్రభయను నతడు. అతడు ధనవంతుడు రూపవంతుడు కాని అల్పాయుష్మంతుడని విశదమయ్యెను. రెండవవాడు పవనాంజయుడు. అతడు విద్యలలో దక్కువ వాడైనను దీర్ఘాయుష్మంతుడగుటచే అంజనాసుందరి నాతనికే వివాహము నిశ్చయించెను. బంధువులందఱు విచ్చేసిరి. వివాహదివ సమున అంజనాదేవి చెలికత్తె యామెతో నిట్లనెను. 'అమ్మా' మనరాజు ఎంత పొఱపా టొనరించినాడు. ఉత్తమ నాయకుని వదలి సాధారణ నాయకుని నీకంట గట్టెనే. అమృత మొక దినమైన త్రాగిన మేలు. యావజ్జీవము విషము త్రాగుట పొసగునే' ఈ మాటను విని అంజనా సుందరి యేమియు ననలేదు. ఈ సంభా షణము పవనాంజయుని జెవిని బడెను. పెండ్లియైన వెంటనే భార్యనొక గదియం దుంచి యామెను బలుకరింపక పోయెను. అంత కొంతకాలమునకు రావణుడు వరుణునితో యుద్ధము జేయువాడై పవనాంజయుని సాయము కోరెను. పవనాంజ యుడు ప్రయాణమై పోవుచు మార్గమం దొక పెంటియంచ తనవిభుని ప్రవాస మునకు వగచుచు విరహతాప మొందుట గాంచి తన భార్య జ్ఞాపకమునకు వచ్చి వెంటనే తన నగరు చేరి అంజనా సుందరితో భోగించెను. పిమ్మట యదే రాత్రి తాను మరలి పోవునపుడు తన ముద్రాంగుళీయకమును నామెకు గుఱుతుగా నిచ్చి పోయెను. క్రమేణ ఆమె గర్భవతి యగుట అత్తమామలు చూచి అశ్చ ర్యాత్ములై యామె వ్యభిచరించెనని భావించి యెన్నిచెప్పినను వినక యామెను వెడల నడచిరి. ఆమె హనుపురమను పట్టణమందు నివసించుచుండ ఆమెకు కుమారు డుద్భవించెను. ఆ కుఱ్ఱనికి హనుమంతు డని జన్మస్థానపు బేరును బెట్టెను. భర్త యుద్ధము నుండి మరలివచ్చి భార్యవార్త విని చింతించి యామెను వెదకి మరల తన యింటికి బిలిచికొని వచ్చెను. హనుమంతుడు పెద్దవాడై తన తండ్రి వలెనే రావణునికి యుద్ధములందు జాల సహాయము చేసెను. రావణుడు ప్రీతుడై సత్యవతియను తన కూతురును అతని కిచ్చెను. శూర్పనఖ కూడ తన కూతురగు అనంతకుసుమ నతని కిచ్చెను. ఈ యిద్దఱు భార్యలతో హనుమంతుడు తన దేశమునకు మరలివచ్చినప్పుడు సుగ్రీవుడును, నలుడును తమ మిత్రుడగు

రావణునికి సాయపడినందున హనుమంతునికి తమ కూతుండ్రగు పద్మరాగను, హరిమాలిని వీరి నిచ్చి పెండ్లిచేసిరి.

## ౪వ ప్రకరణము

## శ్రీరాముని జననము

హిమచూడాదేవి భర్తయు, వజ్రబాహు పురందరుల తండ్రియునగు విజయుడు అయోధ్య నేలుచుండెను. వజ్రబాహునకు కీర్తిధరుడు. అతనికి కోసల, అతనికి హిరణ్యగర్భుడును బుట్టిరి. అతని తర్వాత ౨౭ గురు రాజులు రాజ్యము చేసిరి; కడపటివాడగు అనారణ్యుడు రఘురాయని కుమారుడు. అతనికి దశరథుడు పుట్టెను. ఇక్కాలమందొకనాడు రావణుడు వినోదార్థముగా నారదునితో నిట్లనెను. "ఓయి నారదా, నేనెప్పుడు మృతింతునో చెప్పగలవా". నారదుడు గుణించి యిట్లు చెప్పెను. "దశరథుని కొడుకును జనకుని కూతురును నీకు మరణమును ప్రసాదింతురు". రావణు డులికిపడెను. కాని విభీషణు డతని భయము బోనార్చి వారికి సంతానము కలుగక పూర్వము వారిరువురిని సమయింతును జూడుడని చెప్పి బయలుదేరెను. నారదు డంతకుమున్నే నీ యిద్దఱికీ వార్తనంపెను. దశరథుడును, జనకుడును భీతులై తమ సింహాసనములపై తమ విగ్రహముల నునిచి యిద్దఱును గలిసి యెటకో బోయిరి. విభీషణుడు వారి విగ్రహముల పగులగొట్టి తృప్తినొంది పోయెను. దశరథుడు తన నలుగురు భార్యలతో మగధ దేశము చేరెను. ఈ నలుగురి పేర్లు అపరజిత్, సుమిత్ర, కైకేయి, సుప్రభ. అందు కైకేయి యనునామె భర్తకు ప్రవాసమందొకయుద్ధమందు సాయపడుటజేసి భర్త ప్రీతుడై రెండు వరముల కోరుకొనుమనెను. కైకేయి కావలయువేళ కోరుకొందునని చెప్పెను. పిమ్మట దశరథునికి నల్గురు కుమారులు పుట్టిరి. అపరజిత్తునకు పద్ముడు పుట్టెను. ఇతడే రాముడు. సుమిత్రకు లక్ష్మణుడు పుట్టెను. ఇతడు నీలవర్ణుడు, విష్ణ్వవతారుడు. కాన నారాయణయను పేరుపొందెను. ఇతడే లక్ష్మణుడు. కైకేయికి భరతుడును, సుప్రభకు శత్రుఘ్నుడును బుట్టిరి. ఇక్కాలమందు జనకునికి వైదేహవలన సీతయను కూతు రుద్భవించెను. ఒకనాడు బర్బర దేశమందలి మయూరమాలకు రాజైన అతరంగమయను మ్లేచ్ఛుడు మిథిలపై దాడివచ్చెను. జనకుడు దశరథుని సాయముకోర రాముడు పోయి యతని నోడించెను. జనకుడు ప్రీతుడై సీత నిత్తునని మాటయిచ్చెను. తంటాలనారదుడు ఒకనాడు సీతను జూడవచ్చెను. నారదుని గడ్డము జడలు మున్నగు

భయంకర చిహ్నముల జూచి సీత బెదరి యింటిలో దాగుకొనగా మన కలహ భోజనుడు సందు దొఱికెనని భూమండల యను రాజును సీతను బలాత్కార ముగా నెత్తికొని పొమ్మని పురికొల్పెను. అతడట్లు చేయక తన దగ్గఱి ధనస్సును జనకునకు బంపి దానిని రాముడెత్తి బాణము సంధింప గలిగెనేని పెండ్లిచేయు మని చెప్పెను. రాముడా ధనుస్సు నవలీలగా నెత్తెను. సీతను పెండ్లి యాడెను. లక్ష్మణుడు విద్యాధరులలోని ౧౮గురి స్త్రీలను పెండ్లియాడెను. దశరథుడు వృద్ధుడై తన రామునికి రాజ్య మప్పగింపగోర కైకేయి తన వరములరీతి రాము నడవి కంపెను. సీతారామలక్ష్మణులు అడవిలో తిర్గి తిరిగి చిత్రకూటమును జేరిరి.

౫వ ప్రకరణము

## సీ తా ప హ ర ణ ము

అచ్చట నుండి విజయపురమును జేరిరి. అచ్చట నొక సుందరి లక్ష్మ ణుని వరించి యాతని మెప్పింపలేక యురివేసికొన దొడగెను. అప్పుడు రాముడు వారిరువురికి పెండ్లిచేసెను. క్షేమాంజలి యను రాజ్యములో జితపద్మయను రాకన్నియను లక్ష్మణుడు పెండ్లియాడెను. పిమ్మట దండకారణ్యమును ప్రవేశిం చిరి. అచ్చట శూర్పనఖ కుమారుడు శంబూకుడు తపస్సు చేయుచుండ లక్ష్మ ణుడు "చంద్రహాస"ముతో నతని జంపెను. శూర్పనఖ శ్రీరామునితో మొఱబెట్టు కొనబోయి యతని మోహించెను. మోహము విఫలమయ్యెను. ఆమె భర్తయగు ఖరుడువచ్చి రామునిచే చచ్చెను. రావణుడు తన చెల్లెలిని తృప్తిపఱచదలచి లక్ష్మణుడు లేని సమయములో దూరమునుండి లక్ష్మణుని వలెనే యార్తనాదము చేసెను. సీత రాముని లక్ష్మణ సహాయార్థ మంపెను. అంత రావణుడు సీత నెత్తుకుని విమానములో వెడలిపోయెను.

౬వ ప్రకరణము

## సీ తా న్వే ష ణ ము

రాముడు వెదకివెదకి విఫలుడయ్యెను. అంత నొక అసందర్భము జరి గెను. సహజజాతి అనువాడు సుగ్రీవునిభార్యయగు తారను ప్రేమించి మాయచే సుగ్రీవుని వేషముతో నామెతో క్రీడించెను. నిజసుగ్రీవుడు వచ్చి చూచిమాయా సుగ్రీవునితో తగవులాడి యోడిపోయి రాముని యాశ్రయింప నతడు యథార్థము నెఱిగి దొంగ మగని జంపి సుగ్రీవునికి రాజ్యమును తారను నిప్పించెను. పిమ్మట హనుమంతుడు లంకజేరి సీతను జూచిరావణుని కిరీటము తన్ని లంకలో గడబిడ జేసి తిరిగివచ్చెను.

## ౭వ ప్రకరణము

## యుద్ధకాండము

రావణుడు ఇంద్రజిన్నాగముతో రామసైన్యము గట్టెను. లక్ష్మణుడు తన గరుడవాహనమును పిలిచి నాగముల నాశనము చేసెను. రావణుడు లక్ష్మణునిపై శక్త్యాయుధమును ప్రయోగింప అతడు చచ్చినట్లు క్రిందబడెను. భామండలుడు "ద్రోణఘము" నుండి అమృతముతెచ్చి లక్ష్మణుని బాగుచేసెను. లక్ష్మణుడు అప్పుడు గరుడారూఢుడై తన చక్రముతో రావణుని తల దునిమెను.

## ౮వ ప్రకరణము

విభీషణుడు లంకకు రాజయ్యెను. కుంభకర్ణుడును, ఇంద్రజిత్తును చిన్న చిన్న రాజ్యములకు రాజులైరి. రాముడు పుష్పకవిమానములో అయోధ్య చేరెను. రాముడు పట్టాభిషిక్తుడయ్యెను. సీతతోడను, ప్రభావతి, రతినిభ, శ్రీదమయను తక్కిన ముగ్గురు భార్యలతోడను శ్రీరాములు సుఖముగానుండెను. లక్ష్మణుడు తన యెనమండుగురు భార్యలగు విశల్య, రూపావతి, వనమాల, కల్యాణమాలి, రత్నమాలిక, జితపద్మ, భయవతి, మనోరమయను వారితోడను, వారి ౨౫౦ పుత్రులతోడను, పైగా తన ౧౬ వేల యెక్కుడు భార్యలతోడను సుఖముగా నుండెను.

## లఘువిమర్శ

ఇది జైనరామాయణ సారము. స్థలసంకోచముచే ఇంకను కొన్ని విషయములు ప్రక్షిప్తము అయ్యెను. దీనివలన తెలిసికొనదగిన విషయములు కొన్ని కలవు. మనము జైనగ్రంథముల నవలోకనముచేయుట అవసరమయ్యెడి, మన మతమునకు విరుద్ధములైన బౌద్ధమతమును, జైనమతమును చార్వాకలోకాయత కాలవాదుల సిద్ధాంతములను మనము పాషండమతముల పట్టిలో చేర్చి నాస్తికులనియు, వేద విరుద్ధులు వేదబాహ్యులు వీరని నిందించియు నుపేక్షాభావమును జూపినారము. అట్లిక మీద చేయుట అహంభావచిహ్న మగును.

ఈ కథ వాల్మీకి రామాయణమునకు చాల భిన్నమై యున్నది. రాక్షసులకు వానరులకు సంబంధ ముండెనని తెలియుచున్నది. సీత అయోనిజ కాదు. రాము డేక పత్నీవ్రతుడు కాడు. హనుమంతుడు నిత్యబ్రహ్మచారి కాడు. రావణు డొక్క స్త్రీ లోలత్వమందు తప్ప తక్కిన విషయములం దాదర్శప్రాయుడే.

రాజులకు స్త్రీసంగతి నాటికిని నేటికిని మిక్కుటము. కాని రావణుఁడెన్ని చేసినను సీతాపచారకుడు కాకుండిన నిప్పటికి యనేక విటరాజులవలె, రాజవిటులవలె నిందాస్పదుడు కాకుండెడివాడు. ఆత డహింసాప్రియుడు. యజ్ఞములందు హింస యుండుటచే యజ్ఞధ్వంసి యయ్యెను. కాని వాల్మీకులవారు వేదమతద్వేషి యనియు, మునిహింసకు డనియు తన కలము యొక్క మసిచే రావణునిముఖ మును నల్లగ చిత్రించెను. లక్ష్మణునికి ఎనమండుగురు పట్టపు భార్యలట ౧౬ వేలుపై పెండ్లాలట! ఈ గుంపునంతయు భాగవతమందు శ్రీకృష్ణులవారి కంట గట్టినారు. ఈ బేర మే పౌరాణికునివలన జరిగెనో దురూహ్యము. ఇచ్చట లక్ష్మ ణుడే గరుడవాహనుడు. చక్రి రావణాంతకుడు. మఱియు నారాయణావరావతా రుడు. ఇందు మారీచి లేడు. బంగారుజింక అసలే లేదు. ఇందలి వంశావళులు వాల్మీకులవారి వంశావళులతో భేదించుచున్నవి. శంభూకుడు శూర్పణఖ పుత్రు డనియు నతనిని లక్ష్మణుడు వధించెననియు నిందున్నది. శంబుకు డను శూద్ర తపసిని రాముడు ఖండించెనని యుత్తరరామాయణమున నున్నది. శూద్రుల తపస్సు అంత యోర్వరానిదై యుండెనే?! "దశముఖ"యను పదమున కుత్పత్తిహేతు విందు చాల సమంజసముగా గనబడుచున్నది. జైన రామాయణ మందు కుంభకర్ణుడును, ఇంద్రజిత్తు మరణింపలేదు. మఱియు సంజీవిపర్వత మును హనుమంతుడు తెచ్చెనన్న దిచట కల్ల. భామండలుడు (ఇతడెవడో?) అమృతమును దెచ్చెనని యున్నది. రావణుడు తపస్సు మహేశ్వరునిగూర్చి చేసె ననియు, చేతులదురద వదలనట్లు కైలాసముపై బొటనవ్రేలితో శివుడే యదిమె ననియు మనము వినిన సంగతి. ఇందు వాలిచే నడచబడెనని యున్నది. మఱియు నీ జైనరామాయణములో నహింసావిషయమును, రావణుని యజ్ఞధ్వంసకత్వమును తెలుపుట జైనసిద్ధాంత ప్రచారమునకై చేసియుందురు. మహేశ్వరునికి మారుగా నిచ్చట ప్రతిఘట్టమందు జిననాథుని పేర్కొనియున్నారు. ఇదియు మతప్రచా రార్థమే యుండనోపు. ఈ రామాయణములో విశ్వసనీయవిషయము లనేకము లున్నవి. వాల్మీకి రామాయణమందు రాముని నాదర్శపురుషునిగా జేయుటకై యేకపత్నీవ్రతునిగా జేసియుందురు. మఱియు రావణుని సర్వదుర్మార్గునిగా జేయుటకై యతని గుణపోషణమందు చాల పక్షపాతము చేసియుందురు. ఇది హిందూమత సంప్రదాయమేకాని యట్లుచేయుట చరిత్రకు నష్టము. విద్వ ద్వరేణ్యు లీ జైనరామాయణము నింకను విమర్శించి యథార్థముల నిర్ణయింతురు గాక.

—సురవరము ప్రతాపరెడ్డి*

---

*సుజాత. జూన్ 1927. హైదరాబాదు.

# ఆంధ్రదేశంలో సాహిత్య సంఘాలు

ఒంటరిగా నా గదిలో కూర్చుండి జ్ఞాపకాలు మాత్రమే ఆధారంగా పత్రికలకీ, పుస్తకాలకీ,తదితర-దస్తావేజులకీ దూరంగా, ఎవరి సలహా లేకుండా ఈ సమీక్ష. ఇరవయ్యో శతాబ్దపు తెలుగు సాహిత్య సంఘాలని గురించిన ఈ సమాలోచన బూనడం సాహస కృత్యమే కావచ్చును. కాని ఎవరో ఒకరు ఎప్పుడో ఒకప్పుడు తెగించాలి. ఎక్కడో ఒకచోట ప్రారంభించాలి, అన్నీ హంగులూ కుదిరిన తర్వాత అంత సామగ్రీ పోగుచేసిన పిమ్మట, నిరుపహతి స్థలంబు మొదలైనవి చూసుకొని కృతులు రచించడం చాలా బాగుంటుంది. (కృతులు సమీకృతులు కూడా కృతులే.) ఇచ్చేవాళ్ళుంటే అడిగేవాళ్ళకే కొదవా? సాహిత్య సంఘాలమీద సమగ్ర వివేచన జరపడానికిగాను ప్రస్తుతం నాకొక పెద్దలైబ్రరీ కావాలి, అందులో ఈ శతాబ్దపుదినపత్రికల ఫైల్సు (ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, జనవాణి, జన్మభూమి, ప్రజాశక్తి, మొదలైనవి) ఉండాలి. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపుటాలు, పరిషత్తు తరపున అచ్చుఅయిన, అచ్చుకాని పుస్తకాలూ ఉండాలి. మద్రాసు యూనివర్సిటీ ఆంధ్ర, మైసూరు, అన్నామలై ఉస్మానియా మొదలైన విశ్వవిద్యాలయాలు తెలుగుకోసం చేసిన పనులను వివరించే పుస్తకాలన్నీ ఉండాలి, ఈ విశ్వవిద్యాలయాలకి చెందిన కాలేజీలలో తెలుగు సాహిత్యం ఏయే విధాల వికసించిందో, ముకుళించిందో విశదంచేసే దస్తావేజులన్నీ కావాలి. కాలేజీలలోనే కాక హైస్కూళ్ళలోనూ, ఆఖరికి అరుగులమీద బడులదాక అన్ని పాఠశాలలలోనూ తెలుగు పండితులూ, కవులూ, రచయితలూ పడ్డపాట్లకు సాక్ష్యం ఇచ్చే సామగ్రీ యావత్తూ కావాలి. (నాకిప్పుడు హైస్కూలు పండితులుగా తమ యౌవనాన్ని కర్పూరంవలె ఖర్చుపెట్టిన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రీ, మారేపల్లి రామచంద్రశాస్త్రీ* కనబడుతున్నారు. ఇంకా నాకళ్ళబడనివాళ్ళు ఎందరో ఉన్నారని ఎరుగుదును.)

నా జాబితా ఇంకా పూర్తి కాలేదు. ఆంధ్రసాహిత్య పరిషత్తును ముందుగా స్మరించడం జరిగింది. కాబట్టి ఆ వెంటనే నవ్యసాహిత్య పరిషత్తు, అభ్యుదయ రచయితల సంఘం రావాలి. ఇవి అఖిలాంధ్ర పరిషత్తులు. ఇవి కాక ఇంచుమించు అఖిలాంధ్ర—(అంతేకాదు అఖిల భారత—) విఖ్యాతి పొందిన సాహితీ సమితి, కవితా సమితి, సారస్వతసమాజం యువకవిమండలి మొదలైన సంస్థ

లున్నాయి. అవి చేసిన పనులూ, రాసిన రాతలూ, విశదంచేసే పరికరాలు నా లైబ్రరీలో అందుబాటుగా ఉండాలి. అనగా సాహితి, సఖి, వైశాఖి, కవిత మొదలైన పత్రికలూ, అనేక గద్యపద్య గ్రంథాలూ! నవ్యసాహిత్య పరిషత్తు తరపున వెలువడ్డ "ప్రతిభ" సంపుటాలూ, గి. రామమూర్తి వర్ధంతి సంచికా, పరిషత్ ప్రచురణలూ, కరపత్రాలూ కావాలి. అభ్యుదయ రచయితలు వెలువరించిన "తెలుగుతల్లి" "అభ్యుదయ" పత్రికల సంపుటాలూ కావాలి. అన్నట్టు ఆంధ్ర భారతీ తీర్థసేవ మరచిపోకూడదు.

ఏదో ఒక సంఘం తరపున వెలువడకపోయినా వ్యక్తి స్వాతంత్ర్య సూత్రాన్ననుసరించి జనించి, సాహిత్యానికి మహోపకారం చేసినవీ, చేస్తున్నవీ, అన్ని సంఘాల దృక్పథాన్నీ ఆదరిస్తున్నవీ అనేక పత్రిక లున్నాయి. అవి కళ (పా. వెం. రాజమన్నారు సంపాదితం), శారద (కౌతా శ్రీరామశాస్త్రి), భారతి కాశీనాథుని నాగేశ్వరరావు మొదలగువారు), జయంతి (విశ్వనాథ సత్యనారాయణ), జ్వాల (ముద్దుకృష్ణ), ఉదయిని (కొంపెల్ల జనార్దనరావు), వీణ (పాటిబండ మాధవశర్మ), నా లైబ్రరీలో ఈ పత్రికల సంపూర్ణసంపుటాలు తప్పకుండా ఉండితీరాలి. ఇవి లేనిదే సాహిత్య సంఘాలని సమీక్షించడం అసంభవం.

ఇంచుమించు ఇరవయ్యో శతాబ్దంతో పుట్టి దానితోబాటు ఎదుగుతూ వస్తున్న "కృష్ణాపత్రిక" సంపుటాలకోసం నాలైబ్రరీలో ప్రత్యేకం ఒక బీరువా ఉండాలి. మంచి గంధపు చెక్కలతో దాన్ని తయారుచేస్తే మరీ మంచిది.

ఇవేకాక ఇంకా—బరంపురం, విజయనగరం, విశాఖ పట్టణం, కాకినాడ, రాజమహేంద్రవరం, ఏలూరు, బెజవాడ, తెనాలి, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం, అన్నట్టు మద్రాసు, హైదరాబాదు, బెంగుళూరు, నాగపూరు, రంగూను, మొదలైన చోట్లనుండి వెలువడినంత కాలం వెలువడి ఆగిపోయి, మళ్ళీ వెలువడి, ఆగిపోయి, మరోపేరుతో వెలువడి, ఆగిపోయి, మళ్ళీ వస్తున్న పత్రికలన్నీ కావాలి పైని చెప్పిన, చెప్పమరచిన ఊళ్ళలో ప్రకటించబడిన గ్రంథాలన్నీ ఈ లైబ్రరీలో ఉండాలి. అచ్చుయంత్రపు ఔరస పుత్రికలైన వేగుచుక్క, హితకారిణి, ఆంధ్రప్రచారిణి. సరస్వతీ గ్రంథమాలాదుల ప్రచురణలన్నీ నా లైబ్రరీలో దొరకాలి.

పుస్తకాల పత్రికల జాబితా (నాకు తెలుసు ఇది అసమగ్రమని?) ఇంతటితో చాలించి నాకు కావలసిన లైబ్రరీ ఇంకా ఎలా ఉండాలో చెపుతున్నాను.

ఆంధ్రదేశంలోని అనేక గ్రంథాలయాలలాగ కాక ఈ లైబ్రరీకి ఒక క్రమపద్ధతి, కాంతి, నీటుదనం, ప్రశాంతి ఉండాలి. నేను పనిచేసుకొనే లైబ్రరీహాలు ఎలా ఉండాలో ప్రత్యేకంగా వర్ణించను, గోడలమీద చిన్నయసూరి, కొక్కొండ, వీరేశలింగం, సాంఖ్యాయన శర్మ, వేదం వేంకటరాయశాస్త్రి, ఆదిభట్ల నారాయణదాసు, జయంతి రామయ్య, అక్కిరాజు ఉమాకాంతం, కొమర్రాజు, గిడుగు, గురజాడ, మొదలైనవారి తైలవర్ణ చిత్రాలు (నిలువుటద్దం సైజులో) ఉండాలని మాత్రం నిష్కర్షగా చెప్పి ఊరుకుంటాను. "ఊహతెలియంగల లేఖక పాఠకోత్తములు'' అక్కరలేదు. నారాత నేనే రాసుకుంటాను అచ్చులో దాన్ని పాఠకులు చదువుకుంటారు. అయితే నేను తెమ్మన్న పుస్తకాన్ని ఆలస్యం చెయ్యకుండా తీసుకురావడాని కొక మనిషి కావాలి. మామూలుగా సిగరెట్లూ, కాఫీ తెచ్చేవాడికన్నా ఎక్కువ తెలివితేటలూ చదువూ ఇతని కవసరంలేకుంటే, సర్వత్రా విజ్ఞానపు వైశాల్యం విస్తరించిన సమాజం ఏర్పడేదాకా నా సమీక్షకి వాయిదా వెయ్యవలసి వస్తుంది. అయిందా మరి, నేను రాసుకుంటున్నప్పుడు గొడవచెయ్యకుండా, నా తీరుబాటు సమయాన్ని కనిపెట్టి నా యువక స్నేహితులు నాతో ముచ్చటిస్తూ ఉండాలి. వాళ్ళంతా, నేనేదో బ్రహ్మాండమైన పని చేస్తున్నట్లు ఆంధ్రదేశం అంతటా ఒకపెద్ద భ్రాంతిని పత్రికలద్వారా, పుకారుల ద్వారా ప్రచారం చెయ్యగల సరసులై ఉండాలి.

ఇచ్చేవాళ్ళు లేరని తెలిసికూడా ఇన్ని కోరుతున్న నేను ఇస్తారని తెలిస్తే ఇంకా ఎన్ని కోరగలనో పాఠకుల ఊహకి వదలివేస్తున్నాను.

మరోమారు చెపుతున్నాను. ఈ వ్యాసానికి చదివిన, జీవించిన నా జ్ఞాపకాలు మాత్రమే ఆధారం. తారీఖులూ, దస్తావేజులూ లేని ఈ సమీక్ష అవశ్యం అసమగ్రం, కేవలం వ్యక్తిగతం. సాధ్యమైనంతవరకు సత్యానికి హాని రానీయకుండా చూడాలని నా సంకల్పం. అభిప్రాయాలవిషయంలో వాటికి నా చిత్తశుద్ధి ఒక్కటే హామీ. ఇక ప్రారంభిస్తున్నాను.

ఆంధ్రదేశంలో మొట్టమొదటిగా చెప్పుకోదగ్గ సాహిత్యసంస్థ ఆంధ్ర సాహిత్య పరిషత్తు. బహుశా ఇది ఈ శతాబ్దపు ప్రారంభంలోనో, క్రితం శతాబ్దపు తుదిలోనో ఏర్పడి ఉండాలి. దీని పుట్టుపూర్వోత్తరాలు నాకే కాదు ఎవరికీ తెలియవనుకుంటాను. ఇది ఎక్కడ ఎప్పుడు ఎలా ప్రారంభమయిందో ఎవ్వరూ చారిత్రక ప్రమాణాలతో ఇంకా రాసినట్లులేదు. బహుశా మద్రాసు విశ్వవిద్యాలయంలో కొన్ని విప్లవాలు రాబోతున్నవని తెలిసి వాటిని అరికట్టడానికి ఈ పరి

షత్తు ఏర్పడి ఉండాలి. నాటినుండి నేటిదాకా దీని ప్రధానాశయం తెలుగు సరస్వతిని కొత్త భావాల బారినుండి రక్షించడంలాగ కనబడుతుంది. అధికారంలో ఉన్న ప్రభుత్వపుటండ చూసుకొని మార్పు వెల్లువకు ఆనకట్టలు కట్టడం అభివృద్ధి నిరోధకుల ముఖ్యలక్షణం. విప్లవపు వరదలో అతఃపూర్వం అధికారంలో ఉన్న ప్రభుత్వం కొట్టుకుపోయి కొత్తప్రభుత్వం రావడం, ఇదివరకు వెలివేయబడ్డ భావాలు ఈ కొత్తప్రభుత్వం గొడుగుకింద రాజ్యం చెయ్యడం, విధిగా ఈ భావాలకి ముసలితనం వచ్చి యువకభావాలను కారాగృహంలో వెయ్యడం, ఆ కారాగృహాల్లోనే ఇంకో సరికొత్త ప్రభుత్వానికి ప్రాతిపదికలు ఏర్పడడం జీవితానికి పరిపాటి.

సాహిత్య సమాలోచనలో రాజకీయపరిభాష వాడుతున్నందుకు నేను క్షమాపణ చెప్పుకోదలచుకోలేదు. "మేము సాహిత్యవేత్తలం, మాకూ రాజకీయాలకీ సంబంధం లేదు" అనేవాళ్ళ సంకుచిత దృష్టికి నేను జాలిపడడం మానలేను. సాహిత్యానికీ రాజకీయాలకీ అవినాభావసంబంధం ఉంది. ఈ సంగతి ఎంత పెందరాళే గుర్తిస్తే అంత మంచిది.

రాజకీయ సమస్యలంటే జీవితసమస్యలు. సాహిత్య సమస్యలుకూడా అంతే. రాయలసీమలో కరువుకీ, ఆకలిలో అర్ధానుస్వారానికీ ఉన్న సంబంధాన్ని గుర్తించలేనివాళ్ళతో వాదించి ప్రయోజనంలేదు. నా ఆకలిలోనుంచి అరసున్నను బహిష్కరించాను. ఈ దృక్పథంతో నన్ను పనిచెయ్యనిస్తే రాయలసీమనుంచి కరువునుకూడా తరిమికొట్టగలను. అయితే ఆ కరువూ ఈ అరసున్నా అలాగే ఉండడం కొందరికి అవసరం.

ఈ అవసరాన్ని అంటిపెట్టుకున్న ఆంధ్ర సాహిత్య పరిషత్తులో గిడుగు వెంకటరామమూర్తి సాగించిన పోరాటమే ఈ శతాబ్దపు ఆంధ్ర సాహిత్య చరిత్ర. ఎవరికి చెవుడు? గిడుగు పంతులుకా? లేక అతని మాటలను చెవిని బెట్టమని భీష్మించుకు కూర్చున్న విశ్వవిద్యాలయాధికారులకా?

ఆంధ్ర సాహిత్య పరిషత్తుకీ అప్పటి ప్రభుత్వానికీ ఉన్న సంబంధం చప్పున గోచరించేదికాదు. నిజంగా ఆ రెండిటిమధ్యా లండనీకీ కాకినాడకీ ఉన్నంత దూరం ఉంది. మద్రాసు విశ్వవిద్యాలయం అధికారసంస్థ. ఆంధ్ర సాహిత్య పరిషత్తు అనధికార సంస్థ. అయితేనేం ఈ రెండూ తెలుగు సాహిత్యపు అభివృద్ధికి అడ్డంగా నిలుచున్నాయి. మద్రాసు యూనివర్శిటీ అశ్రద్ధవల్ల; ఆంధ్ర సాహిత్య పరిషత్తు అవివేకంవల్ల.

అవివేకం అనే ఘాటయినమాట ఆంధ్ర సాహిత్య పరిషత్తు విషయంలో ఉపయోగించక తప్పిందికాదు. క్రొత్త భావాల ప్రవేశానికి తలుపులు తెరవడం నిరాకరించిన పరిషత్తుది అవివేకం కాకపోతే మరేమిటి? అందుకే దానిమీద తిరుగుబాటుగా నవ్యసాహిత్య పరిషత్తు ఏర్పడింది.

ఇంతటితో ఆంధ్ర సాహిత్య పరిషత్తు ప్రసక్తి వదలిపెట్ట వచ్చునుగాని ఆదంటే నాకు పూర్తిగా అనిష్టం అనే అపార్థం పాఠకులకు స్ఫురించ వచ్చును. పక్షపాత బుద్ధితో పరిషత్తుమీద దుమ్మెత్తి పోస్తున్నాననీ, పెద్దలపట్ల అవినయం ప్రదర్శిస్తున్నాననీ కొందరనుకోవచ్చును. అందుచేత ఆంధ్ర సాహిత్య పరిషత్తులో అమూల్యములని నేను భావించే అంశాలనుకూడా ఇక్కడ పేర్కొన వలసి ఉన్నది.

వాటిలో ముఖ్యమైనది సాహితీపరులు ఒక సంఘంగా ఏర్పడ వలసిన ఆవశ్యకతను ఆంధ్ర సాహిత్య పరిషత్తు మొట్టమొదట గుర్తించడం. ఈ నలభై యేభై ఏళ్ళలో ఆంధ్ర సాహిత్య పరిషత్తు కేవలం ఆటంకాలు కల్పిస్తూనే కూర్చోలేదు. అన్ని సంఘాలు మొదట సంకల్ప శుద్ధితోనే ఏర్పడతాయి. యౌవనం కాలక్రమాన వార్ధక్యంగా మారక తప్పదు. కాని ఈ వార్ధక్యంలో లాలిత్యం లేకపోవడమే తప్పు. రాను రాను స్వప్రయోజనాలు ఘనీభవించి, ఎదిగివస్తూన్న నూతన భావాల సౌందర్యాన్ని గుర్తించలేని గుడ్డితనం ఒకటి ఈ వార్ధక్యానికి పుట్టుకొస్తుంది. గాంధీజీవలె, గిడుగు రామమూర్తివలె శరీరం ముడుతలు పడుతున్నా మానసిక నైర్మల్యం మసక బారకుండా వయోవృద్ధులు కాగలిగినవారు అరుదు.

ఒక్క శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యం ప్రచురించినందుకే పరిషత్తు జన్మ సార్థక మయిందని నే నొప్పుకోగలను. దీనితోబాటు పరిషత్తు యాజమాన్యం కింద సూర్యరాయాంధ్ర నిఘంటువు వెలువడబోతోంది కదా? ఆ నిఘంటువు రావడం ఆంధ్రభాషకి ఎంతైనా అవసరం. కాని దాని నిర్మాణం వెనుక నున్న మనస్తత్వమే ఆ నిఘంటువు ఇంకా పూర్తికాకపోవడానికి కారణమని ఎందరు గుర్తిస్తున్నారు? మడికట్టుకున్న మాటలను మాత్రమే మానిఘంటువు లోకి రానిస్తామంటారు. ఏది మడి? ఏది కాదు? అనే తర్జన భర్జనలతో ఇంత వరకు కాలం గడచిపోతోంది. ఈ లోపున దేవాలయాల తలుపులు హరిజనులకు తెరుచుకుంటున్నాయి. ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీవారి ఆంగ్ల నిఘంటువు ఉదాహరణ మన కళ్ళముందు కనబడుతూనే వుంది.

సమగ్రమైన ఆంధ్ర నిఘంటువు వెలువడక పోవడమే, సంపూర్ణమైన ఆంధ్ర వ్యాకరణం లేకపోవడానికికూడా కారణం.

లాభంలేదు. ఆంధ్ర సాహిత్య పరిషత్తుని మెచ్చుకోవడం నాకు చేతకాదు. బహుశా నా మనస్తత్వమే ఇందుకు నాకు అడ్డుపడుతున్నట్లుంది. ఎంత నిష్పాక్షికంగా ఉండాలనుకున్నా ఆంధ్రసాహిత్య పరిషత్తు చెయ్యగల స్థితిలో ఉండీన్నీ చెయ్యడం మానిన పనులే నాకు జ్ఞాపకం వస్తున్నాయి. ఏదీ నిఘంటువు ? ఏదీ వ్యాకరణం ? ఏదీ ఆంధ్ర సాహిత్య చరిత్ర ? మళ్ళీ అడుగుతున్నాను ఏదీ నా లైబ్రరీ ? ఆంధ్ర విశ్వవిద్యాలయం చేస్తుందనుకొని సాహిత్యపరిషత్తూ, పరిషత్తు చేస్తుందనుకొని విశ్వవిద్యాలయం ఆదమరచి నిద్రపోయి నట్టుంది.

చైనాదేశపు ఉద్యోగస్తులను గురించి చాంగ్‌కై-షేక్‌సతి ఇలా అంది :

"They are an army of unemployables. Lazy lot all of them but are nevertheless not ashamed to draw their unearned salaries* (సరిగ్గా ఈ మాటల్లోకాదు, భావం మాత్రం ఇవే )

ఇంతటితో ఆంధ్ర సాహిత్య పరిషత్తుని వదలి నవ్యసాహిత్య పరిషత్తు వైపు మళ్ళవలసిందే గాని ఈ రెంటింటికిమధ్య సాహితీసమితి, కవితాసమితివంటి సమూహాలను కొన్నిటి నిక్కడ స్మరించవలసిన అగత్యం ఉంది. నిజానికి ఆంధ్ర సాహిత్య పరిషత్తుకంటే ఈ సంఘాలే కేవలం సాహితీ స్నేహాన్ని పురస్కరించుకొని ఏకీభవించి సృజనాత్మకమైన సారస్వతసేవ చేశాయని చెప్పాలి. సాహితీసమితి సమగ్ర చరిత్రను నోరి నరసింహశాస్త్రి రచిస్తున్నట్టు విన్నాను. ఆంగ్లంలో ఆయన వ్రాసిన వ్యాసం ఒకటి "త్రివేణి" పత్రికలో చదివాను. సాహితీసమితి పుట్టుక తెనాలిలో అని కొందరూ, గుంటూరులో అని మరికొందరూ, అబ్బే మా రాజమండ్రిలో అని ఇంకొకరూ అంటారు. దీనికొక రాజ్యాంగ చట్టం ఉన్నట్టు కనబడదు. ఉండ నక్కరలేదు కూడా. నలుగురు మిత్రులు కలుసుకున్నప్పుడల్లా సాహితీ సమితి అవతరిస్తుంది. నేను కలంపట్టిన కొత్త రోజుల్లో సాహితీ సమితి అంటే నాకు ప్రాణం లేచివచ్చినట్టుండేది. అందులో సభ్యుణ్ణి కావడం ఎలాగో ఎవరికి ఉత్తరం రాయడమో తెలియకపోబట్టి గాని

*ఫౌజు ఫౌజంతా ఉద్యోగానికి అనర్హులు, పిసరంత పనిచెయ్యలేని బద్ధకం. అయినా తమ ఆర్జించని జీతాల నందుకోవడానికి వీళ్ళకి సిగ్గనిపించదు.

లేకపోతే ఒక అర్జీపెట్టుకొనే వాణ్నే ! శ్రీరంగం శ్రీనివాసరావు (సాహితీసమితి) అని అచ్చులో చూసుకోవాలని నాకు చాలా ఉబలాటంగా ఉండేది. నాలోనూ పురిపండాలోనూ ఉండిన ఈ ఉబలాటమే "కవితా సమితి" స్థాపనకి కారణమని ఇప్పుడు వెనక్కి చూసుకొని ఆలోచిస్తే అనిపింపుతోంది. శ్రీరంగం శ్రీనివాస రావు, బి. ఎ. కంటెకూడా శ్రీశ్రీ (కవితా సమితి) అనుకోవడమే నాకు బాగుం డేది. ఒకటి రెండుమార్లు కాబోలు శ్రీరంగం శ్రీనివాసరావు, బి ఏ. (కవితా సమితి) అని నా రచనలకి సంతకం చేశాను. ఈ రకం ప్రదర్శన ప్రియత్వం ఇప్పుడు నాలో పూర్తిగా ఇంకిపోయిం దనుకుంటాను.

కళ్ళు మూసుకొని సాహితీ సమితి గురించి జ్ఞాపకం తెచ్చుకోబోతే నాకు కనబడేవి మూడు ముఖ్యాంశాలు. ఒకటి : గిడుగు వెంకటరామమూర్తితో సమితి సభ్యులు కలిసి తీయించుకున్న ఫోటోగ్రాఫు. రెండు : ఆంధ్రదేశం అంతటా ఆధునిక కవిత్వాన్ని గానం చేస్తూ కృష్ణశాస్త్రి కావించిన జైత్రయాత్ర. మూడు: చెన్నపట్టణంలో శివశంకరశాస్త్రి చేసిన సాహిత్యోపన్యాసాలను ఆంధ్రపత్రికలో చదవడం. ఆ రోజుల్లో అక్కిరాజు ఉమాకాంతం "నేటికాలపు కవిత్వం" అనే పుస్తకం ప్రయోగించాడు. అందులో కవి శబ్దవాచ్యుడైన ప్రతివాణ్నీ ఆయన ఎడా పెడా వాయించి వదలిపెట్టాడు. అదేం చిత్రమో కాని అతను ఎవరెవరిని మరీ ఎక్కువగా దులిపేశాడో వాళ్ళ కవిత్వంమీదనే నా అభిమానం ఎక్కువయింది. తర్వాత కొంతకాలానికి Max Nardan వ్రాసిన Degeneration అనే గ్రంథం చూశాను. ఆంధ్ర భావకవుల మీద అక్కిరాజు ఉమాకాంతంకన్నా తీవ్రంగా నోర్డోపండితుడు యూరోపియన్ నవ్యకవులమీద విరుచుకుపడ్డాడు. అతను తిట్టిన కవులందరి రచనలు సంపాదించి అతిమధురంగా ఆస్వాదించాను. "Max Nardan నోరు నొక్కినవాణ్ణి నేనే" అనియెక్కడో బెర్నార్డుషా ప్రకటించాడు ఒక అమెరికన్ పత్రికల్లో నోర్డో గ్రంథాన్ని రివ్యూచేస్తూ బెర్నార్డుషా నవీన కవిత్వాన్ని సమర్థించాడు.

అయితే మహాపండితుడైన అక్కిరాజు ఉమాకాంతం సవాలుకి సాహితీ సమితి విమర్శాత్మకమైన గ్రంథరూపంలో జవాబు చెప్పలేకపోయింది. "కొన్ని సందేహాలు" అని కృష్ణాపత్రికలో చింతాదీక్షితులు సరళంగా,సరసంగా హేళన చెయ్యడం మినహాయిస్తే ఎవ్వరూ విమర్శకి సాహసించలేదు. పండితుడు తిడుతూఉంటే కవి ఏంచెయ్యాలో చూపించినవాడు కృష్ణశాస్త్రి. "ఇదీ మాకవిత్వం

ఏమంటారు మీరు?" అని ప్రజల్లోకి ఆధునిక కవిత్వాన్ని తీసుకువెళ్ళాడు. ప్రజలు హర్షించారు. "వీళ్ళంతా మావాళ్ళే" అని చెన్నపట్టణములో శివశంకర శాస్త్రి ఉపన్యసించడంతో నేటి కాలంలోకూడా కవిత్వం సజీవంగానే ఉందని స్థిరపడింది. ముద్దుకృష్ణ "వైతాళికులు" అచ్చువేసి ఆధునిక కవిత్వానికి కొక గ్రంథరూపం ఇచ్చాడు. ఔమాకాన్తులకి అదే జవాబు.

ఈ లోపున విశాఖపట్టణంలో నేనూ, పురిపండా అప్పలస్వామీ, వడ్డాది సీతారామాంజనేయులు కలిసి "మనం కవితా సమితి" అనుకున్నాము. అధ్యక్ష స్థానంలో ఒక పెద్ద పేరు ఉండడం మాకు అవసరమనిపించింది. అడగ్గానే అంగీకరించారు "కవిగారు" (మారేపల్లి రామచంద్రశాస్త్రి) కార్యదర్శకత్వం పురిపండా అప్పలస్వామిది. కవితాసమితి ఏంచేసిందో మానిందో నాకు తెలియదు గాని ఎవరూ చెయ్యని పనులు మాత్రం చెయ్యాలని మాకుండేది. అందుకే పురిపండా అప్పలస్వామి "అఖిలాంధ్ర కవుల ఛాయాచిత్ర ప్రదర్శనం" ఏర్పాటు చేసి దిగ్విజయంగా జరిపించాడు. కవిగారి షష్టిపూర్తి ఒక కొత్త ఐడియా. కవితా సమితి వార్షికోత్సవాలు మహోత్సాహంగా జరిగేవి. ఒక వార్షికోత్సవానికి ఆచంట వెంకటరాయ సాంఖ్యాయన శర్మని అధ్యక్షునిగా ఎన్నుకున్నాం. "పెద్ద అధ్యక్షోపన్యాసం తయారు చేస్తున్నాను. నా జీవితంలో చెప్పదలచుకున్న వన్నీ ఒక్కుమ్మడిగా చెప్పబోతున్నాను" అన్నాడాయన కాని మా దురదృష్ట వశాత్తూ వార్షికోత్సవానికి ముందుగా ఆయన మరణించాడు. సాంఖ్యాయన శర్మ స్థానే గిడుగు వెంకట రామమూర్తిని ఆహ్వానించాం. ఆయన అధ్యక్షత వహించిన సభకి విశాఖపట్టణంలో ఏ రాజకీయ సమావేశానికి రానంతమంది జనం వచ్చారు.

ఈనాడు కవితాసమితి నామమాత్రావశిష్టంగా ఉంది. మారేపల్లి రామచంద్ర శాస్త్రి ఒంటరిగా అచ్చతెలుగు "నుడికడలి" ని మథిస్తున్నాడు. సెట్టి లక్ష్మీనరసింహం "ఐస్తీమీద సవాల్" అని వాడుక భాషకోసం పడుచుతనంలో నడుం బిగించినవాడు "ప్రాయమింతకు మున్నెకై వ్రాలకుండ" జయపురాధీశ్వరుని అంతరంగిక కార్యదర్శి అయి "ప్రభాస శాపవిమోచనము" అనే ప్రబంధం రచించి మరణించాడు. పురిపండా దగ్గరనుంచి అప్పుడప్పు డొక ఉత్తరం వస్తుంది. అక్కడక్కడ ఒక పద్యం కనబడుతుంది. వడ్డాది సీతారామాంజనేయులు ఇంకా ఇప్పటికీ అష్టావధానాలూ, శతావధానాలూ చేస్తున్నాడను కొంటాను. మరి నా మాట! సరే, నా మాటకేం: ప్రస్తుతం రాస్తున్నది సాహిత్య సంఘాలను గురించి.

సారస్వత సమాజం. యువకవి మండలి. ఆంధ్రభారతి తీర్థ! ఇంకా ఎన్నో పేర్లు. వీటిలో కొన్ని స్థానిక ప్రాముఖ్యం మాత్రమే సంపాదించినవి. ఆంధ్ర భారతీ తీర్థ అందుకోవడానికి సాధ్యంకాని ఆశయాలలో ఏర్పడింది. తానే ఒక విశ్వవిద్యాలయంగా ప్రవర్తించదలచుకొంది. స్నాతకోత్సవాలు బిరుద ప్రదానాలు మొదలైనవి జరిపించింది. ఆంధ్ర భారతీతీర్థ ప్రధాని బుర్రా శేషగిరి రావు విచిత్రవ్యక్తి; ఈయనలో Don quixote అంశకొంత Peter Pan అంశ కొంత ఉంది. చిన్నపిల్లలు ఆటాకు బొమ్మల పెళ్ళిళ్ళు చేసేటప్పుడు చూపించే ఉత్సాహమూ, ఏకాగ్రత ఆంధ్రభారతీ తీర్థోత్సవాలలో నాకు కనబడేవి.

నవ్యసాహిత్య పరిషత్తు జననం: బ్రిటిష్ సామ్రాజ్య విధానంమీద తిరుగు బాటుగా ఉప్పుసత్యాగ్రహం జరిగిన కాలంలోనే నవ్యసాహిత్య పరిషత్తు ఏర్పడ డం కాకతాళీయం కాదు భారతదేశం అంతటితో బాటు ఆంధ్రదేశంలో కూడా "మధ్య తరగతుల విప్లవం" చెలరేగుతోంది. ప్రపంచ పర్యాప్తమైన "ఆర్థిక మాంద్యం" ఈ విప్లవాన్ని ఎగసనదోసింది. పాతవ్యవస్థమీద అసహ్యం; కొత్త వ్యవస్థకోసం తహతహ! ఈ కొత్తవ్యవస్థ ఎలాగ ఉండాలని అనే విష యంలో ఎవరికి విస్పష్టాభిప్రాయాలు లేవు' పాత వ్యవస్థ విసుగెత్తిస్తోంది. విష మెక్కిస్తోంది. అది పోతే చాలు. ఆ తర్వాత ఏది వచ్చినా సరే; అదీ ఆనాటి మన స్తత్వం.

ప్రజలలో; రాజకీయాలలో ప్రస్ఫుటంగా కనిపించే ఈ మనస్తత్వమే సాహిత్య లోకంలో కూడా ప్రతిబింబించింది. బరంపురంలో మొట్టమొదటిసారి సమావేశమైన అభినవాంధ్ర కవిపండిత సభ (ఇదే, దరిమిలాను నవ్యసాహిత్య పరిషత్తుగా మారింది) లో ఈ ఉత్సాహమే కనిపించింది. అందరి ఆశీర్వాదాలూ నవీనత్వానికే! మెరిసిపోయే కళ్ళలో అపరిమితానందంతో చింతాదీక్షితులు "వచ్చేసింది కొత్త తరం; కొత్త కవిత్వం" అని నాతో అన్నప్పుడు ఆ మాటల్లో చిలుకూరి నారాయణరావు అధ్యక్షోపన్యాసపు సారాంశమంతా ఇమిడిపోయింది. (కథక చక్రవర్తితో నా తొలిపరిచయం బరంపురంలోనే)

నాటినుండి పదిహేనేళ్ళకు పైగా ప్రతి సంవత్సరం నవ్యసాహిత్య పరిషత్తు సమావేశమవుతూ వచ్చింది. ఏటా ఒక వార్షికోత్సవం, ఒక అధ్యక్షుడు, కొన్ని తీర్మానాలు, కాంగ్రెసు సభలు జ్ఞాపకం రాలేదూ? పరిషత్తుసాగించిన "ప్రతిభ" ప్రకటన, అధ్యక్షవరణం కూడా ఎన్నికలద్వారా కాదు. ప్రజాస్వామ్యపు బహి రంగ స్వరూపం లేకపోలేదు పరిషత్తుకి. ఆంధ్రదేశం అంతటా పరిషత్తుకి

సభ్యులున్నారు. కాని వీళ్ళంతా సరిగా చందాలైనా చెల్లించారో లేదో తెలియదు (నా మట్టుకు నేను ఒక్కసారి కూడా చందా ఇచ్చినట్టు జ్ఞాపకంలేదు.) పరిషత్తుకి ఆర్థికంగా గట్టిపునాది పడనే లేదు.

సాహితీసమితికి సహజమైన వ్యవస్థారాహిత్యం అనేగుణం నవ్యసాహిత్య పరిషత్తుని ఎప్పుడూ అంటిపెట్టుకొనే ఉంది. సారస్వత సంఘాలు శిలావిగ్రహాలు కావన్నమాట నిజమే. మార్పు ఎదుగుదలా వాటి ముఖ్యలక్షణం. రాజ్యాంగ చట్టంలోని నిబంధనలను కూడా అధికసంఖ్యాకుల అనుమతితో మార్చుతూ ఉంటారు. కాని ఒక స్వరూపమంటూ ఉండాలికదా! నవ్యసాహిత్య పరిషత్తుని పట్టుకొన్న పెద్దలోపం ఏమిటంటే దాని కొక కేంద్రకార్యాలయం లేకపోవడం. సాహితీసమితి లాగే నవ్యసాహిత్య పరిషత్తుకూడా నలుగురుమిత్రులు కలుసు కున్నప్పుడు మాత్రం ఉన్నానంటుంది. తతిమ్మా సమయాలలో కనబడదు.

లక్షలకొద్దీ జనానికి ఇళ్ళులేని ఈ కాలంలో ఈ దేశంలో సాహిత్యానికొక భవనం కావాలని కోరడం హాస్యాస్పదమే; కోట్లకొలది ప్రజలకి ప్రధాన జీవితావసరాలే సరిగా అందుబాటులోకి రావడంలేదు. సాహిత్యంపైపు దృష్టిమరల్చ డానికి కావలసిన తీరుబాటుగాని సాహిత్య సౌందర్యాన్ని ఆస్వాదించడానికి కావలసిన సంస్కారంగాని అధిక సంఖ్యాకులగు మనప్రజలలో మృగ్యం. ఒక సాహిత్యంలోనే కాదు. అన్ని కళలలోనూ, శాస్త్రాలలోనూ కూడా ఏ మాత్రం శక్తి సామర్థ్యాలు, అభినివేశం ఉన్నవాడైనా ఒక ప్రవాసిగా, కాందిశీకుడుగా బతకవలసి వస్తోంది. భరించలేని ఒంటరితనం నేటి జీవితానికి శాపం. కలిసి మెలసి బతకడం గాని, కలిసి పనిచెయ్యడంగాని ఎక్కడా కనబడదు.

ధనసామ్య సమాజం వ్యక్తి స్వాతంత్ర్యం అనే మిథ్యావాదంతో తెచ్చి పెట్టిన ముప్పు ఇది. చిన్న చేపని మింగడానికి పెద్దచేపకి స్వాతంత్ర్యం! కులం వల్ల, ధనంవల్ల వచ్చిన గొప్పతనం అలగాజనానికి ఎంత ఎడంగా ఉంటే అంత మంచిది, అప్పుడు నీ వ్యక్తికి గిరాకీ.

కొందరనవచ్చును: "ప్రపంచం అంతటికీ ఒకేఒక షేక్స్పియరున్నాడు. ఒక్కడే కాళిదాసు ఉన్నాడు" అని. ఆంధ్రులందరికీ ఒకే ఒక్క అల్లూరుముద్దుతార ఉందనడం కూడా ఇటువంటిదే! ఈ విధంగా విలువకట్టడం విజ్ఞానపు పరిణామ క్రమం తెలిసినవా దెవ్వడూ చెయ్యడు. షేక్స్పియరుగాని కాళిదాసుగాని సహజ కవచకుండలాలతో జన్మించలేదు. వారికి పూర్వం, వారిచుట్టూ అపారమైన విజ్ఞానం

ఉంది. ఆ విజ్ఞానానికి అందమైనఫలంగా వారు రూపుదాల్చారు. అల్లసాని పెద్దన అంత మధురమైన కవిత్వం చెప్పాడంటే అందుకు కారణం అతనిచుట్టూ ఉన్న వివిధ విద్యల ఉద్యానవనాలని మనం మరిచిపోకూడదు.

వాతావరణం కావాలి. స్పర్థకి బదులు సహకారం సాధ్యంకాగల పరిస్థితులను సృష్టించాలి. మన మొక తిరుగులేని నిశ్చయం తీసుకోవలసిన తరుణం వచ్చింది. అరణ్యసీమలో అబ్ధిగర్భంలో పెద్దపులుల, తిమింగిలాలమిలిటరీ సామ్రాజ్యమా? లేక మాధుర్యాన్ని సృష్టించే తేనెటీగల సమష్టి వ్యవసాయమా?

రాజకీయ స్వాతంత్ర్యం లభించి రెండేళ్లయినా అయిందో లేదో అప్పుడే మనం బ్రహ్మాండమైన మిలిటరీ సన్నాహాలు ప్రారంభిస్తున్నాం! ఇంకో విషయం ఆలోచించడానికే తీరుబాటు లేదు. నిర్మూలనంకోసం మనం కృషిచేస్తున్నాం, నిర్మాణం కోసం కాదు.

కాబట్టి అభ్యుదయ రచయితలసంఘం గురించి నే నిక్కడ అసలే ప్రస్తావించను. అధికారస్థానాలను ఆక్రమించిన మరుగుజ్జులు కొందరు అభ్యుదయ ధోరణులను అరికట్టాలని చూస్తున్నారు. వీరి అల్పబుద్ధులకు తాము జయిస్తున్నట్లుగానే అనిపించవచ్చును. కాని అది తాత్కాలికము మాత్రమే. నిడివిమీద వీళ్ళ పతనమూ తప్పదు; సామ్యవాద సమాజ ప్రతిష్ఠాపనా తప్పదు.

ఆ సామ్యవాద సమాజమే అభ్యుదయ రచయితల ధ్యేయం. అందుచేత అభ్యుదయ రచయితలంతా సామ్యవాదులే అని నిరభ్యంతరంగా ఒప్పుకోవచ్చును. కాని సామ్యవాద వ్యవస్థ మానవపురోగమనంలో ఒక మజిలీ మాత్రమే. దారిద్ర్యం, నిరుద్యోగం, సరుకు గిరాకీ అనే పునాదుల మీద నిలబడే పెట్టుబడిదారీ విధానానికి బదులు సమృద్ధి, సమానావకాశాలూ గల సామ్యవాద సంఘం ఏర్పడినప్పుడు ఆ ప్రజల సాహిత్యావసరాలు ఏ రూపం ధరిస్తాయో ఆ తర్వాత వాళ్ళు వేసేముందడుగు ఎట్టిదో ఊహించడం కష్టం. అయితే అప్పుడుకూడా తిక్కన సోమయాజిని చదవకుండా తిక్కన సోమయాజిగురించి మాట్లాడేవాళ్ళూ, అందరాని దేనికోసమో అశాంతి పొందేవాళ్ళూ ఉంటారని మాత్రం చెప్పవచ్చును.

—శ్రీరంగం శ్రీనివాసరావు *

* కిన్నెర. ఆగస్టు 1949.

# పదవాఙ్మయంలో స్త్రీ

జానపదులచేత ఏనాటినుండో పాడబడి నేడు ఉండదమా, ఊడదమా అన్న స్థితిలో ఉన్నపాటలు పాతపాటలు. పాతపాట లనగానే దీనికి వెనక ఎంతో చెప్పవలసి ఉంటుంది. నన్నయగారే మొదటి తెలుగుకవి కాదనీ, భారతమే ఆది ఆంధ్ర కావ్యం కాదనీ అనవలసి ఉంటుంది. అంతకుముందు ప్రజలు కావ్యాత్మ కలవారనీ, వారి నోటపాటలకు మల్లే భావావేగం కవిత్వమై పొంగిపొరలిందని వారే తెలుగుకు ప్రాణప్రతిష్ఠ చేసి విడచిన విరాణ్మూర్తులనీ అంగీకరించవలసి ఉంటుంది. ఇట్లా అనడంలో చిక్కులు వస్తాయనీ అందరికీ తెలుసు. తేలికగా చప్పున అనడంకూడా కష్టమే; అయినా ఇది సత్యం.

నన్నయగారు సంస్కృతకవుల సొత్తుకు తెలుగుబురఖా తొడిగి మన దను కొమ్మన్నారు. ఈ రసోన్మాదులు వాళ్ళజాతికి అనువైనట్లు వాళ్ల భావాలనే స్వంతంగా వాళ్ళమాటల్లో పాడుకున్నారు. ఇందులో ఎవరు మెరుగు త్రోవలు త్రొక్కింది, ఎవరిని మనం విస్మయంలో ఆమోదించవలసిందీ మనమనస్సులకు తెలుసు.

పాల్కురికి సోమన తుమ్మెదపదాలూ, చంద్ర, వెన్నెల పదాలూ పాడుతూ యాత్రికులు శ్రీశైలయాత్ర సాగిస్తుండే వారని చెప్పాడు. ఇంకొక సోమన వీటి కొకలక్షణం చేకూరుద్దామని యత్నించి విఫలుడై విసిగి కాబోలు "అనియతగణైః యతిర్వా ప్రాసోవా" అని మాత్రం చెప్పి సరిపెట్టుకున్నాడు. కాకపోతే వీటికి బంధ మేమిటి? యతిప్రాసల గొడ వేమిటి?

మనుష్యుడు కష్టంకానీ, సుఖంకానీ ఇనుమిక్కిలై పట్టరానపుడు దానినే గొంతువిప్పి స్వేచ్ఛగా పాడుకుంటాడు. తన ఉద్వేగ ఉత్సాహాలను బహిఃప్రపంచంలో మూకంగా ఉన్న శక్తులకుపంచి బరువు దించుకుంటాడు. అక్కడికి అతనికి ఒక తృప్తి, అటువంటి భావతైక్ష్ణ్యం కల మనిషి పదాలు సరిగా పడ్డవా అని చూడడు; పండితులు మెచ్చుకుంటున్నారా అని చూడడు. యతిప్రాసా కుదరాలనీ చూడడు. కాని చిత్రమేమంటే అతని ముఖంలో పాటగా రూపొందుతున్న పాదాలు ఎక్కడికక్కడే సొంపుగా విరగడం మొదలు పెత్తవి: అది తెలుగు మాట్లాడేవాడి మనస్తత్వంలో ఉన్న రహస్యం. తనకు తెలియకుండానే

మాట్లాడుతున్నప్పుడూ వాడు మొదట పలికిన పదానికి ఉచ్చారణలో సమీపంలో ఉన్న పదం మళ్ళీపలకాలని చూస్తాడు.

అంటే "ఆకూ అలమూ" అన్న జంట ఉన్నదనుకోండి. అక్కడ "ఆలానికి" అర్థ ఉంది. అట్లా గడ్డీగాదంలో గాదానికి అర్థంఉంది. కాని వంకర టింకర అన్నప్పుడు టింకరకుగాని, మంచీ గించీలో గించికిగాని అర్థంలేదు. అట్లా అవి వ్యర్థపదాలయినా మొదట పలకబడ్డ మాటల కొక సౌష్ఠవాన్నీ, సౌందర్యాన్నీ, తెచ్చిపెడతవి. వినేవారిచెవులకు ఇంపును కలిగిస్తవి.

ఇటువంటి పాతపాటల్లో పాండిత్య ప్రకర్ష ఉండదు. కాకపోతే భావావేగ ముంటుంది, లౌకికజ్ఞానం పరిపూర్ణంగా ఉంటుంది. కావ్యాల్లో కవి తన పాత్రల్ని నఖశిఖ పర్యంతం నిండుగా అలంకరించి ముచ్చిబొమ్మలా నిలబడతాడు. ఆకన్నూ ఆ ముక్కూ, ఆ తీరూ దూరంగా వుండి చూడడానికే గాని దగ్గరికి వచ్చి తడివి పరిశీలించే టట్లయితే సిర్ఫాగ్యుడి స్వప్నంలా ఎక్కడి కక్కడ ఛిద్రమై పోతుంది.

ఇంకొక విషయం చెప్పాలంటే కావ్యనాయికలూ నాయకులూ రాచకుటుంబంలో పుట్టినవారు లేదా ఉన్నతవంశ్య సూతులు. నాయికలు ఆకాశంలో విహరిస్తుంటారు. కాని భూమిమీద నిలువరు. వారికి తల్లీ తండ్రీ, అన్నా చెల్లెలూ, భర్తా, అత్తా మామా మొదలైన బంధువర్గమంతా ఉన్నట్లు కవి చూచాయగా తెలుపుతాడు. అదీ కథావసరాన్నిబట్టి మాత్రమే. అంతేకాని అందకు వారిలో గల పొత్తు ఎట్లాంటిదో, వాళ్ళవాళ్ళ మెలుకువలు ఎట్లాంటివో మనకు తెలియదు. ఎంతసేపూ నాయిక విరహ వేదన పడుతుంది. నాయకుడి కోసం ఎదురుతెన్నులు చూస్తుంది. చెలికత్తెలు శైత్యోపచారాలూ, చంద్రాద్యుపాలంభనాలూ చేస్తారు. చివరకు వివాహం. ఇదీ జరిగే కలాపం. నాయకుడుకూడా ఏ ధీరోదాత్తుడో, దక్షిణ నాయకుడో, ధీరోదాత్తుడే అయితే ప్రియాన్వేషణ, సమాగమంతోనే కావ్యాంతానికి వచ్చేస్తాడు. దక్షిణనాయకుడే అయితే ముందటిభార్య కాళ్ళకు మ్రొక్కుతూనే, ఆవిడ "చెల్వగు పద పల్లవంపు తాకిళ్ళ"తో తను పులకాగ్ర కంటక వితాను ద్రవుతూనే మరికొందరు స్త్రీల కోసం ఆరళ్ళు పడుతూ ఉంటాడు.

ఎప్పుడూ ఇటువంటి ఇతివృత్తాలను తీసుకుని పాండిత్య ప్రకర్షకోసం పాకులాడుతూ యతిప్రాసలతో తమ భావాలను బిగించుకుంటూ నడిచే కవిలో, మనస్సుకు తట్టిన ఊహను, హృదయం వెలువరించా అనుకున్న భావాన్ని, అప్ర

యత్నంగా చెవులకింపుగా వెలువరించే నిష్పండితుడి పాటకున్న మార్దవం కాని భావస్ఫోరకతకాని ఉండడం కష్టం.

అతని పాటల్లో అర్థంలేని పదాలు ఉండవచ్చు. వేంకట పార్వతీశకవుల గీతాల మాదిరి కేవలం శ్రుతిమాధుర్యమే కలిగి తీసివేసినా చెప్పబోయే భావం చెడని పాదాల ఆవర్తన ఉండవచ్చు. అయినా ఆతణ్ణి భావలోపం లేని మహా రసికుడనాలి. చెప్పదలచుకున్నది వినేవారికి సులువుగా స్ఫుటమయ్యేటట్లు చెప్ప గలిగిన ధన్యశీలి అనాలి.

ఇటువంటి పాటలు ఎవరిచేతన్నా రచింపబడనీ, ఎక్కువగా పాడబడేది స్త్రీలచేత. అసలు నా ఉద్దేశంలో వీటిలో ఒక గుంపుకు కేవలం స్త్రీలే కర్తలని, అవి జోలపాటలూ, సంసారి సంబంధి అయిన మరికొన్ని పదాలూ.

సంసారానికి సంబంధించిన వాటిలో సామాన్య సంసారి జీవితం విస్పష్టంగా విదితమౌతుంది. తెలుగు సంసారంలో తల్లి, తండ్రి, కూతురు, అల్లుడు, కొడుకు, కోడలు వీళ్ళకున్న, స్థానం ఎటువంటిది? ఎవరిది రాచరికం? ఎవరిది కొత్తరికం? అనే సమస్యలకు జవాబులు దొరుకుతవి.

సంసారశకటానికి స్త్రీ పురుషులు రెండు చక్రాలు. అయినా ఈ గీత వాఙ్మయంలో స్త్రీకున్న ప్రాముఖ్యమూ, ప్రాబల్యమూ పురుషుడికి లేదు. ఆవిడ బిడ్డగా, కోడలుగా, భార్యగా, తల్లిగా, అత్తగా సంసారరంగంలో విశ్వవిహారం చేస్తుంది. ఆరితేరిన అనుభవశాలిగా, అన్నిరంగాల్లోను, తన్ను నిరూపించు కుంటుంది. మగవాడి విషయం అట్లాకాదు. ఆతడు బాల్యంలో మాత్రమే గోముగా లాలించబడతాడు. బాల్యదశ గడచిన పురుషుడికి ఈ పాటల్లో అంతగా స్థానం ఉండదు. ఆ బాల్యంలోనైనా, ఆ ముచ్చట ఆతడికి జరగడం తల్లికి మగపిల్లలమీద మోజు జాస్తిగా ఉండడం వల్లనేమో!

ఇటువంటి సంసారాల్లో ఆడబడుచులు హంసలు; చిన్నకోడళ్ళు చిలకలు; పారువాలు బాలపాపలు; కొత్తకోడళ్ళు కోయిలలు.

"చిలకల్లు చిలకల్లు అందురేకాని
చిలకలకు రూపేమి పలుకులేకాని!"

అని ఒక ఇల్లాలు ప్రశ్నించుకుంటుంది. ఆవిడకు చిలకలో అందమేమీ కనిపించదు. కాకపోతే దానికి పలుకుసొగసు ఉన్నది. ఇంతమాత్రమేనా మా చిన్నకోడలికి పలుకుతోపాటు అన్నీ ఉన్నవని ఆ ఇల్లాలు గర్వపడుతుంది. ఆ భావనలో అసలు చిలకలని త్రోసిరాజని "చిలకల్లు మా ఇంటి చిన్నకోడళ్ళు" అని సృష్టికర్తమీదికే సవాలు తీస్తుంది. అట్లా,

"హంసలకు రూపేమి ఆటలేకాని
పార్వాలకు రూపేమి పాటలేకాని
కోయిలకు రూపేమి గొంతులేకాని"

అని నిరసించి,

"హంసల్లు మాఇంటి ఆడబడుచుల్లు
పార్వాలు మాఇంటి బాలపాపల్లు
కోయిల్లు మాయింటి కొత్తకోడళ్ళు"

అని నిర్ధారిస్తుంది— ఆ విధంగా ఆ సంసార మొక పూలరథం;

ఇక తల్లిగా స్త్రీకి చక్కని బాధ్యత ఉన్నదని నిరూపిస్త వీపాటలు. ఆవిడ పిల్లల్ని లాలిస్తుంది. గోముగా పెంచుతుంది. ఉయ్యాలలో ఊచుతూ తన మనోభావాల్ని ఆ హృదయంలేని పసికూనతో చెప్పుకుని మురుస్తుంది. తన బిడ్డనుగూర్చి అడిగినవారికీ, అడగనివాడికీ చాటుతుంది. అందులో ఆవిడకు ఆడ పిల్లలమీదకన్న మొగపిల్లలమీద మోజు హెచ్చు. కాబట్టే,

"కొడుకులు కననివాళ్ళ కడుపేమి కడుపు"

అని నిశ్చలంగా ఒకగిరి గీచుకుంటుంది. ఇల్లాంటి కొడుకు పక్షపాతం చాల ఎక్కువగా కనిపిస్తుంది ఇక్కడ. ఒక ఇల్లాలికి వాంఛనీయాలు చాలా ఉంటవి. చూదండి: అందులో ముఖ్యమైనవి ఇవి.

"తింటేను తియదోసపండు తినాలి
కంటేను కొడుకుల్ల కాన్పే కనాలి
అందితే అన్నతో వియ్యమందాలి
అడితే వదినతో జగడ మాడాలి."

అటువంటి కొడుకులకోసమై గొడ్రాళ్ళంతా సింహాద్రి అప్పన్న గుళ్ళ ముందు ప్రాణాధారం పడతారు. "కొమాళ్ళ నియ్యమని కోరిపడతారు" అందుకు లంచంగా దేవుడికి.

"గుడిదిరుగు వస్త్రమ్ము గుమ్మడిపండూ
దాగళ్ళవడపప్పు దండిబెల్లాలూ"

అర్పిస్తారు. అంత కష్టపడి కొడుకును కన్న బాలెంతరాలికి తోటి స్త్రీ మండలిలో గౌరవం అతిగా జరుగుతుంది. చూడండి,

"గోరింట పువ్వులాటి కొడుకు నెత్తుకొని"—

బాలింత ఒకతి బావికి నీళ్ళకువచ్చెనా ? ఆ వచ్చినదానిచుట్టూ చేరి అమ్మలక్కలు విరగబడి చూస్తారు. ఏదేది బాలింత ఎంత చక్కనిది: అని చోద్యాలుపోతారు. తరువాత వారిలో

"మాసిన్న పట్టుచీర మణవలకు పసుపు
కళ్ళాది కాటుక్క పళ్ళాది ఎరుపు
ఆవాడ బాలింత అబ్బాయి తల్లీ!"—

అని అబ్బాయి తల్లిగాబట్టి అన్నట్లు ధ్వనించే గౌరవసూచకమైన ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతూ చెప్పుకుంటారు.

ఇటువంటి కొడుకును కన్నతల్లి వాడిని ఎట్లా పెంచుతుంది అనేది ప్రశ్న. కిందవద్దురా నెత్తిమీద నడువు అన్నట్లుగా పెంచుతుందని మనం చప్పున ఊహించవచ్చు. ఆ ఊహను బలపరిచే ఉదాహరణలు కొల్లలు—

ఆ తల్లి వాడు ఒకదీపం. వాడిమాట మంచిగంధానికంటె చల్లన చూడండి :

ఇంతంత దీపమ్ము ఇల్లెల్ల వెలుగూ
ఈశ్వరుడి చందమామ జగతెల్ల వెలుగూ
గోరంతదీపమ్ము కొండలకు వెలుగూ
మాడంతదీపమ్ము మేడలకు వెలుగూ
మా ఇంటి అబ్బాయి మాకళ్ళ వెలుగూ

అంటే, అటు కృష్ణుడికీ ఇటు ఈశ్వరుడి తలమీదవెలిగే జాబిల్లికీ, ఆ తల్లి దృష్టిలో ఆవిడ కొడుకు ఏమాత్రము తీసిపోడు. ఇంకా వాడిని చూస్తే చిలుక లాదుతవి హంస లాడుతవి పావురా లాడుతవి.

"వీథి నెందరు ఉన్న విసరదే గాలి
రచ్చ నెందరు ఉన్న రాదమ్మ వాన"—

వాడు వీథిన నిల్చుంటే ఆ తల్లికి విసిరేదీ కురిసేదీ—

మొగలిపువ్వులగాలి, ముత్యాలవానా—

ఇక ఆవిడ, పిల్లవాడికి జోలపాడుతూ—

'ఏడువకు ఏడువకు వెఱ్ఱినాతండ్రీ
ఏడిస్తే నీకళ్ళ నీలాలు కారూ"

అని విచారిస్తుంది.

"నీలాలు కారితే నే చూడలేను
పాలైన కారవే బంగారుకండ్లా!"

అని అర్థిస్తుంది.

తన కొడుకుకు సేవచెయ్యమని సృష్టిలో తానెరిగిన జీవజాలానికంతటికీ ఆసలు పెడ్తుంది— ఆ సేవ విశిష్టంగా ఉండవలెనంటుంది.

"పిల్లిరావే పిల్లి పిల్లల్లతల్లీ
పల్లేరు ముళ్ళలో పాలిచ్చిపోవే."

అన్న తల్లి ఊహలో దానిపిల్లలకు పాలుపోసి అది పనులకు పంపవలె; తన బిడ్డకు పాలుపోసి ఆడుకో పంపవలె.

ఇంకా ఆవిడ దృష్టిలో ఒకరి అందం తనకొడుకు అందంముందు లొచ్చు.

"పిల్లెమ్మ కన్నుల్లు బీరపువ్వుల్లూ
అబ్బాయి కన్నుల్లు కలువరేకుల్లూ"

అని పాడుతూ అటు కొడుకును ఊబ్బిస్తుంది. ఇటు తాను మురుస్తుంది. వాడు అతి అందగాడాయెను. వాడి చిన్ననాటి చిరుమొగం చూచి,

"సిగ్గుపడి చంద్రుడు పొడవడాలడు"

వాడు పుట్టినపుడు తల్లి ఊహలో

స్వాతివానలు కురిసె సముద్రాలకడనూ
పాలవానలు కురిసె బంధువులఇండ్లా

వాడు ముంగిలు ఆడుకుంటే

"ముంతమామీదనీ ముసిరె చిలకల్లు
పండు మామీదనీ బ్రమిసె చిలకల్లు
వట్టిమామీదనీ వచ్చె చిలకల్లు"—

ఆ తల్లికి కొడుకు అంతేకాదు. వాడు నిద్రపోవడానికి కృష్ణుడు జోల పాడితే బ్రహ్మ జోకొట్టాలి. భద్రకాళి పాలిస్తే శివుడు నిద్రపుచ్చాలి. అల్లా ఆ ఇల్లాలి గారాబం పట్టికి దేవతలూ సేవకులే.

ఇక తల్లి ఊహించే వాడి అలంకారాలన్నీ చిత్రవిచిత్రంగా ఉంటవి. బాగా అలంకరించి కొడుకుని చల్లగాలికి తిరిగిరమ్మని పంపుతుంది. వాడు ఏటిగట్టున వెళ్తుంటాడు. ఆ గట్టుమీది చెట్లు గాలికి అల్లాడుతుంటవి. ఆ కదలికకు అబ్బాయి ధరించిన గొలుసులు అల్లాడుతవి. బంగారు తలపాగ అంచులల్లాడుతవి. అప్పుడు వాడు గాలికి చెదిరిన మేఘశకలంలా ఉంటాడట. ఇక తల్లి వాడి అలంకారాల విషయాల్లో అందరినీ పురమాయిస్తుంది.

"తేరె మా అబ్బాయికి ముత్యాలచుట్టూ
ముత్యాలచుట్టుకీ మూడురేకల్లూ
రత్నాలచుట్టుకీ రావిరేకల్లూ"

దానికి

వజ్రాలు తాపిరీ వాడిమామల్లా
కెంపుల్లు తాపిరీ వాడిబాబుల్లా—

దీనినిబట్టి ఇంకొకవిషయం అబ్బాయికి తండ్రితోనేకాక మేనమామలతో ఎక్కువబంధం కట్టిపెడుతుంది తల్లి. "అందితే అన్నతో వియ్యమందాలి!" అనేది స్త్రీ వాంఛించే వాంఛలలో ఒకటని ఇందాక చెప్పుకున్నాం. అందుకని ఈ పాటల్లో మేనమామల ప్రసంగాలు తరుచూ వస్తూ ఉంటవి. వారిని వర్ణిస్తూ,

చెవి చెవికి బారడే పోగుల్లవారూ
అంచుపంచెలవారు అంగీలవారూ
పట్టుపంచెలవారు పాగాలవారు
పెసరకాయలవంటి పెదిమల్లవారూ
కందికాయలవంటి కనుబొమలవారు
మిరెపకాయలవంటి మీసాలవారూ–

అని చెప్పి "వారు మాఅబ్బాయి మేనమామలూ" అని ఠీవి నొలక బోస్తుంది. అదే కూతురి మామగారిని, అనగా తన వియ్యంకుడిని పాడేటప్పుడు ఆవిడ ధోరణి వేరు. అక్కడ ఆమె ఎంత ఎగతాళైనా సేసి హాస్యాన్ని చిలక రిస్తుంది. చూడండి:

"అమ్మాయి మామల్లు ఎటువంటివారూ
చేపగంపలకాడ చెయిజాచువారూ
గుడ్డిగుఱ్ఱాన్నెక్కి గోజారువారూ
పందిపిల్లా నెక్కి పరుగెత్తువారూ"

ఇట్లా అనడానికి కారణం ఆ "మామ" తనతోడబుట్టినవాడుకాడు కనుక. ఏమంటే ఆకాలంలో ఎదురు మేనరికాలు నిషిద్ధం–అన్నకూతుర్ని తనకొడుక్కి చేసుకుంటుంది. లేదా తనతమ్ముడికి కూతుర్నిచ్చి చేస్తుంది. అంతేకాని అన్న కొడుక్కి తనకూతురిని ఇవ్వదు.

అటువంటి మామలదగ్గర తనకొడుక్కి ఎక్కడలేని అధికారం. వాడంటే వాళ్ళు బెదరాలి. అల్లుణ్ణి మంచి చేసుకోవడానికి అవీ ఇవీ తెస్తూ ఉండాలి. తెచ్చినా లేకపోయినా తల్లిమాత్రం,

"పెదమామ తెచ్చాడు పచ్చల్లదండ
నడిమామ తెచ్చాడు నాగబంధాలు
చినమామ తెచ్చాడు చిలకల్ల తొట్టి"–

అని పాడడానికి ముచ్చట పడుతుంది.

పెద్దవాడై ఆ అబ్బాయి మామగారింటి పిల్ల కోసం కాచుకుని ఉంటాడు. పూవులు తస్కరిద్దామని దొంగలు తోటకు కాపువేసినట్లు అబ్బాయిమామ ఇల్లు.

"కానకుండా పుస్తె కట్టేద"మని కాస్తాడు. తీరా ఆ మామలు పిల్లనివ్వ వచ్చినపుడు మాత్రం బిగిసి కూర్చుంటాడు. అప్పుడామామ వచ్చి "మాపట్టి నిచ్చేము దిగవయ్యారాజా" అని బ్రతిమలాడుకోవలె. వాడెంత అల్లరిచేసినా అందరూ సహించాలని ఆ తల్లి కోరిక.

"ఆడంగ ముద్దమ్మ పాడంగ ముద్దూ
అల్లరీ అబ్బాయి అందరికి ముద్దూ

అని వాడిని ఆవిడ సమర్థిస్తూ ఉంటుంది.

ఇంత శ్రద్ధతో చూచే తల్లి పని

"ఉంగరమ్ములు పెట్టి ముంగురులు దువ్వి"

వద్దపెట్టుకుని ముద్దులాదేవర కే తండ్రిమాత్రము

"పలకబలపము లిచ్చి పద్యాలు పాడి"

సరసపెట్టుకుని చదువు నేర్పుతాడు—చెప్పినది వినక మారాము చేసిన ట్లాయెనా తండ్రి దయచూడడు. చిన్నదెబ్బలైనా తగిలిస్తాడు. కాని తల్లి మెల్లిగా

"చదువంటె అబ్బాయి చెండికేశాడు
బద్దె పలుపా రావె బుద్ధి చెప్పాలి"-

అని బెదిరిస్తుంది. అదీ చాలదేమోనని మూణ్ణాళ్ళ ముచ్చటగా పరిణమించ బోయే కూతురు చదువును మెచ్చుకుంటూ కొడుకు వినేటట్లు

"చదువంటె అమ్మాయి సంతోషపడును
అగసాలి రావయ్య నగలుచెయ్యాలి"

అని పురికొల్పుతుంది. అంతటితో ఆగక,

"చదువుకో నాయనా చదువుకో తండ్రి
చదువుకుంటే నీకు సౌఖ్య మబ్బేను-"

అని నచ్చజెప్పడానికి ప్రయత్నిస్తుంది. వాడు చిన్నబుచ్చుకొని యేడ్చె నట్లాయెనా,

"ఎవ్వరే మా తండ్రి నేమి అన్నారు
వెంలేని వీథిలో ఏమగన్నారు
మత్తేభమన్నారు మావాడలోనూ-"

అని వినకపోతే ఏడ్చే అబ్బాయికి ఎఱ్ఱావుపాలు పోస్తానంటుంది. నవ్వితనే నల్లావుపాలు. నల్లావుపాలు అన్ని ఆవులకంటే రుచి అని ప్రతీతి.

తల్లి దృష్టిలో వాడు ఒకరాజు. "ఈ ఇంటి పేరేమి? ఇందరి పేరేమి" అని ఎవరైనా తమ్ము ప్రశ్నించి నట్లాయెనా,

"ఈ ఇల్లు మాదమ్మ వీరు మావారు
దంతపూ తలుపుల్లు దరవాజులు మావి"

అని చెప్పినతల్లి, ఆ సంపత్తుకు స్వామిగా తనభర్తను చెప్పదు. తా నెవరిని ఉయ్యాలలో చూస్తూ పాడుతున్నదో వాడే దానికి రాజు కావాలి కాబట్టే "ఈరచ్చ కూర్చున్న రాజు మా బాబు" అని గర్వంగా చెప్పుకుంటుంది

ఊరి వారందరూ తన బిడ్డను తను చూచినట్లే చూస్తారని ఆమె నమ్మకం. వాడికి దారినపోయే వారు బహుమతు లిస్తారు. కంసాలి మువ్వలు కడ్తాడు. నగల వర్తకుడు రాళ్ళమువ్వలు కడ్తాడు. ఇదంతా "కలవారి పట్టని" గారాములన్నీ కూర్చి వారు చేసే చేష్టలు.

తల్లికెప్పుడూ తనబిడ్డ లక్ష్మీసంపన్నుడు కావాలని ఆశ. కాని ఆవిడ నోరు తెరచి నీవు ధనవంతుడివి కావాలి నాయనా అనదు. కాని ఆ ఉద్దేశాన్ని చిత్రవిచిత్రంగా వెలువరిస్తుంది. ఆవిడను శ్రీలక్ష్మి వరలక్ష్ములు ఎవరిని పొందమంటావమ్మా అని అడుగవచ్చేరట. వస్తే ఆమె,

"తూర్పు ఇంట్లో ఉన్న పెదబాబును పొందు
పడమటింట్లో ఉన్న చినబాబును పొందు

దక్షిణ ఇంట్లో ఉన్న బుచిబాబును పొందు
ఉత్తరమింట్లో ఉన్న చిటిబాబును పొందు"

అని అత్తగారైనట్లుగానే ఆజ్ఞలు పెడుతుంది. ఈ విధంగా తల్లి తన కొడుకుని చూచేతీరు అద్వితీయం.

అట్లా అని ఆవిడకు కూతురిమీద ప్రేమ ఉండదనికాదు. అదెట్లా లేకుండా పోతుంది? తాను ఒకరి కూతురేనాయె! కాని అక్కడ ఆమె అనురాగ ప్రకటనకు పరాయి ఇంటికి పోబోయేపిల్ల అనే దిగులు అడ్డువస్తుంది. దానితో ఆ క్రొత్త చోట ఎట్లా మెలగవలెనో ఎన్ని జాగ్రత్తలు కలిగి ఉండవలెనో ఆవిధంగా కూతురిని తయారు చెయ్యవలెననే జిజ్ఞాస కలుగుతుంది. కాబట్టి ఆమె గురువు. కుమార్తె శిష్య-ఈవిధంగా కొడుకువిషయంలో ప్రకటించే అంతగోము ఈ సంబంధములో ప్రకటిత మవడానికి వీలు చిక్కదు.

కూతురు పుట్టిననాటినుండి ఇంటెడు చాకిరీ చెయ్యడంలో తరిఫీదుకావలె. వంటవండడంలో, చేయెత్తి పోటువెయ్యడంలో, ఎద్దడినీళ్ళు తేవడంలో, ఆఖరికి ఏరువిడకలు సంగ్రహించుకోవడంలో దానికి నేర్పుకావలె. ఇవన్నీ అత్తింటి కోడలైనప్పుడు ఆ పిల్లను అత్తగారి ఆగ్రహంనుంచి కాచుకువచ్చే సాధనాలు.

కాబట్టి ఒక చెల్లెలు అన్నను వస్తువాహనా లడగదు. చీరసారె లడగదు. కాగా

"నాచేతి రోకళ్ళు నల్లరోకళ్ళు
చేయించు అన్నయ్య చేవరోకళ్ళు
వేయించు అన్నయ్య వెండిపొన్నుల్లు."

అని అర్థిస్తుంది. అనగా ఈనాడు ఒక వీణకు, ఒక ఫిడేలుకు ఉన్న గౌరవం ఆనాడు రోకళ్ళ కుండేవి కాబోలు. ఇక ఆమె ఆరోకలితో సువ్వని ఒక పోటు వేస్తే

"దిక్కులు పిక్కటిల్ల సూరన్న కదులు"

స్పృష్టంకాదు.

చిన్నపిల్లగా స్త్రీ పొందే సరదాలలో వదినెలతోనూ, బావలతోనూ సరసాలాడడం ఒక దొడ్డసరదా. అవి చాలసార్లు హద్దులు మీరుతుంటవి. అయినా ఎవ్వరికీ కోపం రాదు. ఒక పిల్ల తన మరదిని ఇట్లా మర్యాద చేస్తానంటుంది-

"మేనత్త కొడుకమ్మ నామేన మరిది
నన్ను చూడావచ్చి పాతర్లొ పడెను
పాతర్లొ పడ్డవాణ్ని రోకళ్ళ కుమ్మి
మూలమంచంవేసి ముంత పొగ బెడుదు
కందకడిగిన నీళ్ళు కాళ్ళ కందించి
తవ్వకడిగిన నీళ్ళు దాహాని కిస్తు."

ఇంకొకచోట వదినెనూ, బావనూ కలిపి

వదినగారూ మీరు వాసి కలవారూ
వండబోయినచోట కుండ నాకేరు
బావగారూ మీరు ప్రతిభ కలవారూ
నిండిన సభలోన పిండి బొక్కేరు

అని ఎగతాళి చేసి అంతకూ తృప్తి లేక—

చక్కిలాల బుట్ట చంకపెట్టుకుని
సభలోన మాబావ సంగీతపరుడు

అని చెణుకు విసురుతుంది.

పెళ్ళయిన తరువాత ఆవిడ ఇంటికి అన్నలు వస్తేకూడా,

"అరటి కాకరకాయ అరచందపప్పు"

తమ్ములు వస్తే,

"గుత్తి చిక్కుడుకాయ గుమ్మడికాయ"

అదే బావలు మరుదులు వస్తే

"మంచాన నల్లుల్లు గోడ ఇల్లులూ
వెలుగులో వేటాడిన తొండలున్నూ"

అత్తా ఆడబిడ్డం అఘాయిత్యాలే అన్పని ఒక పోటువేస్తే

"ఆకాశం తల్లడిల్లు చంద్రన్న కదులు"—

ఇంకా ఆమెకు దంపు.

వదినెల్లు మరదళ్ళు వాదించినట్లు, పుట్టిల్లు ఎంతదూరమున్నా నాలుగడుగుల దూరమే ఎట్లాగో, నల్లాము బియ్యమున్నా ఆవిడకు నాలుగు వాయిలే ఆ పిల్ల దృష్టిలో.

"చేఫలము లే నోరిమాట" మాట ఎట్లా కాదో "చేయెత్తి వేయనిపోటు" పోటు అట్లా కాదు-ఇదే ప్రజ్ఞ ఆడపిల్లకు వంటచెయ్యడంలోకూడా ఉంటుంది. ఆమెకు వంట వంటనగానె వంటెంత సేపూ! — ధాన్యరాసుల మీద చెయివేసినట్లు — అబ్బాయి అందలాలూ గుఱ్ఱాలూ కోరితే, అమ్మాయి పసుపూ కుంకుమా కోరుతుంది. పిల్లలతల్లి అయినతరువాత ఉయ్యాలలమోజు ఆవిడ⁽ కెక్కువ. కుంకంమీద ఉన్న సరదాకొద్దీ ఆడపిల్ల,

"ఊరికే కుంకమ్మ అమ్మ వచ్చింది
కొంగు మాదలు పోసి కొనరె కుంకమ్మ
చేతి మాడలు పోసి చేయించు బరిణె
గోల్కొండ తీసుకెళ్ళి గొలుసు వేయిస్తు
పాలకొండ తీసుకెళ్ళి బందు లేయిస్తు"

అనుకుంటుంది. ఇటువంటి సరదా లీనాడే ఉంటే ఏమిటమ్మా నాడం దొరికిందని గుఱ్ఱాన్ని కొనమంటావా అని ఎగురుతారు పెద్దవాళ్లు. పసుపుకు ఆ స్త్రీల చేతుల్లో చక్కని గౌరవం ఉన్నది. ఒక్కొక్క దశలో ఉన్న స్త్రీ రాచుకుంటే ఒక్కొక్క విధంగా అది శోభలీనుతూ ఉండేది ఆ కాలంలో.

"సీలాటి రేవంత నిగ్గుదేలింది
ఏచేదె కడిగింది ఈ చాయపసుపు"

అన్న ప్రశ్నకు

"పచ్చిపసుపు బావల్ల మరదలాడింది
అణుప్పసుపు అన్నల్ల చెల్లెలాడింది
కొట్లుపసుపు కొమాళ్ళ తల్లి ఆడింది
బావల్ల మరదలే తాను అమ్మాయి
పణతి ఆడిని పసుపు బంగారుచాయ
అన్నల్ల చెల్లెలే తాను అమ్మాయి

"అతివ ఆడిన పసుపు ఆవపూచాయ
కొామాళ్ళ తల్లియే తాను అమ్మాయి
గొంతి ఆడిన పసుపు గోవపూచాయ"

అని జవాబు వస్తుంది. ఇక్కడి వర్ణనలు చక్కనివీ నిరాడంబరమైన విన్నీ. అసలు ఈ వాఙ్మయంలో వర్ణనలన్నీ ఇట్లాగే ఉంటవి. చూడండి! తల్లి తన కూతుర్ని గూర్చి చెప్పుకుంటూ,

"చిక్కుడూ పువ్వెరుపు చిలకము క్కెరుపు
చిగు రెరుపు చింతల్ల దోరపం డెరుపు
రక్కెసపం డెరుపు రాగిచెం బెరుపు
తా ఎఱుపు అమ్మాయి తనవారిలోన"

అని వర్ణిస్తుంది. తనకూతురితో ఆవిడ ఉపమించినవన్నీ రోజూ తన దృష్టిలోపడే ఎఱ్ఱని వస్తువులు. తన కూతురు ఎఱ్ఱగా ఉంటుంది. ఆ సత్యం అందరికీ తెలియాలే గాని ఎట్లా చెప్తే ఏం? కాగా ఆమెకు నిత్యమూ వ్యవహారంలో ఉండే కొన్ని పదాలకన్నా ఎక్కువ తెలియవు. కాబట్టి మెరిసిపోతున్న తన కూతుర్ని శంపాలతాభ అనలేదు, ఉషాదేవత అనలేదు. కాని ఆవిడ రాగి చెంబుకూ, రక్కెస పండుకూ ఉన్న వర్ణం తనపిల్లకు ఉంటే అందంగానే ఉండవచ్చునని ఊహిస్తుంది. అట్లాగే చెప్పుకుంటుంది.

ఇక తల్లి తన కూతురికి ఎంతసేపూ చీరలు నగలూ కావాలని ఆరాటపడుతుంది.

చిన్న నా అమ్మన్న చీర కేడిస్తే
నెయ్యవోయి సాలివాడ నేత్రంపుపట్టు
వెయ్యవోయి కంసాలి వెండి జల్తారు—

అని వారికీ వీరికీ పురమాయిస్తుంది. ఆ తయారైన చీరను తన కూతురు వెయ్యేళ్ళు కట్టాలని ఆతల్లి ఆశ. ఇట్లాగే గాజుల సరదా ఒకటి.

పట్నం నుంచి వచ్చాయి పచ్చగాజుల్లు
పచ్చన్న మాచిన్ని అమ్మి చేతుల్లు
ఊరు తిరిగి వచ్చాయి ఉత్తగాజుల్లు
గుత్తాన మాచిన్న అమ్మిచేతుల్లు-

అని తల్లి కూతురి చేయి మెచ్చుకుని

చిన్నారి పొన్నారి గాజుల్ల సెట్టి
తేరె మా అమ్మాయికి తేనెగాజుల్లు
పాడుతూ తొడిగిస్తు పచ్చగాజుల్లు
నవ్వుతూ తొడిగిస్తు నల్లగాజుల్లు
ఏరేరి తొడిగిస్తు ఎఱ్ఱగాజుల్లు

అని మోజుపడుతుంది.

ఏమీ తెలియని పసికూన ఉయ్యాలలో పాల కేడ్చినా అదుగోనమ్మా వారు నీకు బుట్టెడు నగలు తెస్తున్నారు. ఇదుగోనమ్మా వీరు నీకు పెట్టెడు చీరలు తెస్తున్నారు అని సముదాయిస్తుంది. అట్లా తెచ్చేవారిలో తన పుట్టినింటి తరపు వారెక్కువ. వాళ్ళు పిల్లను మెచ్చి ముత్యాలు గుప్పించిన నత్తు చిలకలు వేయించిన చీర, రత్నాలు తాపించిన రవికలు పంపుతారు. వాళ్ళ ఆశ అంతా ఆ పిల్లమీద, తల్లి ఊహకూడా ఎప్పుడూ తన తమ్ముణ్ణి అల్లుణ్ణి చేసుకోవాలని ఉంటుంది. అట్లా కొత్తగా పెళ్ళయిన ఒక కూతురు—

"అలసందపప్పొండి అవునెయి కాచి
అమ్మ నీ తమ్ముణ్ణి ఏ పేర పిలుతు ?"

అని తల్లి నడిగితే, ఆవిడ

"శంభులింగమ లెమ్మి జపమూర్తి లెమ్మి
నందికేశవలెమ్మి నా ప్రాణవిభుడా !"

అని పిలువమంటుంది. తల్లితండ్రి తాత కూడా మనుమరాలితో మనుముకు తయారవుతాడు.

ఊంచకర్రోచేత ఉగ్గమోచేత
ఊగుతూ వచ్చిన తాతెవ్వరమ్మ—

అని ఒక ముదుసలిని చూచి పిల్లతల్లి నడిగితే దానికి ఆ తాత,

మానిక నిండాను మాడలోసుగుని
మనుమరాలా నిన్ను మనుమడుగ వస్తి—

అని సరసమాడుతాడు. ఈ విధంగా తల్లి పాడే పాటల్లో తనవారి ప్రసక్తే గాని, భర్తవైపువారి చుట్టరికం లేకుండా ఉంటే ఇంటికోడలూ ఆడపడుచూ కలసి హాస్యరసస్పంది అయ్యే ఇటువంటి సంబంధంతో ఆ ఇంటిని స్వర్గం చెయ్యవచ్చు.

కాని ఈ వాఙ్మయంలో అత్తాకోడలూ కలసిమెలసి పూసల్లో దారానికిమల్లే ఉన్నట్లు ఎక్కడా కనిపించదు. ఎప్పుడూ అత్త కోడలిమీద కారాలు మిరియాలు నూరడం, కోడలు చాటున మాటున గ్రుడ్లనీరు గ్రుడ్లకుక్కుకుంటూ ఈ శని ఎప్పుడు విరగడవుతుందా అని దణ్ణాలు పెట్టడం పరిపాటి. అత్త కోడల్ని సాధించలేనిు మేదకురాలైతే కోడలే తిరగబడి అత్తను సాధిస్తుంది. వారిద్దరి మధ్యా ఎప్పుడూ పులిమేకా సంబంధం—అత్త అడుగుతుంది కోడల్ని,

కోడలా కోడలా కొడుకు పెళ్ళామా
పచ్చిపాలా మీద మీగళ్ళు ఏవి?
వేడిపాలా మీద వెన్నల్లు ఏవి?
నూనెముంతల మీద నురగల్లు ఏవి?

దానికి కోడలు ఎదురుగా సమాధానం చెప్పదు. కళ్ళువప్పజెప్పి ఊరుకుంటుంది. కాని సందుదొరికితే వారినీ వీరినీ పిలిచి

ఇరుగు పొరుగులార ఓ చేడెలారా
అత్తగా రారళ్ళు చిత్తగించండి
పెత్తనం లాగేస్తే పేచీలు పోను;—

అని ఎత్తిపోస్తుంది. అంటే కోడలూ స్వతహాగా మెత్తనిది కాదు. కాకపోతే అత్త అనే శక్తికి భగవంతుడు లొంగి ఉండమన్నాడని ఆవిడ నమ్మకం. కాబట్టే తన అత్త తనమీద చెలాయించిన అధికారం తను కోడలిమీద చూపడానికి ఎదురు చూస్తుంది. ఈ కత్తికి రెండువైపులా పదును. ఇది ఒక చక్రం. కాబట్టే,

"అత్తలేని కోడ లుత్తమూరాలూ
కోడలూ లేనత్త గుణవంతురాలూ!"

అనే పాడుభావన సత్యమై కూర్చున్నది.

ఒక దొడ్డకాలంలో అత్తవచ్చి కోడలికి దణ్ణం పెట్టిందట ఇక ఆ కోడలు దీవిస్తుంది.

చాలు చాలత్తయ్య చాలత్తగారూ
నీ కొడుకు వెయ్యేళ్ళ మొదలు కావాలీ
నీ కోడలు పట్టంపురాణి కావాలీ-

ఇంతటితో ఆగితే చక్కగానే ఉండేది. కాని చిగురు మాటగా,

"నువెళ్ళి పంచల్లపాలు కావాలి!"

అని ఊరుకుంటుంది. అత్తమీద కోడలికి కసి అంత-కాని అత్తగారిని ఆరడిపెట్టే కోడళ్ళకన్న అత్తగారింట తిప్పలు పడేవారే హెచ్చు.

అక్కడ ఆరణాలు లేవు, కట్నాలు లేవు అని వేధిస్తారు.

"వేసంకాలం వచ్చె వలువల్లు చిరిగె
వనిత నీ పుట్టింటివా రేల రారు
మారుకాలం వచ్చె మడతలూ చిరిగె
మగువ నీ పుట్టింటి వారేలరారు?"

అని ఎత్తిపొడుస్తారు. ఇంటెడుపనిచేసి అడుగులకు మడుగులు ఒత్తుతున్నా అత్త.

"దంచక్క నంగవే ధాన్యరాసుల్లు
వంచకా వంగరే వనిత కోడళ్ళు!"

అని ప్రచారం చేస్తుంది.

చెల్లెలిని పుట్టింటికి తీసుకుపోవాలని అన్నలు వస్తారు. వాళ్ళను చూచి సంతోషమే కాని వాళ్ళతో తనను పంపుతారో లేదో అని దిగులే ఆ కోడలికి. కాబట్టి ఆవిడ, కాళ్ళకూ నీరిచ్చి కన్నీరు నింపుతుంది. కాని,

ఎందుకూ కన్నీరు ఏల కన్నీరు
తుడుచుకో కన్నీరు ముడుచుకో కురులు
ఎత్తుకో పాపడిని ఎక్కు అందలము:-

అని ఇంకా చెల్లెలు చలనం లేకుండా నిలుచుని ఉంటే, సందేహించి,

"మీ అత్తమామలకు చెప్పిరావమ్మా!"

అని ప్రోత్సహిస్తారు. ఇక ఆమె అప్పుడు బయలుదేరుతుంది.

"కుర్చీపీటమీద కూర్చున్న అత్తా
మా అన్న లొచ్చారు మమ్మంపుతారా?-

అని అడుగుతుంది. దానికి, "నేనెరుగ నేనెరుగ మీ మామ నడుగు" అని సమాధానం. ఇట్లాగే మామ నడగమని అత్తా, బావ నడగమని మామా, వదిన నడగమని బావా ఎవరికి వారు తప్పించుకుంటారు. మీ అన్న లెవరెరుగు మిమ్ము లెవరెరుగు? అని నిర్లక్ష్యాన్ని చూపుతారు.

పుట్టినింటి మీద ఆడపిల్లలకు ఆశ ఎక్కువట!

"కాశి కెడదామంటె కదలవే కాళ్ళు
ఢిల్లి కెడదామంటె తిరగదే మనస్సు
దూరాన పుట్టింటి కెడదాము అంటే
నా కాళ్ళు పన్నినా రథములై నడచు
నాచేతు బుయ్యాలు చేరులై దాగు"

అని ఆమె అనుకుంటుంది. అటువంటి పుట్టింటి ప్రయాణానికే విఘాతం కలిగినప్పుడు స్త్రీ

ఎన్నెన్ని జన్మాలు ఎత్తినా కాని
ఈ ఆడజన్మమూ ఇక నెత్తరాదు
ఆడజన్మ ఎత్తి అడలుటా కంటే
అడవిలో వృక్షమై అట్లుంటె మేలు :—

అని చింతిస్తుంది.

అట్లాగని అత్తింటికోడలు అలిసెపడకుండే "గింకల్లు తీర్చేది మూలుకల్లి కల్లు"—ఇది కోడలిజీవితం,

ఆ దశ దాటిన భార్యబ్రతుకు చక్కనిదే. ఆవిడ అక్కడ అన్నీ సమర్థించు కోగలదు. భర్తప్రమేయం లేకుండా ఇల్లు సరిదిద్దుకోగలదు. దానికీ దీనికీ అనక చాలావరకు భర్తపై అధికారం చెలాయించగలదు. వారిద్దరికీ మధ్య అప్పు డప్పుడు అలుకలుపొగుతుంటవి. అప్పుడు భార్య భర్తతో మాట్లాడదు.

వంకాయ వండాను వరికూడు వార్చాను
తినమనీ చెప్పవే తడికా తడికా :—

అని భర్త వినేటట్లు మధ్య నిర్జీవవస్తువుతో సంభాషణ సాగిస్తుంది. దానికి సమాధానంగా అతడు,

"వగలాడి మాటలకు వళ్ళంత మండింది
వద్దనీ చెప్పవే తడికా తడికా !"

అని తిప్పికొడతాడు. దానితో ఆ కోపం పెరుగుతుంది. దానిని సహించ లేక ఈసారి కొంచెం మెత్తబడేవంతు భర్తది. ఈమారు అలిగేవంతు భార్యది.

"పట్టుచీర తెచ్చాను పెట్టిలో పెట్టాను
కట్టమని చెప్పవే తడికా తడికా !"

అంటాడు భర్త. దానితో ఆవిడ చప్పున లేచి చీర చూచుకుంటుంది. కాని మూతి విరిచి,

చీర కంచులు లేవు చుట్టుచెంగులు లేవు
వద్దనీ చెప్పవే తడికా తడికా !

అని తన నిరసన తెలియజేస్తుంది. కాని తరువాత వారిద్దరికీ ఎట్లాగో ఒకట్లా రాజీ కుదురుతుంది. వారికి ఇక ఆకోపాలు ఉండవు. తెల్లగా తెల్లవారినా భర్త నిద్రలేవకపోతే, భార్య సరసంగా,

చుక్క తెల్లవారె తూర్పు తెలవారె
బూరుగ పూచింది బారువనంలో
కలువలచెర్లోకి నీళ్ళు చేరాయి
కాళ్ళు కడుగ మీకు వేళాయె లెండి !

అని లేపుతుంది. ఆవిడ భర్తను ఉడికించాలని ఎప్పుడూ అతనిముందు తన వారిని పొగుడుతుంది. దానికి ఊరుకోక భర్తకర్మ చాలక,

అన్నల్ని పాడేవు తమ్ముల్ని పాడేవు
నన్నేల పాడవే !

అని అడిగినా,

"ఏమని పాడేది వెఱ్ఱిమాధవుడా !"

అని అమాయికతను నటిస్తూనే, నీవు వెఱ్ఱివాడవని వెక్కిరిస్తుంది.

ఈ పాటల్లోదే ఒకఘట్టం. సీతారాముడూ తమతమవారితో దోవన వెళ్తుంటారు. కాని సీతకు చిరిదబ్బముళ్ళు కాలిలో విరుగుతవి. చుట్టూ ఉన్నవారు,

తియ్యవోయి రామన్న తియ్యవోయి ముళ్ళు అని ఆజ్ఞాపిస్తారు. రాముడు తీయడు.

ముళ్ళేల తీస్తును ఈ మూకలోన
చెయ్యేల ఎత్తుదును చెల్లెళ్ళలోన,

అని ఆభిజాత్యాన్ని వెలువరిస్తాడు. సీత అంతకన్నా గడుసరి. అందవి పండ్లు వుల్లగా ఉంటవనాలని ఆవిడకూ తెలుసు.

"కాలేల ఎత్తుదును కలవారిలోన!"

అంటుంది. అప్పటికి రాముడిమీద సీతదే పైచెయ్యి. ఇట్లాంటి పరపాలు ఈ పాటలద్వారా కోలెదు విదితమౌతవి.

అటువంటి ప్రేమగల భార్య బిడ్డకు జోల పాడేటప్పుడు కూడా భర్తను మర్చిపోదు.

నిద్రపో బలభద్ర రాజకుమారా
నిద్రకూ నూరేళ్ళు నీకూ నూరేళ్ళు—

అని భర్తనుకూడా కలుపుకుని ఆశిషాలు కురిపిస్తుంది.

తన ఇంటికి చుట్టాలు పక్కాలు రావాలని ఇల్లాలు ఎప్పుడూ ఆశపడుతుంది.

"కాకమ్మ కుయ్యవే తరిమికుయ్యావే
కుయ్యవే మా యింటి గుమ్మాలలోన!"

అని అర్థిస్తుంది.

"వెళ్ళవే మావారి అరటి చెట్లెక్కా
మెసలవే మావారి మల్లసాలల్ల!"

అని ఆహ్వానిస్తుంది. కాకి అరుపు చుట్టపురాకకు సూచనకాబట్టి ఆమె ఆశ చక్కనిదే.

భూమిగల ఇల్లాలైతే వానలు కురిపించమని దేవుణ్ణి ప్రార్థిస్తుంది. ఆ ప్రార్థన భక్తుడు భగవంతుడికి విన్నవించినట్లు కాదు. ఒక బంధువు మరొక బంధువు నడిగినట్లు.

వానదేవుడ నీకు వరస చెల్లెలిని
వర్షాలు కురిపించు వరిమళ్ళలోన

అని దేవుడితో ఆవిడ వరసలు కలుపుకుంటుంది. లాలనల్లోనే కాక కోపం వచ్చినప్పుడు ఆమె శాపాలు పెట్టడానికీ సమర్థురాలే.

ఆకార్యం జరిగే పక్షంలో,

వరుసగా నీవార్ని వరుసాడబోతే
పురుషుడా నీశిరసు ధరణి కొఱిగేనీ
కానివార్నీ నీవు కారాడబోతే
కాముడా నీ శిరసు కాటి కొరిగేనీ

అని కోపోద్రిక్త అవుతుంది. ఇక వారి తుష్టినీ, నిష్కామ లబ్ధినీ గూర్చి ముక్తసరిగా చెప్పాలంటే వాళ్ళకు ఉండే కోరికలు చాలా కొద్ది. అయినా ఆశ పాశలులేని వారి సంసారం సజావుగా నడుస్తుంది. వరి అన్నం వండినా చారు చేసినా వారికి పండు, కూర, తాలింపు పెట్టుకున్న రోజు పర్వదినమే. వడ్లు దంచి కూలి తెచ్చుకునే ఇల్లాలు చూడండి ఎట్లా విలపిస్తుందో !

"ఈవేళ మా వడ్లు నేలగవు కాబోలు
వెలగపూడి సంతకు వెళ్ళవుకాబోలు
ఏగాణి వెల్లులి తేను కాబోలు
ఎగరేసి తాలింపు పెట్టను కాబోలు"

ఆమెకు పరాయివారి ఎదుట జంకు ఉండదు. వాళ్ళనుండి సహాయం కోరడానికి ఆవిడ సందేహించదు.

వడ్లబత్తూడా ఓరి నాయన్నా !
వడ్డింపుకోసమని తెడ్డొక్క టియ్యి
కమసాలి నాయన్న ఓరి నాయన్న
కమ్మని నేతిలోకి గరి టొక్క టియ్యి !

అంటుంది.

సీతప్పే లేవడానికి ఏటికి వచ్చి వారావీరా అని కేకలువేసి

ఆవులూ కలవారి ఆడమనిషిని
కోడెలూ కలవారి కోడల్ని నేను
మేకలూ కలవారి మేనకోడల్ని

అని తనస్థితి చెప్పి—

"బిందెత్తి పోవయ్య బిందెత్తిపొమ్మ"

అని ఎవరైనాసరే ప్రార్థించి పని సాగించుకుంటుంది—

ఈ విధంగా స్త్రీ అన్నిరంగాల్లోనూ ఉన్నది. ఆవిడ కూతురు, కోడలు, భార్య, తల్లి, చివరకు అత్త. ఈ పాత్రల శీలాలు ఒకస్థితిలో ఉన్నవిధంగా మరొక స్థితిలో పొసగవు. అయినా వీటిని ఆవిడ ఒక్కొక్క దశలో అతినేర్పుగా నిర్వహిస్తుంది. తన శక్తిని సర్వతోముఖంగా విజృంభింపజేసి విశ్వవిహారం చేస్తుంది. కుటుంబాన్ని పదిముఖాల నుండీ కాచుకుని వస్తుంది.

ఇటువంటి స్త్రీ లేనివాడు మగవాడు ఏనాడో మూలపడి ఉండవలె. ఇక స్వాతంత్ర్యం వారు ఇచ్చే దేమిటి వీరు పుచ్చుకునే దేమిటి ?

చిగురు మాటగా స్త్రీ జీవితాన్ని ఆ జానపదులమాటల్లోనే చెప్పాలంటే,

"ఆడుచుకోను పాడుచుకోను ఆడవారివంతు
కూర్చొని భోంచెయ్య మగవారివంతు !"

నాయని కృష్ణకుమారి *

---

* కిన్నెర. సంపుటము 3. సంచిక 10. అక్టోబరు 1951.